# మానసిక వికాసము

## విద్యార్థులకు, ఉద్యోగులకు







ఆరేటి వేణుగోపాల్




**Addressing MBA / PG Students at K.G.R.N College,**

**Bhimavaram.**




**Addressing MBA Students at Y.N. College,**

**Narsapuram.**

# MAANASIKA VIKAASAM

(FOR STUDENTS AND EMPLOYEES)

BY


## A. VENU GOPAL

5-99, MYTRI NAGAR
MADEENAGUDA, MIYAPUR
HYDERABAD - 500 050,
Ph : 040 - 2304 3933
Cell : 98661 07197
93910 32306


Dedicated to
**SRI SRI RADHA RASABIHARI**
(ISKCON - INTERNATIONAL SOCIETY FOR KRISHNA CONSCIOUSNESS)


*Printing at :* Sai Srinivasa Printers
Khairtabad, Hyderabad - 4. Ph # 2339 2566

*Cover Design :*

M/S. GLOBAL ART
2-407, Divyashakti Apartments
Ameerpet, Hyderabad - 500 016.

Price : Rs. 90 /-

For copies : Contact Author / Printer

# మానసిక వికాసం

(విద్యార్థులకు, ఉద్యోగులకు)

రచయిత :

**ఆరేటి వేణుగోపాల్**

5-99, మైత్రినగర్, మదీనగుడ,
మియాపూర్, హైదరాబాదు - 500 050.
ఫోన్ నం. 040 - 2304 3933
98661 07197, 93910 32306

అంకితం : శ్రీ శ్రీ రాధా రాసబిహారి కి
(ఇస్కాన్ - ఇంటర్ నేషనల్ సొసైటీ ఫర్ క్రిష్ణ కాన్షియస్‌నెస్)

సంకలనం మరియు ముద్రణ :

**శ్రీసాయి శ్రీనివాస ప్రింటర్స్**

ఖైరాతాబాదు, హైదరబాద్ - 4.
ఫోన్ : 040-2339 2566

కవర్ డిజైన్ :

**గ్లోబల్ ఆర్ట్**

2-407, దివ్యశక్తి అపార్టుమెంట్సు
అమీర్‌పేట, హైదరాబాదు - 16.

వెల : రూ. 90/-

# పరిచయం

రచయిత ఆరేటి వేణుగోపాల్ కాకినాడలో జన్మించారు. యానం, కొవ్వూరులో ప్రాథమిక విద్యను, రీజనల్ ఇంజనీరింగు కాలేజి, వరంగల్లులో ఇంజనీరింగు విద్యను అభ్యసించారు.

25 సంవత్సరాలు, భారత్ హెవీ ఎలెక్ట్రికల్స్ (BHEL) సంస్థలో వివిధ రంగాలలో పనిచేసారు. దానిలో 14 సంవత్సరాలు, BHEL (MUMBAI) క్వాలిటీ సర్వీలెన్స్ డిపార్టుమెంటులో పనిచేసారు. వివిధ అంశాలపై 120 పైగా ప్రసంగాలు చేశారు. ఆ సంస్థలో పనిచేసే వారికీ, ప్రొఫెషనల్ కాలేజి విద్యార్థులకూ, పిజి కాలేజి విద్యార్థులకూ ప్రసంగాలుయిచ్చారు. డిప్యూటీ జనరల్ మేనేజరుగా పనిచేస్తూ V.R.S (వాలంటరీ రిటైర్మెంటు) తీసుకున్నారు. ప్రస్తుతం M/s. టాటా ప్రోజెక్ట్స్ లిమిటెడ్ లో కన్సల్టెంటుగా పనిచేస్తున్నారు.

ఈ పుస్తకాన్ని ఉద్యోగులను, విద్యార్థులను దృష్టిలో వుంచుకుని వ్రాయడం జరిగింది. వారి జీవితాలలో సుఖం, మనఃశాంతి, ప్రేమ కావాలంటే, వారిలో మంచి ఆలోచనలు రావాలి. కొన్ని మంచిఆలోచనలు జీవితాలను మార్చివేస్తాయి. మనస్సు విప్పినపుడే మంచిఆలోచనలు బయటకు వస్తాయి. అవి మన వివేకాన్ని, మానవతా సంబంధాలను, సృజనాత్మకతను పెంచుతాయని, ఎన్నో వుదాహరణలతో ఈ పుస్తకంలో, వివరించారు.

ఇక్కడ, విద్య, విజ్ఞానం, నైపుణ్యం, భయం, ఆందోళన, మానసిక ఒత్తిడి వంటి పరస్పర విరుద్ధ అంశాలను విశదీకరించారు. ఈ పుస్తకంలో కృషి, క్రమశిక్షణ, పట్టుదల, ప్రేమ, సంతృప్తి, సంతోషం, అంకితభావం, విజయం, వంటి అంశాలను కూడా విపులీకరించారు.

మానసికబలహీనతలను, సమస్యలను అధిగమించడానికి కొన్ని సూచనలు యిచ్చారు. మనిషి జీవితంలో మంచి గుర్తింపు, విజయం, సాధించాలంటే అతనికి మానసిక వికాసం అవసరం. దీనికి అవసరమైన జ్ఞానాన్ని యువతకు అందించాలనేదే ఈ పుస్తకం యొక్క లక్ష్యం.

విద్యార్థుల, ఉద్యోగస్తుల, సంతోషానికి, విజయానికి కావలసిన అంశాలు, ఆశయం, లక్ష్యం, స్పష్టత, ప్రణాళిక, కమ్యూనికేషన్, ఏకాగ్రత, అవగాహన, సామర్థ్యం, నాయకత్వ లక్షణాలు, ప్రేరణ, టైము మేనేజ్‌మెంటు, మంచిఆలోచనలు, నిర్వహణా

సామర్థ్యం. ఈ అంశాలను వ్యాసరూపంగా, కథారూపంగా విపులీకరించి, యువతకు ఒక డైరెక్షన్ యివ్వాలనే ప్రయత్నమే ఈ పుస్తకం. 'విద్యార్థులు, ఉద్యోగస్తులు, వారికి గల అపారమైన శక్తిని వుపయోగించుకుని మానసిక వికాసం, విజయం, సాధించాలి' అనే మంచి భావనే, 'ఈ పుస్తక రూపంలో వచ్చింది. ఈ పుస్తకాన్ని క్షుణ్ణంగా చదివి యువత లాభం పొందుతారు', అనేదే రచయిత ఆశాభావం.

డా।। ఏ. సత్యనారాయణ (Vice Principal)
DIRECTOR I/C PG COURSES
KGRN COLLEGE BHIMAVARAM, W.G.Dist. A.P.

యువతకు నిర్మాణాత్మక సామర్థ్యం, సృజనాత్మకత, స్వయంకృషిపై నమ్మకం ఆత్మవిశ్వాసం అవసరం. వారిలో ఉదయించే మంచిఆలోచనలను ఆచరణలో పెడితే ఫలితాలు బాగుంటాయి. యువత విద్య, విజ్ఞానం, నైపుణ్యం, కమూనికేషన్ స్కిల్స్‌ల అభివృద్ధి చేసుకోవలసిన ఆవశ్యకత గురించి, ఈ పుస్తకంలో వివరించారు.

మనిషి మానసిక వికాసాన్ని, మానవతా సంబంధాలను మెరుగుపరచుకోడానికి, సమయాన్ని సద్వినియోగం చేసుకోడానికి, సద్భావనను పెంచుకోడానికి. ఈ పుస్తకంలో యిచ్చిన సూచనలు ఉపయోగపడతాయి.

జి. లక్ష్మీనారాయణ

యవతకు ఉపయోగపడే అంశాలను ఈ పుస్తకంలో విపులీకరించారు. రచయిత మంచి సూచనలు యిచ్చారు. ఈ సూచనలు యువతకు సమయ సమయానికి, వారి సమస్యలలో, వాటి పరిష్కారాలలో ఉపయోగపడతాయి. ఈ పుస్తకం ఒకసారి చదివి పడేసే నవల లాంటిది కాదు. ఇది యువతకు మంచి ప్రేరణనిస్తుంది.

అందరు సుఖప్రదమైన, గౌరవప్రదమైన జీవితాన్ని గడపాలనుకుంటారు. అయితే కొందరు ప్రయత్నలోపం వలన, సరైన పరిష్కారాలు లభించక సమస్యలలో చిక్కుకుని, కష్టాలు పడుతుంటారు. వీరికి ఈ పుస్తకం బాగా ఉపయోగపడుతుంది.

అభివృద్ధికి మూలం మార్పు. మార్పుకు మూలం, మానసిక వికాసం, పరిణతి, ప్రేరణ, ప్రయత్నం. ఈ అంశాలనే కాక, పోటీతత్వం, బెంచ్ మార్కింగు, ప్రోయాక్టివ్ థింకింగు, సృజనాత్మకత, యశస్సు వంటి అనేక అంశాలను విశ్లేషించి, ఈ పుస్తకంలో వివరించారు. ఇది విద్యార్థులు, ఉద్యోగస్తులు చదవతగ్గ పుస్తకం.

డా।। పి.విజయ కుమార్

# రచయిత వివరణ

జీవితంలో మనిషి మానసిక వికాసానికి, కృషి, పట్టుదల, నైపుణ్యం, చదువు, శ్రద్ధ అవసరం. మంచి భావనలు, మంచిఆలోచనలు కూడా అవసరం. క్రియేటివ్ థింకింగ్, పోజిటివ్ థింకింగ్ కూడా అవసరం. అవే మన నిజమైన ఆస్తులు. ఈ ఆస్తిని మనం ఇతరులతో పంచుకుంటూ వుంటే, ఆ ప్రక్రియ వారికీ, మనకూ ఉపయోగపడుతుంది. ఆ దిశలో విద్యార్థులకు, ఉద్యోగస్తులకు కొన్ని విషయాలు వివరిస్తే, ఒక చోట పొందుపరిస్తే మంచిదనిపించింది. వారి మానసిక వికాసానికి కొంత సేవచేసే ఒక చిన్న ప్రయత్నమే ఈ పుస్తకం. నేనూ ఒక విద్యార్థినే. నేనూ ఒక ఉద్యోగస్తుడినే. కనుక వారి భావనలు నాకు తెలుసు. విద్యార్థులు, ఉద్యోగస్తులు, ఇటువంటి పుస్తకాలను చదవితే వారిలోని నిరాశావాద ధృక్పథాన్ని దూరం చేసుకోగలరు. ఆశావాదం అంకురించి, చిగురిస్తుంది. పుష్పించి, ఫలిస్తుంది.

వారి జీవితాలలో కలిగే ఆటంకాలు, అనుమానాలు, అవరోధాలు, కష్టాలు, దూరమవటానికి ఈ పుస్తకం దోహద పడుతుంది. జీవితంలో కొన్ని అపజయాలు కలగటం సహజం. మనస్తాపం, దుఖం కూడా కలగవచ్చు. వాటితో కృంగి పోకూడదు. తప్పులను సరిదిద్దుకుని ముందుకు చొచ్చుకుని పోయే ధైర్యం కావాలంటే మంచి పుస్తకాలు చదవాలి. మంచి పుస్తకాల నుంచి, ప్రేరణ పొందాలి. జీవితంలో కొన్నిసార్లు మనకు కష్టాలు వస్తాయి. పరిష్కార మార్గాలు కనబడవు. సెక్స్, హింస, దొంగతనాలను ప్రేరేపించే సినిమా, టివి ప్రోగ్రాముల ద్వారా మరింత మనస్థాపం పొందుతాము. మనలో యిమిడివున్న శక్తిని బయటకు తీసుకురాగల సాధనం మంచి పుస్తకం. సమస్యలను పరిష్కరించడానికి మంచి సాధనమే, మంచి పుస్తకము.

జీవితంలో మనకు జరిగిన అపజయాల నుండి, అనుభవాల నుండి మంచిని తీసుకొని చెడును విడిచిపెట్టాలి. అపజయాలు నుండే క్రొత్త అవకాశాలను వెదకాలంటే, మనోధైర్యం మానసిక వికాసం, నిర్మలత్వం, జ్ఞానం, నైపుణ్యం అవసరం. మానవ సంబంధాలను మెరుగుపరచుకోవడం అవసరం. మనలోని ఉత్సాహాన్ని పెంచుకోవడం అవసరం. నిరుత్సాహాన్ని దూరంగా వుంచడం అవసరం. వచ్చిన అవకాశాలను సద్వినియోగం చేసుకోవడం అవసరం. మనలోని పిరికితనాన్ని, భయాన్ని, ఆందోళనలను, దూరంగా పారద్రోలటం అవసరం. జీవితంలో అన్నీ మనం కోరుకున్నట్లుగా జరగకపోవచ్చు. అప్పుడు కృంగిపోకుండా మరింత ఉత్సాహంతో, ధైర్యంగా ముందుకుపోయి విజయాన్ని పొందటం

అవసరం. ఈ అవసరాలకు మంచి పరిష్కారాలను చూపేదే ఈ పుస్తకం.

పోజిటివ్ థింకింగ్, ప్రోయాక్టివ్ థింకింగ్ చేయటానికి ప్రోత్సహించేదే ఈ పుస్తకం. మంచిని పెంచుకోడానికి మంచి ఆలోచనలు, సృజనాత్మకమైన ఆలోచనలకు, అంకురార్పణ చేయడానికి సహాయ పడుతుంది. అలావచ్చిన మంచి ఆలోచనలను ఆచరణలో పెడితే, కలిగే ఫలితాలను మీముందు వుంచుతుంది. ఈ పుస్తకంలోని అంశాలు అందరికీ తెలిసినవే కానీ వాటి గురించి ఆలోచించే సమయం మనకులేదు. జీవితంలో మనిషి ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్నాడు. ప్రతి సమస్యకు ఒక పరిష్కారం వుంటుందని తెలుసు. కానీ ఆ దిశలో ఆలోచించడం లేదు. సమస్యలకు, పరిష్కారాలు, విజయాలు, అనే దిశలో ఆలోచించడానికి విద్యార్థులకు, ఉద్యోగస్తులకు ఉపయోగపడే సాధనమే ఈ పుస్తకం.

మరికొన్ని ముఖ్యమైన, యువతకు సంబంధించిన అంశాలను, ఈ పుస్తకంలో కథా రూపంలో వివరించాము. కొన్ని ఉదాహరణలతో, కొన్ని పిట్ట కథలతో, వార్తా పత్రికలలో వస్తున్న యదార్థ సంఘటనలతో కొన్ని అంశాలను విపులీకరించడం, విశ్లేషించడం జరిగింది.

1. యువత – వారి జీవితాశయాలు
2. యువత – కర్తవ్య నిర్వహణ
3. యువశక్తి – విజయం
4. మనస్సుతో ఒప్పందం
5. సమస్య – పరిష్కారం (చర్య – ప్రతిచర్య)
6. అల్పతత్వభావన (Inferiority Complex)
7. స్త్రీలు – వారి ప్రతిభ
8. అంకిత భావం – సేవాభావం
9. యువత – వారి వస్త్రధారణ (Youth - Dress habbits)
10. యువత – వారి అభిరుచులు

యువత మనోవికాసానికి సంబంధించిన అంశాలు వ్యాసపరంగా ప్రచురించిన పుస్తకాలను చదవడానికి ఆసక్తి చూపడంలేదు.

పైన ఉదహరించిన అంశాలను కథారూపంగా వివరించడానికి ముఖ్యకారణం యువతకు చదవడానికి ఆసక్తికరంగా వుంటాయని భావించడమే.

ఇంగ్లీషు బాషలో ప్రముఖులు వ్రాసిన కొన్ని ప్రోవెర్బ్‌లను, వారి కొటేషన్స్‌ను (సూక్తులను) నాదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేయడం జరిగింది. అవి పాఠకులకు తప్పక వుపయోగపడతాయి, అనే నమ్మకంతో వాటిని కూడా ఈ పుస్తకంలో పొందుపరచడం జరిగింది. ఈ పుస్తకంలోని రెండవ భాగంలో మానసిక వికాసానికి సంబంధించిన అంశాలను, రెండు కథలలో వివరించాను. ఆ కథలు 1. చిన్న పొరబాటు 2. వ్యక్తి ఆరాధన.

ఈ పుస్తకం విద్యార్థులను ముఖ్యంగా ప్రొఫెషనల్ కాలేజీల నుండి విజయవంతంగా బయటకు వస్తున్న విద్యార్థులను, ఎన్నో ఆశలు ఆశయాలతో వృత్తిలో అడుగుపెట్టిన ఉద్యోగులను, దృష్టిలోవుంచుకొని వ్రాయడం జరిగింది.

ఇటువంటి పుస్తకాన్ని రూపుదిద్దటానికి ప్రేరణ కొద్దిమంది మేధావులవలన వచ్చింది. వారికి నా ధన్యవాదాలు. ఏకలవ్యుడిలా ఆ మేధావుల నుండి ప్రేరణ పొంది, కృషిచేసాను.

ఈపుస్తకం చదివి, విద్యార్థులు, ఉద్యోగస్తులు, మార్పును వారివారి జీవితాలలోకి ఆహ్వానిస్తే నా ఈ ప్రయత్నానికి కొంత సార్థకత వస్తుంది.

ఇటువంటి పుస్తకాలు చదివి మానసిక వికాసానికి దోహదపడే ఆచరణ యోగ్యమైన మరికొన్ని మంచి పుస్తకాలు, మీలో కొందరు వ్రాస్తే మంచిది. అపుడు ఈపుస్తకానికి మరింత సార్థకత వస్తుందని భావిస్తాను.

నా యీ ప్రయత్నంలోని మంచిని గుర్తిస్తే మీకు నా ధన్యవాదాలు.

# INDEX (విషయసూచిక)

## మొదటి భాగం

**Contents** **Page No.**

## రెండవ భాగం



గమనిక:

1. మానసిక వికాసం గురించిన సందేహాలు
2. మానసిక సమస్యలు
3. మానసిక సంఘర్షణలు
4. మానసిక రుగ్మతలు

ఈ నాలుగు అంశాలలో ఏదో ఒక అంశం ప్రతివ్యక్తి ముందూ ప్రశ్నగానే వుంటుంది. దానిలో సందేహంలేదు. అయితే వీటిపై ప్రతి వ్యక్తికీ అవగాహన ఉండవలసిన అవసరంవుంది. చివరి రెండు పేజీలలో (అంటే 209, 210 పేజీలలో కొన్ని ప్రశ్నలు వేయిడంజరిగింది. వీటిని ముందుగా చదవమని కోరుతున్నాన. ఈ ప్రశ్నలకు సమాధానలు, అవగాహన ప్రతి వ్యక్తికీ అవసరం. ఈ పుస్తకం క్షుణ్ణంగా చదివితే ఈ ప్రశ్నలకు సమాధానాలు కొంతవరకు లభిస్తాయి దీనిపై కావలసిన అవగాహన మీ మనస్సులో ఏర్పడుతుందని భావిస్తున్నాను.

# మానసిక వికాసం

(విద్యార్థులకు, ఉద్యోగులకు)

*రచయిత :*

**ఆరేటి వేణుగోపాల్**

5-99, మైత్రినగర్, మదీనగుడ,
మియాపూర్, హైదరాబాదు - 500 050
ఫోన్ నం. 040 - 2304 3933
98661 07197, 93910 32306

# యువత - జీవితాశయాలు

విద్యార్థులు, ఉద్యోగస్థులు, మరెవరైనా కానీ, వారికి జీవితాశయాలు వుండటం చాలా అవసరం. జీవితాశయాలు లేని వారి జీవితం, ఉప్పు, కారం, లేని కూరలావుంటుంది. అది రుచించదు. జీవితాశయాలు వున్నవారి దృక్పథం బాగుంటుంది. వారి ఆశలు, ఆశయాలు, ఆలోచనలు, నిర్మాణాత్మకంగా, సృజనాత్మకంగా వుంటాయి. వారి జీవితాశయాలను సాధించడం ద్వారా అపారమైన ఆనందాన్ని పొందుతారు. తద్వారా వున్నతమైన జీవితాన్ని గడుపుతారు. వారితో జీవితాన్ని పంచుకుంటున్న భార్యా పిల్లలు, తల్లిదండ్రులు కూడా ఆనందంగా వుంటారు. వారు జీవితాశయాన్ని సాధించడంలో తగిన కృషి చేస్తారు. సోమరితనం దూరం అవుతుంది. ప్రతి ప్రయత్నంలోనూ క్రొత్తవుత్సాహం తొంగి చూస్తూవుంటుంది. వారి స్థితిగతులను మార్చుకోదానికి వారు కష్టపడి కృషిచేస్తారు. మార్పును అంగీకరిస్తారు. ఈనాటి వాస్తవికతతో మన జీవితాశయాలు సాధించడం సాధ్యం కాకపోవచ్చు. ఈనాటి పరిస్థితులను అనుసరిస్తూ గానుగఎద్దులా బ్రతుకుతుంటే, జీవితంలో మార్పు సాధ్యం కాదు. జీవితాశయాలు నెరవేరవు. ప్రస్తుత వాస్తవికతకు భిన్నంగా, మార్పుకు అనుకూలంగా మనం కృషిచేస్తే మన జీవితాశయాలు నెరవేర్చుకోవచ్చు.

జీవితాశయాలు అందరికీ వుండాలి. కానీ వాస్తవంలో యివి కొందరికి మాత్రమే వుంటాయి. వీరు ఆశావాదులు. విజయం పొందుతారు. జీవితాశయాలు లేని వారు నిరాశావాదులు, బద్ధకస్థులు. సామాన్యంగా బ్రతికేయాలనుకుంటారు. వీరికి సంతోషం, విజయం దూరంగా వుంటాయి. వీరు మార్పును స్వీకరించరు. కూపస్థమండూకాల్లా వుంటారు. వారి స్థితిగతుల్లో, ప్రగతి పథంలో, మార్పులు వుండవు. వారిపై ఆధారపడి బ్రతుకుతున్న వారి పరిస్థితులు అధ్వాన్నంగా వుంటాయి. ఎప్పుడూ మనస్పర్ధలు, కీచులాటలు. వారు శ్లేష్మంలో చిక్కుకున్న ఈగలా వుంటారు. దీర్ఘకాలంలో జరగబోయే మార్పులను, పరిస్థితులను వారు వూహించలేరు. అసలు జీవితాశయాలు ఎలా వుంటాయి?

కొన్ని ఉదాహరణలు యిక్కడ పొందు పరుస్తున్నాను:

1. బాగా చదివి, IAS, IPS పాసై వున్నత పదవి నలంకరించి, సొసైటీలో మంచి గుర్తింపు పొందడం.

2. ఉన్నత విద్యాభ్యాసాల కోసం విదేశాలకు వెళ్ళాలి అని అనుకోవడం.

3. ఒక పరిశ్రమ స్థాపించి, వృద్ధి చేసి దానికి మేనేజింగు డైరెక్టరు అవ్వాలని. ఎంతోమంది

నిరుద్యోగులకు జీవనోపాధి కల్పించాలని.

4. ఒక పెద్ద సంస్థకు C.E.O పదవిని అలంకరించాలని.

5. వ్యాపారం చేసి, అధిక లాభార్జన చేసి, వున్నతమైన జీవితాన్ని గడపాలని.

6. Business Magnet అవ్వాలని.

7. మంచి క్రీడా కారుడిగా పేరు పొంది. అర్జున అవార్డు పొంది, ధనార్జన చేయాలని

8. World Class Products ను వుత్పాదన చేయాలని.

9. దేశంలోని నలుమూలలా వున్న ప్రసిద్ధి చెందిన ప్రదేశాలను చూసి, అచటి ఆచార, వేష భాషల, వివరాలు తెలుసుకోవాలని.

10. జీవితంలో ఒక్కసారైనా ప్రపంచాన్ని చుట్టి రావాలని. వివిధదేశాల ఆర్థిక పరిస్థితులను అవగాహన చేసుకోవాలని.

11. వారి వృత్తిలో నైపుణ్యం సాధించి, పలువురిచే ప్రశంసలు పొందాలని.

12. వారి బలాలను, బలహీనతనలను గుర్తించి తగిన రంగంలో ఔన్నత్యాన్ని సాధించాలని.

13. ఆటలు, పాటలు, నృత్యం, చిత్ర లేఖనం, నటన వంటి వాటిలో ఏదో ఒక రంగంలో కృషిచేసి, గుర్తింపు పొందాలని.

14. రాజకీయనాయకుడిగా పెరిగి, ప్రజాసేవ పేరుతో ధనార్జన చేయాలని.

15. గౌరవ ప్రదమైన జీవితాన్ని గడపాలని.

16. బాగా చదివి డాక్టరై, లేక ఇంజనీరై ధనార్జన చేయాలని.

17. మంచి, అందమైన బిల్డింగ్స్ కట్టి అమ్మాలని.

18. సినిమా హీరో / హీరోయిన్‌గా అమితంగా ధనార్జన చేయాలని.

19. సంఘసేవ చేసి, యితరులకు కూడా ప్రయోజనాలు చేయాలని.

20. అందమైన బంగళా, మంచి కారు కొనుక్కోవాలని.

21. అందమైన, చదువుకున్న వ్యక్తిని జీవిత భాగస్వామిగా చేసుకోవాలని.

ఇటువంటి జీవితాశయాలు కొన్ని వేలు వ్రాయవచ్చు. ఇటువంటి జీవితాశయాలు, కలవారి బిడ్డలకే పరిమితంకాదు. రైతుబిడ్డలకు, కార్మికుని బిడ్డలకు వర్తిస్తాయి. అబ్బాయిలకు, అమ్మాయిలకు వర్తిస్తాయి.

ఆశయం (Ambition) వుంటే అవకాశాలు వస్తాయి. వాటిని సద్వినియోగం చేసుకోవాలి. కృషి చేయాలి, జీవితాశయాన్ని సాధించాలి. కష్టే ఫలీ అన్నారు. కష్టపడకుండా, సుఖాలను, జీవితాశయాలను సాధించలేరు. సినిమారంగంలో ప్రవేశించి, కీర్తి ప్రతిష్టలు సాధించిన వారిలో NTR, ANR, SVR, MGR, CHIRU, శివాజీ గణేశన్, లత, హేమమాలిని, అమితాభ్‌బచ్చన్ వంటివారు, వారి జీవితాశయాన్ని సాధించడానికి ఎంతో కృషిచేశారు.

కృషిచేయడానికి మనస్సు లేదు, ప్రతిభలేదు. కాని ఒకే సారి గొప్ప వారైపోవాలి. ఇటువంటివారు ఎంతో మంది సినిమారంగంలో కాలాన్ని వృధాచేస్తున్నారు. నికృష్ట జీవితాన్ని గడుపుతున్నారు. వారి సమయాన్ని, పెద్దలు సంపాదించిన డబ్బును వృధా చేస్తున్నారు.

స్వయంకృషి, ప్రతిభ, క్రమశిక్షణ లేనివారు, ప్రముఖ సినిమా దర్శకులు, సంగీత కళాకారులు, నృత్య కళాకారులు, కథానాయకులు, కథానాయికలు అవ్వాలనుకుంటే, వారి జీవితాశయం నెరవేరదు.

'మా తండ్రి కష్టపడి, డబ్బు సంపాదించి, మంచి బంగళాకట్టి, మంచి కారు కొని, నన్ను ధనవంతుని, ముద్దుల బిడ్డగా పెంచాలనేదే, నా జీవిత ఆశయం' అనే వారు మూర్ఖులే.

'నాకు, చదువురాదు. నా తండ్రి నాకు బాగా చదువుకుని, విదేశాల్లో విపరీతంగా డబ్బు సంపాదిస్తున్న, వరునకు యిచ్చి నా వివాహం చేయాలి'. ఆదే నా జీవితాశయం అనే వారూ మూర్ఖులే.

జీవితాశయం సాధించాలంటే, మంచి భావనలు, స్వయంకృషి, సాధన, మనోశక్తి, ఉత్తేజ భరితమైన మంచి అనుభవాలు, ప్రేరణ, ఆదర్శం, సత్సంబంధాలు, మనోస్థైర్యం, ఆత్మప్రబోధం, అవసరం. సరైన సమయంలో, సరైన నిర్ణయాలు తీసుకోవడం అవసరం. ఈ రోజువున్న వాస్థవికత, కొంతకాలం తర్వాత వుండే వాస్థవికత ఒకటిగా వుండవు. దానికి కారణం మార్పు(Change). జీవితంలో వచ్చే మార్పులను, ఉత్తమ ఆశయాలను, సాధించాలనుకునే వారు మార్పు(Change)ను, ఆహ్వానించాలి.

ప్రతి పౌరునికి జీవితాశయాలు వుండాలి. జీవితాశయాలను నెరవేర్చుకోవడం కోసం చేయాలి కృషి

ఇక్కడ నా స్వంత అనుభవాలను, మీ ముందువుంచాలని వుంది. 'సాధ్యం కాదు' అనుకునే కొన్ని పగటి కలలు లాంటి, నా జీవితాశయాలను, నిర్మాణాత్మకమైన వాస్తవాలుగా, మార్చు కోవటానికి నేనుచేసిన కృషి, యువతీ యువకులకు స్ఫూర్తినిస్తుందని, భావిస్తున్నాను.

స్కూల్లో చదువుకునే రోజుల్లో, భూమి గుండ్రంగా వుంటుందని,మనం ఉన్నచోటు నుండి తూర్పుదిశగా గాని, పడమరదిశగా గాని ప్రయాణిస్తే, తిరిగి మనం ఉన్నచోటుకే చేరతామని తెలుసుకున్న రోజున నాకు ఆశ్చర్యం కలిగింది. అదే రోజుల్లో ఒకనాడు ఆకాశంలో విమానం పోతుండటాన్ని చూశాను. పెద్దయిన తర్వాత, ఈ విమానంలో వెళ్ళి, భూమి చుట్టూ ఒక్కసారైనా ప్రదక్షణచేసి, రావాలనిపించింది. నిక్కర్లు వేసుకు తిరిగే ఆరోజుల్లో నా మనస్సులో ప్రవేశించిన ఆ కోరిక నా మొదటి జీవితాశయంగా మారింది.

నా రెండో జీవితాశయం :

నేను ఇంజనీరింగు పాసై క్రొత్తగా ఉద్యోగంలో చేరినరోజులు. నాజీతం 450 రూ॥ మాత్రమే (1973 సంవత్సరంలో). మా దగ్గర బంధువు ఒక మంచి ఇండిపెండెంట్ బంగాళా కదుతున్నారు. 'ఇంటి ప్లాను ఒకసారి ఇవ్వు, చూస్తాను' అన్నాను. 'ఏం ? నువ్వా ఇల్లు కట్టేస్తావా ?' ఊహించని ఈ జవాబు గాని, ప్రశ్న, నాలో మరొక కోరిక పుట్టించింది. ఆయన పై నాకు చాలా గౌరవం. కనుక ఆయనను తప్పు పట్టలేదు. కాని నా జీవితంలో మంచి యిల్లు కట్టాలి, అని మాత్రం ఆశయం కలిగింది. ఇది నా రెండో జీవితాశయం.

భగవంతుని దయవల్ల ఈ రెండు జీవితాశయాలూ నెరవేరాయి.

నా ఈ జీవితాశయాలు నెరవేరడానికి నాకు ఉపయోగపడిన కొన్ని అంశాలు, ఆసక్తికరంగా వుంటాయి. అవి ఈనాటి యువతీ యువకులకు స్ఫూర్తినిస్తాయి. అవి ఏమిటంటే...

నా జీవితాశయాలను నెరవేర్చుకొనేందుకు వచ్చిన అవకాశాల్ని జాగ్రత్తగా వినియోగించుకోవడం. నా అంతర్గత శక్తిని సద్వినియోగం చేసుకోవడంకోసం, నాఆలోచనా సరళిని విశ్లేషించుకోవడం.

నా ఆర్థిక, మానసిక శక్తులను తరచుగా పునః పరిశీలించుకోవడం.
గమ్యం దిశగా పోతున్నప్పుడు మధ్యలో వచ్చిన ఇబ్బందులను అధిగమించడం.
నావృత్తి పట్ల గౌరవం, పనిలో ఆనందం. ఖాళీ సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం. ఖర్చు చేసేముందు ఆలోచన, పొదుపులో స్వేచ్ఛ.

కష్టే ఫలీ అనే సిద్ధాంతాన్ని నమ్మి, అమలు చేయడం.

సత్సాంగత్యం, ఐస్కాన్ సంస్థలో లైఫ్ మెంబర్‌షిప్ తీసుకోవడం. ISKCON అంటే International Society for Krishna Consciousness. ISKCON సంస్థలో లైఫ్

మెంబర్‌షిప్పు తీసుకోవడం వలన మంచి పరిచయాలు ఏర్పడ్డాయి. ISKCON సంస్థ, ఇంచుమించు 400 శ్రీ కృష్ణ మందిరాలను వివిధ దేశాలలో నిర్మించింది. లైఫ్ మెంబర్సు, ప్రతి మందిరం లో 3 రోజులు ఉచితంగా వుండవచ్చు.

స్టే, ఫుడ్, ట్రాన్స్ పోర్టు వంటి అన్ని సౌకర్యాలూ ఉచితం. అక్కడ కృష్ణ భక్తులు ఇండియన్స్‌ను చాలా గౌరవిస్తారు. ఎందుకంటే, కృష్ణ భగవానుడు ఇండియాలో అవతరించాడు కనుక.

పానమ్ ఎయిర్ లైన్స్, 28,000 రూ॥ కు రౌండ్ ది వరల్డ్ టికెట్టు యిచ్చారు. దేవుని దయవలన నా జీవితాశయం నెరవేరింది, జర్మనీ, ఫ్రాన్స్, స్విట్జర్లాండు, ఇంగ్లాండు, వెస్ట్ ఇండీస్, అమెరికా లోని మియామి, ఓర్లాండో, వాషింగ్టన్, న్యూయార్క్ నయాగరాఫాల్స్ చికాగో, లాస్‌ఏంజిల్స్, శాన్‌ఫ్రాన్సిస్కో చూశాను. తర్వాత హాంగ్‌కాంగ్, సింగపూర్, బ్యాంకాక్ చూసి తిరిగి ఇండియా వచ్చాను. ఆ మధురానుభూతులు నాలో కొత్తవుత్సాహాన్నిచ్చాయి. ఈ విదేశీ పర్యటనలో ISKCON టెంపుల్స్ యొక్క విశ్రాంతి గృహాలలో కాని, బంధువులు, స్నేహితుల గృహాలలో కాని వున్నాను. ఖర్చు తక్కువ. వారితో అనుబంధమూ పెరిగింది.

మరి నా రెండో ఆశయం అలానే వుంది. మంచి యిల్లు కట్టాలనే జీవితాశయం, వాస్తవిక రూపం దాల్చలేదు. నాకు 51 సంవత్సరాలు వచ్చాయి నా రెండో కోరిక తీరలేదు.

BHEL లో ఉద్యోగం చేస్తూ ఒక మంచి మూడు అంతస్థుల మేడ కట్టడం కష్టమని తేలిపోయింది. అపుడే BHEL లో VRS (వాలంటరీ రిటైర్మెంటు స్కీము) ప్రవేశపెట్టారు. ధైర్యం చేశాను. జీవితంలో కొంత రిస్కుతీసుకోవాలనుకున్నాను. ఎవరు వద్దన్నా BHEL నుండి డిప్యూటీ జనరల్ మేనేజరుగా VRS తీసుకున్నాను. నాకు రావలసిన VRS డబ్బుతో పాటు, పి.ఎఫ్, గ్రాట్యుటీ, లీవ్ ఎన్‌క్యాష్‌మెంటు డబ్బులు వచ్చాయి. ఆరు లక్షలు ఇన్‌కమ్ టాక్సు కట్టాను. మిగిలిన డబ్బుతో నా రెండో జీవితాశయాన్ని నెరవేర్చుకున్నాను. కొంత డబ్బును, హౌసింగ్ ఫైనాన్స్‌గా అప్పు తీసుకున్నాను. పైగా నావృత్తిలో గల అనుభవానికి గుర్తింపువుంటుందని, నా గట్టినమ్మకం. మరొక ఉద్యోగం వచ్చింది.

అలా సాధ్యంకాదు అనుకునే నా జీవితాశయాలను వాస్తవాలుగా మార్చుకున్నాను. కష్టే ఫలి అన్నారు. ఈ నిజాన్ని యువతరం గుర్తించాలి.

చదువుకునే రోజుల్లో నాకు మరొక ఆశయం వుండేది. 'బాగా చదివి, విదేశాలకు కూడా వెళ్ళి వుద్యోగంచేసి ఆర్థికంగా స్థిరపడితే కానీ వివాహం చేసుకోకూడదు అనుకునే వాడిని. కుటుంబంలో వచ్చిన మార్పులదృష్ట్యా అది వీలుకాలేదు నా చెల్లి వివాహం జరిపే బాధ్యతను వాలంటరీగా నేను తీసుకున్నాను.

ప్రగతి శీలక భావాలున్న, చదువు కోని మేధావి అయిన ఒక ధనవంతుని కోడలుగా, చెల్లికి వివాహం చేసి పంపాను. జీవితంలో రాజీపడవలసివచ్చింది. ఫర్వాలేదు రాజీపడ్డాను. తద్వారా విదేశాలకు వెళ్ళకుండానే చెల్లి పెండ్లి చేయడానికి నేనూ పెండ్లి చేసుకోవలసి వచ్చింది. చేసుకున్నాను. అదే భగవంతుని వరమని భావించాను. జీవితంలో అన్నీ మనం అనుకున్నట్లు జరగవు కదా. దీనికి మరొక ఉదాహరణను యిక్కడ వివరిస్తాను.

నేను డాక్టరు అవ్వాలనుకునేవాడిని. కానీ ఇంజనీరు అయ్యాను. ఆశయం నెరవేరలేదు. కనీసం నాకుటుంబంలో ఎవరినైనా ఒకర్ని డాక్టరు చేయాలనుకున్నాను. అదీ కుదరలేదు అబ్బాయి సాఫ్ట్‌వేర్ ఇంజనీరు అయ్యాడు. లండన్‌లో కొంత కాలం వుద్యోగం చేసి వచ్చి ప్రస్తుతం ఇండియాలో సత్యం కంప్యూటర్స్ లో వుద్యోగం చేస్తున్నాడు.

అమ్మాయి చైల్డ్ సైకాలిజిస్టు. కానీ గృహిణిలా వుండి పోయింది. అల్లుడు గారు కూడా సాఫ్ట్‌వేర్ ఇంజనీర్. కుటుంబ సమేతంగా వెళ్ళి, లండన్‌లో ఒక సంవత్సరం వుద్యోగం చేసివచ్చారు. ప్రస్తుతం వారి కుటుంబం అమెరికాలో వుంటుంది. ఆయన SAP కన్సల్టెంటు. విప్రో కంపెనీ ఆయనను కుటుంబ సమేతంగా అమెరికా పంపింది.

నా జీవితాశయం ? నేను డాక్టరును కాలేక పోయాను కనుక, కనీసం ఒక్కరైనా నాకుటుంబం లో డాక్టరు కావాలి. కృషి చేసి చివరికి డాక్టరు చదివిన అమ్మాయిని కోడలుగా తెచ్చుకున్నాను. ఆ విధంగా నా జీవితాశయం నెరవేరింది. నేను విదేశాల్లో వుద్యోగం చేసి రావాలనుకున్నాను. కుదరలేదు కాని నా పిల్లలద్వారా ఆ ఆశయం నెరవేరింది.

యువతీయువకులందరకీ జీవితాశయాలు వుండాలి. వాటిని సాధించడానికి స్వయంకృషి, పట్టుదల వుండాలి. వారి ఆలోచనా ధోరణిలో మార్పు అవసరం. సమాజంలో వస్తున్న మార్పులను అంగీకరించాలి. ఆదిశలో కృషి చేయాలి. జీవితాశయాలను సాధించాలి. అవాస్తవికతను, వాస్తవికతగా మార్చుకోవాలి. ధనం, కీర్తి ప్రతిష్టలు సంపాదించి, ప్రగతి పథంలో సాగిపోవాలి. ముఖ్యంగా నేను చెప్పదలచుకున్నది, జీవితాశయం నేరవేర్చుకోడం కోసం తగిన కృషిచేయాలి. మనం కృషి చేసినా ఒక్కొక్కసారి అనుకున్నవి పూర్తిగా జరగక పోవచ్చు. కానీ మన ప్రయత్న ఫలితంగా కొంత ప్రగతిని సాధించడం జరుగుతుంది. మనం, ఇటువంటి జీవిత ఆశయాలు కలవారిని ప్రోత్సహించాలి. వారికి తగిన ప్రోత్సహం, సహాయం అందచేయాలి. వారి విజయంలో మన ఆనందాన్ని వెదుక్కోవాలి.

# యువత - కర్తవ్య నిర్వహణ

ఈ పుస్తకం, విద్యార్థులను, ఉద్యోగస్తులను వుద్దేశించి వ్రాయడం జరిగింది. కనుక కొన్ని ముఖ్యమైన వివరణలను ఇక్కడ పొందుపరచడం జరిగింది. ఈనాటి యువత, చదువు, ఉద్యోగం, వారికి తల్లిదండ్రులు వారికి విధించిన శిక్షగా భావించకూడదు. వాటిని ఆనందంగా, స్వీకరిస్తే, ఫలితాలు బాగుంటాయి. వారిలో వురకలు, పరుగులు వేసే వుత్సాహం, సంతోషం, ఏకాగ్రత, పైకిరావాలనే పట్టుదల వుండాలి. వారి ప్రతిభను పదునుపెట్టే అవసర విషయాలపైనే ఆస్తకి చూపాలి. అనవసర విషయాల్లో తలదూర్చి చేతులు కాల్చుకోకూడదు. వారి సమయాన్ని దుర్వినియాగం చేసుకోకూడదు. విద్యార్థికి ముఖ్యమైన బాధ్యత, విద్యనభ్యసించడమేకాని గాసిప్, డిస్కో కల్చర్ అలవాటు చేసుకోవడం కాదు. సినిమాలు, టి.వి. ఇంటర్నెట్‌ల నుండి, మంచినికాక, చెడుకోసం ప్రాకులాడటం మంచిది కాదు. ఉద్యోగస్తుని ముఖ్యమైన బాధ్యత తనకు యిచ్చిన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించడమే. కానీ బాధ్యతలుమరచి మొదటి నుండే హక్కులకై పోరాడటం మంచిది కాదు. తన అనుభవానికి, చదువుకు, విజ్ఞానానికి, తగిన పారితోషికం దక్కుతుంది. పనిలో వారి నైపుణ్యాన్ని, వారికి యిచ్చిన పనిలో, అవసరమైన జ్ఞానాన్ని పొందడం, వృద్ధి చేసుకోవడం అవసరం. కర్తవ్య నిర్వహణ సవ్యంగాచేస్తే, కోరికలు నెరవేరుతాయి. అనుభవం, ప్రతిభ విద్య, విజ్ఞానం మనిషికి గుర్తింపు నిస్తాయి. ప్రతిమనిషికీ తనదంటూ ఒక రోజు వుంటుంది దానికోసం వేచిచూడాలి. ప్రయత్నలోపం లేకుండా తగిన కృషిచేస్తే ఆ రోజు త్వరగా వస్తుంది. ఉద్యోగి కర్తవ్యాన్ని ప్రక్కన పెట్టి అతితెలివిగా ఎత్తులు వేస్తే బోల్తాపడతాడు.

విద్యార్థులు, వుద్యోగస్తులు, అశ్లీల సాహిత్యం, నీలి చిత్రాలు, ఇంటర్నెట్ ఎబ్యూజ్‌లపై ఆకర్షితులై, సమయాన్ని వృధా చేసుకుంటున్నారు. దుష్ఫలితాలను పొందుతున్నారు.

విద్యార్థులు, వుద్యోగస్తులు, వీరిలో మంచి బుద్ధి, చెడుబుద్ధి, మంచితెలివి, చెడుతెలివి, అతి తెలివి వుంటాయి. చెడు బుద్ధికల వారిలో కూడా తెలివి, అతితెలివి వుంటాయి. అవే వారి పతనానికి దారి తీస్తున్నాయి. ఇంగితజ్ఞానాన్ని మరచిపోతున్నారు. పెద్దల పట్ల, దైవం పట్ల నిర్లక్ష్య వైఖరిని అవలంబిస్తున్నారు. దైవాన్ని విమర్శించడం గొప్ప అనుకుంటున్నారు. సృష్టి అంతా భగవంతునిదేనని, ఈ రోజు మన వద్ద వున్నవన్నీ మన పూర్వజన్మ కర్మననుసరించి, భగవంతుడు మనకు యిచ్చిన ప్రసాదాలే అని మరచి పోతున్నారు.

మనిషికి ఆధ్యాత్మిక చింతన చాలా అవసరం. తద్వారా తనకు మనశ్శాంతి లభిస్తుంది. ఈ రోజు పాశ్చాత్యదేశాల లోని వారు ఒక నాటి నాస్తికులు, మనశ్శాంతి

కోసం ఆధ్యాత్మిక చింతన చేస్తున్నారు. వీరు భౌతికమైన, శారీరకమైన సుఖాలపై విసుగుచెంది, ఆధ్యాత్మిక సంపదల కోసం ప్రాకులాడుతున్నారు. గీతాసారాన్ని బాగా అర్థం చేసుకుంటున్నారు. మన యువత 'భగవత్‌గీత' అంటే ఏమిటి ? 'భాగవతం' అంటే ఏమిటి ? అని అడిగే దుస్థితికి దిగజారుతున్నారు. ఒక్కసారైనా ఆ పవిత్రగ్రంథాలను తెరిస్తే కదా, అందులో వున్న జ్ఞానం అర్థం కావడానికి.

మన సాంప్రదాయాలనూ, ప్రేమానురాగాలనూ, చూసి విదేశీయులు ఆకర్షితులు అవుతున్నారు. క్రమేపీ వాటికి మన యువతీ యువకులు దూరం అవుతున్నారు. దీనికి మూలం విద్య, విజ్ఞానం ఏకాగ్రతపై ధ్యాస తగ్గడమే. ఇంక వీరికి మనఃశాంతి ఎక్కడ దొరుకుతుంది ?

మనిషికి ముఖ్యంగా కావలసినవి మనఃశాంతి, జ్ఞానము, కీర్తి, సంపద, ధైర్యము, ఆరోగ్యము. మనఃశాంతి లేకపోతే మిగిలినవి అన్నీ వున్నా ప్రయోజనం లేదు. అలాగే జ్ఞానము లేని సంపద, ధైర్యము, ఆరోగ్యం నిరుపయోగమే. అలాగే ఆరోగ్యంలేని, ధైర్యము, సంపద, నిష్ప్రయోజనమే. కనుక శాంతి, జ్ఞానము, కీర్తి, సంపద, ధైర్యము ఆరోగ్యము కావాలంటే స్వయంకృషి అవసరం. అందుకే కృషితో నాస్తి దుర్భిక్షం అన్నారు. కనుక విద్యార్థులు, ఉద్యోగస్తులు వారి వారి రంగాలలో కృషి చేయాలి. సత్ఫలితాలు పొందాలి.

ఈ సందర్భంగా కొన్ని ఉదాహరణలను గుర్తు చేసుకోవడం అవసరమని పిస్తుంది. ఇండియాలో అధిక ధనవంతునిగా ఎదిగిన శ్రీ ధీరూభాయి అంబానీ, చివరిదశలో అనారోగ్యంతో బాధపడ్డారు. జీవితంలో అన్నీవుండి ఆరోగ్యం లేకపోతే కష్టమే. అయితే ఆయన స్వయంకృషి వలన, ధైర్యంగా సరైన సమయంలో సరైన నిర్ణయాలు తీసుకోవడం వలన చాలా ఎదిగారు. కీర్తి, ధనం, సంపదలు, జ్ఞానము సంపాదించారు. ఇవన్నీ స్వయంకృషితో సంపాదించారు.

ఆయన అంతగా చదువుకోలేదు. పెట్రోలు పంపులో పనిచేశారు. క్లర్కుగా పనిచేశారు. స్వయం కృషితో అంచెలంచెలుగా ఎదిగారు. మొదట్లో ఆయన జీవితాశయం, ఒక సెకండుహ్యాండు జీపును కొని, భార్యను ప్రక్కన కూర్చోపెట్టుకుని, అహ్మదాబాదు రోడ్లపై షికారు చేయాలని. కానీ ఆయన కృషి, ఆయన్ను మనదేశంలో అత్యుత్తమ పారిశ్రామిక వేత్తగా, ఉత్తమ వాణిజ్యనిపుణునిగా అధికధనవంతునిగా చేసింది.

నాకు తెలిసిన ప్రముఖ పారిశ్రామిక వేత్త, మొదట్లో ఒక చిన్న హోటల్‌లో క్లీనర్‌గా పనిచేస్తూ స్వయంకృషితో పెద్ద పారిశ్రామిక వేత్త అయ్యారు.

మన ప్రస్తుత దేశాధ్యక్షుడు శ్రీ అబ్దుల్ కలాం, లాల్ బహదూర్ శాస్త్రి, అబ్రహాం లింకన్, కామరాజ్ నాడార్ వంటి అనేక మంది ప్రముఖులు, జన్మతా దారిద్ర్యంలో పుట్టినా, స్వయంకృషితో అత్యుత్తమ స్థానాలను చేరుకున్నారు. అత్యుత్తమ సేవలను అందించారు. మన యువత అటువంటి వారిని ఆదర్శంగా తీసుకుని కృషిచేసి పైకిరావాలి. వారినుండి ప్రేరణ పొందాలి. కర్తవ్య నిర్వహణలోనే నిజమైన శాంతి, ఆనందం పొందాలి. కర్తవ్యం అంటే విద్యార్థులకు చదువుసంధ్యలు, ఆటలుపాటలు మరి ఉద్యోగులకు వారి వృత్తిలో చేసేపనిని, WORK IS WORSHIP (వర్క్ యీజ్ వర్షిప్) అని భావించి కృషిచేయడం. అలాచేస్తే వారి కర్తవ్యదీక్ష యితరులను ఆకర్షిస్తుంది.

విద్యార్థులు వారికున్న అర్హతను బట్టి వారి జీవన విధానాన్ని నిర్ణయించుకోవాలి. అంతేకాని వారి పెద్దలు సంపాదించిన డబ్బు ఖర్చుపెట్టడం, వారి కార్లలో తిరగడం, విలాసవంతమైన జీవితాన్ని గడపటం సరికాదు. అలాచేస్తే కృషితో వున్నతస్థానానికి చేరుకోవాలనే తపన చచ్చిపోతుంది. ఫలితం ?

వారి జీవితం + పెద్దల డబ్బు = విషాదం. మనకు కావలిసిందీ, ఎవరైనా ఆకాంక్షిచేది యిది కాదు.

యువత జీవితం + వారి స్వయం కృషి + పట్టుదల = సుఖసంతోషాలు, సిరిసంపదలు.

ఒకసారి చాలా సంవత్సరాల తర్వాత కలిసిన, ఒక మంచి స్నేహితునితో, ఒక మంచి హోటల్‌లో భోజనం చేయాటానికి వెళ్ళాను. అతను ఒక పారిశ్రామిక వేత్త. మాతో అతని అబ్బాయి కూడా మా కారులో వచ్చాడు. అతని వయస్సు సుమారు 18 సం॥ లు. అతనికి 20 రూపాయలు యిచ్చి, బయటకు వెళ్ళి టిఫిన్ తినమని చెప్పాడు. అది సాధారణమే అన్నట్లు ఆ అబ్బాయి బయటకు వెళ్ళి పోయాడు. నాకు కొంత వింతగా అనిపించింది. 'మనతోబాటు భోజనం చేసేవాడుగా. ఎందుకు బయటకు పంపావు ?' అని నా మిత్రుడ్ని అడిగాను. అతను చెప్పిన జవాబు, నన్ను మరీ ఆశ్చర్యపరచింది.

'నేను స్వయంకృషి తో పైకి వచ్చాను. ఈ కారు, బంగళా, ఇండస్ట్రీ, సంపదలు నాకు మానాన్న గారు యిచ్చినవి కావు. స్వయం కృషితో సంపాదించుకుని పారిశ్రామిక వేత్తగా నిలబడ్డాను. నా సంపాదనంతా వాడికోసమే. అవుతే ఈ సుఖాల్ని, విలాసాలను అనుభవించడానికి యింకా తనకు అర్హత రాలేదు. ఆ తర్వాత అర్హత వచ్చినప్పుడు, నా కారూ వుపయోగించు కోవచ్చు, నాతో యింత కంటే మంచి 5 స్టార్ హోటల్‌లో భోజనం చేయవచ్చు. ఆ అర్హత స్వంతంగా తనకృషితో సంపాదించుకోవాలి. అప్పటి వరకూ సైకిల్

మీద కాలేజీకి వెళ్ళాలి. కంఫర్ట్సును పరిమితం చేసుకోవాలి నియంత్రించు కోవాలి అని జవాబు యిచ్చాడు.

కనుక యువత ఒకటి నిర్ణయించుకోవాలి. జీవితంలో సుఖసంతోషాలతో, సిరిసంపదలతో వుండాలనుకుంటున్నారా ? లేక దారిద్ర్యంలో, మానసిక ఒత్తిడి, భయం, ఆందోళనలతో, కష్టాలు పడాలనుకుంటున్నారా ? ఈనాటి యువతకు రాబోయే కాలంలో వారి భార్యా బిడ్డలను దారిద్ర్యంలోకి నెట్టివేసే అధికారం లేదు. వారి సంతోషం కోసం, పెళ్ళి చేసుకుంటారు. పిల్లల్ని కంటారు. అలాంటప్పుడు ఆ భార్యబిడ్డలను సంతోషపెట్టే బాధ్యత వారిపైవుంది. వారిని దారిద్ర్యంలోకి తీసుకువెళ్ళే అధికారం ఈనాటి యువతకు లేదు.

ఈనాటి యువత మనోభావాలను పరిశీలించి, సమీక్షిస్తే బయటపడే సత్యం ఏమిటంటే, వారిలో చాలామంది కష్టపడకుండా సుఖపడాలనే భావం వ్యక్తమౌతుంది. ఇది సరికాదని విజ్ఞతగల యువతకు తెలుసు. సరైన దిశలో పయనించడానికి వారికి మార్గదర్శకతను వారు కోరుకుంటే, వారు మానసిక వికాసానికి సంబంధించిన పుస్తకాలను చదవ వలసిన అవసరం వుంది. మంచి పుస్తకం, మనిషికి మంచినేస్తం. మనిషికి మంచి మార్గదర్శకతను చూపుతుంది. సినిమా, టివి వారి విజ్ఞానాన్ని పెంపొందించడానికి వుపయోగపడే మంచి సాధనాలు. ఇంటర్నెట్ ద్వారా విజ్ఞానాన్ని సొంతం చేసుకోవచ్చు. కాని ఆచరణలోకి వస్తే, యువత వీటి నుండి తీసుకుంటున్న మంచికంటే, చెడుప్రభావం, ఎక్కువగా చాలామందిపై కనబడుతుంది. అందుబాటులో ఉన్న విజ్ఞానాన్ని సద్వినియోగం చేసుకునేవారు, ఔన్నత్యానికి దగ్గర అవుతున్నారు. వారి ప్రతిభాపాటవాలకు పదును పెట్టుకుని, విజ్ఞతతో సుఖసంతోషాలను స్వంతంచేసుకుంటున్నారు. ఎవరు ఈ దిశలో ప్రయాణిస్తున్నారో వారికి, కృషికి తగ్గ ప్రతిఫలం దొరుకుతుంది. ఎవ్వరు బద్ధకం, కృషిలోపం, నిర్లిప్తత, ప్రేమరాహిత్యం వంటి అంశాలను స్వంతం చేసుకుంటున్నారో, వాళ్ళు జీవితంలో కష్టాలు పడుతున్నారు.

ప్రేమరాహిత్యం అంటే పెద్దలను గౌరవించకపోవటం, ఎదిరించి మాట్లాడటం. పెద్దలను కించపరచటం. కాలేజీలలో ఉపాధ్యాయులను బఫూన్లుగా పరిగణించడం. వారిని హేళనచేసి సంతోషించడం, వారిపై జోక్స్ వేసి, హాస్యాన్ని అందించడం. సమయసందర్భాలు, పెద్దాచిన్నల తారతమ్యం గమనించాలి. నాకు తెలిసిన ఒక విద్యార్థి, తోటి విద్యార్థులందరికీ పేర్లుపెట్టి (నిక్ నేమ్స్‌తో) పిలిచి, వారిని కించపరుస్తూ ఇతరులను సంతోషపెడుతూ వుండేవాడు. తన క్లాస్‌మేట్ అయిన ఒక అమ్మాయి పేరుసుధారాణి. ఒక రోజున చేపల

బజార్లో చూసాడు. ఆరోజునుండీ, బొమ్మిడాయిలరాణి అని పేరుమార్చి హేళనచేస్తూ, ఏడిపించేవాడు. ఆ అమ్మాయి పరిస్థితి ఏమిటంటే, తండ్రి లేదు. తల్లి కష్టపడి పనిచేస్తూ సుధారాణిని, ఆమె ఇద్దరు చెల్లెళ్ళను పెంచుతుంది. వారి యింటికి కావలసిన వస్తువులు తీసుకురాడానికి నౌకర్లు లేరు. అవన్నీ తెలిసికూడా ఆమె అందమైన పేరును, 'సుధారాణిని', 'బొమ్మిడాయిలరాణి'గా మార్చి ఆమెను ఏడిపించడం రాక్షసత్వం. అలాగే నత్తితో మాట్లాడే సుబ్బారావును, నత్తిపకోడీ అనీ, హెల్త్ ఇన్స్పెక్టరు గారి అబ్బాయిని సానిటరీ శాస్త్రి అని, కొద్దిగా పొట్ట వున్న బుజ్జి అనే అబ్బాయిని, బానపొట్ట బుజ్జిగాడు అని, సూర్యకుమారిని, సూర్యకాంతం అని పేర్లు పెట్టి ఏడిపించడం, తద్వారా సంతోషించడం జరిగేది. దీన్ని కూడా ప్రేమరాహిత్యం అంటారు. తోటి విద్యార్థులను ప్రేమగా చూడక, వారిని బాధించడం ప్రేమరాహిత్యమే. కాని అతను కాలేజి ప్రెసిడెంటుగా పోటీచేయాలని నిర్ణయించు కున్నాడు. సుధారాణిపై చాలా మందికి సాను భూతివుంది, పైగా బాగా చదువుతుంది. ఆమె సహకారం లేకపోతే ప్రెసిడెంటుగా నెగ్గడం కష్టమని తేలిపోయింది. ఇంక ఎప్పుడూ యిటువంటి పనులు చేయనని చెప్పి, ఆమె కాళ్ళు పట్టుకుని బ్రతిమాలవలసిన స్థితి వచ్చింది. ప్రతి వారికీ తనదంటూ ఒక ప్రత్యేకమైన రోజు వుంటుందని మరువకూడదు.

ఇటువంటి వాతావరణం విద్యాలయాల్లోనేకాదు. ఆఫీసుల్లో, వ్యాపార సంస్థలలో కూడా చూస్తూవుంటాము. ఇంట్లో బాధ్యతలు నెరవేర్చి ఆఫీసుకు వచ్చిన మహిళలను, ఇటువంటి కుళ్ళుజోక్సు, చాలా బాధ కలిగిస్తాయి. కాని వుద్యోగం మానలేరు కదా.

ఇటువంటి జుగుప్సాకరమైన, వ్యర్థప్రసంగాలతో ఎన్ని పనిదినాలను, ఎంత కాలాన్ని వృధాచేస్తున్నారనేది, ఆలోచిస్తే మంచిది. ఆకాలాన్ని, సద్వినియోగం చేసుకుంటే, నిర్మాణాత్మకతను, విజ్ఞానానికి, మనోవికాసానికి సంబంధించిన విషయాల గురించి చర్చించుకుంటే వారికీ, సమాజానికీ, దేశానికీ, ఎంతో మేలు జరుగుతుంది.

చాలా మంది విద్యార్థులు, ఉద్యోగస్తులు, వారికి అందుబాటులో వున్న జ్ఞానాన్ని (KNOWLEDGE), సమాచారాన్ని (INFORMATION) సరిగ్గా వుపయోగించు కోవడంలేదు. వారు Knowledge ని update చేసుకోవడం లేదు. దానికి ఒక ఉదాహరణను వివరిస్తాను. ఒకసారి, భీమవరంలో MBA విద్యార్థులకు ఒక గెస్ట్‌లెక్చర్ తీసుకోవడం జరిగింది. వారిని ఒక ప్రశ్న వేశాను. మనిషి ఆహారం, నీరు తీసుకోకుండా ఎన్ని రోజులు జీవించగలడు? ఆ విద్యార్థుల సమాధానాల సారాంశం, 2 రోజులనుండి, 52 రోజుల వరకూ మనిషి ఆహారం, నీరు తీసుకోకుండా బ్రతకగలడు అని. అంటే వారి జవాబులలోని వ్యత్యాసం 50 రోజులు. దీన్నే రేంజి (RANGE) అంటారు. 'బాలయోగి పేరు విన్నారా

?' అని అడిగాను. 'బాలయోగి, మన పార్లమెంటుకు స్పీకరు పదవిలో వుండగా ప్రమాదంలో చనిపోయారు'

'మరి ఆయనకు ఆ పేరు ఎవరి నుండి వచ్చింది ?' 'తెలీదు'

'ముమ్మిడివరం బాలయోగి గురించి ఎప్పుడైనా విన్నారా?'

'లేదు' అందరి జవాబు యిదే. అంటే వారు చూట్టూ ఏమి జరుగుతుందో గమనించడం లేదు. Knowledge ను update చేసుకోవడం లేదు. వారు పశ్చిమ గోదావరి జిల్లాలో వున్నారు తూర్పు గోదావరి జిల్లాలో, ముమ్మిడి వరం గ్రామంలో సుమారు 46 సంవత్సరాలు ఆహారం, నీరు తీసుకోకుండా నివసించిన బాలయోగి గురించి వారికి తెలియదు. వినలేదు. ఈ తప్పు వారిదే కాదు. వారి పెద్దలది కూడా.

ముమ్మిడివరం బాలయోగి గురించి కొన్ని వివరణలు వారికి యిచ్చాను. అప్పుడు వారు ఏకగ్రీవంగా అంగీకరించి ఒక జవాబు చెప్పారు. అది 'మనిషి, ఆహారం, నీరు తీసుకోకుండా, కేవలం గాలి మాత్రమే ఆధారంగా 100 సంవత్సరాలైనా జీవించగలడు. 'మనిషికి భగవంతుడు యిచ్చిన ఆయుష్షు ప్రకారం రెండు రకాలుగా జీవిస్తాడు, జీవిస్తున్నాడు. అంటే ఆ శక్తి, ఆహారం, నీరు తీసుకోవడం ద్వారా లభిస్తుంది. రెండవది, మన లోపలి శక్తిని ప్రజ్వలింపజేసి, ఆశక్తి ఆధారంగా మనిషి ఆహారం, నీరు తీసుకోకుండా జీవించగలడు. ఎన్నాళ్ళు? అతనికి భగవంతుడు ప్రసాదించిన ఆయుష్షుపై ఆధారపడి వుంటుంది. ఈ ముమ్మిడివరం బాలయోగి, పశువులకాపరి నల్లగావుండేవారు. 12 సంవత్సరాల వయస్సులో 'భక్తపోతన' సినిమా చూసి తర్వాత మళ్ళీ యింటికి వెళ్ళకుండా ఒక చెట్టు కింద కూర్చుని తపస్సుచేసుకోవడం మొదలుపెట్టారు. ఎన్నిసార్లు యింటికి తేవాలని ప్రయత్నించినా, తిరిగి వెళ్ళి ఆ చెట్టు క్రింద చీమలు, పాముల మధ్య కూర్చుని తపస్సు చేసుకోవడం చేశారు. అక్కడి ప్రజలు, అతన్ని దైవరూపంగా భావించి పూజలు చేయడం మొదలుపెట్టారు. ఒకేసారి నోరుతెరిచి 'నేను', మీకు ఏమి చెయ్యలేను. మీరు కూడా నాకు ఏమీ చేయవద్దు. క్రిందటి జన్మలో మధ్యలో, ఆగిపోయిన నాతపస్సుని, యీజన్మలో చేసుకుంటున్నాను' అన్నారు. ఆయన తపస్సుకు యితరులవలన భంగం కలగకుండా, ఒక గుడిని నిర్మించి తలుపుకు తాళంవేసి సీలుచేశారు.

ఎంతోమంది నాస్తికులు వచ్చి రాత్రింబవళ్ళు పరిశీలించారు. 'గాలి తప్పించి, మరేమీ ఆగది లోకి ప్రవేశించడంలేదు, నిజంగానే ఈ బాలయోగి ఆహారం, నీరు తీసుకోకుండా, తనలోని అంతర్గతశక్తి తోనే జీవిస్తున్నారు' అని నిర్ధారణ చేసుకున్నారు. అలా ఆయన మరో 46 సంవత్సరాలు జీవించి, 58వ ఏట పరమపదించారు. ఆయన్ను

చూసి ఆయన సోదరుడు కూడా అలానే తపస్సు చేయడం మొదలుపెట్టి కేవలం గాలి ఆధారంతోనే లోపలి శక్తిని వుపయోగించుకుంటూ ఇంచుమించు 58 సంవత్సరాల వరకూ జీవించారు. ఆ తపస్సు వలన నల్లగా వుండే వారిలో తేజస్సు, మేలిమి ఛాయ వచ్చాయి.

ముఖ్యంగా చెప్పేదేమిటంటే మనం మనజ్ఞానాన్ని మన పరిసరాలలో (environmental) జరుగుతున్న మార్పుల వివరాలను (Information), మనం time to time update చేసుకోవడం లేదు. ఈ పొరబాటును సరిదిద్దుకోవాలి. ఈ కృషిలోపం, బద్ధకం, విషయాలపై ఆసక్తి లేకపోవటం, నిర్లిప్తత వలన, విజయాన్ని సాధించలేక పోతున్నాము. వెనుకబడి వుంటున్నాము. ఈ పోటీయుగంలో (competitive world) లో సరైన పద్ధతిని అవలంబించక, సరైన నిర్ణయాలు, సరైన సమయంలో తీసుకోలేక వెనుకబడి పోతున్నాము. ఈనాటి యువత తప్పు తమదైనా, యితరులను ఆక్షేపిస్తున్నారు, తప్పుపడుతున్నారు. విద్యార్థులైనా, ఉద్యోగులైనా యిటువంటి వాతావరణం నుండి బయటపడాలి.

విద్యార్థి యొక్క ప్రాథమిక ధర్మం విద్యనభ్యసించడం. ఉద్యోగస్తుని ప్రాథమిక ధర్మం ఉద్యోగం చేయడం. తనకు యిచ్చిన బాధ్యతలను నిర్వహించక పోవడానికి ముఖ్య కారణాలు, బద్ధకం, నిర్లిప్తత. కష్టపడకుండానే సుఖపడాలనే వాంఛ. విద్యార్థి సక్రమంగా చదవకుండానే పరీక్షలలో ఫస్టుక్లాసులో వుత్తీర్ణుడు అవాలని వినాయకునికి, వెంకటేశ్వరస్వామికి మ్రొక్కుకోవడం, మనం గమనిస్తూనే వుంటాము.

ఒక లెక్చరర్ విద్యార్థులకు ఒక ప్రశ్న వేస్తారు 'అసలు మీరు కాలేజికి ఎందుకు వస్తున్నారు ?'

విద్యార్థుల జవాబులు చాలా వింతగా వుంటాయి

'కేవలం అటెండెన్సు కోసమే సార్'

'కేవలం కాలక్షేపం చేయడం కోసమే సార్'

'కాలేజీలో అమ్మాయిలను / అబ్బాయిలను సరదాగా ఏడిపించడానికే సార్'

'కాలేజ్ పేరుతో వచ్చి, సినిమాలకు, పబ్స్‌కు, వీడియో పార్లర్‌కు వెళ్ళడానికి సార్'

'సార్, మీకు జీవనాధారం కల్పించడానికే సార్'

'మేం కాలేజికి రాకపోతే అమ్మాయిలకు బోర్ కొడుతుంది. సార్'

ఇటువంటి వింత, వింత సమాధానలనిస్తున్న విద్యార్థులు ఏ దిశలో ప్రయాణిస్తున్నారో అర్థంచేసుకోవాలి. పరీక్షలు దగ్గరకు వచ్చేటప్పటికి ఈ విద్యార్థులలో బెంగ, ఆందోళన,

భయం చోటు చేసుకుంటాయి. పరీక్షలలో ప్రథమశ్రేణి లో ఉత్తీర్ణులు అవడానికి షార్ట్ కట్స్ కోసం అన్వేషించడం మొదలు పెడుతారు. పరీక్షలను నిర్వహించేవారిని బెదిరించడం, కాపీలుకొట్టడం వారిహక్కు అనడం జరుగుతుంది.

ఇటువంటి విద్యార్థులపై కొన్నిజీవితాలు ఆధారపడివుంటాయి. సమాజ శ్రేయస్సు, దేశశ్రేయస్సు ఆధారపడివుంటుంది. ఈనాటి విద్యార్థులే రేపటి పౌరులు. వీరు రూపుదిద్దే భవిష్యత్తు ఎలావుంటుంది ? వీరే రాజకీయ నాయకులైతే వారి పాలన ఎలావుంటుంది ? అపుడు సమాజశ్రేయస్సు ఎలాసాధ్యం ? మనం చూస్తూనే వున్నాము.

అలాగే ఉద్యోగి కష్టపడకుండానే, తన బాధ్యతలు సక్రమంగా నిర్వహించకుండానే హక్కులకై పోరాడుతూ, ఒకే సారి CEO లేదా, GM (జనరల్ మేనేజరు), MD (మేనేజింగు డైరెక్టరు) అవ్వాలనుకుంటే హాస్యాస్పదమే.

వీటన్నిటికీ మూలకారణాలు విద్యార్థులు, ఉద్యోగులలో ఏకాగ్రత లోపించడం. స్వార్థం, స్వలాభాపేక్ష, అసహనం, అనాసక్తి చోటుచేసుకుంటాయి. వీరు యీ అవస్థ నుండి బయటపడాలంటే, పరిస్థితులపై అవగాహన, స్పష్టత అవసరం. అన్నిటికీమించి కృషిపై నమ్మకంకుదరాలి. వీటికోసం విద్యార్థులు, ఉద్యోగులు మంచి పుస్తకాలను చదవడం అలవాటు చేసుకోవాలి. అపుడే యువత తమ కర్తవ్యనిర్వహణను సక్రమంగా నిర్వహించ గలుగుతారు. అప్పుడేవారు మంచి గుర్తింపు పొందుతారు, ప్రగతిపథంలో ప్రయాణిస్తారు. జీవితంలో సుఖశాంతులు పొందుతారు.

# యువశక్తి - విజయం

మూర్తిగారు ఒక మేధావి. ఆయన ఒక పెద్ద గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్‌కు ఛైర్మెన్. ప్రాజెక్ట్స్ అండ్ డెవెలప్‌మెంటు అనేది ఆయన స్థాపించిన ఒక సంస్థ. 'యువత తమ సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలి. శక్తివున్నపుడే కృషితో విజయాన్ని సాధించాలి' అని యువతను వుద్దేశించి తరచూ చెబుతారు మూర్తిగారు. మనిషి వయస్సుతో పాటు మంచి అనుభవాలను పెంచుకోవాలి. అప్పుడే విశాల ధృక్పథం, వ్యక్తిత్వం ఏర్పడుతుంది. అపుడే విజయం సాధ్యం అంటారు మూర్తిగారు. మూర్తిగారి దృక్పథం చాలా స్పష్టంగా వుంటుంది. 'యువకులకు శక్తి సామర్థ్యాలు వుంటాయి. కష్టపడడానికి, ఆరోగ్యం సహకరిస్తుంది. కానీ వారిలో తగిన మానసికపరిణతి వుండకపోవచ్చు. దానికై వారు కృషి చేయాలి', అంటారు మూర్తిగారు. 'ముసలి తనం వచ్చిన వాళ్ళకు మానసిక పరిణతి వుంటుంది. కానీ కష్టపడడానికి ఆర్యోగం, శరీరం సహకరించవు. కనుక శక్తిభరితమైన యవ్వనాన్ని వృధా చేసుకోకుండా శ్రమించాలి. మంచి ఫలితాలను పొందాలి. ముసలితనం రాకముందే మాసనిక పరిణతిని సాధించాలి. 'యువశక్తికి యీ పరిణతి తోడైతే, పనితీరు చక్కగా వుంటుంది. నిర్మాణాత్మక ధోరణిలో పనిచేసి, ఎంచుకున్న వృత్తిలో విజయాన్ని సాధించవచ్చు' అంటారు మూర్తి. 'ఈనాటి యువత, తమ శక్తిని, టివి, సినిమాలు, క్రికెట్, గాసిప్‌లతో వృధా చేస్తున్నారు. ఏ శక్తీ వారికి ముసలితనం రాకుండా ఆపలేదు. కనుక యువత మార్పును స్వీకరించి, సరైన మనస్తత్వాన్ని అలవరచుకుని మంచిపౌరునిగా రూపొందాలి.

మూర్తి గారు స్థాపించిన ఆ సంస్థలో రవి పనిచేస్తున్నాడు. రవి వుత్సాహవంతుడైన యువకుడు. ఆత్మవిశ్వాసం వుంది. అయితే అనుభవం తక్కువ. తనను తీర్చిదిద్దుకోవడంలో అతను కొంత కృషి చేయవలసిన అవసరముంది. వచ్చిన అవకాశాలను చక్కగా వుపయోగించుకుంటాడు. పైకిరావాలనే పట్టుదల వుంది. తోడుగా కొంత బద్ధకం కూడావుంది. అవకాశాలను, తనకు అనుకూలంగా మార్చుకుంటాడు. కానీ లక్ష్యాలను నిర్దేశించుకోడు. పై అధికారుల సలహాలపై ఆధారపడుతుంటాడు. తన పనిని ఈజీగా తీసుకుంటాడు. పంక్చువాలిటీ విషయంలో అంత సీరియస్ కాదు. అదే అతని వీక్‌నెస్ (బలహీనత).

మూర్తి గారి భార్య, సవితామూర్తి. ఆమె చాలా వుత్తమురాలు. పనిని సంతోషంగా స్వీకరిస్తారు. పదిమంది తోనూ సంతోషంగా నవ్వుతూ పనిచేయించుకుంటారు. అలాగే

బాగా పని చేసినవారికి తగిన ప్రతి ఫలం ముట్టేలా చూస్తారు. ఆమె సాధించిన విజయాలను, సంతోషాన్ని, పదిమందితోనూ పంచుకుంటారు. తన ఆఫీసులో పనిచేసే వారందరూ పనిలో ఆనందాన్ని వెదుక్కోవాలని, అప్పుడే పని భారంగా వుండదని చెబుతారు. అపుడు వారి పనిని విజయవంతంగా పూర్తి చేయవచ్చు అని తరుచూ సూచిస్తూ వుంటారు.

'ఆమెతో పనిచేయడం ఒక ఆనందం' అని, పనివాళ్ళంతా, భావిస్తుంటారు. కానీ ఆమె భర్త మూర్తిగారు చండశాసనుడు. కానీ చాలా డైనమిక్, వివేకి. బద్ధకం అనే మాట, ఆయన డిక్షనరీలోనే వుండదు. చాలా చురుకైన వ్యక్తి. ఆయనలానే అందరూ పనిచేయాలనుకుంటారు. ఆయన స్పీడుతో పని చేయడం కొంచెం కష్టమే. మూర్తిగారు తన అంచనాలకు భిన్నంగా యేమైనా జరిగితే సహించరు. ఆయన మేధావి. స్వయం శక్తితో పైకి వచ్చారు. ఆయన ఒక గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్‌కు ఛైర్మెన్ అని ముందే చెప్పాను.

మూర్తిగారు నడిపే ప్రాజెక్ట్సు అండ్ డెవెలప్‌మెంటు అనే ఆ సంస్థను ఆయన భార్య సవితగారు మేనేజ్ చేస్తుంటారు. అపుడపుడు మూర్తిగారు వచ్చి అన్నీ సక్రమంగా నడిచేలా సూచనలిస్తూ వుంటారు. ఆయన ముఖ్యంగా నిర్దేశించేది డిసిప్లిన్, పంచువాలిటీ.

ఆరోజు రవి అనివార్య కారణాల వలన మూడు గంటలు ఆలస్యంగా ఆఫీసుకు వచ్చాడు. ఆరోజే మూర్తిగారు. పంక్చువల్‌గా 9 గంటలకు. ఆ ఆఫీసుకు వచ్చారు. సవితగారు అనారోగ్య కారణం వలన ఆఫీసుకు రాలేదు.

'మేడమ్ గార్కి కారణాలు చెబితే ఏమీ అనరులే' అనుకుంటూ ఆఫీసుకు వచ్చిన రవి ఆఫీసులో మూర్తిగారు వున్నారని తెలిసి కంగారు పడ్డాడు.

'రవీ. బాస్ నిన్ను రమ్మన్నారు. వెంటనే వెళ్ళు' మేనేజర్ గారి హుకుం.

'ఆలస్యంగావచ్చి ఈ కోపిష్టిబాస్‌కు దొరికిపోయానే' అనుకున్నాడు. తోటి వుద్యోగస్థులు రవిని జాలిగా చూసారు. 'రవికి ఈ రోజు అక్షింతలు తప్పవు. అన్నట్లు కొంత మంది చూపులు చెబుతున్నాయి.

వారి చూపులు రవిని యింకా భయపెట్టాయి. భయపడుతూనే మూర్తిగారి కేబిన్‌లో అడుగుపెట్టాడు.

మూర్తిగారు. రవి తయారుచేసి, సబ్మిట్ చేసిన ఫైలు చూస్తూవున్నారు. ఒకసారి రవివంక కోపంగా చూసి, తిరిగి ఆ ఫైల్ చూడటంలో వుండిపోయారు.

'రవి తిట్లు తినేటపుడు తను వుండటం భావ్యంకాదనుకుంది' సెక్రెటరీ రోజా.

'సార్, మీకు కాఫీ పంపిస్తాను '

'పంక్చువల్‌గా వచ్చిన రవికి కూడా ఒక కప్పు కాఫీ పంపించు'

రోజా ముసిముసినవ్వులతో నెమ్మదిగా అక్కడనుండి జారుకుంది.

'నువ్వు రూపొందించిన ప్రాజెక్ట్ రిపోర్టు చూస్తున్నాను. కూర్చో'

'ఫర్వాలేదు సార్'

'ఆత్మవిశ్వాసం వున్న వాళ్ళు అనవలసిన మాట కాదు. 'ఫర్వాలేదు కూర్చో'

రవి ఒద్దికగా కూర్చున్నాడు. రూమ్‌లో నిశబ్దం.

'ఈ ప్రాజెక్ట్ వివరాలను ఏమైనా మార్చాలా సార్?'

ధైర్యం చేసి రవి అడిగాడు.

'నువ్వు తయారు చేసిన ప్రాజెక్ట్, ఛండాలంగావుంది' మూర్తిగారు బాంబు పేల్చారు.

'మేడమ్‌కు చూపావా?'

'మేడమ్‌గారితో డిస్కస్ చేసాను, సార్. కొన్ని సూచనలు యిచ్చారు. కొంచెం ఇంప్రూవ్ చేయాలన్నారు'

'మరి చేయలేదేం'

'లీవ్ నుండి రాగానే, అదే చేద్దామనకుంటున్నాను',

'అందుకేనా 3 గంటలు ఆలశ్యంగా వచ్చావు ?' మరోబాంబు పేలింది.

'సారీ సార్'

'నీ ప్రాజెక్ట్ లో ఆబ్జెక్టివ్స్ బాగానే వున్నాయి. కానీ లక్ష్యం స్పష్టంగా లేదు... నీ తెలివి తేటలను, క్రియేటివిటిని (అదే సృజనాత్మకతను) జోడిస్తే అద్భుతాలు సృష్టించవచ్చు'.

'మేడమ్ కూడా అలానే అన్నారు, సార్'

'ఫైలులో నువ్వు సూచించిన లక్ష్యాలను ఆశయాలనూ సాధించాలంటే, మనం ఎదుర్కో బోయే సమస్యలు, వాటిని పరిష్కరించే విధానలూ పూర్తిగా వివరించలేదు. కొంచెం ఏకాగ్రత లోపించింది'

రవి కొంచెం ధైర్యం పుంజుకున్నాడు.

'ఆదిశలోనే నేనూ చాలా ఆలోచించాను. సార్. లీవ్‌లో వున్నా, నేను మావూరులో, ఈ ప్రాజెక్టుకు చేయవలసిన మార్పులు, స్ట్రేటజిక్ డిసిషన్ల గురించి బాగాఆలోచించాను, సార్'

'అదేనయ్యా ! మీ యువతలో వున్న ఇండిసిప్లిన్. ఆఫీసులో ఆఫీసుపని ఏకాగ్రతగా చేయాలి. ఇంట్లో యింటిపని చేయాలి. అయినా రవీ ! నువ్వు సూచించిన ఫిగర్స్‌లో కొన్ని లోపాలు వున్నట్లున్నాయి'

'అవును సార్ వాటిని బాగా ఆలోచించి ఇంప్రూవ్ చేశాను సార్'

రవి వెంటనే తన పాకెట్ నోట్‌బుక్కు తెరచి తను చేసిన మార్పులను చూపించాడు.

మూర్తిగారు ఆఫిగర్స్ పై వేగంగా దృష్టిసారించారు. ఈ లోగా కాఫీ వచ్చింది 'కాఫీ తీసుకో' ఇద్దరూ కాఫీ తాగేలోగా, మూర్తిగారి కంప్యూటర్ బ్రెన్‌లో ఆఫిగర్స్ రికార్డు అయిపోయాయి.

'ఈ పనంతా సెలవుల్లో వున్నపుడే చేశావా?' రవి పోకెట్ నోట్ బుక్కును తిరిగి యిచ్చేసారు.

'అవును సార్'

'ఏం? ఎందుకు?'

'మేడమ్ హస్పిటల్ నుండి రాగానే, వీటిని చూపిస్తే, ఆమె సంతోషిస్తారనిపించింది సార్'

'అవును. ఆమెకు బదులు నేను సంతోషిస్తున్నాను'

'థాంక్స్ సార్'

'కానీ రవీ నీ లో కొంత ఇండిసిప్లిన్ వుందయ్యా'

'అవును సార్. మేడమ్‌గారి శిక్షణలో నాలో చాలా మార్పు వచ్చింది. ఇంకా మారడానికి కృషి చేస్తాను. మేడమ్‌గారితో శభాష్ అనిపించుకుంటాను'.

'గుడ్ కీప్ యిట్ అప్. వృద్ధిలోకి వస్తావు'

'మేడమ్‌గారి ఆరోగ్యం, ఎలా వుంది? సార్'

'ప్రస్తుతానికి బాగానే వుందయ్యా. ఆలస్యంగా ప్రెగ్నెన్సీ వచ్చింది కదా ? డాక్టర్లు విశ్రాంతి అవసరమని అంటున్నారు'

'కంగ్రాట్యులేషన్స్ సార్. మేడమ్ గారి అనారోగ్యనికి కారణం యిది అని తెలియదు సార్'.

'థ్యాంక్యూ. నీ ప్రాజెక్ట్ రిపోర్టు త్వరగా పూర్తి చేసి, ఇంటికి పంపు. మేడమ్ చూసి

సంతోషిస్తుంది.'

'ఒకే సార్. మరికొంత ఇంప్రొవైజ్ చేసి ఫైల్‌ను రేపే ఇంటికి పంపుతాను సార్.'

'నీ డెడికేషన్‌ను మెచ్చుకుంటున్నాను. నీలాంటి తెలివిగలవాళ్ళు మా సంస్థకు కావాలి'.

'సంస్థ పురోభి వృద్ధికి కష్టపడి, సమిష్టిగా కృషి చేస్తాం సార్'.

'రవీ ఈ రోజు 3 గంటలు ఆలశ్యంగా రావడాని, ఏదో కారణం వుండి వుంటుంది.

ఏమిటది ?'

'నిజంగా చెప్పాలంటే. నా ఆలశ్యానికి కారణం నా బద్ధకమే సార్'. ముందు నిన్ననే బయలుదేరి వచ్చేద్దామనకున్నాను. బద్ధకించాను. ఉదయమే బయలుదేరి వచ్చాను. దారిలో ఒక వర్గంవారు 'రాస్తారోకో' కార్యక్రమం నిర్వహిస్తున్నారు. ఒకేచోట మాబస్సు మూడు గంటలు ఆగిపోయింది. ఫలితం నేను మూడు గంటలు ఆలశ్యంగా ఆఫీసుకు వచ్చాను. అయితే ఈ వాయిదా వేసే మనస్తత్వం మంచిదికాదని తెలుసుకున్నాను సార్'

మూర్తిగారు ఫ్లవర్ వేజ్‌నుండి ఒక గులాబీని తీసి రవికి యిచ్చారు. 'థాంక్స్ సార్'

'రవీ ఎప్పుడూ యిది గుర్తుంచుకో, మనకు లక్ష్యం వుండాలి. లక్ష్యసాధనకు, కృషి అవసరం. ఏకాగ్రత, ఆత్మవిశ్వాసం అవసరం. మనిషికి వున్న పెద్ద జబ్బు బద్ధకం. బద్ధకం వలన అభివృద్ధి. సంతోషం కుంటుపడుతుంది. *Anyhow. All the best* నువ్వు వెళ్ళి మేనేజర్ గార్ని లోపలికి పంపు'

'I will raise to your expectations, sir' థాంక్యు ఫర్ ది అడ్వైజ్.'

'OK ! My Boy', యింతకీ నువ్వు ఏపని మీద యింటికి వెళ్ళావు ?

'పెళ్ళి చూపులకు, సర్' రవి కొద్దిగా సిగ్గుపడ్డాడు.

'ఏమైంది?' 'వచ్చేనెలలో పెండ్లి నిశ్చయించారు. సార్'

'కంగ్రాట్యులేషన్స్ ఇంతకీ మేనేజర్ గార్ని ఎందుకు రమ్మంటున్నానో తెలుసా ? ఊహించు'

'తెలియదు సార్'

'నీకు జీతం మరో 10,000 రూపాయలు పెంచమని చెబుదామని'

'థాంక్యు సార్'

'ఇది నీ అంకిత భావానికి గుర్తింపు, నీ తెలివి తేటలకు గుర్తింపు'.

'థాంక్యు సార్'

'OK ! కష్టపడి, కృషిచేసి, జీవితంలో పైకిరావాలి'

మూర్తిగారు కుర్చీలోంచి లేచి రవికి షేక్‌హాండ్ ఇచ్చారు.

ఏడుపు ముఖంతో, బాస్ రూం నుండి, రవి బయటకు వస్తాడనుకున్నారు తోటి వుద్యోగస్తులు. నవ్వుతూ, చేతిలో గులాబీతో బయటకు వచ్చిన రవిని చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

ఏకాగ్రతతో ఆ గులాబీనిచూస్తూ, మురిసిపోతూ వుండిపోయాడు రవి.

'ఈ గులాబీ చాలావిలువైనది. నాకు చాలాప్రేరణ యిస్తుంది. నాలోని సృజనాత్మక శక్తిని, నా తెలివితేటలను జోడిస్తుంది. నిర్మాణాత్మకమైన పనులు చేయడానికి ప్రోత్సాహాన్ని యిస్తుంది' మనస్సులోనే అనుకున్నాడు రవి.

గులాబీనే తదేకంగా చూస్తూ మురిసిపోతున్న రవి, మేనేజర్‌గారి రాకను గమనించలేదు,

'రవీ, కంగ్రాట్యులేషన్స్. ఛైర్మెన్‌గారు నీకు పదివేల రూపాయల జీతాన్ని పెంచడమేకాక అసిస్టెంటు మేనేజరుగా ప్రమోషన్ కూడా యిచ్చారు. కీప్ యిట్ అప్'

'థాంక్యూ సార్'

'జీవితంలో పైకి రావాలంటే మనల్ని మనం రూపుదిద్దు కోవాలి. వ్యక్తిగతంగా మనం సాధించవలసినవి కొన్ని అంశాలు వుంటాయి. మనం త్యజించ వలసిన విషయాలు కూడా కొన్ని వుంటాయి. వాటిని గురించి బాగా ఆలోచించి, ఒక పేపరు తయారు చెయ్యి. రేపు నువ్వు ఒక లెక్చర్, ట్రెనింగు డిపార్ట్‌మెంటులో యివ్వాలని ఛైర్మెన్‌గారు చెప్పారు. జూనియర్ ఆఫీసర్లలో ఆత్మవిశ్వాసం పెంపొందేలా నీ లెక్చర్ వుండాలి.

'OK ! సార్'

విషయాలు తెలుసుకున్న, రవి తోటి వుద్యోగులు రవిని మనసారా అభినందించారు.

రవి ఆనందానికి అవధుల్లేవు. తనపై వుంచిన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించాలి. రవి ఆలోచనలలో పడ్డాడు ఎన్నో అంశాలు, ఆలోచనలు మనసులోకి వస్తున్నాయి.

రవిలో క్రియేటివ్ థింకింగ్ మొదలైంది. మదిలో మంచిఆలోచనలు ఉదయిస్తున్నాయి.

మనం సుఖసంతోషాలతో గడపాలనుకుంటే, మనల్ని మనం రూపుదిద్దుకోవాలి.

మనల్ని మనం రూపుదిద్దుకోవాలంటే, మనం చేయవలసినవి, మనం సాధించ వలసినవి.

కొన్ని పనులు వుంటాయి అవి.

1. స్వార్జితమైన (సెల్ఫ్ ఎక్వైర్డ్) ఆస్తులను, ధనాన్ని, పేరు ప్రఖ్యాతులను, మంచితనాన్ని, నిలబెట్టుకోవాలి.

2. స్వలాభాపేక్ష అవసరమే కానీ మితిమీరకూడదు.

3. ఇతరుల లాభాన్ని ఫణంగా పెట్టకూడదు. ఇతరులను వంచించ కూడదు.

4. ఆత్మనింద చేసుకోకూడదు.

5. ధైర్యంగా, ఆత్మవిశ్వాసంతో వుండాలి.

6. ఆత్మనిగ్రహము, ఇంద్రియ నిగ్రహములతో వుండాలి. మన కోరికలు గుఱ్ఱాలు కాకూడదు.

7. స్వయం శిక్షణ (సెల్ఫ్ కల్చర్, సెల్ఫ్ ట్రెనింగు) అవసరం. సాధనతోనే స్వయం శిక్షణ సాధ్యం. దానికి మనస్సు పెట్టాలి.

8. ఆత్మవిశ్వాసము (సెల్ఫ్ కాన్ఫిడెన్స్), ధైర్యము చాలా అవసరం. అవే మన విజయానికి పునాదులు.

9. స్వయం శిక్షణ అంటే విద్య, విజ్ఞానం, యితరులనుండే కాక, మన చుట్టూ వున్న వాతావారణాన్ని గమనిస్తూ నేర్చుకోవడం చాలా అవసరం.

10. మనల్ని మనం క్రమశిక్షణలో వుంచుకుంటే, యితరులు మనకు నీతులు చెప్పే అవసరము వుండదు.

11. మనగొప్పల్ని మనమే ప్రదర్శించే గుణం అవసరం. దాన్నే సెల్ఫ్ – ఎఫేసింగ్ అంటారు.

మనం రూపుదిద్దుకోవాలంటే మనం త్యజించవలసినవి కూడా కొన్ని వుంటాయి.

మన స్వంత విలువలను దుర్వినియోగం చేసుకోకూడదు.

అహంకారాన్ని, గర్వాన్ని దూరంగా వుంచాలి. మనల్ని మనం గౌరవించుకోడానికి, యితరులను కించపరచకూడదు.

ఆత్మవంచన (సెల్ఫ్ డిసెప్షన్) చేసుకోకూడదు. మనల్ని మనమే మోసగించుకుంటే, యితరులకు ఏం సహాయం చేయగలం?

ఆత్మ నింద (సెల్ఫ్ కండెమ్నేషన్) చేసుకోకూడదు.

ముందు వుదహరించినట్లు,

మనల్ని ఎపుడూ మనకంటే వున్నతులతోనే కంపేర్ చేసుకోవాలి. కానీ, చెడు వారితో, గుండాలతో, ఫాక్షనిస్టులతో, అరాచకాలను ప్రోత్సహించేవారితో, దోపిడీదారులతో, పోల్చుకోకూడదు. మనకున్న వనరులను దుర్వినియోగం చేసుకోకూడదు. ఏదోవిధంగా దోపిడీచేసి మనఆస్తిని, దర్పాన్ని, హోదాని పెంచుకోకూడదు. దాన్ని నిరర్థక స్వార్థం అంటారు. నిరర్థకస్వార్థంతో పనిచేసే వాళ్ళకు ఏదో ఒక రోజున ఓటమి తథ్యం.

రవిలో ఆలోచనా ప్రవాహం సాగుతూనే వుంది. తనలో వస్తున్న మంచిఆలోచనలను క్రమబద్ధీకరించి. ఒక మంచిసందేశాన్ని, తన జూనియర్ ఆఫీసర్లకు యివ్వాలను కుంటున్నాడు.

ఇలాంటి భావనలు, యువతీ యువకుల మనస్సులో మెదలుతూవుంటే, మంచిది. ఆ ఆలోచనలకు రూపుదిద్దాలి. కార్యాచరణలో పెట్టాలి. ఫలితాలను విశ్లేషించాలి. అవసరాన్ని బట్టి మార్పులు చేసి సత్ఫలితాలు పొందాలి. అంచెలంచెలుగా అభివృద్ధిని సాధించాలి. ఏ పనిలోనైనా, ప్రాసెస్‌లోనైనా, కంటిన్యువల్ ఇంప్రూవ్‌మెంట్ అవసరం. విజయానికి, మన సంతోషానికి అదే మూల కారణం.

# మనస్సుతో ఒప్పందం

ఇది తండ్రీ, కూతురు, మధ్య జరుగుతున్న సంభాషణ. మనిషికీ బాధ్యతలకు గల ఒప్పందం గురించి, చర్చించడం జరుగుతుంది. ఒక బాధ్యత నెరవేర్చాలి. కాని ఆబాధ్యత నెరవేర్చడానికి మనస్సుపెట్టకుండా, సీరీయస్‌గా తీసుకోకుండా కాలక్షేపంచేస్తున్న అమ్మాయిలో, ఎన్నో నెగెటివ్ ఆలోచనలు. పని ఎగగొట్టడానికి 30 కారణాలు. కారణం ? తండ్రి యిచ్చిన బాధ్యతను నెరవేర్చడానికి ఆమెకు అవగాహన, నేర్పు, జ్ఞానం లేక కాదు. అన్ని వనరులూ ఆమెవద్ద వున్నాయి. బద్ధకం కూడా వున్నాది. లేనిది ఒకటే. బాధ్యత నెరవేర్చడానికి తన మనస్సుతో సరైన ఒప్పందం. మనస్సు వుంటే ఆ బాధ్యత చేపట్టడానికి మార్గాలెన్నో వున్నాయి. ఆ పనిపై మనస్సు లేనపుడు, ఆమె తన మనస్సుతో చేసుకున్న నెగెటివ్ ఒప్పందాలను పోజిటివ్‌గా ఆ తండ్రి ఎలా మారుస్తున్నాడో, ఈ సంభాషణ వింటే మీకే తెలుస్తుంది. మనం మనమనస్సుతో కొన్ని బాధ్యతలు నెరవేర్చేముందు, కొన్ని నెగెటివ్ ఒప్పందాలు చేసుకుంటాము. కనుక ఈ సంభాషణను మనకు అన్వయించుకుంటే, ఆ నెగెటివ్ ఆలోచనలు ఎలాపోతాయి ? పోజిటివ్ ఒప్పందాలుగా ఎలా మార్చుకోవాలి? తర్వాత ఫలితాలు ఎలావుంటాయి ? అని మీరు వూహించు కోవాలి. వీరి సంభాషణ ఎలా సాగుతున్నాదో చూద్దాం.

F : ఫాదర్ A: అనురాధ (డాటర్ కుమార్తె)

F : అనూ!, ఆనందరావు అంకుల్ తో నువ్వు చేయబోయే కాంట్రాక్టు చేస్తున్నావా?

A: మరీ ఇంత వుదయాన్నే చేయాలా డాడీ ?

F : అవునమ్మా. ఏ పని ప్రారంభించాలన్నా, ఏపనికైనా ఫినిష్ంగ్‌టచెస్ యివ్వాలన్నా తెల్లవారు జామున చేస్తేనే మంచిది. అదే ది బెస్ట్ టైమ్. ఉదయం లేవగానే బద్ధకంగా అనిపించినా, ఈ పనిని పారంభిస్తే మంచి ఆలోచనలు వస్తాయి. వాటిలో సృజనాత్మకత (కియేటివిటీ) వుంటుంది. మనస్సు ఫ్రెష్‌గా వుంటుంది. మనస్సుపెట్టి ప్రొద్దున్నే పనిచేయడం మొదలుపెడితే, లోపల్నించి శక్తి తన్నుకొస్తుంది. ఈరోజు కాకపోతే రేపైనా ప్రయత్నించి చూడు.

A: ఇంకా చాలా టైము వుందిగా డాడీ ?

F : నువ్వు MS చేయడానికి USA వెడదామనుకుంటున్నావు. కొన్ని యూనివర్సిటీస్‌లో అడ్మిషన్ కూడా వచ్చింది. తర్వాత వీసా వస్తుంది. USA వెళ్ళి పోతావు. అంకుల్ యిచ్చిన

ఈ పనిని పూర్తి చేయకుండా వెళ్ళిపోతే ఆయన డిసప్పాయింట్ అవుతారు.

A: లేదు డాడీ, అంకుల్ నిరాశ చెందేలాచేయను.

F : ఇంకా టైముంది అంటున్నావుగా. ఈ సమయంలో, ఈ కాంట్రాక్టును మరింత బాగా రూపుదిద్దు. మంచిగా ప్లాన్ చేయడానికీ, ప్లాన్‌ను ఆచరణలో పెట్టేటపుడు ఎదురయ్యే అడ్డంకులను ముందుగానే వూహించు. ఆ అడ్డంకులను తొలగించడానికీ టైము కావాలి. కనుక వెంటనే ఈ పనిని మొదలు పెట్టు. సరిగ్గా ప్లాను చేసుకుంటే మరింత ఆత్మ విశ్వాసం పెరుగుతుంది.

A: నాకు మీ నుండి యిలాంటి ప్రేరణ కావాలి డాడీ. ఈ ఒత్తిడి లేకపోతే నేను పనిని ప్రారంభించలేను. మీ సలహాలు నాకు ఎప్పుడూ కావాలి.

F : అవి ఎప్పుడూ వుంటాయి తల్లీ. అయితే ఒత్తిడి (ప్రెజర్) లేకుండా పని చేయలేనంటున్నావు. ఆ ఒత్తిడి నీ నుండే రావాలి. ఉదాహరణకు ఈ కాంట్రాక్టు రూపుదిద్దడం. ఆనంద్‌రావు అంకుల్‌తో సంప్రదించి అంగీకారం తీసుకోవడం, నీ పనిని ప్రారంభించడం, ఆయన ఆఫీసుకు తగ్గట్టుగా నువ్వు సాఫ్ట్‌వేర్ డెవెలప్ చేయడం. ఈ పనులన్నిటికి 20 రోజులు పడుతుందనుకుందాం 21 వ రోజున ఇంకోపని చేయడానికి కాంట్రాక్టు కుదుర్చుకో. ఆ కాంట్రాక్టు, కూడా యివ్వడానికి అంకుల్ సిద్ధంగా వున్నారు. అయితే యీ కాంట్రాక్టు పూర్తయిన తర్వాత మాత్రమే యిస్తానని చెప్పారు. ఆ కాంట్రాక్టు కూడా చేయాలని వుందా ? చేయగలవా?

A: డాడీ, మరొక కాంట్రాక్టు కూడా చేయాలని వుంది, చేయగలను'.

F : 'చేయక పోయినా పర్వాలేదు. ఆ 21 రోజున మనందరం కలసి రెండు మూడు రోజులు నాగార్జున సాగర్, శ్రీశైలం వెళ్ళివద్దాం. సరదాగా గడుపుదాం అది చేయాలంటే నువ్వు ఈ కాంట్రాక్టు 20 రోజులలో పూర్తిచేయాలి.' నేను మన ప్రయాణానికి టిక్కెట్ళు కొంటాను.

A: లేదు డాడీ. ఈ రెండు కాంట్రాక్టులు నిర్ణీతసమయంలో నేను పూర్తిచేస్తాను. నా పనితనంచూసి అంకుల్ సంతోషిస్తారనే నమ్మకం నాకుంది.

F : నీపై నీకు గల ఆ నమ్మకమే నీకు నిజమైన పెట్టుబడి. ఇంక ఆలస్యమెందుకు ? పనిని ప్రారంభించు.

A: డాడీ. నిజంగా నా మనస్సు లో వున్న మాట చెప్పనా ?

F : చెప్పు తల్లీ.

A: ఇదే మొదటి కాంట్రాక్టు అవడంవలన ఈ పని బోరుగా అనిపిస్తుంది డాడీ.

F : బోరుగావుంటే ఈపని చేయనని, చేయలేనని చెప్పు. ఇంట్రస్టులేని పని చేయవద్దు.

A: లేదుడాడీ, ఇంట్రస్టువుంది. కానీ స్టార్టింగ్‌ప్రోబ్లమ్.

F : ప్రస్తుతం బోర్ అనుకుంటున్నవి, తర్వాత చాలా ఆనందాన్ని యివ్వవచ్చు. ఉదాహరణకు ఉదయాన్నే షటిల్ ఆడ్డానికి వెళ్ళాలన్నా, వాకింగుకుగాని, జాగింగుకుగాని వెళ్ళాలన్నా డాన్సుక్లాసుకు వెళ్ళాలన్నా ముందు బోర్‌గానే వుంటుంది. ప్రారంభిస్తే తర్వాత వాటివలన మనకు ఎంతమేలు జరుగుతుందో నీకు తెలుసు.

A: ఈ పనిని ప్రారంభించడం నిజంగానే, చాలా కష్టం డాడీ.

F : అనూ ! ఒకటి గుర్తుంచుకో. 'కష్టేఫలీ' అన్నారు. కష్టపడని వాళ్ళు జీవితంలో పైకి రాలేరు. కష్టం అనుకుని విడిచి పెట్టకూడదు. కష్టమైన పనినే ముందు చేయాలి. లేకపోతే ఆ పనిని ఎప్పుడూ ప్రారంభించ లేవు. కష్టాన్ని సాధించడంలో వున్న తృప్తి మరిదేనిలోనూ వుండదు. నీ మనస్సుతో సరైన ఒప్పందం చేసుకోలేదనుకో, అది ఎప్పుడూ కష్టం, కష్టం అంటూ నీ బుర్రను తొలచి వేస్తూనే వుంటుంది. అపుడు నీవు ఈపనిని ఎప్పుడూ ప్రారంభించ లేవు.

A: సరదాకి అంటున్నా డాడీ. నేను ఈ పనిని ప్రారంభించకపోతే ఏదైనా ప్రమాదం ముంచుకు వస్తుందా?. తండ్రి ఆ జోక్‌ను సరిగ్గా స్వీకరిస్తాడు. తిరిగి నవ్వుతూ జవాబిస్తాడు.

F: ఇప్పుడు ప్రమాదం లేదు. అలా అని ఎప్పుడూ ప్రమాదం రాదని చెప్పలేం. పని ప్రారంభించకుండా వుండటానికి నువ్వు చెబుతున్న వంకలు, నీవి కాదు. నీ మనస్సువి. మనస్సు కోతిలాంటిది. ఆకోతికి స్థిరత్వం వుండదు. పని ఎగ్గొట్టడానికి, నీతో, రకరకాల వేషాలు వేయిస్తుంది. నువ్వు యీ కోతిలాంటి మనస్సుకు, ప్రాధాన్యతను యివ్వకుండా, మెదడుకు ప్రాధాన్యత నిస్తే, మెదడు సృజనాత్మకంగా, నిర్మాణాత్మకంగా పనిచేస్తుంది. నీకు తగిన ప్రోత్సాహన్ని సంతోషాన్ని, తృప్తిని యిస్తుంది.

A: డాడీ, మీరు చాలా గ్రేట్. నాలోవున్న నెగెటివ్ థింకింగును, పోజిటివ్‌గా కన్వర్టు చేస్తున్నారు. డాడీ యింకొక ప్రశ్న అడగనా?

F : సందేహం దేనికీ ? అడుగు.

A: (నవ్వుతూ) ఈ పని చేయడానికి యింక ఎవ్వరూ లేరా ? నేనే చేయాలా ?

F : (నవ్వుతూ) అంకుల్, ఫోన్ బుక్కులో, ఈ పని చేయగల వారి పేర్లు చాలా వుంటాయి. ఆనందరావు నా స్నేహితుడు గనుక, ఈ పని నీకు అప్పగించలేదు. ఆయన చాలా తెలివైన వారు. చిన్నపటి నుంచీ నిన్ను చూస్తున్నారు. చదువులో నీ ప్రతిభను చూస్తున్నారు. ఆయనకు నీపై చాలా నమ్మకం. నీవైతేనే ఈపనిని సమర్థవంతంగా చేయగలవని భావిస్తున్నారు. USA వెళ్ళేలోగా నీతో ఈపనిని చేయించి, ప్రోత్సహించాలను కుంటున్నారు. ఆ నమ్మకాన్ని ఒమ్ము చేయకూడదు.

A: నిజమే డాడీ, కానీ ఈ కాంట్రాక్టు అంత మంచిఫలితాలను యిస్తుందంటారా?

F : నీ ప్రయత్నలోపం లేకుంటే, మంచిఫలితాలనే యిస్తుంది. మంచిఫలితాలు వుంటాయనే, ఈపనిని నీకు యిచ్చారు. నువ్వయితేనే సమర్థవంతంగా చేయగలవని ఆయన నమ్మకం.

A: ఈపనిని ఇంకా స్టడీచేయాలి డాడీ.

F :అవును, ఈ స్టడీ కూడా ఈ పనిలోని ఒక భాగమే. ప్రారంభించు. ఫలితాలు బాగుంటాయి.

A: థాంక్స్ డాడీ. మంచిసలహాలు యిచ్చారు. కొంచెం రిలాక్స్ అయి, ఈ కాంట్రాక్టు పనిని ప్రారంభిస్తాను.

F : (నవ్వుతూ) ఈ మాట నీ మనస్సు చెబుతోందా ? లేక నీ మెదడు చెపుతుందా ?

A: (నవ్వుతూ) నా కోతి మనస్సు కాదు డాడీ. నా మెదడే చెబుతుంది.

F : (నవ్వుతూ) అయితే పర్వాలేదు. రిలాక్స్ అవ్వు తర్వాత ఫ్రెష్‌గా, ఉత్సాహంతో ఈ పని ప్రారంభించు. ఆలశ్యం అమృతం విషం అనే సామెత గుర్తుంచుకో.

A: ఈ పనిని నేను సమర్ధవంతంగా చేసి చూపిస్తాను డాడీ. నాలో వున్న నెగెటివ్ థింకింగును, పోజిటివ్ థింకింగుగా మార్చారు. థాంక్స్ డాడీ.

ఇలాంటి వివరణలు తల్లిదండ్రులు తమ పిల్లలకు యిస్తూ, నిరంతరం ప్రోత్సహించాలి. వారి నెగెటివ్ ఆలోచనలను ఆదిలోనే తొలగించి వారిని పోజిటివ్‌గా ఆలోచించేలా చేయాలి. అపుడు పిల్లలు కార్యోన్ముఖులు అవుతారు. సరైన సమయంలో సరైన నిర్ణయాలు తీసుకుంటారు. సరైన రీతిలో వారిపనులను సక్రమంగా పూర్తిచేస్తారు. బద్ధకానికి మూలకారణం వారిలోని నెగెటివ్ ఆలోచనలే. వాటికి మనస్సులో ఆస్కారం లేకుండా చేస్తే, వారు తప్పక విజయంసాధిస్తారు. వారికి మంచి భవిష్యత్తు వుంటుంది.

# సమస్య - పరిష్కారం (చర్య - ప్రతిచర్య)

మనకు జీవితంలో ఎన్నో సమస్యలు ఎదురు అవుతుంటాయి. సమస్యలు లేని వారు ఎవరూ వుండరు. పేదవారు, గొప్పవారు అనే భేదం లేదు. ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం వుంటుంది. సమస్య వచ్చినపుడు దానికి గల మూల కారణాలను గుర్తించాలి. ఆ మూలకారణాలను విశ్లేషించాలి, తగిన నిర్ణయాలు తీసుకోవాలి. ఆ నిర్ణయాలను ఆచరణలో పెట్టాలి. ఫలితాలను చూడాలి. ఆఫలితాలను విశ్లేషించాలి. కొన్ని మార్పులు, చేర్పులూ చేయాలి. అంచెలంచెలుగా వృద్ధి చేసి పరిష్కారం సరిగ్గావుండేలా చేయాలి. ఈ ప్రక్రియ కోసం ఆలోచించడం అవసరం. స్వేచ్ఛగా ఆలోచించాలి. పరిస్థితులను అవగాహన చేసుకోవాలి. అంతేగాని తొందరపాటు పనికి రాదు. అలాగే, యేదైనా సంఘటన (చర్య) జరుగుతే వెంటనే తొందరపడి ప్రతి చర్య తీసుకోకూడదు. అలా తొందరపాటు ప్రతి చర్యలవలన ఫలితాలు సక్రమంగా వుండవు. ఒక్కొక్క సారి ఫలితాలు చాలా విషాదంగా వుండటానికి అవకాశం వుంది. ఉదాహరణకు.

ఒక విద్యార్థి పరీక్ష తప్పాడు. అది వూహించని సంఘటన. అసలు 'ఫస్టుక్లాసులో ఉత్తీర్ణుడ్ని' అవుతాను అని అనుకున్నాడు. అన్ని పేపర్లూ చూసాడు. అతని రోల్ నంబరు లేదు. అనుకున్న దానకి భిన్నంగా ఫలితాలు రావడంతో, చాలా నిరాశ చెందాడు. బాధను తట్టుకోలేకపోయాడు. పెద్దలకు తనముఖం చూపించడం కష్టం అనుకున్నాడు. ప్రతిచర్య ఆత్మహత్య. సంఘటన పరీక్షతప్పడం. ప్రతిసంఘటన అతని మరణం. ఈ మధ్యలో అతను చేయవలసినవి చాలావున్నాయి. అవే ఆలోచన, ఆత్మావగాహన, పునఃపరిశీలన, అంతర్మధనం వివేకం. 'పరీక్షలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడ్ని అవుతాను అనుకున్నవాడు, వివేకంతో ఆలోచిస్తే, మరెక్కడో పొరబాటు జరిగివుండవచ్చనే అనుమానం రావచ్చుకదా. తనపై తనకు అంతనమ్మకం వున్నవాడు ఒకేసారి తప్పంతా తన మీద ఎందుకు వేసుకున్నాడు? తప్పు యితరులదేమో అనే సందేహం ఎందుకు రాలేదు? మనోధైర్యాన్ని కూడగట్టుకుని యూనివర్సిటీకి, రీవెరిఫికేషన్‌కోసం, ఎందుకు అప్లై చేయకుండా వూరుకున్నాడు? అదే ఆలోచన తల్లిదండ్రులకు కూడా రాలేదు. పరీక్ష తప్పినందుకు తిట్టారు. వారూ ఆలోచించలేదు. ప్రతిఫలంగా, ఒక్కగానొక్క కొడుకు యొక్క శవం మిగిలింది.

నిజానికి ఆ అబ్బాయి పరీక్ష తప్పలేదు. ఫస్టుక్లాసులోనే వుత్తీర్ణుడయ్యాడు. అతని రోల్ నంబరు లోని ఆఖరిసంఖ్య 6 (ఆరు), సున్నాలా తప్పుగా ముద్రణ చేయడం జరిగింది. ఆ పొరబాటు యూనివర్సిటీలోనే జరిగింది. కనుక అన్నిపేపర్లూ ఒకలాగానే ముద్రణ

చేసాయి. ఫలితం ప్రథమ స్థానంలో వుత్తీర్ణుడయిన అబ్బాయి, రోల్ నంబరు లేదు. పరీక్ష తప్పిన మరొక అబ్బాయి ఫస్టుక్లాసులో వుత్తీర్ణుడయినట్లు తెలిపింది. ఈతప్పు ఒక నిండు ప్రాణాన్ని బలితీసుకుంది. జరిగిన తప్పును గుర్తించి యూనివర్సిటీ వారు తెలియచేశారు. అప్పటికే ఆ అబ్బాయి ప్రాణాలు గాలిలో కలసి పోయాయి. ముఖ్యంగా తెలుసుకోవలసింది ఏమిటి? చర్యకు, ప్రతిచర్యకు (లేదా సమస్యకు, పరిష్కారానికి) మధ్య చేయవలసింది ఆలోచన. ఆలోచించకుండా నిర్ణయాలు తొందరపడి తీసుకుంటే పర్యావసానం బాగుండదు.

మరొక వుదాహరణ కూడా యిక్కడ వివరిస్తాను. తెల్ల చీరకట్టుకుని, మల్లెపూలు పెట్టుకున్న వాళ్ళంతా నా పెళ్ళాలే అన్నాడట ఒక ప్రబుద్ధుడు. ఒకసారి అలానే జరిగింది. 5'.4" వున్న ఒక గృహిణి తెల్లచీర కట్టుకుని, మల్లెపూలు పెట్టుకుని, షాపింగుకు వెడుతున్నాది. ఆ ప్రబుద్ధుడు ఆమెను వెనుక నుండి చూచి తన భార్యే అని భ్రమపడ్డాడు. ఆమెను ఆశ్చర్యపరచాలని వెనుక నుండి వెళ్ళి గట్టిగా పట్టుకున్నాడు. వెను తిరిగి చూసిన ఆమె అవాక్కయింది. ముందూ వెనుకా ఆలోచించలేదు. పులిలా విజృంభించింది అతని చెంపలు వాయించింది. ఈ ప్రతిచర్య ఫలితం, అతని కళ్ళజోడు విరిగింది. విరిగిన కళ్ళజోడు, అతని కంటిలో గుచ్చుకుంది. ఫలితం అతను ఒక కంటిని శాశ్వతంగా కోల్పోయాడు. తర్వాత, అసలు సంగతి తెలుసుకుని ఆమె పశ్చాత్తాపపడింది. చర్యకు, ప్రతిచర్యకు మధ్య ఆలోచించడానికి సమయం లేదు. తొందరపాటు వుంది. ఆ ప్రతి చర్య ఫలితం అతను ఒక కన్ను శాశ్వతంగా కోల్పోయాడు. ఇలా చెప్పాలంటే చాలా వుదాహరణలు వున్నాయి.

ముఖ్యంగా వివరించాలనుకున్న దేమంటే, సమస్యకు పరిష్కారం వుంటుంది. తొందర పడితే, ఆలోచించకపోతే, ఫలితం బాగుండదు. ఆలోచించడం, పరిస్థితులను అవగాహన చేసుకోవడం చేసి, తర్వాత మాత్రమే నిర్ణయాలు తీసుకోవాలి. చెప్పడం తేలికే ఆచరణ కష్టం అంటారు. నిజమే కాని ఒక ప్రాణం, ఒక కన్ను పోగొట్టుకోవడం కూడా కష్టమే కదా. జీవితంలో ఆలోచించకుండా తొందరపడి తీసుకున్న నిర్ణయాలు, వాటి ఫలితాలు ఎలాగుంటాయో అందరికీ తెలుసు. ఎందుకంటే మనందరికీ తొందర పాటు నిర్ణయాలు తీసుకుని, తర్వాత బాధపడిన అనుభవాలు వున్నాయి కదా.

మరొక వుదాహరణ, రవికి భార్యపై అనుమానం కల్గింది. బయటకు చెప్పలేడు. భార్యతో మాట్లాడి సమస్యను పరిష్కరించుకోడానికి అతని సంస్కారం అడ్డు వచ్చింది. ముభావంగా వుండటం మొదలు పెట్టాడు. భార్యకు ఈ ముభావానికి కారణం తెలియదు. తెలుసుకోడానికి ప్రయత్నించింది. సమాధానం ముభావం. వారి సంసారిక జీవితం కుంటు

పడింది. రోజు రోజుకూ పరిస్థితి విషమించుతూవుంది. రవి భార్య సౌమ్య, అతన్ని ప్రాధేయపడింది. ఫలితం లేదు, తల్లిదండ్రులకు చెప్పి పరిష్కారం కోసం ప్రయత్నిద్దామనుకుంది. అది గ్రహించి, రవి రెచ్చిపోయాడు. చేయిచేసుకున్నాడు. ఆ రోజుతో ఆగిపోలేదు. తరచుగా రవి కొట్టడం, తిట్టడం చూసి ఆమె విసిగిపోయింది. ఆరాక్షసుడి బారినుండి తనను తాను కాపాడుకోవాలను కుంది. అందరు మగవాళ్ళూ రవిలా శాడిస్టులుగా వుండరని తెలుసు. భార్యను తిట్టే, కొట్టే కుసంస్కారం అందరి మగవాళ్ళకూ వుండదని తెలుసు. ఉదాహరణ ఆమె తండ్రి, ప్రదీప్ బాబాయి (విదేశాలలో వుంటున్నాడు), తన ఆఫీసులో పనిచేస్తున్న వాళ్ళు, తన బంధువులు. వారికి వున్న సంస్కారం, రవి సంస్కారంలో, ఆమెకు చాలా వ్యత్యాసం కనబడింది. తన సమస్య పరిష్కారం అయ్యే వరకు సంసారిక జీవితానికి దూరంగా ఉండాలనుకుంది. తన పరిస్థితి ఎవరికి చెప్పినా ఏమి ప్రమాదము వస్తుందో అనే భయం. కానీ విదేశాలలో వున్న ప్రదీప్ బాబాయికి మాత్రం తెలిపింది. గోప్యంగా వుంచమని, తన తల్లి తండ్రులకు చెబితేవారు భరించలేరని కోరింది.

ప్రదీప్‌కు పిల్లలు లేరు. అన్న కూతురు సౌమ్య అంటే చాలా ప్రేమ. ప్రదీప్ విదేశాలలో వుంటూనే పావులు కదపడం మొదలు పెట్టాడు. రవిలో మార్పును గ్రహించాడు. సౌమ్య జీవితం నాశనం కాకూడదు. అన్నకు, వదినకు, బంధువులకు చెబితే సమస్య పరిష్కారమవుతుందని ఆశపోయింది. తెరవెనుక వుండి తెలివిగా పావులు కదిపాడు.

దానికి పర్యవసానమే చైతన్య, సౌమ్య ఆఫీసులో రంగప్రవేశం చేశాడు. చైతన్య, సౌమ్య వ్యక్తిత్వాన్ని, మంచితనాన్ని బాగా అర్థం చేసుకున్నాడు. ఎప్పటి కప్పుడు ప్రదీప్‌కు ఫీడ్ బాక్ యిస్తూవచ్చాడు.

రవి నుండి వచ్చిన విడాకుల ప్రపోజల్సును సౌమ్య అంగీకరించింది. రవి తల్లి తండ్రులు ఈ విషయం తెలిసి, రవి యింటికి వస్తూ వుండగా కారు ప్రమాదంలో మరణించారు. తల్లిదండ్రుల మరణానికి కారణం సౌమ్య అని రవి అభిప్రాయపడ్డాడు. ఈ నిందను భరించలేక పోయింది. సౌమ్య, రవిల మధ్య దూరం మరింత పెరిగింది. రవి, సౌమ్యను హింసించడం ఎక్కువ చేసాడు. సౌమ్యను హత్య చేయాలని ప్రయత్నించాడు.

కోర్టు విడాకులు మంజూరు చేశారు. రవి దౌర్జన్యాలకు నిరసనగా, కోర్టు రవికి ఆరునెలలు జైలుశిక్ష కూడా విధించింది.

వెంటనే ప్రదీప్ బాబాయి. రంగ ప్రవేశం చేశాడు. చైతన్య, సౌమ్యలతో సుదీర్ఘ చర్చలు జరిపాడు. సౌమ్య, చైతన్య సంస్కారం చూసి సంబరపడింది. సౌమ్యలోని ఓర్పు, అందచందాలు, సంస్కారం చూసి చైతన్య ఆమెపట్ల ఆకర్షితుడయ్యాడు. ప్రదీప్ జరిగిన

విషయాలు తన అన్నకు వదినగారికీ చెప్పాడు. వారి నుండి సౌమ్య రెండో పెళ్ళికి అంగీకారం తీసుకున్నాడు. చైతన్య, సౌమ్యల వివాహం ఘనంగా జరిగింది.

జైలులో వున్న రవి వద్దకు క్రొత్త దంపతులను తీసుకు వెళ్ళాడు ప్రదీప్. రవి షాక్ తిన్నాడు. క్రొత్త దంపతులను చూసి కాదు. ప్రదీప్‌ను చూసి. అప్పటి వరకూ ప్రదీప్, సౌమ్య చిన్నాన్న అని రవికి తెలియదు. ప్రదీప్‌కు పిల్లలు లేక పోవడం వలన, సౌమ్యనే సొంత కూతురిలా ప్రేమిస్తాడని తెలియదు. సౌమ్య తెలియచేయాలని ప్రయత్నించినా, రవి ఎపుడూ శ్రద్ధ చేయలేదు. అతని నిర్లిప్తతను చూసి సౌమ్య ఆ విషయం ప్రస్తావించడం మానేసింది.

సౌమ్య-ప్రదీప్‌లు చనువుగా మాట్లాడుకోవడం రవి చూశాడు. సౌమ్యను అనుమానించాడు. అతనిలో కోపం, క్రోధం కట్టలు తెంచుకుంది. తొందరబాటు నిర్ణయాలు తీసుకున్నాడు. భార్యను హింసించాడు. రవిలోని అనుమానానికి మూలకారణం, తండ్రి లాంటి ప్రదీప్ అని సౌమ్యకు తెలియదు. రవి శాడిజం, అతని సంస్కారాన్ని, అతని నుండి దూరం చేసింది. ఫలితంగా తన చక్కటి సంసారాన్ని చేతులారా పాడుచేసుకున్నాడు. తన సంస్కారాన్ని తలచుకుని బాధపడ్డాడు. అందమైన, సంస్కారం గల భార్య నుండి విడాకులు కోరాడు. ప్రస్తుతం సౌమ్య, చైతన్య భార్య. తల్లిదండ్రులను పోగొట్టు కున్నాడు. ఫలితంగా రవి పిచ్చివాడయ్యాడు. చర్యకూ, ప్రతి చర్యకూ మధ్య కావలసింది ఆలోచన, నిదానం. అంతేకాని తొందరపాటు నిర్ణయాలు కాదు.

సమస్యకు పరిష్కారం ఆత్మహత్యకాదు, విడాకులు కాదు. దండన కాదు, హత్యకాదు, హింస కాదు. మనుష్యుల ఆలోచనావిధానం, అతని ప్రవృత్తి, సంస్కారాలను బట్టి వుంటుంది. సమస్య పరిష్కారంలో కొంత జాప్యం కూడా జరగవచ్చు. ఆలస్యమైనా, సమస్యకు ఒక రోజు పరిష్కారం దొరుకుతుంది. అప్పటివరకు సంయమనం, ఓర్పు, అవగాహన చేసుకోడానికి ప్రయత్నం అవసరం.

ఆత్మహత్య చేసుకుందామని నిర్ణయించుకున్న వ్యక్తికి, సరైన సమయంలో, సరైన సలహాలు యిస్తే, ఆ సమయానికి ఆత్మహత్య చెసుకోకుండా ఆపగలిగితే, ఆ వ్యక్తి జీవితంలో మరెప్పుడూ ఆత్మహత్య చేసుకోడు. తొందరపాటు నిర్ణయాలు తీసుకోవడం మానేస్తాడు.

# అల్పతత్వ భావన (ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు)

జీవితంలో, కొంతమంది తమపై అధికారులతో మాట్లాడటానికి, జంకుతారు. ఆఫీసులోనే కాదు, ఫంక్షన్స్‌లోకూడా వారు, బిడియం, భయంతో పైఅధికారులతో కలవరు. పైఅధికారి చొరవ తీసుకుని సరదాగా మాట్లాడినా, జవాబులు జంకుతూ చెబుతారు. పైఅధికారులంతా రాక్షసులు కారు. వారు ఎంత మంచిగా వున్నా వాళ్ళ కుటుంబ సభ్యులు సరదాగా పలకరించినా యిబ్బంది పడిపోతారు. దిన్నే ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్సు అంటారు. వీరు పైఅధికారులతోనే కాదు, కొత్తవాళ్ళతో మాట్లాడాలన్నా భయపడతారు.

ఈ మనస్తత్వం మంచిదికాదు. కొన్ని సమయాల్లో సరైన సమాధానం తెలిసి కూడా ఆ భయం వలన సరిగ్గా సమాధానం చెప్పక, వారిపైవున్న మంచిఅభిప్రాయాన్ని పోగొట్టుకుంటారు. చొరవతీసుకుని సరైనసమాధాన్ని చెప్పలేక, మౌనంగా వుండి పోతారు. అపుడు వారి పనితనం, నేర్పులపై అనుమానాలు ఏర్పడతాయి. ఫలితంగా వారు వెనుకబడి పోతారు.

జీవితంలో పైకి రావాలంటే, తెలివితేటలేకాదు, చొరవ, మాట్లాడే తీరు, మంచి భాష, చిరునవ్వు, అవసరం. సరైనసమయం లో, సరైనసమాధానం చెప్పగలగాలి. బిడియం, సిగ్గు, ముభావం వంటి లక్షణాలను దూరంగా వుంచాలి. అందరితోనూ మంచిగా కలసిపోవాలి. మనల్నిమనం తక్కువగా అంచనా వేసుకోకూడదు. మన మాటలవలన, ఎదుటివారు లేక బాస్ ఏమైనా అనుకుంటారేమో, అనే సందిగ్ధ అవస్థకు దూరంగా వుండాలి. చెప్పిన సమాధానం సరైనది కాక పోతే బాస్ ఉరితీయడు కదా. సరిచేయడానికి ప్రయత్నించ వచ్చు. ఈ బిడియంవలన మనల్ని సరిదిద్దుకునే అవకాశాన్ని పోగొట్టుకోవడం జరుగుతుంది.

ఈ ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు బారినుండి, దూరంఅవ్వాలి. అంటే అందరితోనూ కలవాలి. అందర్నీ కలుపుకోవాలి. మనభాషను వాక్చాతుర్యాన్ని అభివృద్ధిచేసుకోవాలి. అవసరాన్నిబట్టి కొన్ని రిహార్సల్సు వేసుకోవాలి. ముందుగా కొంత సాధనచేయడం వలన మన సమాధానం తెలివిగా వుండటానికి అవకాశముంది. ముందుగా జరగబోయే పరిస్థితులను ముందుగా వూహించి, సరైన పద్ధతిగా మాట్లాడటానికి ప్రయత్నించాలి. అపుడు మన మనస్సులో పరిస్థితికి అనుకూలంగా, అవసరమైన సమాధానలు వున్నపుడు, సిగ్గు, బిడియం మననుండి దూరంఅవుతాయి. పదిమందితో మన వూహలను పంచుకోవాలి. వారితో సంప్రదించాలి, సలహాలు ముందుగా తీసుకోవాలి. కమ్యూనికేషన్ స్కిల్స్‌ను పెంచుకోవాలి.

సామూహిక పనులలో భాగం పంచుకోవాలి తద్వారా పదిమందిలో మాట్లాడవలసిన అవసరం కల్పించుకోవాలి.

వివాహాలు, గృహప్రవేశాలు, జన్మదిన పార్టీలు, చిట్టీపార్టీలు తదితర ఫంక్షన్స్‌కు విధిగా హాజరు అవ్వాలి. అందరితో చనువుగా ప్రవర్తించాలి. గ్రూప్ ఏక్టివిటీస్ లో పాలు పంచుకుంటే, పదిమంది మనతో చర్చిస్తారు. మనమూ వారితో చర్చించే అవకాశం వస్తుంది. వచ్చిన అవకాశాన్ని మౌనంగా వుండటం ద్వారా చేజార్చుకోకూడదు. మనకు తెలిసిన విషయాలు అనుభవాలను, యితరులతో పంచుకోడానికి ముందుకు రావాలి. వారి భావనలను గ్రహించాలి. తద్వారా మనలో స్పష్టత ఏర్పడుతుంది. ఎప్పుడైతే మన అభిప్రాయాలను స్పష్టంగా తెలియచేయడం జరుగుతుందో అపుడు ఈ ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ మననుండి దూరం అవుతుంది.

నా స్నేహితుడు, గిరి మాట్లాడేతీరు చక్కగా వుంటుంది. సమయానికి తగ్గట్టుగా మాట్లాడతాడు. తొందరపడి మాటలు మిగలడు. మాట్లాడే ముందు ఆలోచిస్తాడు. తను మాట్లాడేతీరు యితరులను బాధపెట్టకూడదు. సౌమ్యంగా మాట్లాడాలి. కనుక గిరి తగిన వ్యూహాన్ని మనస్సులో రూపుదిద్దుకుంటాడు. తనను చెస్ ఆటగాడితో పోల్చుకుంటాడు. చెస్ ఆటగాడు, తను ఒక ఎత్తు వేసే ముందు బాగా ఆలోచిస్తాడు. తను వేయబోయే స్టెప్‌కు ప్రతిగా, తన పోటీ దారుడు ఎలాస్పందిస్తాడు ? ఏ పావుని కదుపుతాడు? దానికి ప్రతిగా తను ఎన్ని రకాలుగా తన పావులను కదపవచ్చు? ఏ నిర్ణయం తనకు మంచి ఫలితాన్నిస్తుంది ? అని ముందుగానే ఆలోచిస్తాడు. కనుక గిరితో మాట్లాడటానికి అందరూ ఇష్టపడతారు. అలాగే మనం మాట్లాడేముందు, ఎదుటి వ్యక్తి ఎలా స్పందిస్తాడు ? తనతో ఏవిధంగా మాట్లాడితే, తగిన రీతిలో వుంటుంది? ఏ విధంగా మాటాడితే అతనికి కోపం వస్తుంది ? అసలు మాట్లాడక పోతే అతను ఎలా భావిస్తాడు ? అని గిరిలా ఆలోచించాలి. అలా అని ఎదుటి వ్యక్తి ఏదైనా ప్రశ్నవేస్తే ఆలోచిస్తూనే చాలాసేపు మౌనంగా వుండి పోకూడదు.

ఎవరితోనైనా కలసినప్పుడు ఆవ్యక్తినిబట్టి, అతని మనస్తత్వాన్నిబట్టి, చుట్టూవున్న పరిస్థితులనుబట్టి మాట్లాడవలసి వస్తుంది. తను వీటిని ముందుగా వూహిస్తే సంభాషణ ప్రారంభం, ముగింపు ఆనందకరంగా వుంటుంది.

అపుడు పదిమందిలో సరదాగా గడపవచ్చు. పైఅధికారులలో, కొత్తవాళ్ళతో సరదాగా మాట్లాడవచ్చు. మన తెలివితేటలను, సామర్థ్యాన్ని తెలుపవచ్చు. మంచి గుర్తింపును పొందవచ్చు. కనక యీ అల్పతత్వ భావన (ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్సు) నుండి మనం

దూరం అవ్వాలి. దానికికావలసింది, ముఖ్యంగా చొరవ. దానికి, మనం విడిచి పెట్టవలసింది, సిగ్గు, బిడియం, భయం. ఎదుటి వారితో మాట్లాడటానికి ఎందుకు భయపడాలి ? ఎందుకు సిగ్గు పడాలి ? ఈ సిగ్గు పోవాలంటే పబ్లిక్ స్పీకింగు అవసరం. మాట్లాడే తీరును మెరుగు పరచుకోవడం అవసరం. మన బుర్రలో ఆలోచనలులేక ఖాళీగావుంటేనే ఈ సిగ్గు, బిడియం ముందుకువస్తాయి.

అవసరమైన రకరకాలైన సమాచారాన్ని మన వద్ద వుంచు కోవాలి. కొన్ని మ్యాజిక్ పదాలను, వాక్యాలను, మనం గుర్తించు కోవాలి. వాటిని తగిన సందర్భాలలో తగిన రీతిలో వాడాలి. అపుడు మన సంభాషణ విన సొంపుగావుంటుంది. అయితే ఆ మ్యాజిక్ పదాలు ఏమిటి? ముఖ్యమైనవి 'థాంక్యూ', 'వెల్‌కం', 'సారీ', తర్వాత 'మీ సలహా ఏమిటి ?', 'మీ అభిప్రాయం చాలాబాగుంది'. 'ఆ రీతిలో నేనూ ఆలోచిస్తాను'.

'మీ ఆలోచనలతో నేనూ ఏకీభవిస్తున్నాను'.

'మీ సలహాకు ధన్యవాదాలు'

'మీ మాటలలో మీ మంచితనం కనబడుతుంది'

'మీ మాటలు నాలో చాలా ఆలోచనలను పుట్టిస్తున్నాయి'.

'మీ మాటలతో నేను ఏకీభవించలేక పోతున్నాను. కారణం నాకు తగిన అనుభవం లేదేమో? అయినా పునరాలోచన చేస్తాను.'

ఇటువంటి అనేక సమాధానాలు సందర్భోచితంగా రావాలి. మన భాషణలో కొన్ని విజ్ఞత గల పదాలను సందోర్భోచితంగా వుపయోగిస్తే ఎదుటివారు, మనకు పరిస్థితులపై, మంచి అవగాహన వుందని, భావిస్తారు. లేకపోతే మనతో సంభాషణ వ్యర్థమని భావిస్తారు.

మన సంభాషణలో వుపయోగపడేవి, యితరులు గుర్తించేవి, విజ్ఞతగలవి కొన్ని పదాలను, యిక్కడ వుదహరిస్తూన్నాను. అంకితభావం, స్పందన, సిరిసంపదలు, ధనధాన్యాలు, లక్ష్యం, ఆకర్షణ, మంచితనం, దూరపు ఆలోచనలు, మంచి ఆలోచనలు, జయం, విజయం, పోజిటివ్ ఆలోచనలు, పాసివ్ థింకింగు, రియాక్టివ్ థింకింగు, ప్రొయాక్టివ్ థింకింగు, విజ్ఞానం, ఆకర్షణ, పెర్సనాలిటీ, విజ్‌డం, బ్లిస్, మంచి భావనలు, తృప్తి, సత్సంబంధాలు, సృజనాత్మకత, ఏకాగ్రత ,సంబంధ భాంధవ్యాలు, పశ్చాత్తాపం, ఎమోషనల్ ఇంటెలిజన్సీ, శక్తి సామర్థ్యాలు, ఓర్పు, డబ్బు, కీర్తి, పరువు-ప్రతిష్ట, ప్రణాళిక, ప్రాధాన్యతలు, ప్రపంచం తీరు, పుణ్యం, పాపభీతి, ప్రవర్తన, ప్రశాంతత, అవగాహన, ఆశలు, ఆశయాలు. ఆనందం, అదృష్టం, ఆస్తి, అభిమానం ఆద్యాత్మిక చింతన, అహం. ఆత్మానందం,

నిబంధనలు, నిస్వార్థం, విలువలు, ఒప్పందం, క్షమాపణలు, గెలుపు, గమ్యం,వ్యూహం, యోగ, ప్రాణాయామం, గుర్తింపు, సంతృప్తి, వినోదాలు, విహారాలు, వ్యాయామం, వ్యక్తిత్వం, విలువలు, కళాభిమానం, క్రీడలు, నీతి, నిజాయితీ, శక్తి, అంతర్గతశక్తి వీటిలో కొన్నిపదాల్ని సందర్భానుచితంగా మన సంభాషణలో వాడితే, యితరులు ఆకర్షితులవుతారు. అవసరాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి, యిటువంటి పదాలను కూడా వాడవలసి వస్తే వెనుకాడకూడదు.

కోపం, భయం, ఆందోళన, కృషిలోపం, కష్టం, ఒత్తిడి, ఆవేశం, ఆత్మన్యూనత, అభద్రతా భావం, అలసట, నెగెటివ్ ఆలోచనలు, భావోద్రేకం, చెడుభావన, నియంత్రించడం, ఓపిక, ఓటమి, నిర్లక్ష్యం, మంచి చెడుల విచక్షణ, మానసిక సమస్యలు, శారీరక రుగ్మత, తీవ్రంగా స్పందిచడం, ప్రక్షాళనం.

మన సంభాషణని అర్థవంతంగా, ఆకర్షణీయంగా, విజ్ఞతతో కూడుకున్నట్లు యితరులకు అనిపించాలంటే ఈ క్రింది పదాలను కూడా సందర్భాన్ని బట్టి వాడాలి. వీటిలో కొన్ని పోజిటివ్ ఆలోచనలను సూచిస్తాయి.

ఆత్మవిశ్వాసము (సెల్ఫ్ కాన్ఫిడెన్స్), ఆత్మనిగ్రహము, స్వయంశిక్షణ, స్వయంకృషి ఆత్మశిక్షణ, సెల్ఫ్ డిసిప్లిన్డ్, ఆత్మస్తుతి, ఆత్మగౌరవము, ఆత్మశోధన, ఆత్మనిగ్రహము, ఆత్మత్యాగము (సెల్ఫ్ సాక్రిఫైస్), ఆత్మ పరిశీలన, ఆత్మతృప్తి (సెల్ఫ్ సాటిస్ ఫాక్షన్), సెల్ఫ్ స్టైల్డ్, సెల్ఫ్ సఫిసియెన్సీ (కావలసిన భాగ్యాలన్నీ వుండటం), స్వార్థితం, నిస్పందేహం, సెల్ఫ్ లెస్ (స్వప్రయోజనములను లక్ష్యపెట్టని), ఆత్మసుఖము (సెల్ఫ్ లవ్), వివేకం, సెల్ఫ్‌మేడ్ (స్వయం కృషి తో పైకి వచ్చిన), సర్వీస్ ఓరియంటెడ్ (సేవాంకితం), వ్యక్తిత్వం, ఒప్పందం, విజయం, మొదలైనవి.

మరికొన్ని నెగెటివ్ ఆలోచనలను సూచించే పదాలను అవసరం అనుకుంటే మన సంభాషణలో వాడాలి. ఆత్మవంచన, సందేహం, బోస్టింగ్ / సెల్ఫ్ గ్లోరియస్ (పజ్జలు పలకడం), అతిశయం, గర్వం, సెల్ఫ్ ఇంపార్టెన్స్, స్వప్రయోజనం (సెల్ఫ్ ఇంటరెస్ట్), స్వార్థం (సెల్ఫిష్), ఆత్మస్తుతి (సెల్ఫ్ ప్రేయిజ్), ఇంద్రియ సుఖాలు, భోగ వాంచలు, వియోగము, సెట్ బాక్స్ (ఆటంకములు), సివియారిటీ (తీవ్రమైన), బద్ధకం, నిరాశ, నిస్పృహ, భయం, ఆందోళన, సమస్యలు, విసుగు మొదలైనవి.

మంచి పుస్తకాలనుండి మనం కొన్ని మంచి విషయాలను, సామెతలను, మంచిపదజాలాన్ని గుర్తించాలి. వాటిని మెదడులో రిటేన్ చేసుకోవాలి. అవసరాన్ని బట్టి ఆ పదజాలాన్ని గుర్తుతెచ్చుకోవడం అవసరం. ఆ పదజాలాన్ని సరిగ్గా సందర్భానుచితంగా వాడటం అవసరం.

అనవసరమైన పదజాలన్ని వాడితే ఎబ్బెట్టుగా వుంటుంది. సందర్భాన్ని బట్టి పైప వుదహరించిన వాటిలో కొన్ని పదాలను వాడటానికి సందేహించ కూడదు. అపుడు మన సంభాషణ అర్థవంతంగా, వినసొంపుగా వుంటుంది. మన సంభాషణ నుండి కొందరు కొన్ని సందేశాలను (మెస్సేజెస్)ను తీసుకుంటారు. మనం కూడా గర్వంగా మాట్లాడగలం. ఇన్ ఫీరియారిటీ కాంప్లెక్స్ మన నుండి దూరం అవుతుంది.

సందర్భానికి తగినట్టు పైన వుదహరించిన పదాలను వాడాలంటే కొంత సాధన అవసరం. సాధన లేకపోతే అవసరమైన పదాలు గుర్తుకురావు. తర్వాత యిలా అని వుంటే బాగుండేది అని మనం అనుకోవచ్చు. కానీ ఆ అవకాశం పోయింది కదా. కనుక ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సు పోవాలంటే, చొరవ అవసరం. మన భాషపై కమాండ్ అవసరం. మాట్లాడే తీరును అభివృద్ధి చేసుకోవాలి. సందర్భాన్ని బట్టి మాట్లాడాలి. అతిగా మాట్లాడకూడదు. అవసరాన్నిబట్టి భావయుక్తంగా మాట్లాడాలి.

అతిగా మాట్లాడే వారిని వాగుడుకాయ అని ఆక్షేపిస్తారు. వీళ్ళని ఇంగ్లీషులో ఎక్స్ట్రావర్ట్సు (EXTRAVERTS) అంటారు. వీరి మాటలు గంటలసేపు విన్న తర్వాత, మనం ఆలోచిస్తే వీరు మాట్లాడిన దాంట్లో గాసిప్, గాలివాగుడు తప్పించి, మనకు కావలసిన సమాధానం ఏమీ వుండదు.ఆఫీసుల్లో, విద్యాసంస్థలలో అవసరానికి మించి వీరు, గాసిప్ చేస్తుంటారు. క్రికెట్ గురించి, సినిమాల గురించి, తమ అభిమాన హీరోల గురించి వ్యర్థ ప్రసంగాలు చేస్తుంటారు. ఎన్నో పనిదినాలు, వ్యర్థం అవుతుంటాయి.

వీటిని దృష్టిలో పెట్టుకుని, చనువుగా, చొరవగా, భావయుక్తంగా, చక్కటి భాషలో చక్కటి తీరుగా మాట్లాడటం అలవాటు చేసుకుంటే అల్పతత్వ భావన (ఇన్ఫీరియారిటి కాంప్లెక్సు) మనకు దూరం అవుతుంది.

మన సంభాషణ వినసొంపుగా, వివేకంతో వుండాలంటే, కొన్ని విజ్ఞతగల సూక్తులను వాడాలి. అందుకే పెద్దలు చెప్పిన మంచి కొటేషన్స్‌ను, నాదైన శైలిలో తెలుగులోకి తర్జుమా చేసి ఈ పుస్తకంలో పొందు పరిచాను. కొన్ని సూక్తులనూ సమీకరించాను. విజయం, సంతోషం, మంచి ఆలోచనలు, మానవసంబంధాలు, ప్రేమతత్వం, స్నేహం, ఆధ్యాత్మికచింతన వంటి అంశాలలో వాటిని పొందుపరిచాను. వాటిని తగిన రీతిలో విశ్లేషించుకోవాలి. అవసరానికి తగ్గట్టు వుపయోగించాలి. అప్పుడు అల్పతత్వభావన దూరంఅవుతుంది.

# స్త్రీలు-వారి ప్రతిభ

సమాజంలో ఎంతో మంది స్త్రీలు తమ ప్రతిభను చాటుతున్నారు. ఒకనాటి స్త్రీలు, ఎక్కువశాతం గానుగఎద్దులాంటి జీవితాన్ని సాగిస్తూ ఇంటికి మాత్రమే పరిమితమై వుండేవారు. భర్త, అత్తమామల సేవ, పిల్లల్ని కనడం, పెంచడం, వారికి పెళ్ళిళ్ళు చేయడం, మనవలను పెంచడం వరకే వారి పరిధి వుండేది. కానీ ఈ పోటీ ప్రపంచం (Competitive World)లో అన్ని రంగాలలోనూ స్త్రీలు, పురుషులతో పోటీ పడుతున్నారు. వారి ప్రతిభను నిరూపించుకుంటున్నారు. కొన్ని సమయాల్లో పురుషుల కంటే స్త్రీలే నయం, అన్నంతగా కృషి చేస్తున్నారు. సత్ ఫలితాలను మన ముందు వుంచుతున్నారు. డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, జర్నలిస్టులుగా, I.A.S ఆఫీసర్లుగా, పైలట్స్‌గా, సాఫ్ట్‌వేర్ ప్రొఫెషనల్సుగా, అలా ఎన్నో రంగాలలో కృషి చేస్తున్నారు. వారి విజయానికి కారణాలు, వారి ఏకాగ్రత, బావాలలో స్పష్టత (Clarity), వినయ విధేయతలు.

విద్యారంగంలోకూడా విద్యార్థినులు విద్యార్థుల కంటే మేము ఏవిషయంలోనూ ముఖ్యంగా, చదువువిషయంలో తీసిపోము అని ఋజువు చేసుకుంటున్నారు. ప్రతిభా, పాటవాలు గమనిస్తే 'కొన్నిరంగాలలో మాకు మేమే సాటి' అని ఋజువు చేసుకుంటున్నారు. 'మరికొన్ని రంగాలలో మేము ఎవరికీ తీసిపోము' అని ఋజువు చేసుకుంటున్నారు. సమకాలీనియులైన కొంతమంది స్త్రీలఔన్నత్యం గురించి యిక్కడవివరించాను.

సంగీతంలో ఎమ్.ఎస్. సుబ్బలక్ష్మి, లతా మంగేష్కర్, ఆషాభోన్స్‌లే, అనురాధా పోడ్వాల్, సుశీల, జానకి, చిత్ర, కవితా కృష్ణమూర్తి, వంటి ఎంతో మంది స్త్రీలు చరిత్రసృష్టించారు.

రచయిత్రిగా, చరిత్ర కారిణిగా రొమిల్లా థాపర్‌కు ప్రంపంచ స్థాయి గుర్తింపు వచ్చింది. ఆమె ఎన్నో అవార్డులు పొందారు. ఉన్నత పదవులను అలంకరించారు. ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ అధ్యక్షురాలు, బ్రిటిష్ అకాడమీ కరస్పాండింగ్ ఫెలో లాంటి పదవులు, మరియు ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో డాక్టరేట్లను సాధించారు. ఎన్నో విశ్వవిఖ్యాత విశ్వ విద్యాలయాల్లో విజిటింగు ప్రొఫెసర్‌గా వ్యవహరిస్తున్నారు.

నిర్భయంగా మాట్లాడే శోభాడే అందరికీ సుపరిచితురాలే. ఆమె ప్రముఖ రచయిత్రి, జర్నలిస్టు, పత్రికాసంపాదకురాలు, మహిళా హక్కుల కార్యకర్త. టి.వి వ్యాఖ్యాతగా మనందరికి సుపరిచితురాలు. సెక్స్ అనేది ఒక బాధ్యత, శరీరం పవిత్రమైనది, దాన్ని పాడుచేసే అవకాశం ఎవ్వరికీ యివ్వకూడదని నిర్భయంగా స్త్రీ జాతికి చెబుతూవుంటారు. సెక్స్‌కి సంబంధించిన

సాహసాలు యువత చేస్తే, ప్రమాదాలు పొంచివుంటాయని గుర్తు చేస్తూవుంటారు. పెద్దల్ని, కుటుంబ విలువల్ని గౌరవించడం యువత భాద్యత అని అంటారు. ఆమె అందించిన ఈ మెసేజ్‌ని (విలువైన సందేశాన్ని) ఈనాటి యువత సీరియస్‌గా తీసుకుంటే మన సాంప్రదాయవిలువల్ని గౌరవించడమేకాక, ప్రతీరోజూ జరుగుతున్న అబార్షన్లు, అవకాశవాదాలు, స్త్రీలపై అత్యాచారాలు తగ్గుతాయి.

ఈనాడు వార్తా పత్రికకు ఒక 20 సం॥ అమ్మాయి ఒక ఉత్తరం రాసింది. తను 31 సంవత్సరాల, వివాహితుడ్ని, పిల్లలుగల వాడిని 5 సంవత్సరాలుగా ప్రేమిస్తుందట. వారికి శారీరిక సంబంధ ఏర్పడిందట. ఫలితంగా 3 సార్లు అబార్షన్లు. ఇంట్లో యిది తెలియక పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు. అతను మళ్ళీ వెంటబడుతూ, బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు. తనకు చనిపోవాలనిపిస్తోంది, అని వ్రాసింది. చేతులు కాల్చుకుని ఆకులు పట్టుకోవాలనే ప్రయత్నమే యిది. శ్రీమతి శోభాడే గారి సలహాలను పాటిస్తే యిటువంటి ఆపదరాదు. ఆమె హద్దులుదాటి, జీవితాన్ని నాశనం చేసుకోవడం మంచిదికాదు. తద్వారా కని పెంచిన పెద్దలను మోసగించడం కూడా సరికాదు.

శోభన భార్తీయ, ప్రముఖ హిందూస్థాన్ టైమ్స్ పత్రిక బాధ్యత చేపట్టి, నిర్మాణాత్మకంగా నడుపుతున్నారు. మన దేశంలో మీడియాకు చెందిన కృషిలో పేరుగాంచిన 50 మందిలో శోభన భార్తీయ, ఒకరు. ఢీల్లీ ఛాబంర్ ఆఫ్ కామర్సు అండ్ ఇండస్ట్రీ వారు 'ఔట్ స్టాండింగ్ బిజినెస్ ఉమన్' అవార్డుతో శోభన గారిని సత్కరించారు. భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదు తో ఆమెను సత్కరించింది.

కిరణ్ మజుందార్ షాను ప్రభుత్వం 'పద్మభూషణ్' బిరుదుతో సత్కరించింది. చొరవ, స్వయంకృషి, నిర్మాణాకమైన ఆలోచనలు చేయడం ఆమె మంచి గుణాలు. అవసరాలకు తగ్గట్టు వ్యూహాలను రూపుదిద్దే దిట్ట. తన లక్ష్యాలను అధిగమించడమే ఆమె తత్వం. అదే ఆమె పదివేల రూపాయలతో ప్రారంభించిన వ్యాపారం, దినదినాభివృద్ధి అవడానికి కారణం, ఆమె పట్టుదల, కార్యదీక్ష ఓర్పు వలన ఇండియాస్ మధర్ ఆఫ్ ఇన్వెన్షన్ అని ప్రశంసలు పొందారు. ఆమె ప్రముఖ స్త్రీ వ్యాపారవేత్తగా (Best Indian Bussiness woman of the year 2004 - Economic Times awards for Coporate Excellence) వారిచే గౌరవించబడ్డారు. మధుమేహానికి మంచిమందు తయారుచేశారు. బయోటెక్నాలజీ రంగంలో బొప్పాయి నుండి ఎంజైమును తయారుచేశారు. వీరు తయారుచేసిన మందులు సామాన్య మానవునికి అందుబాటులోకి వచ్చాయి.

శ్రీమతి అరుంధతి రాయ్ – ఆమె బుకర్ ప్రైజ్ గెలుచుకున్న భారతీయ రచయిత్రి

ఆమె సామాజిక కార్యకర్తగా గుర్తింపు పొందారు.

ఆరో తరగతి మాత్రమే చదువుకున్నా అమోఘమైన జ్ఞాపకశక్తి గల మరొకస్త్రీ ఉమాభారతి అందరికీ సుపరిచితురాలే. స్వామి వివేకానంద, పీస్ ఆఫ్ మైండ్, మను - ఏక్ భక్తి కానాతా' అనే పుస్తకాలు వ్రాశారు. సంతోషంగా వున్నపుడే ఆమెకు దేవుడు గుర్తుకొస్తాడట. మరి కోపంగా వున్నపుడు ఎవరు గుర్తుకు వస్తారో ? అద్వానీజీ ? వాజ్‌పాయ్‌జీ ? సోనియాజీ?

18 సంవత్సరాల సానియా మీర్జా పేరు వినని వారుండరు. ఆమె ఓపెన్ టెన్నిస్ ఆటలో చక్కని ప్రతిభను కనబరుస్తూ లక్షలాది మంది అభిమానాన్ని సంపాదించింది. 2001 సం॥ లో 987 ర్యాంకులో వున్న సానియా ప్రస్తుతం 50th ర్యాంక్‌కు చేరుకోగలిగింది. మహిళాటెన్నిస్‌లో ఆశాజ్యోతిగా వెలుగుతున్న సానియా, ప్రధమస్థానాన్ని చేరుకోడానికి యింక ఎంతో కాలం పట్టదని, టెన్నిస్ క్రీడాకారుల గట్టి నమ్మకం. ఇటీవలి ప్రపంచ మేటి క్రీడాకారిణి. సెరీనాతో మూడో రౌండు వరకు ఆడి ఓడినా, ఆమె ఆట తీరును చూసి పలువురు ప్రశంసించారు. స్వయంగా సెరీనా కూడా ప్రశంసించారు. 'సానియా యింత గొప్పగా ఆడి, యింత గట్టి పోటీ యిస్తుందని వూహించలేదు' అన్నారు. 'సానియా ఆట తీరు నాకు చాలా నచ్చింది. 18 సం॥ వయస్సులోనే యింత నిలకడగా ఆడుతుంది సానియాకు మంచి భవిష్యత్తు వుందని' సెరెనా అన్నారు. భారత క్రీడాకారులు సానియా మీర్జా నుండి ప్రేరణ పొందాలి. సానియా ప్రతిభ, ఆట తీరు, మనకు గర్వకారణం.

శ్రీమతి కిరణ్ బేడీ పేరు విననివారు వుండరు. ఆమె IPS ఆఫీసర్. ఆమెకు క్రేన్ బేడీ అనే పేరు కూడావుంది. ఢిల్లీ నగరంలో, ట్రాఫిక్‌జామ్ అయిన చోటల్లా ఆమె ప్రత్యక్షమై, క్రేన్‌తో, ట్రాఫిక్‌కు అడ్డు వచ్చిన వాహనాలను, లిఫ్ట్ చేయించేవారు. అన్ని ట్రాఫిక్ సిగ్నల్స్‌ను, సరిగ్గా నియంత్రించి, ట్రాఫిక్ సమస్యలను. నిరోధించారు. తరువాత 'తిహార్' జైలు సూపరింటెండుగా నియమితులయ్యారు. ఎన్నో అకృత్యాలు చేసిన భయంకరమైన ఖైదీలకు, యోగ, ప్రాణాయామం, అక్షరాస్యత వంటి వాటిని నేర్పించి, వారిలో మంచిని పెంచి, వారిని యోగ్యులుగా చేశారు. తిహార్ జైలును ఆశ్రమంగా మార్చేశారు. తద్వారా మెఘసెసే అవార్డు పొందారు. ప్రస్తుతం ఐక్యరాజ్యసమితిలో పోలీస్ సలహాదారుగా న్యూయార్క్‌లో వుంటున్నారు. యువతీయువకులు, ఇటువంటి అనేక మంది ఉన్నత ఆదర్శాలు గలవారినుండి ప్రేరణ పొందాలి.

# అంకిత భావం - సేవాభావం

ఈ లక్షణాలు ఈ రోజుల్లో క్రమేపీ క్షీణించి పోతున్నాయి. యువత సేవాభావంగల ప్రముఖులనుండి ప్రేరణను పొందడంలేదు. యువతలో ఈ సేవాభావం క్రమేపీ లోపిస్తుంది. యువత గుర్తింపు పొందాలంటే, కీర్తిని పొందాలంటే కొంత కృషిచేయాలి. ఈ దిశలో నాకు తటస్థించిన ఒక అనుభవాన్ని మీముందు వుంచుతున్నాను. ఒకసారి నేను ఉద్యోగ రీత్యా తిరుచిరాపల్లి వెళ్ళి, తిరిగి ముంబాయి వస్తున్నాను. తిరుచ్చి నుండి మద్రాసు ఫ్లైట్ మధ్యాహ్నం. మద్రాసు నుండి ముంబాయి ఫ్లైట్ రాత్రి 7 గంటలకు. మద్రాసులో నాకు వేరే పని లేనందున, విమానాశ్రయం, లాంజ్‌లోనే విశ్రాంతి తీసుకుందామని నిర్ణయించు కున్నాను. ఆసమయంలో లాంజ్‌లో విశ్రాంతి తీసుకుంటున్న వారి సంఖ్య 200 కు పైనే వుంటుంది. వివిధ ఫ్లైట్స్ కోసం వేచి వున్నారు. ఆసమయంలో తెల్లబట్టలలో వున్న ఒక వ్యక్తి ముగ్గురు అనుచరులతో ఆ లాంజ్‌లోకి ప్రవేశించాడు. ఆయనను ఎవ్వరూ పట్టించుకోలేదు. డ్యూటీ లో వున్న పోలీస్ కానిస్టేబుల్ సెల్యూట్ చేశాడు. VIP లాంజ్ కు దారి చూపాడు. ఆయన వెళ్ళిపోయాడు. కాని ఎవ్వరూ ఆయనను గుర్తించలేదు. ఆయన ఎవ్వరని పోలీసును అడిగాను తమిళనాడు ప్రభుత్వంలో ఒక మంత్రి అని చెప్పాడు.

కొద్ది సేపటి తర్వాత ఆనాటి మనీలా కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ మూపనార్ అక్కడికి వచ్చారు. నా ప్రక్కన కూర్చున్న హిందీ నటుడు శ్రీ పరేష్ రావల్, మరో యిద్దరు వెళ్ళి ఆయనతో కరచాలనం చేశారు. వాళ్ళతో మాట్లాడుతూనే ఆయన VIP లాంజ్ వైపు వెళ్ళారు. ఆయనను కూడా మరెవ్వరూ పట్టించు కోలేదు. ఎవరిస్థానాల్లో వారు కూర్చునే వున్నారు.

కొద్ది సేపట్లోనే ఒక స్త్రీ ఆలాంజ్ లోకి ప్రవేశించారు. అక్కడ కూర్చున్న అందరి లోనూ విద్యుత్ ఒక్క సారిగా ప్రవహించింది. అందరూ ఒక్కసారిగా లేచి నిలబడ్డారు. ఆమె అలా అనుకోకుండా కనబడటం వారి అదృష్టంగా భావించారు. ఆమె నవ్వుతూ చక చకా నడచు కుంటూ లాంజ్ లోకి వెళ్ళారు. ఆమెతో ఆమె అనుచరులు కూడా వెళ్ళి పోయారు. అక్కడ వున్న అందరి కళ్ళ లోనూ ఆనందం కనబడుతూనే వుంది. అందరూ ఆమె గురించే మాట్లాడు కోవడం మొదలు పెట్టారు. ఆమె ఎవరు ? ఊహించండి.

నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, మొదటి సారిగా చంద్రుని పై అడుగుపెట్టి, ఆ ఘనతను దక్కించుకున్నాడు. ప్రపంచమంతా ఆహా ! ఆహా ! అన్నారు. ఆసందర్భంలో మీరు వూహిస్తున్న ఆమెను, ప్రక్కన వున్న వాళ్ళు ఒక ప్రశ్నఅడిగారు మీరు ఎన్నో ఘనతలు సాధించారు. చంద్రుని పై కూడా కాలు పెట్టగలను అని అనుకుంటున్నారా ?' అని అడిగారు.

ఆమె నవ్వి యిలాఅన్నారట.

'నేను ఏ ఘనతలూ సాధించలేదు. అవసరమైన వారికి, నాకు అందుబాటులో వున్న వారికీ, సేవ మాత్రమే చేస్తున్నాను. నా అవసరం వున్న దీనులు, అనాథలూ, రోగస్థులూ చంద్రునిపై వుంటే, వారికి సేవ చేయటానికి నేను, నా సహచరులూ చంద్రగ్రహం పై అడుగుపెడతాము' అన్నారట.

ఈపాటికి ఆమె ఎవరో మీరు వూహించేవుంటారు. ఆమె పేరే 'మదర్ థెరిస్సా' ఎందరో అభాగ్యులకు తల్లి. దీనులను, దుఃఖాలనూ ఓదార్చి వారి కష్టాలను పంచుకున్న సాధ్వి. రోగస్థులకు సేవ చేసిన మహాతల్లి. ఆమె దర్శనం ఆ రోజు కాకతాళీయంగా జరిగినందుకు నేనెంతో ఆనందించాను. ఆ వయస్సులో చెరగని చిరునవ్వు నవ్వుతూ చక చకా నడుచుకుంటూ నా ముందు నుండి వెళుతుంటే నమస్కరిస్తూ వుండి పోయాను.

ఆమె నిరుపేదలకు, కుష్ఠ వ్యాధిగ్రస్తులకు, ప్రకృతివైపరీత్యాలవలన అవస్థలపాలైన పేదప్రజానీకానికి సేవలందించారు. అనాథలకు, దిక్కులేని వారికి, ప్రేమ, జాలి అందించారు. వారి సేవలో ఎప్పుడూ నవ్వుతూ వుండే వారు, ఆమె అనుచరులు కూడా చిరునవ్వు నవ్వుతూ ఆనందంగా కనబడతారు. అదే విషయాన్ని ఆమెతో పాత్రికేయులు ప్రస్తావించి, 'వారు ఆనందంగా కనబడటానికి మూల కారణం ఏమిటని అడిగారు'? జవాబుగా 'అనాథలు, పేదలు, వ్యాధిగ్రస్తులు వారి వారి కష్టాలలో బాధ పడుతూ వుంటారు. ఏడుపుగొట్టు ముఖాలతో వారి ముందుకు వెడితే, వారికి, మేము సేవ చేయగలమనే నమ్మకం కలుగదు. చిరునవ్వుతో సేవచేస్తే, వారికి కొండంత బలం వస్తుంది. అందుకే మా సిస్టర్సు నవ్వుతూ సేవలు చేస్తారు' అని అన్నారట.

ఆమెను చూడ్డానికి చాలా మంది వచ్చే వారట వీలైనంత మందికి ఆమె తన బిజినెస్ కార్డుని యిచ్చేవారట. దాని మీద యిలా ముద్రించి వుంటుంది.

'మౌనానికి ఫలితం ప్రార్థన, ప్రార్థనకు ఫలితం విశ్వాసం,

విశ్వాసానికి ఫలితం ప్రేమ, ప్రేమకు ఫలితం సేవ, సేవకు ఫలితం శాంతి'.

ఆమె శాంతి స్వరూపిణి, శాంతి కాముకురాలు. అందుకే ఆమెకు అత్యుత్తమ పురస్కారం, నోబెల్ బహుమతి యిచ్చారు. (ప్రపంచశాంతి కోసం). విశ్వశాంతికై ఆమె కృషిచేశారు. ఆమెకు వచ్చిన బహుమతుల మొత్తాన్ని పేద ప్రజల సంక్షేమానికే వినియోగించారు. పేద ప్రజలకు మదర్ థెరెస్సా నిర్వహించిన, ఆశించిన కార్య కలాపాల వివరాలు యిలా వున్నాయి.

సాంఘిక కార్యకలాపాల్లో

శిశు సంక్షేమం, విద్యావధకాలు, కుటుంబ నంరక్షణ, అన్నదాన కార్యక్రమాలు, మద్యం సేవించి, పతనమైన వారికి చికిత్సా కేంద్రాలు, సహజ కుంటుంబ నియంత్రణ కేంద్రాలూ, డే క్రేష్‌లు, రాత్రి బసలు, ఆదివారం స్కూల్స్.

వైద్య సేవల్లో

డిస్పెన్సరీలు, కుష్ఠ చికిత్సా కేంద్రాలు, అనాథ శరణాలయాలలో వైద్య కేంద్రాలు, మానసిక, అంగవికల శిశుచికిత్సాలయాలు, ఎయిడ్స్ వ్యాధిగ్రస్తుల చికిత్సా కేంద్రాలు, అవివాహిత స్త్రీల ప్రసవ కేంద్రాలు, రోగగ్రస్థమై అవసాన దశలో వున్న వాళ్ళ శరణాలయాలు.

విద్యా కార్యక్రమాలలో

అనేక పాఠశాలలు, కుట్టు నేర్పే కేంద్రాలు, వ్యాపార చేతి వృత్తుల కేంద్రాలు.

ఈ వివరాలు శ్రీ నవీన్ చావ్లా , IAS తను ఆంగ్లంలో వ్రాసిన మదర్ థెరెస్సా జీవిత చరిత్ర అనే పుస్తకంలో వ్రాసారు. శ్రీ నవీన్ చావ్లా మదర్ థెరెస్సా గురించి యిలా అన్నారు.

'మానవత్వానికీ - మంచి తనానికీ మరో పేరు మదర్ థెరెస్సా'

'అభాగ్యులకూ, అనాథలకూ అమ్మ ఒడి థెరెస్సా'

'పతితులారా, భ్రష్టులారా, బాధా సర్ప ద్రష్టులారా, రా రండంటూ ఆప్యాయతానురగంతో అక్కునచేర్చుకునే అమృతమూర్తి మదర్ థెరెస్సా'

'నిరంతర కృషికీ, నిరాడంబరతకూ చిరునామా థెరెస్సా'

సుమారు 23 సంవత్సరాలు మదర్ థెరెస్సాకు సన్నిహితులుగా వున్నారు శ్రీ నవీన్ చావ్లా. ఆయన పుస్తకంలో మదర్ థెరెసా స్థాపించిన 'మిషనరీ ఆఫ్ ఛారిటీ, విశ్వవ్యాప్త కార్యక్రమాల గురించి వివరంగా వ్రాశారు. ఈనాటి యువతీయువకులు మదర్ థెరిసా నుండి ప్రేరణ పొంది, సేవా కార్యక్రమాలలో భాగం పంచుకోవాలి. ఆమె చూపిన దారిలో కొన్ని అడుగులు వేయడానికైనా ప్రయత్నించాలి ఆమె లేని లోటును నిరాడంబరంగా, నిదాన నిర్వర్తిస్తున్న ఆమె అనుయాయుల నుండి ప్రేరణపొంది, ఆదారిలో నడిస్తే మనకూ జీవిత సార్థకమవుతుంది.

నిస్వార్థంగా పేదల సేవ చేసిన మదర్ థెరెస్సా నుండి ప్రేరణ పొందాలా ? లేక స్వార్థపరులైన రాజకీయనాయకులు, తీవ్రవాదులు, మావోయిస్టులు, ఫాక్షనిస్టుల నుండి

ప్రేరణ పొందాలా ? అనేది యువత నిర్ణయించుకోవాలి. ఎన్నో హత్యలు ఎన్నో దోపిడీలు, ఎన్నో ఎన్‌కౌంటర్లు, ఎన్నో మానభంగాలు, యివన్నీ ఎందుకు జరుగుతున్నాయి ? ఎంతో మంది అమాయకులు ఎందుకు బలైపోతున్నారు?

యువతకు మార్గదర్శకతను చూపిన మదర్ థెరెస్సా మరువలేని మాతృమూర్తి. కొన్ని సంవత్సరాల తర్వాత, 'మదర్ థెరెస్సా ఎవరు?' అని అడిగితే, 'ఆమె ఎవరు' ? 'ఆమె పేరు ఎప్పుడూ వినలేదు' అని యువత చెబితే ఆశ్చర్యపోనక్కరలేదు. ఈనాటి యువత ఏదిశలో ప్రయణిస్తున్నారు ?

ఇది అనుకరణ యుగంలా మారుతుంది. పాశ్చాత్యుల అనుకరణ, డిస్కో కల్చర్, కోల్పోతున్న విలువలు ఈనాటి నిజాలు.

'మేము సంపన్నుల కోసం పనిచేయం. పేదలకు త్రికరణశుద్ధిగా సేవచేస్తాం. మేం చేసే పనికి డబ్బు తీసుకోం' అని నొక్కి వక్కాణించారు మదర్ థెరెస్సా. అలా చెప్పే ధైర్యం మనలో ఎంతమందికి వుంది ? ఎంత మంది రాజకీయనాయకులు, టెర్రరిస్టులు, మావోయిస్టులు, ఫాక్షనిస్టులు ఆదిశగా కృషి చేస్తున్నారు? కొంతమంది ఆ దిశలో చేస్తున్నది తక్కువ, తద్వారా లబ్ధి పొందుతున్నది ఎక్కువ.

ఒక సారి మదర్ థెరెసా, కుష్టు రోగుల పుళ్ళు శుభ్రం చేస్తున్నపుడు, ఒక సంపన్నురాలు చూసి చిరాకు పడింది. 'నాకు కోటి రూపాయలు యిచ్చినా, యిలాంటి పనిని చేయను' ఆని అన్నారట. మధర్ థెరెసా. 'నేనూ చేయను' అన్నారట. అంటే కుష్టురోగులసేవ కోటి రూపాయల కోసం చేయను. నా ఆత్మతృప్తి కోసం మాత్రమే చేస్తాను. అని, దాని భావం. ఆమె అంకితభావం చూసి కొంతమంది పెద్ద మొత్తాలలో విరాళాలు, పంపేవారు. బ్యాంకులో డబ్బు పెట్టే అవసరం ఆమెకు లేదు.

ప్రజల క్షేమం కోసం, ఉపాధి కోసం, కుష్టు, క్షయ వ్యాధి గ్రస్తుల ఆరోగ్యం కోసం, వెంటనే ఆ డబ్బు ఖర్చు పెట్టించేవారు.

ఆమె సేవ, కేవలం, కలకత్తా నగరానికే పరిమితం కాలేదు. కేవలం భారత దేశానికే కాదు, ప్రజలు ఏదేశంలో కష్టాలలో వుంటే ఆదేశానికి సహాయం పంపేవారు. ఇథియోపియా, ఆఫ్రికా, బంగ్లాదేశ్, ఇరాన్, ఇరాక్, తూర్పు యూరప్ దేశాలకు, పీడిత ప్రజల సహాయర్థం ఆమెకు అందిన త్యాగ ధనాన్ని వెంటనే పంపారు.

ఆమెలోని సేవా భావం, అంకితభావం, మానవత్వం, నిర్మాణాత్మకంగా చేసిన పని తీరులను గ్రహించి ప్రేరణ పొందాలి. యువతలోని ఆర్గనైజింగు కేపబిలిటీస్ ఆదిశలో

పనిచేసేలా చూస్తే, ఎంతోమంది అనాధలు, పీడితులు, వ్యాధి గ్రస్తుల లాభం పొందుతారు. ఈ రోజు వరకు ఈ దిశలో మనం ఏమి చేశాము ? ఏమి చేయగలం ? అని యువత, ఉద్యోగస్తులూ, విద్యార్థులూ ఆలోచించాలి. ప్రణాళిక ప్రకారం, సమిష్టిగా సేవాపథకాలను చేపట్టడం యువత బాధ్యత.

మదర్ థెరెస్సా 87 సంవత్సరాల వయస్సులో అంతిమశ్వాస తీసుకునే వరకూ, సేవ, సహాయం చేయడం లోనే కృషి చేశారు. మనం ఆ దిశలో ఏంచేస్తున్నాం ? ఏమీ చేయలేమా? 'చేయగలం' అనే సమాధానం వస్తే, భవిష్యత్తులో ఫలితం ఆనందదాయకంగా వుంటుంది. ప్రముఖ రచయిత శ్రీ యండమూరి వీరేంద్రనాథ్ గారు, ఇలా అన్నారు

'ఈ బాధావలయ ప్రపంచంలో – నీ సంతోషం ఒక బహుమతి'
'ఈ బీద ప్రపంచంలో – నీ చిరునవ్వు ఒక బహుమతి'
'ఈ ద్వేష పూరిత ప్రపంచంలో – నీ ప్రేమ ఒక బహుమతి'
'ఈ నిరాశాలోకంలో– నీ నమ్మకమే ఒక బహుమతి'
'భయపడే వారికి, బాధాగ్రస్తులకు నీ స్పర్శ ఒక బహుమతి'

ఈ బహుమతులన్నీ ఖరీదు లేనివని తెలుసుకోవడమే భగవంతుడు నీకిచ్చిన పెద్ద బహుమతి.

భగవంతుడు యువతకు యిచ్చిన బహుమతులను అవసరంలో వున్నవాళ్ళకు పంచగలగాలి. మనం యివ్వగలిగితేనే, అవసరం వచ్చినపుడు యితరులు మనకు, యిస్తారు. మన వద్ద వున్న బహుమతులను, మనం మాత్రమే యితరులకు పంచగలం. జంతువులు ఈ బహుమతులను పంచలేవు. అదే మనిషికి జంతువుకు వున్న తేడా. మన పరిధిలో మనం, మనవద్ద వున్న బహుమతులను పంచలేక పోతే మనమూ జంతువులతో సమానమే.

ప్రతివారు, తమకు గుర్తింపు, కీర్తి, పేరు, పరువు ప్రతిష్టలు కావాలని కోరుకుంటారు. అయితే అవి అడిగితే రావు. మనం చేసే మంచి పనులు చూసి మాత్రమే, యితరులు మన మంచిని గుర్తిస్తారు. మదర్ థెరెస్సా చేసిన మంచి పనులు చూసి, ప్రజలు ఆమెను ఆమె సేవలను గుర్తించారు. ఆమెకు కీర్తి ప్రతిష్టలు, బిరుదులు, ఆమెకు దక్కాయి. కీర్తి, ధనం, పరువు ప్రతిష్టల గురించి ఆమె పనిచేయలేదు. అంకితభావం, సేవాభావం ఆమె లక్షణాలు. వాటినుండి మనం ప్రేరణపొందాలి.

# యువత - వారి వస్త్రధారణ

వేష భాషల్లో మార్పు మంచిదే. అవసరం కూడా. దుస్తుల విషయంలో ఆకర్షణీయంగా, అందంగా వుంటే మంచిదే. కానీ ఆ దుస్తులు, వేషధారణ జుగుప్సాకరంగా వుండటం మనం చూస్తూనే వున్నాం. ఫ్యాషన్ ఛానల్స్‌లో వస్త్ర ధారణ ఎంత జుగుప్సాకరంగా వుంటుందో కూడా మనంచూస్తున్నాం. ఈ యుగం అనుకరణ యుగం అంటుంటారు. యువతీయువకులు పాశ్చాత్యదేశస్థుల వస్త్రధారణను అనుకరిస్తున్నారు.

భారతీయ సంస్కృతికి అద్దంపట్టే వస్త్రాలను, భారతీయ ఫ్యాషన్ రంగానికి ప్రపంచఖ్యాతి తెచ్చిపెట్టే విధానాన్ని అవలంబించడం అవసరం. మన చూడీదార్ పైజామా, లంగా ఓణీ, చీరలు, గాగ్రా చోళీలను ప్రపంచవ్యాప్తం చేయడానికి కృషిచేయాలి. ఈరకం దుస్తులను, ప్రత్యేక సందర్భాలలో వేసుకోడానికి, ఎలా మార్పులు చేయాలో, ఎలా ఎంబ్రాయిడరీ చేయాలో, ఎలా వర్ణరంజితంగా చేయాలో ఆలోచించి రూపొందించాలి. అవి కనువిందు కలిగించేలా వుండాలి. లోనెక్, నోబేక్ డిజైనులు రూపొందించడం ద్వారా, అవి ధరించే వాళ్ళనూ, చూసేవాళ్ళనూ యిబ్బంది పెట్టకూడదు. ఫ్యాషన్ పేరుతో జుగుప్సాకరంగా వుండటం అవసరమా ? అలా జుగుప్సాకరంగా వస్త్రధారణ చేసుకుంటేనే పలువురి దృష్టిని ఆకర్షించుకోవచ్చా ? ఈ పలువరిలో సంస్కారవంతులూ వుంటాగు, రాక్షసులూ వుంటారు.

రాక్షసులు, చూసి ఆనందించడంతో సరిపెట్టుకోరు. వారి ఆలోచనాపరంపర సాగుతూనే వుంటుంది. గౌరవించవలసిన స్త్రీని మరోవిధంగా వూహించుకుంటుంటారు. ఎదురుగా కనబడే ఆ అర్ధనగ్నసుందరిని ఏవిధంగా స్వంతం చేసుకోగలమా అని ఆలోచిస్తారు. తాత్కాలికంగా మాత్రమే. అటువంటి ఎంతోమంది రాక్షసుల వూహాసుందరిగా మారడానికి కారణం, ఆ స్త్రీయొక్క జుగుప్సాకరమైన వేషధారణ కాదా ?

ఒక వార్తాపత్రికలో ఒక అందమైన అమ్మాయి యిలా వ్రాసింది. 'నా బేక్ (వీపు) బాగం చాలా అందంగా వుంటుంది. కనుక బేక్‌లెస్ జాకెట్లును, దుస్తులను డిజైన్ చేసుకోవాలనుకుంటున్నాను. మీరు కొన్ని సూచనలు యివ్వగలరు' అని.

ఆమెను విమర్శించే వుద్దేశ్యం నాకు లేదు. ఎవరి అందం ఆనందం వారిది. ఎవరి ఆలోచనలు వారివి. ఎవరి అభిరుచి వారిది. అందంగా వున్నవాళ్ళు అందంగా వస్త్రధారణ చేసుకోవడం తప్పుకాదు. ఆ అందాన్ని చూసి యితరుల మెచ్చుకునేంత వరకు బాగానే వుంటుంది. కానీ సమాజంలో అందరూ అటువంటి సంస్కారం కలిగి వుంటారని భావిస్తే,

అది మనతప్పే అవుతుంది. మనదేశంలో ఆడది అందంగా తయారయ్యి, అర్ధరాత్రి ఒంటిరిగా వెడుతుంటే ఏమీజరగదు అని గారంటీ ఎవ్వరూ యివ్వలేరు. అందరిలోనూ అంత సంస్కారం వుంటే మంచిదే. కానీ కీడు ఎంచి మేలు ఎంచాలన్నారు పెద్దలు.

'అందంగా అలంకరించుకోకుండా, అందమైన బట్టలు, నగలూ ధరించకుండా అమ్మాయి, అర్ధరాత్రి ఒంటరిగా వెడుతుంటే ఏ ప్రమాదం జరగదా?' అని అడగవచ్చు. ప్రమాదం జరగదని ఏమీలేదు. ప్రమాదం జరగవచ్చు. అందుకే మన సమాజంలో పరిణతి, మంచిదనం, పూర్తిగా వచ్చేంత వరకూ జాగ్రత్తగా వుండాలి. అమ్మాయిలు తమనుతాము రక్షించుకోవాలి.

'అబ్బాయిలు ఫాషనబుల్‌గా వుండగాలేంది, అమ్మాయిలు ఫాషనబుల్‌గా వుంటే తప్పేమిటి?' అని కొంతమంది ప్రశ్నించవచ్చు. తప్పులేదు. అయితే వార్తా పత్రికలలో వస్తున్న వార్తలు చూస్తూవుంటే. అమ్మాయిలలో వున్న సంస్కారం, అందరి అబ్బాయిలలో లేదేమో అనిపిస్తుంది. మగవారిలోని మానసిక దౌర్బల్యం పూర్తిగా పోయేవరకూ, ఆడవాళ్ళు వారిని వారు రక్షించుకునే ప్రయత్నాలు చేస్తూనే వుండాలి.

ఇలా ప్రస్తావించడానికి కారణం, ఆడవాళ్ళు అలంకరణలు చేసుకోకూడదు అని కాదు, కాస్మొటిక్సు వాడకూడదు అనీ కాదు. అందంగా కనబడేలా వస్త్రధారణ చేసుకోకూడదు అనీ కాదు. జుగుప్సాకరంగా వుండకూడదు అని మాత్రమే. ఏదైనా అతిగావుంటే ఫలితం మంచి కంటే చెడు ఎక్కువ.

మనలో మార్పు సహజమే. ఆడవాళ్ళుగానీ మగవాళ్ళుగానీ మనలో వచ్చిన భౌతిక, మానసిక మార్పులను స్వాగతించాలి. ఆడవాళ్ళలో, బిడ్డగా, బాలికగా, యవ్వనవతిగా, తల్లిగా, మామ్మగా మార్పులు వస్తున్నాయి. వేషభాషలలో కూడా సహజంగా మార్పులు వస్తాయి. ఈరోజు చక్కగా హుందాగా బట్టలు వేసుకున్న ఆడవాళ్ళను చూసి, పాతచిత్రాలలోని హీరోయిన్‌లా అందంగా, చక్కగా వుంది అంటారు. కాని ఈ రోజుల్లోని హీరోయిన్‌లా వుంది అనడానికి సాహసించరు. ఎందుకంటే ఈ రోజుల్లోని చాలా మంది హీరోయిన్లు, వ్యాంప్‌రోల్సు వేసుకునే  బట్టలు వేసుకుని జుగుప్సాకరంగా వుంటున్నారు.

సినిమాహీరోయిన్లు అలా వస్త్రధారణ చేసుకుంటే ఖండించరు. లొట్టలు వేసుకుంటూ చూస్తారు. మరి మేము అలా వస్త్రధారణ చేసుకుంటే ఎందుకు విమర్శిస్తారు? అని కొంతమంది అమ్మాయిల వాదన. తప్పులేదు. ఎవరి యిష్టంవాళ్ళది. కానీ అలా లొట్టలు వేసుకుంటూ చూసేవాళ్ళను ప్రోత్సహించడం అవసరమా?

'బాలికగా వున్నపుడు వేసిన బట్టల వంటివే, నేనూ వేసుకుంటాను' అని తల్లి చెబితే కొంత ఎబ్బెట్టు అనిపించవచ్చు. 'నా మనవరాలు వేసుకున్న బట్టల వంటివే నేనూ వేసుకుంటాను' అని మామ్మగారు చెబితే మరికొంత ఎబ్బెట్టుగా వుండవచ్చు. చిన్నబట్టలు వేసుకున్న, పెద్దపాపలా వుండవచ్చు.

ఫాషనబుల్‌గా వస్త్రధారణ చేసుకునే యువతీ యువకులు, అంతటితో ఆగక, నగర శివార్లలో అవినీతిగా నుడుపుతున్న క్లబ్ హౌసెస్‌కు, డిస్కో పేరుతో వెళ్ళడం. పోలీసులకు పట్టుబడటం. ముఖంచాటు వేయడం, వంటి వాటి గురించి కూడా వార్తా పత్రికలలో చదువుతూ వున్నాము. యువతీయువకులు డిస్కోకల్చరును అలవాటు చేసుకోవడం,. మత్తుపదార్థాలు సేవించడం వంటి అలవాట్లతో వారి వుజ్వలమైన భవిష్యత్తును పాడుచేసుకుంటున్నారు.

సమాజంలో వీరి చుట్టూ వున్నవాళ్ళలో కొంతమంది మానసిక అనారోగ్యం గలవారూ వున్నారు. వారు చాలా భయంకరమైన వ్యక్తులు. వూబిలో దిగిపోతున్నవారిని రక్షించరు. మరింత నష్టం కలిగేలా చేస్తారు.

స్త్రీలకు మంచి గుర్తింపు, జుగుప్సాకరంగా వుండే దుస్తులు వేసుకోవడాన్ని బట్టి రాదు. బాధ్యతలను పంచుకుంటూ ప్రగతిశీలంలో అడుగుపెట్టి, కీర్తి ప్రతిష్టలు అనే ప్రగతి శిఖరాలను అధిరోహిస్తే మంచి గుర్తింపు వస్తుంది. స్త్రీలు, మన ఆచార, వ్యవహారాలను దృష్టిలో వుంచు కోవడం అవసరం. మన ఆచార వ్యవహారాలు ఛాందస భావాలతో కూడినవి. వాటిని పాటిస్తూ వుంటే ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వుంటుంది. మనిషికి అవసరం, మార్పు అనే వాదన వినబడుతూనే వుంది.

ఇక్కడ ఒక ఉదాహరణ యివ్వడం అవసరం.

విజయలక్ష్మి ఒక అందమైన అమ్మాయి. ఆమెకు భగవంతుడు యిచ్చిన గొప్పవరం అందం. ఆమె తల్లిదండ్రులిద్దరికీ పాశ్చాత్య నాగరికత పై మక్కువ ఎక్కువ. వారు వారి పెద్దలు పెట్టిన విజయలక్ష్మి అనే పేరును 'విల్స్' అనీ 'రీచా' అని మార్చేసారు. విల్స్ అని తండ్రి, రీచా అని తల్లి ముద్దుగా పిలుచుకుంటూంటే బాగానే వుంటుంది. ఆ అమ్మాయిని ఎవరైనా విజయలక్ష్మి అని పిలిస్తే వారికి చాలా కోపంవచ్చేది. వారిపై అనవసరపు కోపాన్ని ప్రదర్శించేవారు. కనుక వారికి నచ్చినట్లుగా రీచా అనే అందాము. లక్ష్మి అంటే గాడెస్ ఆఫ్ రిచ్‌నెస్. అందుకే ఆమె లక్ష్మి అనే పేరు రీచాగా మారింది.

ఉద్యోగరీత్యా రీచా తల్లిదండ్రులు ఒకసారి యూరప్ వెళ్ళి వచ్చారు. వారికి

పాశ్చాత్యనాగరికత, వారి అలవాట్లు, వారి వస్త్రధారణలపై మోజు పెరిగింది. విదేశాల్లో వున్నది తక్కువ కాలమైనా, పాశ్చాత్య నాగరికత పై, వారి విలువలపై, క్రమశిక్షణపై, ఎక్కువ ప్రాధన్యత యిచ్చేవారు. కొన్ని మంచిలక్షణాలను పాశ్చాత్యుల నుండి దత్తత తీసుకుంటే మంచిదే. తల్లిదండ్రుల అలవాట్ల యొక్క ప్రభావం రీచాపై చాలావుంది. ఫాషనబుల్‌గా దుస్తులను ధరించడం, కాస్మొటిక్సును వాడటము వరకు బాగానే వుంది. కానీ ఎక్కువ ప్రాధాన్యతను తోటి విద్యార్థులను ఆకర్షించడంలో, వారిని పిచ్చివాళ్ళను చేయడంలో శ్రద్ధ చూపడం. అదే బాగావుండేది కాదు. మన నాగరికతను అలవాట్లను తక్కువచేసి మాట్లాడటం, తోటివారికి రుచించేది కాదు. అయినా వారిని కేర్ చేసే మనస్తత్వం 'రీచా'లో లేదు.

శ్రీను, రీచా ఒకే కాలేజిలో చదువుతున్నారు. రీచా యొక్క అందచందాలు, వేషభాషలను చూసి శ్రీను ఆమెపట్ల చాలా ఆకర్షితుడయ్యాడు. ప్రేమలో పడ్డాడు. శ్రీను ధనవంతుల బిడ్డ. శ్రీను తండ్రి రాజకీయనాయకుడు. తండ్రిలాగే శ్రీను కాలేజి రాజయకీయాల్లో ముఖ్యపాత్ర తీసుకున్నాడు. జనరల్ సెక్రెటరీగా ఎన్నికయ్యాడు. కాలేజిలోను, బయటా మంచివాడు అనే పేరువుంది. శ్రీను తనను ప్రేమిస్తున్నట్లు 'రీచా'కు తెలుసు. కానీ రీచా శ్రీనును ప్రేమించలేదు. స్నేహితుడిగా మాత్రమే భావించేది.

ఆమె ధ్యాసంతా ఎక్కువగా, క్రొత్తగా ఆకాలేజిలో లెక్చరర్‌గా చేరిన రవిపై వుంది. నెమ్మదిగా, సౌమ్యంగా మాట్లాడే అతని తీరుని చూసి సంతోషపడేది. రవిది లోతైన మనస్సు. అతని మనస్సులో ఏముందో తెలుసుకోవడం, అంతతేలిక కాదు. ఆచితూచి మాట్లాడతాడు. ఎదుటివారి దృష్టిని అతని ప్రవర్తన ద్వారా ఆకర్షించుకుంటాడు. అతని మాటల్లో స్పష్టతతో ఎదుటివారిని పొగడటం, చక్కగా చమత్కరించడం చేస్తుంటాడు. రవితో మాట్లాడుతుంటే యింకా మాట్లాడాలనిపిస్తుంది. రవి చక్కటి పెర్సనాలిటీ, మాటతీరూ, విద్యార్థినీ విద్యార్థులనే కాక తోటి లెక్చరర్సును కూడా ఆకట్టుకుంటాయి. విద్యార్థుల సమస్యలను, వారి తొందరపాటు పనులను చక్కగా విశ్లేషించి, చక్కటి పరిష్కారాలను సూచించడం ద్వారా ప్రత్యేక గుర్తింపు పొందాడు. అమ్మాయిల దృష్టిలో అతను హీరో. అతని మంచితనం, వ్యక్తిత్వం రీచాను ఆకట్టుకున్నాయి. ఉపాధ్యాయుడిలా కాకుండా ఒక స్నేహితుడిలా మాట్లాడే అతని తీరూ, ప్రవర్తన రీచాకు చాలా నచ్చింది.

'రీచా' నెట్ ద్వారా రవితో చాటింగ్ చేయడం, స్నేహం చేయడం మొదలుపెట్టింది. రవి భావవ్యక్తీకరణలో ఉన్న స్పష్టతను గుర్తించింది. 'రీచా' వస్త్రధారణ కొంత మందికి యిబ్బంది కరంగా అనిపించినా, రవి మాత్రం 'రీచా'ను అభినందించేవాడు. రీచా సన్నగ,

పొడుగ్గా వుండటం వలన, అందం, సౌకర్యంగల జీన్స్ వేసుకుంటే బాగావుంటాయని, తరచు జీన్స్ లోనే కాలేజీకి వెళ్ళేది. జీన్స్ వేసుకున్న ప్రతీసారీ కొత్తదనం కనబడేలా, టాప్స్ మార్చడం రీచా ప్రత్యేకత. ఎక్కువగా పొట్టి, బాడీ ఫిట్టింగ్, టాప్స్ రంగు రంగులవి వేసుకునేది. బాడీ షేప్స్ అందంగా కనబడటానికి, స్పాంజితో చేసిన బ్రాస్ వేసుకోవడం వలన ఆమె వస్త్రధారణ జుగుప్సాకరంగా అనిపించినా, ఆమె తల్లిదండ్రులు ఎప్పుడూ అభ్యంతరం చెప్పలేదు. అది ఒక ఫాషన్‌గానే గుర్తించారు. రవికూడా అది ఫాషన్‌గానే గుర్తించి, 'మనకు ఏ బట్టలు సౌకర్యంగా వుంటాయో, వాటినే వేసుకోవాలి. ఎవరో ఏదో అనుకుంటారని మన రుచిని ఫణంగా పెట్టకూడదు' అని సలహాయిచ్చాడు. 'క్రొత్తను ఆహ్వానించాలని, ఎప్పుడూ లంగా ఓణీలు వేసుకుని పాతకాలం అమ్మాయిలా వుండాలని లేదు' అని సలహా యిచ్చాడు. రీచా వస్త్రధారణ వ్యక్తిత్వం బాగుంటాయి అని పొగుడుతూవుంటాడు. వారి అభిప్రాయాలు, అభిరుచులూ ఒక్కలాగ వుండటం వలన, రీచా తనకు తెలియకుండానే రవిని ప్రేమించడం మొదలు పెట్టింది.

కానీ రవి ఎప్పుడూ 'ఐ లవ్ యూ' అని చెప్పలేదు. ఎప్పుడూ ఆమెను తాకలేదు. ఆమెలో మనోబలం పెంచడానికే ప్రయత్నించాడు.

'రీచా' వేషభాషలలో ఒక ప్రత్యేకత వుందని, మంచి పెర్సనాలిటీ ఉందని, తగిన కృషి చేస్తే MISS INDIA గా పోటీ చేయవచ్చని చెప్పాడు. మోడలింగ్ కూడా చేయవచ్చని సలహాయిచ్చాడు.

రవి మంచి సలహాలు యిస్తాడనీ అనవసరమైన చొరవ తీసుకునే అవకాశవాది కాదు అనీ రీచా అభిప్రాయపడింది. అతనిపై గౌరవం పెరిగింది. ఇంటర్నెట్ చాటింగ్‌లో రవి, అనవసరపు గాసిప్ చేయకుండా, ఆమె వ్యక్తిత్వాన్ని రూపుదిద్దుకోడానికి తగిన సలహాలు మాత్రమే యిస్తూవుంటాడు.

ఒకరోజు 'రీచా', తన తలిదండ్రులతో పరిచయం చేస్తానని, రవిని ఇంటికి ఆహ్వానించింది. కాలేజీలో వేరేపని, అనుకోకుండా రావడంవలన, రవి, రీచా యింటికి ఆలస్యంగా వెళ్ళాడు. క్లబ్‌లో ఫంక్షన్ వుందని, రీచా తల్లిదండ్రులు వెళ్ళిపోయారు. ఆరోజు రావద్దని, ఆ ప్రోగ్రాం మరొక రోజుకు వాయిదా వేసుకోమని 'రీచా', రవికి చెప్పలేకపోయింది.

మిస్ ఇండియాలా అలంకరించుకున్న 'రీచా'ను చూసి రవికి కళ్ళుచెదరాయి. ఎంతోసేపు కబుర్లు చెప్పుకుంటూ వుండిపోయారు. వారిలో క్షణ, క్షణం పరస్పర ఆకర్షణ పెరుగుతుంది. ఫలితంగా ఒకరికొకరు దగ్గరయారు. రవి, చొరవ తీసుకుని 'రీచా'ను

దగ్గరకు తీసుకున్నాడు. రీచా లతలా రవిని చుట్టుకుపోయింది. మనసులు కలిసాయి. పెదవులు కలిసాయి. తనువులు కలిసాయి. రోజులు గడచే కొద్దీ వారిద్దరు మరింత దగ్గరయ్యారు. మరిన్ని సంతోషసమయాలను, పంచుకున్నారు. ఫలితం? అది దాచినా దాగదు.

'రీచా' తను గర్భవతిని అని రవికి చెప్పాలనుకుంది. అది ముందే గ్రహించిన రవి ఉద్యోగానికి రాజీనామా చేసి, రీచాకు చెప్పకుండా వెళ్ళిపోయాడు. రీచా అప్పుడు కళ్ళు తెరచింది. రవిని గురించి వాకబుచేసింది. రవికి ముందే వివాహం జరిగిందని, అతని భార్య రూపవతి, ధనవంతులబిడ్డ అని తెలిసింది. రవి తన భార్యను, ఆమె ద్వారా వచ్చిన ఆస్తిని వదలు కోనని ఖచ్చితంగా చెప్పాడు. జరిగిన దానిలో తనతప్పు లేదని, చెప్పాడు.

రవి 'రీచా'ల ప్రేమ వ్యవహారాలు, తెలుసుకుని శ్రీను, భగ్న ప్రేమికుడయ్యాడు. పిచ్చివాడిలా తయారయ్యాడు. ఒకసారి ఆత్మహత్యకు కూడా ప్రయత్నించాడు. శ్రీను తండ్రి కోపంతో రెచ్చి పోయాడు. ఆయనకు ధనబలం, రాజకీయ పలుకుబడి వున్నాయి. ఆయన వలన రీచా తల్లిదండ్రులు చాలా కష్టాలు పడవలసివచ్చింది. ఈ బాధలు పడలేక 'రీచా' తల్లి కారు డ్రైవరుతో లేచిపోయింది. విదేశీనాగరికత వ్యామోహంలో, పడి ఆ కుటుంబం చాలా నష్టపోయింది. కానీ చేతులుకాలిన తర్వాత ఆకులు పట్టుకోవాలని చూసినా ప్రయోజనం వుండదు కదా.

రీచాను, రీచా తల్లిని, శ్రీను తండ్రి దుర్మార్గాన్ని తలచుకుంటూ, చాలా కృంగిపోయాడు. రీచా తండ్రి అన్నీ త్యజించి సంసారానికి, సంఘానికి దూరమయ్యాడు.

డ్రైవరుతో లేచిపోయిన తల్లి ఆర్థికంగా, నైతికంగా నిలబడలేక కృంగిపోయింది.

'పుట్టబోయే బిడ్డను పెంచడం కష్టం. తల్లితండ్రుల అండలేదు. ఆబిడ్డను వుంచుకోవాలా? అబార్షను చేయించుకోవాలా?' అనేది రీచా సమస్య.

స్త్రీలకు మంచి గుర్తింపు, జుగుప్సాకరంగా వుండే దుస్తులు వేసుకోవడం వలన రాదు. వారు మన ఆచార వ్యవహారాలకు గౌరవమివ్వాలి. స్త్రీలుగాని పురుషులుగాని వారి వారి వస్త్రధారణ కనులకు యింపుగా వుండాలి. 'జుగుప్సాకరంగా ఉంది' అని చూసేవారు అనుకోకూడదు. వారిలో దాగివున్న రాక్షసత్వాన్ని నిద్రలేపకూడదు. మన వస్త్రధారణ, మన సంస్కారాన్ని, మన మనోభావాల్ని తెలుపుతాయి. కనుక వస్త్రధారణ విషయంలో తగిన జాగ్రత్త తీసుకోవడం అవసరం. యువతరం ఈ సత్యాన్ని గుర్తించాలి.

# యువత - వారి అభిరుచులు

మనలో చాలా మందికి క్రికెట్టు ఎలా ఆడాలో తెలియదు. ఎప్పుడూ ఆడలేదు. కానీ క్రికెట్టు అంటే గొప్ప క్రేజ్. క్రికెట్టుపైగల ఈ బంధం (అభిరుచి), విద్యార్థులను విద్యనుండి దూరం చేస్తుంది. ఉద్యోగస్థులను ఉద్యోగాల నుండి దూరంచేయడానికి దోహదపడుతుంది. పబ్లిక్ ఎగ్జామ్స్ సమయాల్లో, కూడా, చదువు మాని, క్రికెట్టు మాచ్ చూసే ప్రబుద్ధులెంతో మంది వున్నారు. ఫలితం ? పరీక్షలు తప్పడం. లేక తక్కువ మార్కులు రావడం. ఫలితం ప్రొఫెషనల్ కాలేజీలో సీటు దొరకకపోవడం. రాజీపడటం. చదువుమానడం. జీవితాన్ని నిస్తేజంగా జీవించడం. చాలీచాలని ఆదాయంతో తనూ, తన పిల్లలూ పస్తులువుండటం. కొంతమందికి అవసరానికి మించిన ఈ బంధాల వలన, అవసరానికి మించిన, ఈ అభిరుచుల వలన కాలేజీలకు వెళ్ళాలనిపించదు. ఇంటికి ఆలస్యంగా వెళ్ళేలా చేస్తుంది. ఫలితం ఇంట్లో గొడవ. స్నేహితులతో జీవితాన్ని ఆనంద దాయకం చేసుకుంటున్నా మను కుంటారు. కాని ఎన్ని గంటలు ఎన్ని రోజులు వృధా అవుతున్నాయో గమనించరు. ఫలితం జీవితంలో రాజీపడటమే. మన నిరాశాజనకమైన పద్ధతి, మనలను భవిష్యత్తులో ఎంత నిరాశ పరుస్తుందో ఆలోచించరు.

కొంతమంది స్త్రీలు, గృహిణులు, టివి, సినిమాలతో వారి అనుబంధం వలన సోమరిపోతులు అవుతుంటారు. తద్వారా తల్లిదండ్రులు, అత్తమామలు, భర్తలు, పిల్లలు, వారి అసంతృప్తికి కారణభూతులవుతారు.

అలా అని క్రికెట్టు చూడకూడదు అనికాదు. స్నేహం చేయడం, ప్రేమించడం తప్పు అని కాదు. టివి, సినిమాలు చూడకూడదు అనికాదు. ప్రతిదానికి ఒక పరిమితి, పద్ధతి వుంటుంది. ఏదైనా మితిమీరితే అది చెడుకే దారి తీస్తుంది.

ఒక పూజారి గారికి క్రికెట్టు అంటే విపరీతమైన మోజు. క్రికెట్టు కామెంట్రీ వింటూ పూజలు చేస్తుండేవాడు. మంత్రాలు చదువుతూ మధ్య మధ్య సునీల్ గవాస్కరాయనమః, ఆరు రన్నులు కొట్టారాయనమః, సెంట్యురీ కొట్టడానికి మరో తొమ్మిది పరుగులు బాకీ వున్నాయనమః అంటూ పూజలు చేయిస్తూవుంటే, అది చూసిన, ఆలయ ధర్మనిర్వాహకులు ఆ పూజారిగారిని, ఆ పదవి నుండి తొలగించారు. కాని ఆయన క్రికెట్టు పిచ్చి పోలేదు. ముదిరింది. ఫలితం జీవనం జటిలమయ్యింది. ఆదాయం లేదు. ఆలయంలో పూజలు చేయడం, క్రికెట్టు మ్యాచ్ చూడటం, కామెంటరీ వినడం తప్పించి మిగీతా పనులు రావు. ఫలితం అడుక్కోవలసిన ఖర్మ పట్టింది.

ఒక గృహిణి ఈ టీవి, బంధం/అభిరుచి వలన టివి చూస్తూ వుండిపోతుం తన చిన్న పిల్లల్ని స్కూలు నుండి తీసుకురావాలి అన్న మాట తరచూ మరచిపోతూ వుంటుంది. ఫలితం ఒకరోజు, స్కూలు నుండి వస్తూంటే పిల్లలు రోడ్డు దాటుతున్నపుడు ప్రమాదం జరిగింది. హాస్పిటల్‌లో భర్తీచేశారు. ఫలితం భర్తతో చివాట్లు, రోజూ హాస్పిటల్ చుట్టూ ప్రదక్షిణలు. అన్నిటినీ మించి, పిల్లలు దక్కుతారో లేదో అనే బెంగ.

ఒక టీనేజరుకు సినిమాపిచ్చి ఎక్కువ. ఎప్పుడూ ఉహలోనే వుంటుంది. ప్రేమపిచ్చిలో పడింది. తను బిలో మిడిల్ క్లాసు, అబ్బాయి ధనవంతులబిడ్డ. భవిష్యత్తులో తన ప్రియుడి ద్వారా తనకు లభించే బోగభాగ్యాల గురించిన ఆలోచలనలతో తలమునకలయింది. 'సినిమాలోని' హీరో, హీరోయిన్లతో తనను పోల్చుకునేది. ఫలితం, ఆ అమ్మాయి నెలతప్పింది. దాచాలన్నా దాగని నిజం. అబ్బాయికి పెద్దవాళ్ళతో చెప్పే ధైర్యం లేదు. తన ప్రేయసిని తప్పించుకుని తిరగడం మొదలుపెట్టాడు. నిజం తెలిసిన ఆ అమ్మాయి పెద్దలు, అన్ని ప్రయత్నాలూ చేశారు. కానీ అవి విఫలమయ్యాయి. దిక్కుతోచని స్థితిలో ఆ అమ్మాయి, భవిష్యత్తుని, ఆలోచించుకుని తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుంది. ఆ అబ్బాయికి మరొక ధనవంతుల అమ్మాయితో పెళ్ళిఅయింది.

ఇలాంటి సంఘటనలను ఎన్నో సినిమాలలో, టివి కార్యక్రమాలలో చూస్తూనే వున్నాము. రకరకాలుగా మార్పులు చేర్పులు చేసి చూపుతున్నారు. కాని పర్యవసానం అబ్బాయిల అవకాశవాదం, అమ్మాయిలు కాలుజారడం. పరువు ప్రతిష్టలను కోల్పోయి బ్రతకడం, కష్టమనిపించి ఆత్మహత్యలు చేసుకోవడం.

ప్రేమ తప్పుకాదు. విలువల ఆధారంగా ప్రేమించుకోవాలి. ఫలితాలను ముందుగా వూహించుకోవాలి. ఎదుటివారిని అర్థం చేసుకోవడంలో తప్పులు చేయకూడదు. ఎదుటి వారి మాటలు, చేతలు సమయానుసారంగా మారవచ్చేమోనని ఆలోచించాలి. నిర్ణయాలు తీసుకోవడంలో పొరబాట్లు, తొందరబాటు పనికిరావు. సినిమా వేరు, జీవితం వేరు. అదృష్టం బాగుండి, అనుకున్నవి అనుకున్నట్లు జరిగితే మంచిదే. కాని కీడు ఎంచి మేలు ఎంచడం మంచిదే కదా. ప్రేమలో పడి, ప్రేమగా పెంచి పెద్దచేసిన పెద్దలను మోసగించి, తనూ మోసగింప బడటం, జీవితాన్ని త్యజించడం మంచిది కాదు. జీవితం దేవుడు యిచ్చిన వరం. కృషితో, పట్టుదలతో జీవితంలో పైకిరావాలి. ఇది అమ్మాయిలకూ, అబ్బాయిలకూ వర్తిస్తుంది.

స్త్రీ వంటింటి కుందేలు అనేది, ఈరోజుల్లో వాస్తవంకాదు. అన్ని రంగాలలోనూ స్త్రీలు, పురుషులతో పోటీ పడుతున్నారు. తాము ఏవిధంగాను, ఏరంగాలోనూ తక్కువకాదు.

సినిమా నాయికగా వూహించుకుని కలలుకంటూ, జీవితాన్ని పాడుచేసుకోవడం మంచిదికాదు. ఈ పోటీ ప్రపంచంలో నిలబడాలి. కృషిచేయాలి, రాణించాలి. ఆత్మవిశ్వాసం పెంచుకోవాలి. మానవతా సంబంధాలు పెంచుకోవాలి. క్రమశిక్షణ, వారి పని పట్ల గౌరవం పెంచుకోవాలి. ఆశావాద దృక్పథం స్త్రీలకూ అవసరమే. తార్కికంగా ఆలోచించుకుంటూ కృషిచేస్తూ జీవితంలో స్త్రీలూ పైకి రావాలి. అందరిచేత శభాష్ అనిపించుకోవాలి, బాధ్యతలను పంచుకోవాలి. అంకితభావంతో తమ పనిని, సమర్థవంతంగా చేయాలి. అది విద్య, ఉద్యోగ రంగాలలో గాని, మరి యితర రంగాలలో గానీ పరిపూర్ణత సాధించాలి.

సామాన్యంగా, స్త్రీలలో భావవ్యక్తీకరణలో చాలా స్పష్టత వుంటుంది. అందుకనే తమ ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పిన ఎంతోమంది పురుషుల వెనుక స్త్రీల హస్తం వుంటుందనేది సత్యం. సామాన్యులు కూడా, వారి భార్య సలహాలు, తల్లి సలహాలు తీసుకుంటూ వుంటారు. ఈ రోజుల్లో అమ్మాయిలు చక్కగా చదువుకుంటూ, అవసరమైనపుడు వారి పెద్దలకు, తోబుట్టువులకూ, స్నేహితులకూ సలహాలు యివ్వగలిగే స్థాయికి పెరుగుతున్నారు. సినిమాల పిచ్చిలో పడి రంగురంగుల ప్రపంచాన్ని వూహించుకుంటూ, మోస పోవడం గొప్పకాదు. తమ, తమ, బాధ్యతలను చక్కగా నిర్వర్తిస్తూ, సమర్థవంతంగా పైకిరావడం గొప్ప. అమ్మాయిలు ఈవిధంగా అంతర్మథనం చేసుకోవడం అవసరం. తమ సామర్థ్యాన్ని నిరూపించుకున్న తర్వాత, కులమత, భాషా భేదాలను కూడా అధిగమించి తగిన వరుడ్ని ఎంచుకున్నా ఆపద వుండదు. భవిష్యత్తు బంగారు బాట చేసుకోవచ్చు, ఎందుకంటే అప్పటికి అవసరమైన పరిణతి వస్తుంది. కనుక మోసపోయే ప్రసక్తి వుండదు.

కనుక యువత అభిరుచులు క్రికెటుబంధం, అనవసరమైన స్నేహబంధం, సినిమాలబంధం, టివిబంధం, పరిణతి లేని ప్రేమబంధం, వంటి వాటితో సమయాన్ని వృధా చేసుకోకూడదు.

జీవితంలో, స్నేహం, ప్రేమ, ఆటలు,పాటలు అవసరం. విలువల ఆధారంగా వాటిని పెంపొందిచుకోవాలి. అవి యువతకు మార్గదర్శకతను చూపుతాయి. యువత వాటిపట్ల విజ్ఞతను చూపాలి.

జీవితాన్ని సుఖమయం చేసుకోవాలి.

# మంచి ఆలోచనలు (Ideas)

కొన్ని మంచి ఆలోచనలు, మన జీవితాలను మార్చివేస్తాయి. కనుక వాటి గురించి వివరణ యిస్తున్నాను. మన జీవితంలో, సుఖం, మనశ్శాంతి, ప్రేమ కావాలంటే, మనలో మంచి ఆలోచనలు వుండాలి. విజయం అపుడే సొంతం అవుతుంది. జీవితం ఒక మాయాజాలం. ఈ జీవితంలో మిరాకిల్స్‌ను స్వీకరించి సంతోషంగా వుండాలి. కనుక మంచి ఆలోచనలు అవసరం, మనకు ఎంతైనావుంది.

ఆలోచనలు, సముద్రకెరటం లాంటివి. కాలం (టైము) ఎవరికోసం ఆగదు.

మంచి ఆలోచనలు వచ్చినప్పుడు వెంటనే అమలు చేయాలి. వాయిదా వేస్తే, రేపు వాటిని మరచిపోతాము. మంచి ఆలోచనలు వచ్చినప్పుడు కనీసం వాటిని డైరీలో వ్రాసుకోవాలి.

మన మనస్సు పేరాచూట్ లాంటిది. పేరాచూట్ విచ్చుకుంటేనే పనిచేస్తుంది. అలాగే మనస్సును విప్పితేనే బాగా పనిచేస్తుంది. మనస్సు విప్పినపుడే మంచి ఆలోచనలు వస్తాయి. మనస్సు మూసుకుని వుంచితే చిలుము, చీడ పడుతుంది.

దురభిప్రాయాలు, అవివేకము లాంటి సాలెగూళ్ళలో మనస్సు చిక్కుకుంటే మనకు మంచి జరుగదు. మనస్సుని మూసి వుంచితే, వేగంగా వచ్చిన మంచి ఆలోచనలను, అంత వేగంగానే మరచి పోతాము.

మనస్సు విప్పితే, మంచిఆలోచనలు అంకురిస్తాయి, పుష్పిస్తాయి, ఫలిస్తాయి. మంచి ఆలోచనలు, మనలోని సంకుచితభావాల్ని దూరంచేస్తాయి. మంచిఆలోచనలు వివేకాన్నిస్తాయి.

విజ్ఞానానికి మూలం మనిషి ఆలోచనలే, వివేకమే. మనోరథ సిద్ధి, లక్ష్యసాఫల్యము, మంచి·అన్వేషణలకు, మూలం మంచి ఆలోచనలే.

ఉన్నత శిఖరాలను చేరాలంటే, మంచి ఆలోచనలతో ముందుకు సాగిపోవాలి.

మనిషి జీవితం, తన ఆలోచనలపైనే ఆధార పడివుంటుంది. మంచి ఆలోచనలు, మనిషిని మంచిగా తీర్చిదిద్దుతాయి. చెడు ఆలోచనలు, మనిషిని చెడ్డగా రూపుదిద్దుతాయి. తెలివైనవాడు, ఏ పనైనా చేసే ముందు ఆలోచిస్తాడు. తెలివిలేని వాడు, ఆలోచించకుండా పనిచేస్తాడు, పశ్చాత్తాప పడతాడు.

మన ఆలోచనలలో మంచి మార్పు వస్తే, మనలో కూడా మంచి మార్పు వస్తాది.

మనస్సు భూమి లాంటిది. మంచి ఆలోచనలను విత్తనాలుగా చల్లితే, హృదయ పూర్వకంగా సేద్యం చేస్తే, కృషికి తగ్గ మంచి ఫలితాలనిస్తుంది. వినయం, విధేయత, స్వయంకృషిల ఫలితం జయం.

తెలివైనవాడు ఎక్కువ వింటాడు, తక్కువ మాట్లాడుతాడు. మనస్సుకు విశ్రాంతినిస్తే ప్రయోజనకరమైన మంచి ఆలోచనలు వస్తాయి. మంచి ఆలోచనలను ధైర్యంగా అమలుచేయాలి. ధైర్యంగా ఓటమిని ఎదురించాలి. ధైర్యంగా విజయాన్ని సాధించాలి.

ఇతరుల మంచి ఆలోచనలను తెలుసుకుని మంచిని పంచుకోవాలి.

ఆలస్యమొనర్చు అలవాటు వలన కాలము వ్యర్థమవుతుంది. అభివృద్ధి కుంటుపడుతుంది.

మనస్సును మూసి వుంచితే, మంచిఆలోచనలకు చెడుఆలోచనలకు వ్యత్యాసము తెలియదు.

శుద్ధమైన ఆలోచన, ఫలితం జయం. శుద్ధమైన మాట, శుద్ధమైన బాట.

మంచి ఆలోచనలు డబ్బును సంపాదిస్తాయి. డబ్బు మంచి ఆలోచనలను సంపాదించలేదు.

ఇతరుల మంచి అభిప్రాయాలను చంపేవారి ప్రయత్నం, వారిని కూడా కొంత చంపుతుంది.

మంచి ఆలోచనలకు మూలం సృజనాత్మకత (CREATIVITY).

ఏపనైనా చేసేముందు బాగా ఆలోచించాలి. మరొక మంచి పద్ధతి వుండవచ్చు.

నీలోని సృజనాత్మక శక్తిని స్వేచ్ఛగావదలాలి. క్రొత్త ఆలోచనలు, ప్రతిభావంతమైన క్రొత్త విషయాలు బయటకు వస్తాయి. ఇలాంటి స్వేచ్ఛను పిల్లలకు కూడాయివ్వాలి.

అద్భుతమైన విషయాలను, మనస్సు ఆలోచించ గలదు. మనస్సుకు ఆలోచించే, అవకాశం యివ్వడం మనవంతు.

మంచి అనుభవాలు, భావాలు, త్యాగాలు-సృజనాత్మకమైన ఆలోచనలకు ప్రతీకలు.

కొన్ని మంచిఆలోచనలను యిక్కడ ఉదాహరిస్తాను :

జీవితంలో నువ్వు చాలా ముఖ్యమైన వ్యక్తివి. నీ నడవడిక దానికి తగ్గట్టుగా వుండాలి.

మన భవిష్యత్తును మనమే నిర్ణయించు కోవాలి.

ఇతరుల అభిప్రాయాలను గౌరవించాలి.

మనల్ని మనం గౌరవించు కుంటే, యితరులు మనల్ని గౌరవిస్తారు.

మనిషికి మంచి స్నేహితులు పుస్తకాలు. మంచి పుస్తకాలు మనిషి ఒంటరితనాన్ని దూరం చేస్తాయి.

ఆశ అనేది లేకపోతే మనిషి జీవించడం కష్టం. మనిషి ఆశాజీవి.

చిన్న విషయాల గురించి మనస్సు పాడు చేసుకోకూడదు. చిన్న విషయాలు, నీ సంతోషాన్ని నీనుండి దూరం చేయకూడదు.

జీవితంలో మనకు దొరికిన దానితో మనం సంతోషపడాలి.

సంతోషం, పరిమళద్రవ్యం లాంటిది అది మనదగ్గర వుంటే అందరికీ తెలుస్తుంది.

సంతోషమే విజయం. ఇతరులకు సహాయంచేయడమే సంతోషం.

మంచి ఆలోచనలు, మంచి చేతలు, ఫలితం సంతోషం.

నీకు కావాలి అనుకున్నదంతా నీకు ఉన్నాయని, నీకు వద్దనుకున్న దంతా నీకు లేవని అనుకుంటే ఆనందం నీవద్దేవుంటుంది.

నోరు మంచిదయితే ఊరు మంచి దవుతుంది, ఫలితం సంతోషమే

ప్రావీణ్యాన్ని నిరూపించే ఒక్కపని, వెయ్యి మాటల కంటే విలువైనది

మన కష్టాలకు మూలకారణం మన చేతలే.

కోపంలో వున్న వ్యక్తి ముందు, మౌనంగా వుండటమే మంచిది.

నిగ్రహం కోల్పోతే, ధనం మనదగ్గర నిలవదు.

మనల్ని ఏది సంతోషపెడుతుందో, దాన్ని గురించి కృషిచేయాలి. మన అందరి లక్ష్యం సంతోషంగా వుండటమే. మనం, ఆనందంగావుంటేనే, ఆనందాన్ని యితరులకు పంచగలం.

మన సంతోషం మన ఆలోచనల పైనే ఆధారపడి వుంటుంది.

విజయం యొక్క రహస్యం, తెలుసుకోవాలన్న జిజ్ఞాసే, మనిషిని ముందుకు నడిపిస్తాది.

అసాధ్యాలకు కారణం అపనమ్మకము, నిరర్థక భయము, కృషి లోపము.

కష్టాలలో వున్నవారిని ఆదుకోవాలి అనే ఆలోచన మనలో రేకెత్తాలి. దానికి స్ఫూర్తి కావాలి.

యశస్సు సంపాదించిన వారి సిద్ధాంతాలకు, ప్రభావితులం కావాలి.

వ్యక్తిత్వ పరిపూర్ణ వికాసానికి యోగ, ధ్యానము అవసరం. శ్వాసపై ధ్యాసే ధ్యానము.

ఈ మెదడే ఒక జ్ఞాపకాల పాతర. కష్టం సుఖం, బాధ, సంతోషం అన్నీవుంటాయి అందులో.

వేసిన దారి వెంట వెళ్ళటం సులభమా పదిలమా? లేక మనం వేసుకున్న బాటలో వెళ్ళటం సులభమా పదిలమా? నిర్ణయించు కోవలసినది మనమే. ఏదారి ఎంచుకున్నా అవరోధాలు వుంటాయి. పడినా లేవాలి. ధైర్యం కూడ గట్టుకుని నడవాలి. ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగాలి. కష్టం, సుఖం అంటిపెట్టుకునే వుంటాయి. మనం ఎంచుకున్న బాటలో చేదుఅనుభవాలు వుంటే కృంగిపోకూడదు. తియ్యటి అనుభవాలు, విజయాలు, ఫలితాలు, పదిమందికి ఉపయోగపడాలి.

దేశభవిష్యత్తు, యువతపైనే ఆధారపడి వుంటుంది. కనుక యువత సన్మార్గంలో నడవాలి. మనలో నూతనభావాలు ఆవిర్భవించాలి. నూతనమార్గమును అవలంబించి, నూతన ఆదర్శాన్ని సమాజానికి అందించాలి.

సత్యధర్మాలను రక్షిస్తే, అవే మనల్ని, మన దేశాన్ని సంరక్షిస్తాయి.

మనస్సొక పిచ్చికోతి, చంచలమైనది కనుక మనం అంతరాత్మను నమ్మాలి, మనస్సునికాదు.

మనలోని శాంతిని అనుభవించాలంటే తగిన కృషిచేయాలి.

నీతినియమాలు లేని రాజకీయాలు, చాలా భయంకరం.

ప్రాచీన సాంప్రదాయాలు అభ్యున్నతికి సోపానాలు.

కష్టపడి పనిచేస్తే, మనలో జ్ఞానాగ్ని ఆవిర్భవిస్తుంది.

చెడును వదబోసి మంచిని సాధించాలి. మంచిచెడుల విచక్షణ, విశ్లేషణ చేసుకోవాలి.

స్నేహం, ప్రేమ, అధికారం దౌర్జన్యంగా పొందలేము. ఆదిశలో ప్రయత్నిస్తే అవి నిలవవు.

సత్ప్రవర్తన, ప్రేమ, మనిషిని యోగ్యుడ్నిచేస్తుంది.

ప్రవాహానికి మూలం చిటపట చినుకులే. విజయానికి మూలం చిన్న చిన్న ప్రయత్నాలే.

న్యాయాన్ని మించినది కరుణ (కనికరం). ఇతరులపై కనికరం చూపాలి.

ధైర్యమే బలము, అధైర్యమే మన బలహీనత.

దురదృష్టము మిత్రుల్ని శత్రువులుగా చేస్తుంది.

అసూయద్వేషాల్ని దరిచేరనీయవద్దు. అవి మనస్సును కుళ్ళిపోయేలా చేస్తాయి.

శారీరకంగానూ, మానసికంగానూ ఉల్లాసంగా వుండాలి. అందరితోనూ కలివిడిగా వుండాలి.

శుభప్రదమైన, శోభాయనీయమైన మన ఆశయాలే మనప్రగతికి సోపానాలు.

ఎక్కువ సమస్యలకు కారణం మనలో ఎక్కువ ఐడియాస్ (భావనలు, ఆలోచనలు, తలంపులు) లోపించడమే.

ఎక్కువ విను, ఎక్కువ నేర్చుకో, ఎక్కువ ఆలోచించు, ఎక్కువ అర్థంచేసుకో. అలా, విజయాన్ని స్వంతం చేసుకోవాలి.

సరైన సమయంలో అవకాశాలను అందుకోవాలి, సమస్యలను దూరంచేసుకోవాలి.

ఎక్కువగా దేనికి ప్రాధాన్యతనివ్వాలో, ధైర్యంగా నిర్ణయించుకోవాలి.

ముఖ్యమైన పనులను ఇపుడే చేయాలి. అవి అత్యవసరం కాకముందే ఆపనులను పూర్తి చేయాలి.

డబ్బును, సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలి.

ప్రేమించడానికి ఆదరించడానికి మంచి మనస్సు కావాలి.

సృష్టిలో అందరికంటే నిర్భయుడు ప్రేమికుడు.

గొప్ప ఆలోచనలు ఎప్పుడూ నిర్మలమయిన మనస్సునుండి వస్తాయి. (మనస్సు విప్పినపుడే)

గొప్పమనస్కులు, గొప్పగానే ఆలోచిస్తారు.

ప్రపంచానికి అత్యుత్తమమైంది యిచ్చి, సంతోషాన్ని స్వంతం చేసుకోవాలి.

మన ఆలోచనలు మంచిగావుంటే, మనం మంచిగా వుంటాము. అపుడే మన మంచితనానికీ గుర్తింపు వస్తుంది. మన ఆలోచనలు చెడుగావుంటే దురదృష్టం మనల్ని వెంటాడుతూనే వుంటుంది.

మన ఆలోచనలలో భయం వుంటే, భయగ్రస్తులుగా మిగిలిపోతాం.

ఆత్మనిగ్రహంవుంటే విజయం సాధించవచ్చు. మనస్సు కలవర పాటుతో వుంటే ఫలితం, అపజయం, అది మనవెంటే వుంటుంది.

క్రమశిక్షణ, ఫలితం ఆనందం. అపుడే సమయాన్ని సద్వినియోగం చేసుకోవచ్చు.

ఆనందదాయకమైన జ్ఞాపకాలు మిగలాలంటే తగిన కృషి చేయాలి.

ఆనందం కోసం కృషిచేస్తే ఆనందమే మిగులుతుంది.

ఆలోచనలకు అడ్డుకట్ట వేయకూడదు. ప్రగతిని దూరం చేసుకోకూడదు.

ఇతరుల అవసరాలను తెలుసుకోవాలన్న జిజ్ఞాసే నాయకత్వ లక్షణాలకు ప్రతీక.

స్థిర చిత్తము లేనివాడు జీవితంలో ఏ ప్రావీణ్యాన్నీ సాధించలేడు.

సిగ్గు, లజ్జ లేనివాడు, దుడుకుతనం కలవాడు, కథానాయకుడు కాలేడు.

ఆశించిన మార్పు సాధించలేక పోయినా, ప్రశాంతంగా వుండగలిగే వాడే తెలివైన వ్యక్తి.

సుఖశాంతులు తగినంత మనవద్ద వుంటే, సంతోషాన్ని ఇతరులకు పంచగలం.

దుష్టులకు దూరంగా ఉండాలి.వారి ద్వారా దు:ఖమే కాని సుఖము దొరకదు.

సామర్థ్యము కలవారు ప్రయత్నలోపం చేయరు. నిష్కపటమైన ప్రయత్నం, మంచి పద్ధతి.

చిన్న విషయాలకే ఎక్కువ బాధ పడకూడదు. జీవితంలో కష్టాలు వస్తాయి. వాటిని సక్రమంగా పరిష్కరించు కోవాలి.

అథారిటేరియన్ పేరెంట్స్ వలన పిల్లల్లో అసంతృప్తి పెరుగుతుంది. ఎవరి మాటా వినరు. తమ పై నియంత్రణ కోల్పోతారు, మరింత చెడిపోవచ్చు. కనుక పేరెంట్స్ జాగ్రత్త పడాలి.

మానసిక స్థిరత్వాన్ని పొందదానికి ఆత్మవిశ్వాసం కావాలి. అపుడే నిర్మాణాత్మకంగా ఏపనైనా చేయగలం.

నిరాశ, నిస్పృహలలో ఉన్నవారిని ఒక కంటితో కనిపెడుతూవుండాలి. వారి ద్వారా హాని జరగవచ్చు.

మూఢనమ్మకాలను బాగా నమ్మేవాళ్ళే మూర్ఖులు.

తమిళులకు అమావాస్య చాలా శుభదినం. మన తెలుగు వారికి చాలా అశుభదినం. ఏది మూఢ నమ్మకం ?

న్యూమరాలజీ పిచ్చి. ఇండియాలో 7, 9 సంఖ్యలు మంచివి. చైనా లో 8 సంఖ్య మంచిది. అమెరికాలో 13 సంఖ్య అంటే భయం. ఎవరి పిచ్చి వాళ్ళకు ఆనందం.

పరుగుపెట్టి పాలు త్రాగడం కంటే, నిలబడి నీళ్ళు త్రాగడం మంచిది

శత్రువులను గుర్తించేటపుడు కూడా జాగ్రత్త అవసరం.

హింస, ప్రజాపీడనము, నిరంకుశాధికారములకు మూలం చెడ్డ శాసనములు.

దీర్ఘాలోచన చేయగల మనస్సులోనే వుంటుంది, ఆనందం, స్థిరత్వం.

వికారమైన మనస్సుకల వ్యక్తి కంటే కురూపిమేలు.

నిదానస్తుడికి కోపం వస్తే జాగ్రత్తపడాలి. మూర్ఖుడికి కోపం వచ్చినా జాగ్రత్తపడాలి.

దుఃఖాలకు మూలం అప్పులే. అప్పుచేసి పప్పుకూడు తినకూడదు.

డబ్బు లేకున్నా, అవసరానికి మించి వున్నా, మనస్సుకు సౌఖ్యం కలిగించదు.

అందం, అవివేకం తోడుగావుంటాయి. అవివేకిని ఒక కంటితో కనిపెడుతూవుండాలి.

ధర్మగుణం మన యింటి నుండే ప్రారంభంకావాలి.

అన్ని మతస్తుల వారిలోవున్నది ఎర్రటిరక్తమే. అందరి దేవుడూ ఒక్కడే. పేర్లు మాత్రమేవేరు.

దైవభక్తి తర్వాత పరిశుభ్రత ముఖ్యం. (Cleanliness is next to Godliness)

పిరికిపందలు చాలాసార్లు చనిపోతారు. భయపడుతూ పదిసార్లు చనిపోకూడదు.

స్త్రీలోలుడు గుడ్డివాడు. వానికి మంచిచెడ్డల విచక్షణ వుండదు.

అప్పు – పెద్ద సాలెగూడు. దానిలో చిక్కుకుంటే బయటపడటం కష్టం.

అలస్యం, అవినీతిని ప్రోత్సహిస్తుంది. ఆలస్యం చేసేవారిని గుర్తించి, త్యజించాలి.

ఆశ మనకు మరింత శక్తినిస్తుంది. మనిషి ఆశాజీవి. అసంతృప్తి నిజమైన వ్యసనము, దుస్థితి. ఉన్నదానితోనే తృప్తి పడాలి. కానీ కృషిలోపం చేయకూడదు.

డబ్బుకు దాసోహం కావద్దు. జీవితంలో సర్వం డబ్బేకాదు.

సూక్తులను త్యజించ వద్దు. సూక్తులను జీర్ణించుకోవాలి.

బంగారు గుడ్లు పెట్టే బాతును చంపడం మూర్ఖత్వం.

ఈరోజు చేయగలపనిని, రేపటికి వాయిదా వేయవద్దు.

ఆశ మనిషిని బ్రతికిస్తుంది. మనిషి ఆశాజీవి.

ఆశావహ దృక్పథంతో జీవిస్తే ఆరోగ్యం బాగుంటుంది. నిరాశలో జీవించే వానికన్నా ఆశావహ దృక్పథంతో జీవించే వారే ఎక్కువ కాలం జీవిస్తారు. నిరాశ, నిస్పృహలలో వుండేవారిని జబ్బులు త్వరగా ఆశ్రయిస్తాయి. అవి తీవ్రతరమవుతాయి.

సరైన సమయంలో సరైన నిర్ణయం తీసుకోలేకపోతే, దొంగలు పడిన ఆరు నెలలకు కుక్క మొరిగినట్లుంటుంది. ఫలితం శూన్యం.

సమస్యలను ఆదిలోనే పరిష్కరించకపోతే, తొండముదిరి వూసరవిల్లిలా మారుతుంది. గోటితో పోయేదానికే గొడ్డలి అవసరమౌతుంది.

మనం చేసిన పొరబాట్లు, మనల్ని వెంటాడుతూనే వుంటాయి. చేసిన పాపానికి పరిష్కారం పశ్చాత్తాపమే.

డబ్బువుంటే కొండమీది కోతి దిగివస్తుంది. ఆ కోతి వలన మనకు జరిగేమేలు ఏమిటి?

కులం కన్నా గుణం ప్రధానం. మంచి గుణం, మంచి ఆదర్శం. ఫలితం మానవ సంబంధాల వృద్ధి.

మనం చేసే ప్రతి తప్పూ, ఒక గుణపాఠం నేర్చుకునే గొప్ప అవకాశం. ఆ తప్పులను తిరిగి చేయకూడదు. చేస్తే ఆతప్పులు అలవాటుగా మారతాయి.

మనకు ఏదైనా కష్టం కలిగితే, బాధపడటం మాని, అంతకంటే ఎక్కువ కష్టాలలో, బాధల్లో వున్న వారిపై జాలి పడాలి. అటువంటి కష్టాలు, మనకు రానందుకు సంతోష పడాలి. కష్టాలు, బాధలు వచ్చాయని, ఏడుస్తూ కూర్చుంటే మనకు ఒరిగేదేమీ వుండదు.

మానవసంబంధాలు, ఏకాగ్రత, జ్ఞాపకశక్తి మనలో పెరుగుతున్నాయని అనుకునే భావనలు పోజిటివ్ ఆలోచనలు.

మతిమరపు పెరుగుతుంది, టైములేదు, ఏకాగ్రత లోపిస్తుంది, అనుకునే భావనలు నెగెటివ్ ఆలోచనలు.

మానసికంగా ఆరోగ్యంగా వున్నావారు ఏఅంశాన్నైనా మరచిపోయారు అంటే అర్థం, ఆ అంశంపై వారికి ఆసక్తి లేదని.

మనమిచ్చే ప్రాధాన్యతను బట్టి మన మతిమరపు ఆధారపడుతుంది.

అపజయం, మరొక అవకాశం అని భావిస్తే, విజయం ఎంతో దూరం వుండదు.

జయానికి, పట్టుదలే మన పెట్టుబడి. విజయానికి, అపజయాలే పునాది.

జీవితంలో సమస్యలూ వుంటాయి వాటికి పరిష్కారాలూ వుంటాయి.

అభివృద్ధే ధ్యేయంగా, అనుకూల ఆలోచనలకే ప్రాధాన్యమిస్తే జయం మనదే.

జయం పొందాలంటే నిరాశ, నిస్పృహ, బద్ధకం వీటిని దూరంగా వుంచాలి

కృషి, పట్టుదల, పరిశ్రమ, లక్ష్యం వుంటే, అసాధ్యాలు సాధ్యాలు అవుతాయి.

మంచి పుస్తకాలు, పాత అనుభవాలు, సత్సాంగత్యం, విజయానికి ప్రేరణనిస్తాయి.

ఇతరులు మిమ్మల్ని అభిమానించాలన్నా, ఆదరించాలన్నా, ఆదర్శంగా తీసుకోవాలన్నా

ముందు మనం ఆ ఔన్నత్య సాధనకు కృషిచేయాలి. ఇష్టపడాలి, కష్టపడాలి. అపుడే తగిన ఫలితం లభిస్తుంది.

శరీర సామర్థ్యాన్ని కాపాడు కోవడానికి వ్యాయామం చాలా ముఖ్యం. అలాగే చురుకుదనానికి మూలం మనస్సుకు పదును పెట్టడం.

జీవనశైలి, ఆహారపు అలవాట్లు మన ఆరోగ్యాన్ని నిర్దేశిస్తాయి.

మన మీద మనకున్న నమ్మకం, మన భవిష్యత్తుకు బంగారుబాట వేస్తుంది.

మన మీద మనకు నమ్మకం లేకపోతే లోయల్లోకి పడిపోతాము. కనుక ఆత్మవిశ్వాసం అవసరం.

ఆట చూసి ఆనందించు. ఆటను పాడుచేయకు. పనితనం నైపుణ్యం లేని వ్యక్తికి తన పనిముట్లు సహకరించవు.

గూడులో వున్న పది పక్షుల కంటే చేతిలో వున్న ఒక్కటే మేలు. మనకు వున్నదానితో తృప్తిపడాలి.

నోరు తెరుచుకుని చూస్తూ కూర్చుంటే ఏమీ సాధించలేము.

చితికిన మనస్సు ఏ నిర్ణయాలూ తీసుకోలేదు.

గుంపులో వున్న వాళ్ళందరూ మన స్నేహితులు కారు.

మునిగి పోనున్న వ్యక్తి తనకు అందిన గడ్డిపోచ తోనైనా తనను కాపాడు కోవాలని ప్రయత్నిస్తాడు.

ప్రయత్న లోపం పశువుల పని. మనం పశువులం కాదు. మనిషికి ప్రయత్నలోపం పనికిరాదు.

మనం చేసింది తక్కువ, చేయవలసింది చాలావుంది. మనం సాధించినది సముద్రంలో కాకిరెట్ట మాత్రమే అని గుర్తించుకోవాలి.

'కృషితోనాస్తి దుర్భిఃక్షం'.

నీ వాక్చాతుర్యం విజయాన్ని వరించలేదు. నీలోని చైతన్యం విజయానికి నాంది (నీ విజయానికి కారణం నీ మాటలు కాదు. నీ చేతలు)

ప్రతిభా పాటవాల్ని పెంచుకోవాలంటే,ఎంచుకున్న లక్ష్యాలను మధ్యలోనే మార్చకూడదు.

మన బలాలు, బలహీనతలను బేరీజు వేసుకుంటే అవే మనల్ని ప్రభావితంచేస్తాయి.

మన బలహీనతలను సమర్థించుకుంటూ, ముందుకు సాగాలను కోవడం సరికాదు.

లక్ష్యాలను నిర్ణయించుకోవాలి. కానీ ఆలక్ష్యాలు సాధించగలవిగా వుండాలి.

కార్యాచరణ సరిగ్గా వుంటే ఫలితాలు సరిగ్గా వుంటాయి. మన కార్యాచరణ నిర్మాణాత్మకంగా వుండాలి.

జీవితంలో ఒడిదుడుకులు సహజమే. ఒడిదుడుకులలో కూడా శాంత స్వభావంతో కూడిన మనస్సు వుండాలి.

మార్పు సహజసిద్ధము. మార్పును అంగీకరించాలి. కృషి వలన వచ్చిన మార్పు, అందరికీ ఆనందదాయకం.

స్వయంకృతాపరాధాల వలన కలిగిన మార్పు బాధాకరమే.

శాంతస్వభావము కలవాడు, బలవంతుని కంటే మెరుగు.

పొరబాట్లు ఎవరు చేసినా మనస్సులో ఎక్కువ కాలం గుర్తుంచుకోకూడదు.

మన ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం, మనోనిబ్బరం మనల్ని ప్రభావితం చేస్తాయి.

మన సామర్థ్యాన్ని మనం తక్కువగా అంచనా వేసుకోకూడదు.

సామర్థ్యంలేని రంగంలోనే కాలంగడిపితే, మనది శ్లేష్మం మధ్య చిక్కిన ఈగ పరిస్థితే.

ఏ రంగంలో రాణిస్తామో, ఆరంగం ఎంచుకోవడం, ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోవడం, కృషి చేయడం అవసరం. లక్ష్యాలను నిర్ణయించుకుని, వాటి సాధనకు కృషిచేయడం అవసరం.

నీతినిజాయితీ, నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడివుంటే, ఆత్మగౌరవం పెరుగుతుంది.

మనం చేసిన పనులకు, మనదే జవాబుదారీ, మనదే బాధ్యత, మరొకరిని తప్పుపట్టడం భావ్యంకాదు.

సోమరికి క్షణం తీరికావుండదు, ఒక్క రూపాయి ఆదాయం వుండదు. మరి విజయం ఎలా సాధ్యమవుతుంది. మనిషికి ప్రథమ శత్రువు సోమరితనం. సోమరితనం, అధిక నిద్ర, మనిషికి నిజమైన శత్రువులు.

పని చేయడం పురుషలక్షణం. ఉద్యోగం చేయడానికి స్త్రీ పురుషుల భేదంలేదు.

ఏ సమస్యనైనా పూర్తిగా పరిశీలించి, తరువాత సరైన నిర్ణయం తీసుకోవాలి.

మంచి ఆలోచనలు చేయాలంటే, దానికి సమయం కేటాయించాలి. అంకితభావం కావాలి. ఆలోచనాసరళి సవ్యంగా వుండాలి.

సామర్థ్యం, తెలివితేటలు, సాధించాలన్న తపన, విజ్ఞానం, మనలో మంచి ఆలోచనలను పుట్టిస్తుంది.

మంచి ఆలోచనలు క్రియాశీలకంగా వుండాలి.

ఆత్మకు విజ్ఞానం, దేహానికి ఆరోగ్యం అవసరం. ఆ దిశగా మన దినచర్యలను రూపుదిద్దుకోవాలి.

విద్య, జ్ఞానం (Knowledge), విజ్ఞానం వినయాన్నిస్తాయి.

సలహాలనైనా అడిగితే కాని యివ్వవద్దు.

మనకి మనం సహాయం చేసుకుంటే, దేవుడు కూడా మనకు సహాయం చేస్తాడు.

భగవంతుడు ఈ ప్రపంచాన్ని సృష్టించాడు, మనం మన నగరాన్ని అందంగా సృష్టించాలి.

భగవంతుని దయ మనకు నిమ్మదిగా రావచ్చు. కానీ తప్పక వస్తుంది.

ఆపదలో వున్న వానిని ఆదుకోవాలి.

దురాశ దుఃఖానికి చేటు. అత్యాశ వుంటే ఎవరు తీసుకున్న గోతిలో వారే పడాతారు.

నేరస్మృతి ఎపుడూ సందేహాస్పదమైనదే.

ఆరోగ్యమే మహాభాగ్యం.

ఉన్నదానిలో సంతోషించడం మేలు.

పెద్ద మనస్కుల దయ పెద్దగానే వుంటుంది.

నిదానమే ప్రదానము.

ఉత్తమంగా మనవంతు కృషి చేయాలి ఫలితం బాగా లేకపోతే కృంగిపోకూడదు.

తక్కువ కోరికలున్నవాడే ఎక్కువ ధనవంతుడు.

తనను గురించి తాను తెలుసుకున్న వాడే నిజమైన తెలివైనవాడు.

గర్విష్ఠి, తనే గొప్ప అని భ్రమించేవాడు, ఏదో ఒక రోజున మట్టికరుస్తాడు.

సంతోషంగా వుండాలంటే కష్టాలలో కూడా ఓర్పుగావుండాలి.

చావు కంటే ఆకలి చాలా చెడ్డది.

పరుగు పెట్టి పాలు త్రాగడం కంటే, నిలబడి నీరు త్రాగడం మేలు.

అప్పు చేసి పప్పు కూడు తినకూడదు. దుఃఖానికి మూలం అప్పు.

దేశాన్ని ప్రేమించు, దేశం అంటే మనుషులు, దేశం అంటే మట్టికాదు.

జీవితంలో వస్తున్న మార్పులను స్పష్టంగా గుర్తించి తదనుగుణంగా మారాలి.

**జీవితంలో ఏదీ శాశ్వతం కాదు 'మార్పు' మాత్రమే శాశ్వతం.**

సమస్యలు వచ్చినపుడు, చేయవలసింది ఏమిటి? అని ఆలోచించగలిగితే ఎప్పటికైనా పరిష్కారం లభిస్తుంది.

సంయమనం పాటిస్తే సమస్యలుండవు.

న్యాయాన్ని నిర్దేశించిన వాళ్ళే న్యాయాన్ని వ్యతిరేకించ కూడదు.

ఇతరులు చేసిన అవివేకమైన పనులను పరిశీలించి మన వివేకాన్ని పెంచుకోవాలి.

జీవితం ఒక పోరాటం, జీవితం రాచబాట కాదు.

జ్ఞానం సంపాదించటానికి బ్రతకాలి - బ్రతకడానికి జ్ఞానం సంపాదించాలి.

ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. తొందరపాటు మంచిది కాదు.

గతించిన కాలం తిరిగిరాదు (గతం తిరిగిరాదు).

ప్రేమ, వ్యాపారం, జీవితం నీ వాగ్ధాటిని అభివృద్ధి చేస్తాయి. అవసరం అటువంటిది.

అలంకరించుకోడం (ఫేషన్) కూడా ఒకరకమైన కురూపితనమే.

ఫేషన్ మితిమీరితే, అది నిజమైన కురూపితనమే.

మూర్ఖులు ఇళ్ళు కడతారు, తెలివైనవారు వాటిని కొంటారు.

మూర్ఖులు కలలుగంటూ వుంటారు. విజ్ఞత కలవారు కార్యోన్ముఖులుగా వుంటారు.

మూర్ఖులు ముఖఃస్తుతి చేస్తారు. మంచివారు మంచి చెడులను విశ్లేషిస్తారు.

కాలాన్ని వృథా చేయడంకంటే, కష్టపడి పనిచేయడం మంచిది.

ప్రతి వ్యక్తికీ అదృష్టం ఒక్కసారైనా తలుపుతడుతుంది. అపుడు దాన్ని సరిగ్గా వినియోగించుకోవాలి.

స్వాతంత్ర్యం మనిషి ఆకలిని తీర్చదు. కానీ స్వాతంత్ర్యం అన్నిటికంటే మిన్న

వచ్చిన అవకాశాల్ని వృధాచేసుకోకూడదు.

అదృష్టవంతుల్ని ఎవరూ పాడుచేయలేరు. దురదృష్టవంతుల్ని ఎవరూ బాగుచేయలేరు.

కష్టపడకుండా ఏదీ సులువుగా అందుబాటులోకి రాదు.

త్రాగుబోతు, పిచ్చోడు సత్యాన్ని మాట్లాడుతారు.

అతిమేధావికి పిచ్చివానికి దగ్గర పోలికలు వుంటాయి.

మంచివాని మంచితనం దృఢమైనది, చలించదు.

దేనిలోనైనా సరే అతిగా వుంటే చెడుకు దారి తీస్తుంది (ఫలితం చెడు మాత్రమే).

దురదృష్టము వలన పుడుతుంది కీడు.

పచ్చకామెర్ల రోగికి అన్నీ పచ్చగానే కనిపిస్తాయి. చెడ్డవాళ్ళకు అంతా చెడుగానే కనిపిస్తాయి.

ప్రేమలో, యుద్ధంలో, తప్పక న్యాయంగా వుండాలి.

తప్పులు చేయని మనిషిలేడు, చేసిన తప్పులను, సరిదిద్దుకోని మనిషి మనిషే కాదు.

ప్రతీ గాడిదా తన స్వరాన్ని గొప్ప అనుకొంటుంది. ప్రతీ మనిషి తను చేసిన పనులే గొప్పఅనుకొంటాడు.

తిండిని అదుపులో వుంచితే, డాక్టరును దూరంగా వుంచవచ్చు.

మన గొప్పదనం, అందం, వ్యక్తిత్వం, మనం చేసే గొప్పపనులను బట్టే వుంటుంది.

నీరు, నిప్పు, డబ్బు పరిమితి వున్నంత వరకు, మానవునికి మేలు చేస్తాయి. మితిమీరితే నాశనం చేస్తాయి.

మన అవివేకస్థితి - అతి పెద్ద వ్యాధి. ఆవ్యాధిని దూరం చేసుకోవాలి.

మన మనోభావాలన్నీ, మన ముఖంలోనే కనబడతాయి.

మన నమ్మకమే మనకు అద్భుతాల్ని చూపుతుంది.

హిస్టరీ మళ్ళీ మళ్ళీ తిరగబడుతుంది.

గర్వము కంటే వినయం, విధేయతలు, మనకు లాభం చేకూర్చుతాయి.

లంచగొండితనం ఒక వ్యాధి, లంచం కోసం నిర్ణయాలను ఆలస్యం చేసేవాడు చీడపురుగు.

ప్రేమలేని జీవితం నరకం.

అన్ని దుర్మార్గాలకు మూలం, సోమరితనం.

గ్రుడ్డివాడు మరొక గ్రుడ్డివానికి దారిచూపితే యిద్దరూ గోతిలో పడతారు.

మూర్ఖుడు మరొక మూర్ఖుడి నుండి సలహాలు తీసుకుంటే ఇద్దరూ మునిగి పోవడం ఖాయం.

కోరికలే గుఱ్ఱాలైతే కొంపలు మునిగి పోతాయి.

ప్రవాహానికి ఎదురు ఈదరాదు.

గర్వం, కృతఘ్నత తోడుదొంగలు.

చెడు మనస్సుకు, సంతోషం ఎపుడూ దూరమే.

ఎంతకాలం బ్రతుకుతున్నాం అన్నది ముఖ్యంగాదు, ఎంత చక్కగా బ్రతుకుతున్నాం అన్నది ముఖ్యం.

యువతరం కోరికలు గుర్రాలు, వాటికి కళ్ళెం అవసరం.

లక్ష్యం ఏదైనా, క్రమశిక్షణ ముఖ్యం. క్రమశిక్షణ లేని వ్యక్తి జీవితంలో ఏదీ సాధించలేడు.

యువత తమ కలల్ని సాకారం చేసుకునేందుకు అహర్నిశాలూ శ్రమించాలి.

సలహాలు సందేశాలూ యివ్వడం సులువు, వాటిని స్వయానికి అన్వయించుకోవాలి, పాటించాలి.

ఇతరులలో చూడాలను కుంటున్న మార్పు, ముందు మనలోరావాలి.

కలకు, సానుకూల ధోరణి తోడైతే అద్భుత ఫలితాలు సొంతమవుతాయి.

యువత చైతన్యవంతం కావాలి. పలువిషయాల వెనుక పరుగుపెట్టే మనస్సును నియంత్రించాలి.

ఇతరులకు సహాయం చేయడంలోనే వుంది నిజమైన ఆనందం.

యువతలో ఏకాగ్రత లోపిస్తే. కల్లోలాలను సృష్టిస్తుంది.

మనిషి ఎలా చచ్చాడన్నది ముఖ్యంకాదు ఎలా బ్రతికాడన్నది ముఖ్యం.

చెడిపోయిన మానవ సంబంధాల గురించి విచారించి ప్రయోజనం లేదు. ముందే జాగ్రత్తపడాలి.

ఏపనైనా చక్కగా చేయాలంటే, స్వయంగా మనమే చేసి చూపించాలి.

పేదరికం సోమరితనం నుండే పుడుతుంది.

వ్యక్తి తెలివైనవాడైతే, తన జ్ఞానమే అతనికి బహుమతి అందిస్తుంది.

బాధలనుండి దూరమవ్వాలను కొంటే సుఖాలే కావాలనే కోరికను, దూరంగా వుంచాలి.

వివేకమే మహదానందం. అవివేకి క్షమార్హుడుకాడు.

తిన్నయింటి వాసాలు లెక్కపెట్టకూడదు. కృతఘ్నత మహాపాపం.

మూర్ఖుడు తనయింటిని, తానే తగలపెడతాడు. తను కూర్చున్న కొమ్మను తానే నరుకుతాడు.

నేరస్తుడిని శిక్షించడం కంటే క్షమాభిక్షపెట్టడం మేలు.

బెల్లం వున్న చోటే చీమలు చేరతాయి.

చిరునవ్వు విలువ కంచిపట్టు చీరకంటే ఎక్కువే.

విమర్శించవలసివస్తే ప్రేమతో, చిరునవ్వుతో విమర్శించు.

వాదించుకోవడం కంటే, రాజీపడితేనే, ఫలితాలు మెండు.

అలసట, ఆయాసం, ఒంటరితనం వలన చాలా భయాలు పుడతాయి

ధనముంటే, మంచి గృహాన్ని కట్టవచ్చు, గృహస్థుల చిరునవ్వులు మాత్రమే గృహాన్ని స్వర్గం చేస్తాయి.

ఏపనిచేసినా అది మనకు ఆనందానిచ్చేదానిలా వుండాలి.

మన సంతోషం కొరకు మనం పనిచేయాలి. ఆ సంతోషం యితరులకు పంచాలి.

సరదాల్లేని జీవితాలు నిరర్థకం.

ఆశలను నెరవేర్చుకోవచ్చు దురాశలను నెరవేర్చుకోలేము. దురాశ, దుఃఖాన్ని మిగులుస్తుంది.

ఫలితాలను ముందుగా తెలసుకోవాలని అనుకుంటే, ఒక్కొక్కసారి నిరాశ నిస్పృహాలు కలుగవచ్చు.

పుష్పాల్లా మనిషి సువాసనలు వెదజల్లాలి. మంచి ప్రవర్తన వలనే అది సాధ్యం.

మనిషి సూర్యుడిలా ప్రకాశించాలి. తన అంతర్గత శక్తిని బాహ్య ప్రపంచానికి తెలపాలి

ముఖస్తుతి, కృత్రిమమైనది నిజమైన ఆనందాన్నీయదు.

తెలివైనవాడు ఎక్కువ ఆశిస్తాడు. దానికి తగిన కృషి చేస్తాడు.

సరైన దారి ఎన్నుకోకపోతే అన్ని కష్టాలనూ ఎదుర్కోవలసిందే.

ధైర్యవంతుడు ఒక్కసారే చస్తాడు పిరికివాళ్ళు చాలాసార్లు చస్తారు.

మనస్సు స్వర్గాన్ని నరకం చేయకలదు, నరకాన్ని స్వర్గం చేయకలదు, అది మన దృక్పథాన్ని బట్టి ఆధారపడుతుంది.

నీ మనస్సు మంచిదైతే మానసికరుగ్మతలు దూరంగా వుంటాయి.

మానసిక ఆరోగ్యంపై అవగాహన అవసరం.

డబ్బు సంపాదించాలి కాని వ్యక్తిగత విలువల్ని పతనం చేసుకోకూడదు.

బ్రతకడానికి తిను, తినడానికి మాత్రమే బ్రతకవద్దు.

ఖాళీ కుండలు మ్రోత ఎక్కువ చేస్తాయి.

ప్రతివ్యక్తీ అతని అదృష్టానికితనే సూత్రధారి, తనే శిల్పి.

ప్రతి నాణానికి బొమ్మ బొరుసు వున్నట్లే ప్రతి విషయానికి మంచి, చెడులు వుంటాయి.

ప్రతి వ్యక్తీ, మరొక వ్యక్తికి అక్షరాస్యత చేకూర్చాలి.

కష్టించకుండా, సులభంగావచ్చింది సులభంగానే పోతుంది.

Education is for those who don't die

పొరబాటు అస్థిరమైనది. నిజం స్థిరమైనది (చావులేనిది).

ప్రతి వ్యక్తీ తనవృత్తిని పొగుడుకుంటాడు. ఏపనీ చెడ్డదికాదు.

ప్రతి మార్పు దుఃఖాలను లేక సుఖాలను తెస్తుంది.

ప్రతి వ్యక్తికీ తనదంటూ ఒక రోజు వుంటుంది. దాన్ని అశ్రద్ధ చేయకూడదు.

ప్రతి వ్యక్తీ తన జీవాత్మకు ఒక నాయకుడు. మన జీవాత్మకు మన కళ్ళు కిటికీలు.

అనుభవం – అతి మంచి ఉపాధ్యాయుడు.

శృతిమించిన ఆనందం వెనుక దుఃఖం దాగివుంటుంది.

మూఢనమ్మకాలకు బై బై చెప్పాలి.

నవ్వలేనివారికి మీ నవ్వుని అరువివ్వండి మీరు నవ్వుతూ మాట్లాడితే, వారూ నవ్వుతారు.

శారీరక, మానసిక ఆరోగ్యం మెరుగు కావాలంటే ఒంటరి తనాన్ని దూరం చేసుకోవాలి.

Extroverts - (బహిర్ముఖులు) పరిచయాలు బాగా పెంచుకుంటారు. అనవసర ప్రసంగాలు చేస్తారు.

Introverts – (అంతర్ముఖులు) పదిమందిలో పరిచయాలు పెంచుకోరు, వీరు తెలివైనవారు.

చదువు, జ్ఞానం, అజ్ఞానం నుండి విజ్ఞానం వైపుకు తీసుకువెడతాయి.

నమ్మకం, ఆసక్తీ మనిషి ఆధ్యాత్మిక చింతనను పెంచుతాయి.

మన లక్ష్యం దిశలో ఏకాగ్రత వుండాలి. లక్ష్యం డాక్టరు కావాలని, ఏకాగ్రత గాసిప్, క్రికెట్టు, సినిమాలు చూడటం. ఫలితంగా మన లక్ష్యం నెరవేరదు. ?

చెడుఅలవాట్లు ఫలితం అగచాట్లు.

అర్థంలేని ఆలోచనలు వాదనలు మన బలహీనతలను కప్పిపుచ్చుకోడానికే.

నిన్ను నువ్వు వ్యర్థమైన సమర్థనలతో మోసగించు కుంటూ వుంటే, బయటివారు (ఎంతటి మేధావులైనా) నిన్ను ఉద్ధరించలేరు.

వ్యసనాలను మీరు వదలాలనుకున్నా అవి మిమ్మల్ని వదలవు. కనుక వ్యసనాలకు ఆదిలోనే అడ్డుకట్ట వేయాలి.

టైమ్ మేనేజ్‌మెంటు తెలియనివారికి, చావడానికి కూడా టైమ్ దొరకదు.

సిరిసంపదలకన్నా విలువైనది సమయం.సమయాన్ని సద్వినియోగం చేసుకోకపోతే అన్నీ

కష్టాలే.

Pessimist – ప్రతివ్యక్తి, ప్రతి వస్తువు కీడు కలిగించునని భావిస్తాడు, మంచిలో చెడు మాత్రమే చూస్తాడు.

Optimist – సర్వమూ మన మేలుకొరకే అని అనుకుంటాడు. – చెడులో కూడా మంచిని చూస్తాడు.

దొర్లుతున్న రాయిని నాచు అడ్డుకోలేదు.

పాపాలుచేసే వ్యక్తి ఎప్పుడూ విజయం సాధించలేదు.

మానసిక దృఢత్వం మనిషి పరిణతకి ద్వారం

చిన్న చిన్న పొరబాట్లే మనిషి మనవత్వాన్ని, కృంగదీస్తాయి (మట్టి పాలు చేస్తాయి) (A tiny leak, sinks a ship).

తెలివైన శత్రువు, మూర్ఖుడైన స్నేహితుడి కంటే మెరుగు.

తెలివైనవాడు అన్నీ తెలుసుకోవాలనుకుంటాడు.

చెడు స్నేహితుడు గోముఖ వ్యాఘ్రము లాంటివాడు.

తెలివిగలవానికి ఒక మాట చెబితే చాలు.

పై పై తళుకులు, మెరుపులు చూసి మోసపోకూడదు.

కష్టాల తరువాత సుఖాలు వస్తాయి.

నిజాయితీ, భగవంతుని యొక్క గొప్ప సృష్టి

సోమరి మనస్సు, దయ్యాల కొంప.

సిద్ధాంతాలు ఎన్ని నేర్చుకున్నా నేర్చుకున్నది సాధన చేయడం అవసరం. అమలు (impliment) చేయడం ముఖ్యం.

కనబడేదంతా నిజంకాదు. మెరిసేదంతా బంగారం కాదు.

లక్ష్యం నాణ్యత పైనే వుండాలి.

మన జీవితవిధానం నాణ్యతా యుతంగా వుండాలి. (Quality shall be a way of life.)

జీవితం చాలా మూల్యమైనది, విలువైనది.

నదులన్నీ సముద్రం వైపే వెళతాయి. మన ప్రార్థనలన్నీ భగవంతునివైపే వెళతాయి.

ప్రపంచం ఒక నాటకశాల జీవితం ఒక నాటకం.

ఉత్తర్వు కంటే ఉదాహరణ మేలు.

మంత్రాలకు చింతకాయలు రాలవు. శాపనార్థాలకు మన సమస్యలు పరిష్కారం కావు.

దాగి వున్న మన సామర్థ్యాలు, మనకు పేరుప్రఖ్యాతులు తెచ్చిపెట్టవు.

మన ఆర్థిక స్థితిని బట్టి, మన ఖర్చును నియంత్రించాలి.

తృప్తే, మనిషికి ఆనందాన్నిస్తుంది.

దూరపుకొండలు నునుపుగా కనబడతాయి. భ్రమలో పడకూడదు.

ఎవరూ చావునుండి తప్పించుకోలేరు. కనుక చావుకు భయపడకూడదు.

డైమండే, డైమండును కొయ్యగలదు.

నిప్పు లేకుండా పొగరాదు. నిజాలు నిప్పులా వుంటాయి.

అత్యాశ వుండరాదు. ప్రాకడం నేర్చుకోకుండానే నడవలేము.

కోపం పిచ్చితనానికి దారితీస్తుంది.

చెడులక్షణాలు, అన్ని దుర్మార్గాలకు మూలం.

కష్టే ఫలీ. కష్టపడేవాళ్ళ వద్దే ధనం నిలుస్తుంది. సోమరి పోతుల వద్ద ధనం నిల్వదు.

కోపం జీవనజ్యోతినే ఆర్పేస్తుంది.

మంచి భార్య-భర్తను మంచిగా రూపుదిద్దుతుంది. అలాగే మంచి భర్త కూడా.

మూర్ఖుడు యిచ్చే తీర్పు, మూర్ఖం గానే వుంటుంది.

స్త్రీ తన భర్తలోని, అన్ని తప్పులనూ క్షమిస్తుంది కాని, అతనిలోని నీచత్వాన్ని, నీచమైన ఆలోచనలను క్షమించలేదు.

తనకువున్నదానితో సంతృప్తి పొందేవాడే అసలైన ధనవంతుడు. కానీ బద్ధకస్తుడు ధనవంతుడు కాలేడు.

స్త్రీ మనసు, శీతాకాలపుగాలిలా త్వరగా మారిపోతుంది.

యవ్వనంలో క్రమశిక్షణ, మధ్య వయస్సులో ప్రేమ, సహవాసము, వృద్ధాప్యంలో

శిశువులా భర్తను పోషించేదే, నిజమైన భార్య.

ఆకలితో వున్న వాడిలో కోపం వుంటుంది.

మొరిగే కుక్క కరవదు. మొరగని కుక్కని, అలలు లేని నదిలోని నీరును చూసి భయపడాలి.

ఒకే గూటికి చెందిన పక్షులన్నీ ఒకే చోటికి చేరతాయి.

మితంగా మాట్లాడితే, చమత్కారం రుచిస్తుంది.

నిచ్చెన ఎక్కాలంటే క్రింది మెట్టు నుండే ప్రారంభించాలి.

ఆరంభశూరత్వం విజయానికి నాంది కాదు.

మన నమ్మకమే మనల్ని ధైర్యంగా విజయం వైపుకు నడుపుతుంది.

అపజయాలన్నీ అవకాశాలుగా తలచి, వాటి నుండి పాఠాలు నేర్చుకోవాలి.

కాయకష్టం చేయడానికి భయపడకూడదు. అదే మన వ్యక్తిత్వాన్ని రూపుదిద్దుతుంది.

ప్రతి ఓటమి – అభివృద్ధికి సోపానమార్గమే.

విజయం, లక్ష్యసాధనలకోసం ఏకాగ్రత, పట్టుదల అవసరం.

విజయం మాటలతో సాధ్యం కాదు. చేతలు ప్రధానం.

ఆపదలో ఆదుకున్న వాడే నిజమైన స్నేహితుడు.

మూర్ఖుని వద్ద ధనం నిల్వ వుండదు.

శుభప్రదమైన ఆరంభం. విజయానికిదారి.

మంచి ఉదాహరణ – మంచి ధర్మోపన్యాసముతో సమానం.

అందమైన ముఖానికి రంగులు పూయవలసిన పనిలేదు.

మన నోరు మంచిదైతే, ఊరు మంచిదవుతుంది.

పదునైన వాక్కు శక్తివంతమైన తూటా.

చెడు మనోభావాలే అసలైన నేరస్థులు.

ఇంట్లో మన నవ్వులే కాంతి రేఖలు.

బాగా ఆకలి, బాగా అవసరం వున్నప్పుడు – బాగా పోరాడుతాం.

ఆకలి పొట్ట, మంచి ఆలోచనలను యివ్వదు.

సుదీర్ఘ ప్రయాణం మొదటి అడుగుతోనే ప్రారంభం అవుతాది.

విజయం మొదటిదశ, ప్రారంభం.

మిడిమిడి జ్ఞానం కష్టాలకు మూలం.

మనిషి గుర్తింపు అతని సాంగత్యాన్ని బట్టే వుంటుంది. విజయం పొందాలంటే విజయం పొందిన వారి నుండి ప్రేరణ పోందాలి.

ధైర్యవంతుడు శక్తివంతుడు. వృధాగా వాదన చేయదు, ఏ పనినైనా చేసిచూపిస్తాడు.

గుర్రాన్ని చెరువు దగ్గరకు తీసుకువెళ్ళగలం, కానీ నీరు త్రాగించలేం.

నమ్మకస్తుడైన వ్యక్తి, కపటములేని వ్యక్తి నిజమైన ధైర్యశాలి.

ఉత్సాహవంతుడు ఆనందమయుడు. ఎల్లప్పుడూ నవ్వుతూనే వుంటాడు. చెడ్డ మనస్సు గలవాడు కొద్దిసేపులోనే అలసిపోతాడు.

చిన్నచిన్న అవకాశాలను వదులు కోకూడదు. అవే గొప్ప సదవకాశానికి ప్రారంభం కావచ్చు.

నిన్ను మోసగించుకోడం నీకు చాలా తేలిక. కానీ దేని కోసం ? ఏమి ఉద్ధరించడానికి?

# మానవ సంబంధాలు పెంచుకోవడం

విద్యార్థులు, ఉద్యోగస్తులే కాదు అన్ని వృత్తుల్లో వున్న వారికీ మానవ సంబంధాలు మెరుగు పరచుకోవలసిన ఆవశ్యకతవుంది. అప్పుడే వారు అనుకున్న లక్ష్యాలను సాధిస్తారు. అనుకున్న స్థాయికి చేరకలుగుతారు. అన్నీ ఒంటరిగా చేయడం సాధ్యం కాదు. మన ప్రగతికి మన కృషి, పట్టుదలతోపాటు మన స్నేహితులు, హితులు, బంధువుల యొక్క సహకారం, అవసరముంటుంది. స్నేహం, సహకారం ప్రేమ అనేవి యిచ్చి పుచ్చుకునేవి. మనం ఇతరులకు వాటిని పంచితే అవి పెరిగి తిరిగి మన దగ్గరకు వస్తాయి. అందుకనే మంచి, మానవ సంబంధాలు, పెంచుకోవాలి. వాటికోసం మనం పాటించవలసిన కొన్ని సూచనలను ఇక్కడ పొందు పరచడం జరిగింది.

మనం స్నేహం చేద్దామనుకునే వారి కన్నా మనతో స్నేహం చేయాలనుకునే వారితోనే మంచి సంబంధాలు పెంచుకోవాలి. ఇవ్వడంలోనే ఆనందంవుంది, తీసుకోవడంలో కాదు, అని నమ్మేవారికి ఎక్కువ స్నేహితులుంటారు. మంచి మానవసంబంధాలు పెంచుకోవాలంటే అభిరుచి, ఆకర్షణ, అవసరం, వుండాలి. మీ బంధువులు, స్నేహితులు వారి వారి సామ్రాజ్యాన్ని అవకాశమున్నంత వరకు పెంచుకొవడానికి మీరు సహకరించాలి. ముఖ్యమైన స్నేహితులు, బంధువుల పుట్టిన రోజులు, పెళ్ళి రోజులకు మీ శుభాకాంక్షలు తప్పక తెలపాలి.

కష్టంలోవున్న వారికి సహాయం చేయాలి. కష్టంలో వున్నవారికి సానుభూతి తెలియజేయాలి. మంచిగా మసలుకోవడం కష్టమే, అయినాసరే మంచిగా వుండటంలోనే వుంది ఆనందం. దానిలోనే దాగివుంది మన ఔన్నత్యం.

సత్సంబంధాలు దీర్ఘకాలం వుండాలంటే ఎదుటివారిని బాగా అర్థం చేసుకోవాలి. ఎదుటివారి లోపాన్ని ఎత్తి చూపకూడదు. ఎవరి వ్యక్తిత్వం వారిది. మీ స్వార్థం కోసం వారిని ఇబ్బంది పెట్టవద్దు. ఇతరుల విషయాల్లో వారు కోరితే తప్ప జోక్యం చేసుకోవద్దు. వ్యంగ్యం మీ మాటల్లో ధ్వనించకూడదు. మీరు ఇతరులను చులకన చేస్తే, వారూ మిమ్మల్ని చులకన చేయడానికి పోటీపడతారు. మంచిమాటలు, మంచి ప్రవర్తన, ఫలితం మంచి సంబంధాలు. పనికిరాని మాటలతో ఇతరుల సమయాన్ని వృధా చేయకూడదు.

మనం పట్టుకున్న కుందేలుకు మూడేకాళ్ళు అని వాదించరాదు. నమ్మటానికి ఎవరూ మూర్ఖులు కారు. మనం తప్ప. సంబంధ-బాంధవ్యాలలో రిజిడ్‌గా వుండకూడదు. పట్టూ, విడుపూ వుండాలి. మీసలహాలు ఎంత మంచివైనా ఎదుటివారి మూడ్‌ను గమనించి

మాట్లాడాలి. అనవసరపు వాదనలతో మీరు గెలవవచ్చేమో కానీ, ఓడిన వారికి మీ పై మంచి అభిప్రాయం దూరమవుతుంది. మీవలన జరిగిన పొరపాట్లను అంగీకరించడంలోనే వుంది, మీ ఔన్నత్యం. మీ పొరబాటు ఎంత చిన్నదైనా 'సారీ' చెప్పడం మరువ కూడదు. పొరబాట్లు సహజమే. కానీ అవి పునరావృత్తం కాకూడదు. మీ పొరబాట్లు పునరావృత్త మవుతూవుంటే, అవి అలవాటుగా మారే ప్రమాదముంది.

విమర్శలు, వ్యంగ్యం - వీటిని దూరంగా వుంచితే, ఇతరులకు మీపై సదభిప్రాయం ఏర్పడుతుంది.

మంచిని పెంచాలంటే తగిన సహాయం ఇతరులకు చేరాలి.

హితులు, స్నేహితులు చెప్పిన, యిచ్చిన మంచి సలహాలకు విలువనివ్వాలి.

మీ అహంకారం, దుడుకు స్వభావం చూసి మీ సన్నిహితులు మీకు దూరంగా వుంటారు.

మీహితుల, హితాన్ని మీరుకోరాలి.

మానవ సంబంధాలను పెంచే మూడు మాటలు - థ్యాంక్స్, వెల్‌కం, సారీ.

అనవసరపు చర్చలు, విమర్శలతో మనకాలాన్ని వృధాచేయకుంటే, మన వ్యక్తిత్వానికి గుర్తింపు వస్తుంది.

మృదు సంభాషణ, మృదువుగా మసలుకోవడం వలన మనకు మంచి జరుగుతుంది.

ఇతరులకు మనపై దురభిప్రాయం వుండకూడదు అని అనుకుంటే, మన అభిప్రాయాలు సరిగ్గావుండాలి.

స్నేహితులు, బంధువులతో మంచి సంబంధాలను పెంచుకోవాలను కుంటే మనకు మంచి వ్యక్తిత్వం వుండాలి. ఇతరులపై ఒత్తిడి కల్గించకూడదు.

సరైన సమయంలో సరైన సలహా, సరైన సహాయం, అందిస్తే ఫలితం బాగావుంటుంది. ఎదుటి వారికే కాదు, మనకూ మంచి జరుగుతుంది.

అడగక పోయినా, అవసరమనుకుంటే సహాయం చేయాలి. సంబంధ, బాంధవ్యాలను పెంచుకోవాలంటే చాకచక్యంగా మసలుకోవాలి.

మనిషికి మనిషికి మధ్యవున్నదే మహత్తరమైన మానవసంబంధం.

ప్రగతికి మూలం... మానవ సంబంధాలు. వాటికి మూలం... మన మంచి వ్యక్తిత్వం. మనం ఇతరుల మంచి కోరితే, వారు మన మంచి కోరుతారు. మనవ సంబంధాలు -

మనిషి ప్రగతికి రాచబాట. స్నేహాన్ని, సత్సంబంధాలను పెంచుకోవడం వాటిని చిరకాలం వృద్ధి చేసుకోవడం, మన బాధ్యత.

ఇతరులను కలుసుకోవడానికి వారితో నవ్వుతూ మాట్లాడటానికి, వారితో సాన్నిహిత్యాన్ని పెంచుకునేందుకు ఆసక్తి చూపాలి. ఇతరులు పొరబాటున మీకు ఇబ్బంది కల్గిస్తే వారిని దూరం చేసుకోకూడదు. వారే ఒకరోజు మీ మంచితనాన్ని గుర్తించి మీకు మంచి సహాయం చేయవచ్చు.

మీకు వున్న మంచి అలవాట్లు, గుణాలపై ఇతరులకు ఆసక్తివుంటే వాటిని సగర్వంగా వారికి పంచాలి. మీకువున్న జ్ఞానాన్ని నైపుణ్యాన్ని ఇతరులకు పంచితే అవి వృద్ధి చెందుతాయి. కానీ తరిగిపోవు. మీలోని నెగెటివ్ థింకింగును సమర్థించుకోకండి. ఇతరులతో అనవసరంగా వాదించకండి.

మానవ సంబంధాలను పెంచుకోవాలంటే ప్రతి చిన్న విషయానికీ బాధపడకూడదు. ఎమోషనల్‌గా ఫీల్ అవ్వకూడదు. స్నేహితులు వేసే చిన్న జోక్స్‌కే కోపం తెచ్చుకోకూడదు. TAKE IT EASY (టేక్ ఇట్ ఈజీ) పాలసీని నమ్మిన వారు మానవ సంబంధాలను వృద్ధిచేసుకుంటారు. తరచుగా మన స్నేహాన్ని, బాంధవ్యాలను విశ్లేషించుకుని అవసరమైన మార్పులను చేసుకోవాలి.

ప్రశాంతంగా పాజిటివ్ దృక్పథంతో వుంటే స్నేహితులు వారి చెడును విడిచి మీదారికి వస్తారు. స్నేహం, సంబంధ బాంధవ్యాలు, పెరగాలంటే పోజిటివ్ యాటిట్యూడ్, ఉదారస్వభావం మనలో వుండాలి. BAD EMOTIONS (బ్యాడ్ ఎమోషన్స్) కలవారు కూడా మననుంచి కొంత నేర్చుకుని, వారూ, మారాలనుకుంటే వారికి సహకరించాలి.

మంచి సంబంధాలను పెంచుకోవాలంటే మనలో మంచి, స్నేహం, సత్‌భావన, అణకువ, అవసరం.

ఔదార్యం, స్నేహం, సత్ భావనలను పంచితే, అవి మరింత పెరిగి ఇతరుల నుండి తిరిగి మనకు చేరతాయి.

ఇతరులను మనం గౌరవిస్తే, ఆదరిస్తే వారూ మనల్ని అదే విధంగా చూస్తారు.

ఇతరుల గౌరవమర్యాదలకు మనం భంగం కల్గించకుండావుంటే, వారూ మనపట్ల గౌరవమర్యాదలు చూపుతారు.

గౌరవం, మర్యాద, స్నేహం, సత్సంబంధాలు అనేవి యిచ్చిపుచ్చుకునేవి.

తెలిసిన వ్యక్తి ఎదురవుతే ముందుగా మీరు నవ్వుతూ పలకరిస్తే, ఆస్నేహం, ఆ బాంధవ్యం పెరుగుతుంది.

పరస్పరం పలకరించుకోవడం, సహకరించుకోవడంలోనే వుంది ఆనందం, అత్మీయత.

ఇతరులు మీకు గౌరవ మర్యాదలు యివ్వాలని మీరు ఆశిస్తారు. అలాగే మీరూ వారికి గౌరవ మర్యాదలు ఇవ్వాలి. వారి గొప్పతనాన్ని గుర్తించాలి.

ఇతరుల మంచిని గుర్తించి, వారిని గౌరవించాలి. అభినందించాలి. తద్వారా ఆనందం, పొందాలి.

ఏదైనా మంచిని మనం కోరుకోవడంలో తప్పులేదనుకున్నపుడు, ఇవ్వడంలో కూడా తప్పులేదు. కృతజ్ఞత మిగులుతుంది.

ఏమాటలు మనల్ని నొప్పిస్తాయో, మనల్ని చిన్న బుచ్చుకునేలా చేస్తాయో, అటువంటి మాటలు మన నోటనుంచి రాకూడదు. ఇతరులను నొప్పించకూడదు.

ఎలాంటి ప్రవర్తన వలన మనం చిన్నబుచ్చుకుంటామో, అలాంటి ప్రవర్తన మనం ప్రవర్తించకూడదు.

మీకిష్టం లేకపోయిన పనిని చేయమని ఎవరైనా మిమ్మల్ని నిలదీస్తే మీరు బాధ పడతారు. అలాగే యితరులను, వారు మీ కింద పనిచేసే వారైనా సరే, వారికిష్టం లేనిపనిని చేయమని శాసించకూడదు.

మీ ఉన్నతాధికారి చెప్పిన పని చేయడం మీకిష్టం లేదు. అదే పనిని మీరు మీ క్రింది పనిచేసే వారికి చెప్పడం భావ్యంకాదు. మీరు చేసిన మంచి పనికి మీరు ఇతరుల నుండి అభినందనలు కోరుకుంటే (మనస్సులో) అటువంటి మంచి పనులు ఇతరులు చేస్తే వారిని అభినందించడానికి ముందువుండాలి.

ముందుగా మనల్ని మనం అభినందించుకునేస్థాయికి ఎదగాలి.

మంచి అనేది యిచ్చిపుచ్చుకునేది. కానీ కోపం అనేది, యిచ్చిపుచ్చుకునేది కాదు.

ఇతరులు మనపై కోపం ప్రదర్శిస్తే మనం బాధపడతాం. అలాగే ఎదుటి వారిని మనం కోపగించుకున్నపుడు వారూ బాధపడతారని గ్రహించాలి.

మన ఉన్నతాధికారులే కానీ, మన క్రింద పనిచేసే వారే కానీ ఎవరికి ఇవ్వవలసిన అటెన్షన్, ఇంపార్టెన్స్, గౌరవం వారికి ఇవ్వాలి. అలాగే స్నేహితులు, బంధువులు, ఎవరికి యివ్వలసిన

గౌరవమర్యాదలు వారికివ్వాలి.

వృత్తిలో పోటీ (కాంపిటీషను) మంచిదే. పోటీపడి పనిచేసి పైకిరావాలి. ఇతరుల గొంతులు కోసే స్థాయికి దిగజారకూడదు. వ్యాపారంలో, వృత్తిలో, ఎవరికి దక్కవలసిన వాటా వాళ్ళకు దక్కుతుంది. మనం వృద్ధిలోకి రావాలంటే, ఎక్కువ కృషి చేయాలి.

ఎవరైనా యితరులను దిగజార్చాలనే ప్రయత్నాలు చేస్తే, ఆ వూబిలో వారే పడతారు.

మీరు తీసుకునే నిర్ణయాలు ఇతరులను బాదించేవిగా వుండకూడదు, చైల్డిష్ (CHILDISH) గా వుండ కూడదు.

పీతలు, బుట్టలోంచి పైకి రావాలని ప్రయత్నిస్తుంటే, మరి కొన్ని, ఆపీతలను, కాళ్ళు పట్టుకుని క్రిందకు లాగుతాయి. అలాగ మనమూ జీవితంలో పైకి రావాలని ప్రయత్నించే వాళ్ళను దిగజార్చటం (లెగ్ పుల్లింగ్) చేయకూడదు.

మనకు మానసిక పరిపక్వత వుంటే, మానవ సంబంధాలు బాగుంటాయి.

మన ఆలోచనల్లో స్పష్టత వుంటే ఇతరులు మనల్ని గౌరవిస్తారు. మననుండి సలహాలు పొందాలనుకుంటారు.

ఇతరుల వలన మీకు జీవితంలో మంచిగాని, చెడుగానీ, ఏమి జరిగినా, దానికి బాధ్యులు మీరే. మీ వ్యక్తిత్వాని బట్టి యితరులు స్పందిస్తారు.

ఇతరులను మార్చాలను కునే ముందు, మీలో మార్పు కోసం ప్రయత్నించాలి. సమస్యలుంటే పరస్పర చర్చల ద్వారా సామరస్యంగా, సౌమ్యంగా, పరిష్కరించుకోవాలి. మన మూర్ఖపు ప్రవర్తనతో ఇతరులను ఇబ్బంది పెట్టకూడదు.

సత్సంబంధాలు పెంచుకోడానికి చదువు, సంస్కారం, నైపుణ్యమే కాదు, మాట్లాడే ప్రతిభ కూడా అవసరం.

ఇతరులను నవ్వుతూ పలకరిస్తే, వారూ, మీతో మంచిగా మట్లాడటానికి ఆసక్తి చూపుతారు.

ఇతరుల పేర్లను గుర్తుంచుకోవాలి. పేరుతో పలకరిస్తే, వారిని మీరు గుర్తించారని, సంతోషిస్తారు. సహకరిస్తారు, గౌరవం యిస్తారు.

ఇతరులతో స్నేహంగా, సహాయకారిగా వుండాలి. ఇతరులతో మాట్లాడేతీరు ప్రవర్తించే తీరు బాగుంటే, వారు మీపై ఎక్కువ ఆసక్తి, ఆప్యాయత చూపుతారు.

ఇతరులు చేసే మంచిని గుర్తించి వారిని అభినందిస్తే సద్భావన కలుగుతుంది.

మన మాటాల్లో ఎక్కువ విమర్శలేవుంటే, యితరులకు రుచించదు.

ఉదారస్వభావం, ఇతరుల మంచి కోరడం, వారిపట్ల ఆసక్తి చూపడం, మంచిది.

ఇతరులకు, సమాజానికి, సేవా గుణాన్ని కనబరుస్తే సత్సంబంధాలు మెరుగుపడతాయి.

మన ఆనందం మనకెంత ముఖ్యమో, ఇతరుల ఆనందం వారికీ, అంతముఖ్యం. అది గ్రహించి వారికి మనం చేయగల సహాయం చేయాలి. ఇతరులను తప్పు పట్టి విమర్శించే ముందు, మన తప్పులను గుర్తించి ఆత్మవిమర్శ చేసుకుని సవరించు కోవాలి.

జ్ఞానం, దర్మం, దయ, దానగుణం, శాంతం, సహనం వంటి గుణాలు మనవద్ద వుంటే ఇతరులు వాటిని గుర్తించి గౌరవిస్తారు.

చదువు సంస్కారంతో బాటు, మాట్లాడే ప్రతిభ కూడా వుంటే జీవితంలో మంచి గుర్తింపు వస్తుంది.

మనలో సద్గుణం, సద్భావన, సంస్కారం, వుంటే మన చదువుకు సార్థకత వుంటుంది, మనకు గుర్తింపు వుంటుంది.

మితభాషణ, మధురభాషణ, ఫలితం స్నేహం, సద్భావన అవే మనకు నిజమైన బలం.

అహంకారం సత్సంబంధాలను దూరంచేస్తుంది. సరళ స్వభావం సత్సంబంధాలు ముఖ్యం మనదికాని వస్తువు కోసం ప్రాకులాడటం మంచిదికాదు. మనది కాని వస్తువును అవసరానికి వాడుకోవడం కూడా మంచిదికాదు. ఎదుటి వారిలో ఏదైనా మంచిని మనం గుర్తిస్తే వెంటనే అప్పుగా తీసుకొని ఆచరణలో పెడితే మంచిది. అవిశ్వాసం, అనాదరణ, కాఠిన్యం, సంకుచిత స్వభావం, ద్వేషం మానవసంబంధాలను మలినం చేస్తాయి.

ఇతరులలో కూడా, అభినందించగల మంచి గుణాలు ఉంటాయి. వాటిని గుర్తించి ప్రేరణ పొందాలి. మంచి వక్త లక్షణాలు, సరైన ప్రిపరేషన్, ప్రాక్టీస్, చక్కటి ప్రెజంటేషన్. వాటితో ఇతరులను ఆకిర్షిస్తాడు. మంచి సంబంధాలను పెంచుకుంటాడు.

సహనం, మర్యాద, పరోపకార చింతన, ప్రశాంతత, మానవ సంబంధాలను మెరుగు పరుస్తాయి.

ప్రేమ, గౌరవం, సహకారం, ఇతరులకు అందిస్తే, అవే తిరిగి మనవద్దకు వస్తాయి.

ఎదిగిన పిల్లలతో తల్లిదండ్రులు పెత్తనం చేయడం సరికాదు. వారితో స్నేహం చేయాలి. ప్రేమగా నచ్చచెప్పాలి. అధికారికంగా కాదు అరమరికల్లేకుండా మాట్లాడాలి. పెద్దలు పిల్లలకు ఆదర్శంగా వుండాలి. వారి స్నేహాల్ని కట్టడిచేయకూడదు. పరిశీలించాలి. వారు

చెప్పిందే నిజం అనుకోకుండా పరిశీలించాలి. విశ్లేషించాలి. తగిన సలహాలనివ్వాలి.

తెలివితేటలు మాత్రమే విజ్ఞానం కాదు. అవి సంపూర్ణ వికాసాన్ని అందివ్వలేవు.

మన వేషభాషలే మన గురించి మాట్లాడతాయి. కనుక వాటి విషయంలో తగిన జాగ్రత్త తీసుకోవాలి.

ధైర్యవంతుల వద్దే ఉపకారస్వభావం వుంటుంది. ధైర్యవంతులు, మర్యాదస్తులు, ఇతరులను ఆకర్షిస్తారు.

త్యాగం, నిరాడంబరత, ఉదారతలు మానవ సంబంధాలను మెరుగుపరుస్తాయి.

మాటల్లో నెమ్మది, చూపుల్లో వాడి మేలు. మన అవసరాల కంటే, ఇతరుల అవసరాల విషయంలో మనం వివేకం చూపాలి.

**ఏమి మాట్లాడుతున్నాము? ఎవరి గురించి మాట్లాడుతున్నాము? ఎవరితో మాట్లాడుతున్నాము? అనేది జాగ్రత్తగా గమనించాలి.**

మనం ఇతరుల విపత్తులను, నిరాడంబరాన్ని, పేదరికాన్ని, వారి వేషభాషణలను చూచి, పరిహసించ కూడదు. మనకు హానిచేసినవారికి కూడా సహాయం చెయ్యాలి. మన ఉపకార స్వభావం, మర్యాదే మన ఆస్తి - ఏదో ఒక రోజు అది మనకు వుపయోగపడుతుంది.

రోమ్‌లో వున్నపుడు రోమన్‌లా వుండాలి. అలాగని జుగుప్సాకరంగా వస్త్రాలంకారణ చేసుకుంటే మంచిది కాదు.

తిన్న ఇంటి వాసాల్ని లెఖ్ఖ పట్టకూడదు. ఎవరి ఉప్పు తిన్నామో వారి పట్ల ఎల్లపుడూ కృతజ్ఞతాభావంతో వుండాలి.

ఆత్మహత్య చేసుకోవడంకంటే తన నిరాశను దూరంచేసుకున్నవాడే ధీరుడు.

ఇతరులను మంచి చేసుకోవాలంటే ముఖస్తుతి చేయనక్కరలేదు.

గతంలో చేసిన పొరబాట్లను, పునరావృత్తం కాకుండా చూసుకోవాలి. నిన్ను నీవు సరి దిద్దు కోడానికి ఇంకా సమయం మించి పోలేదని గ్రహించాలి.

అందరికీ సలహాలివ్వడం ఉచితంకాదు. సలహాలివ్వడం తేలిక ఆచరించడం కష్టం.

కవిని అర్థంచేసుకోవాలంటే మంచి మనస్సు కావాలి. కవిని, కవే అర్థం చేసుకుంటాడు.

నిజం మాట్లాడటానికి సమయం పడుతుంది, కానీ చెడువార్త వేగంగా వ్యాపిస్తుంది.

నీకు సలహా కావాలంటే విజ్ఞతగల వానిని సంప్రదించాలి.

బాధలు లేకుండా మనకు ఆనందము లభించదు.

కోరికలపై అదుపు సాధించాలి. ఏదేశమేగినా, ఏభాష పలికినా మన సంస్కారం మరిచి పోకూడదు.

మనం ఆత్మాన్వేషణ కోసం ఆలోచన చేయాలి. నీతి నియమాలను పాటించడమే నిజమైన పూజ మనల్ని కాపాడేది సత్యము, ధర్మము, స్నేహము.

సహాయం చేసిన వారికి కృతజ్ఞత తెలపాలి. ఆ సహాయాన్ని మరచిపోకూడదు

సత్యధర్మములను పాజిటివ్ దృక్పథంతో ఆచరించాలి. జీవితం గాలిబుడగ లాంటిది జీవితాన్ని తప్పుల మయం చేయకుడదు. సంబంధ, బాంధవ్యాలను పెంచుకోవాలి. మానవసేవే, మాధవసేవ అన్నారు.

# ప్రోయాక్టివ్ థింకింగు (Proactive thinking)

ఇది చాలా చురుకైన, శక్తివంతమైన ఆలోచనా సరళి. ఆలోచనా విధానం. ముందు జరగబోయే, సంశయాత్మకమైన పరిస్థితులను, కార్యక్రమాలను తీవ్రంగా ఆలోచించి, అనేక రీతులలో ఆలోచించి, తగిన నిర్ణయాలను తీసుకోడానికి ఈ విధానం ఉపయోగపడుతుంది. అపుడు భవిష్యత్తులో ఏపరిస్థితీ, ఒక సమాచారంగా, అయోమయ అవస్థగా వుండదు. ఎందుకుంటే ఆపరిస్థితిని ముందుగానే వూహించి, వాటి యొక్క మంచి చెడులను బేరీజు చేసుకోవడం, వాటిని, యితరులలో చర్చించడం, కొన్ని నిర్ణయాలు తీసుకోవడం ముందే జరుగుతుంది కనుక.

ఈవిధానంలో, 'ప్రస్తుతపనులు జరిగే సమయంలో, ఇవినరైన ఫలితాలను, యివ్వకపోతే, ఏమి చేయాలి?' అని ముందుగా ఆలోచించడం జరుగుతుంది.

సంస్థలో పనిచేసే వ్యక్తులు, సమర్థవంతంగా, ఒక విధానాన్ని విడిచి, మరొక విధానాన్ని అవలంబించడానికి ముందు ఆలోచనలు చేస్తారు.

ఏకారణంగానైనా, సంస్థ సరిగ్గా, లాభసాటిగా పనిచేయడం లేనప్పుడు, పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు, ఈ ప్రాయాక్టివ్ థింకింగ్ లాభసాటి అయిన విధానం.

ఈ విధానం లో ప్రతి ఆల్టర్నేటివ్ యొక్క బలాలను, బలహీనతలను (Strengths, Weaknesses) ముందుగా ఆలోచించడం జరుగుతుంది. మనకు రాబోయే కష్టాలు (threats), మనకున్న అవకాశాలు (Opportunities) గురించి ముందుగా ఆలోచించడం జరుగుతుంది.

భవిష్యత్తులో పరిస్థితులు ఏవిధంగా వుండవచ్చు? ఏమేమి జరగవచ్చు? అని ముందుగా ఆలోచించడం జరుగుతుంది. అవి నిజమైన పరిస్థితులుగా మారవచ్చు, మారకపోవచ్చు. మారితే వాటికి ముందుగానే ఒక చక్కటి పద్ధతిని రూపొందించుకొని వాటిని సక్రమంగా చేర్పులు కూర్పులు, చేయాలి. ప్రాముఖ్యతలలో మార్పులను, ముందు వెనుకగా అవసరాన్ని బట్టి మార్చుకోవడం చేసుకోవాలి. తగిన వనరులను సమీకరించుకోవాలి. తగిన వ్యూహరచన చేయాలి.

అవసరాన్నిబట్టి మరికొన్ని మంచి నిర్ణయాలు ముందుగానే తీసుకోవాలి. ఈ బాధ్యతలను సక్రమంగా నిర్వహించాలి. ఇలా మార్పు జరుగుతుందని ముందుగా, వూహించలేదు అని నిస్సహాయతను వ్యక్తం చేయకూడదు. జరగబోయే మార్పుల వలన తాము చేయవలసిన పనులను, ముందుగా వూహించాలి. అప్రమత్తత అవసరం. రాబోయే

మార్పును వూహించి, మరేవిధంగా, సమర్థవంతంగా ఈపనులను నిర్వహించాలి ? అనే ముందు ఆలోచన అవసరం. ఆ పనులు నిర్వహించడంలో విలువలను చేజార్చుకోకూడదు. కానీ డబ్బు, గౌరవం సంపాదించాలి.

ప్రొయాక్టివ్ థింకింగుకు, దూరదృష్టి (VISION) అవసరం. విజన్ అంటే సంస్థలో పనిచేసేవారందరు ఏ దారిలో పయనించాలి అని నిర్ణయించడం. దూరదృష్టితో తీసుకున్న నిర్ణయాలు, భవిష్యత్తులో చాలా వుపయోగపడతాయి. లాభసాటిగా వుంటాయి. ప్రోయాక్టివ్ థింకింగ్ చేసే వ్యక్తులు ఎప్పుడూ, ఓటమిని చూడరు. గెలుపు వైపే వీరి ధ్యాసంతా. స్వంతలాభమేకాక, సంస్థనుకూడా లాభసాటిగా నడుపుతారు. క్రొత్త విధానాలను రూపొందిస్తారు. క్రొత్త ప్లానులో ఉద్దేశ్యాలను (ఆబ్జెక్టివ్సను) నిర్దేశిస్తారు. వాటిని, సక్రమంగా పనిచేసి సాధించేలాచేస్తారు.

రియాక్టివ్ థింకింగు (REACTIVE THINKING) : ఈ ఆలోచనా విధానాన్ని, వ్యాపారం, స్థిరంగా చక్కగా సాగుతున్నపుడు వాడాలి. ఇది సరైన నిర్ణయాలు తీసుకోదానికి ఉపయోగ పడుతుంది. సంస్థలో జరుగుతున్న విధానాలాకు, ఫలితాలకు, సరైన సమయంలో స్పందించి తగిన నిర్ణయాలు తీసుకోడం జరుగుతుంది. తద్వారా అంచెలంచెలుగా మార్పులు (CHANGES), అభివృద్ధి (CONTINUOUS IMPROVEMENT) సాధ్యపడుతుంది. ఇక్కడ కైజెన్ మెథడ్. (KAIZEN METHOD) ఉపయోగ పడుతుంది. జపాన్ భాషలో, కైజన్ అంటే అంచెలంచెలుగా అభివృద్ధిని సాధించడం. ఏ పని/ఏ పద్ధతి/ఏ పరిస్థితి లోనైనా మార్పు, అభివృద్ధి లేకుండా, సంవత్సరాల తరబడి చేస్తూ పోతూ వుంటే, విసుగు, నిరుత్సాహము, నష్టము కలుగుతుంది. మన పోటీదారులు ముందుకు పోతారు. మనం వెనుక బడిపోతాం. పోటీదారులకు లాభాలు, మనకు నష్టాలు. ఎందుకంటే అంచెలంచెలుగా అభివృద్ధి కోసం మనం కష్ట పడటం లేదు. మార్పు, అభివృద్ధి లేని పని/పద్ధతి/పరిస్థితి, ప్రోసెస్‌ల వలన మనలో ఎదుగూబొదుగూ వుండదు. మనం అభివృద్ధి చెందాలంటే, మార్పు అవసరం. మార్పుకోసం మన మనస్సులో మంచి ఆలోచనలు రావాలి. ఉత్పాదకత, క్వాలిటీ, భద్రత మొదలైన అంశాలలో మార్పు, అవసరం. అభివృద్ధి కోసం, మంచి ఆలోచనలను ఆచరణలో పెట్టాలి. అభివృద్ధిని విశ్లేషించాలి ఫలితాలను విశ్లేషించాలి. మంచి ఫలితాలను పొందడానికి మార్పు, అభివృద్ధి దిశలలో మనం కృషి చేయాలి. ఈ పద్ధతినే కైజెన్ అంటారు.

ఈ దారిలో పయనించడానికి, చాలా రియాక్టివ్ థింకింగు అవసరం. ప్రస్తుతం జరుగుతున్న ప్రతిపనికీ మనం బాగా ఆలోచించి సానుకూలంగా స్పందించి, మంచి మార్పునుతేవాలి. మంచి ఫలితాలను పొందాలి. తద్వారా అనేక విధాలుగా లాభం

పొందవచ్చు. మానవ సంబంధాలు మెరుగు పరుచుకోవచ్చు. జ్ఞానం, విజ్ఞానం, వివేకం పొందవచ్చు. నిరాశ, నిస్పృహలకు దూరంగా వుంటూ, సుఖసంతోషాలను వెదుక్కోవచ్చు. ఆత్మ విశ్వాసాన్ని పెంచుకోవచ్చు. బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించవచ్చు. ఇలా రియాక్టివ్ థింకింగ్ చేయడం ద్వారా అంచెలంచెలుగా, నిరంతరం అభివృద్ధిని సాదించగలం. జరుగుతున్న ప్రతి చర్యపై చక్కగా స్పందించి, మార్పు, అభివృద్ధి సాధించాలి.

ప్రతి పనిని పలురకాలుగా చేయవచ్చు. ఏపనినైనా వివిధ రకాలుగా చేయదానికి అవకాశముంది. వాటిలో ఏపద్ధతి అనుసరిస్తే మంచిది? అని బాగా ఆలోచించాలి. ఆదిశలో మంచి పద్ధతిని ఆచరణలో పెట్టాలి. తగిన విధంగా మంచినిర్ణయాలు తీసుకోవాలి. పరిస్థితులు నిలకడగా అంటే పరిస్థితులలో స్థిరత్వం వుంటే, ఈరకమైన రియాక్టివ్ థింకింగు, అభివృద్ధి కోసం చేయవలసిన అవసరముంది.

కొన్ని పరిస్థితులు, ఎదిరించలేనివిగా, సాత్వికంగా, మంచిగానే వుంటాయి. కానీ సత్ఫలితాలను యివ్వవు. అటువంటి పరిస్థితులను, పద్ధతులను సరిగ్గా, సరైన సమయంలో, గుర్తించదానికి ఆలోచించే విధానాన్ని పాస్సివ్ థింకింగ్ అంటారు. ఈ ఆలోచనలు పరిస్థితులను సరిగ్గా గుర్తించదానికి మాత్రమే వుపయోగపడతాయి. కానీ నిర్ణయాలు తీసుకోదానికి కాదు. ఇవి కేవలం RESULTSను విశ్లేషించదానికి ఉపయోగపడతాయి. STRENGTHS – స్ట్రెంగ్త్స్, WEAKNESSES – వీక్‌నెసెస్, OPPORTUNITIES – ఆపర్ట్యునిటీస్, THREATS – థ్రెట్స్‌ను సరిగ్గా గుర్తించదానికి పాస్సివ్ థింకింగు వుపయోగ పడుతుంది.

ఈ పాస్సివ్ థింకింగు (ఆలోచనా) విధానం, డెటా మేపింగు (DATA MAPPING) కు బాగా వుపయోగపడుతుంది. DATA అంటే విషయములు, కార్యములు, సత్యాలు, నిర్ణయాలు, వివరాలు, వార్తలు. MAPPING (మేపింగు) అంటే సక్రమంగా అమర్చడం. DATA MAPPING (డాటా మేపింగు) అంటే సంబంధిత డాటాను సక్రమంగా, సులువుగా అర్థమయ్యే రీతిలో కాగితం పై అమర్చడం, వ్రాయడం. దీనికి పలురకాలైన పద్ధతులు వున్నాయి. ఇవి డాటాను విశ్లేషించదానికి నిజాలను విశదీకరించదానికి వుపయోగపడతాయి. తద్వారా లభించిన జ్ఞానం సరైన దారిని చూపుతుంది. వీటి కోసం Graphs, Bar charts, Pie charts, Control Charts వంటివాటిని వుపయోగిస్తారు. సమయాన్ని సద్వినియోగం చేసుకోదానికి, పరిస్థితులను సులువుగా అర్థంచేసుకోదానికి, మార్పులను అభివృద్ధి చేసుకోదానికి, సత్ఫలితాలను పొందదానికి పైవిధంగా ఆలోచించడం అవసరం.

రియాక్టివ్ థింకింగు ద్వారా సక్రమంగా పనిచేసే పద్ధతిని (సిస్టమ్‌ని) రూపొందించవచ్చు.

ఎక్కడైనా, ఎపుడైనా పని కుంటుపడితే, వాటి మూలకారణాలను కనుగొని, వాటిని సరిదిద్దడంద్వారా మంచి ఫలితాలను పొందవచ్చు. దీనినే ఇంగ్లీషులో (CAUSE AND EFFECT ANALYSIS) కాజ్ అండ్ ఎఫెక్ట్ ఎనాలిసిస్ అంటారు. దీన్ని ఇషికోవా ఫిష్ బోన్ డయాగ్రామ్ (ISHKOWVA FISH BONE DIA GRAM) రూపొందించడం ద్వారా సత్ ఫలితాలను పొందవచ్చు. మూలకారణాలలో కొన్నిటిని, తగిన మార్పులు చేయడం ద్వారా, పలితం బాగుండేలా కృషి చేయవచ్చు. వీటి గురించి మరొక సందర్భంలో వివరణ యిస్తాను ఈ పోటీ ప్రపంచంలో నిలదొక్కుకుని. నిర్మాణాత్మకంగా, సృజనాత్మకంగా లాభసాటిగా కృషిచేయాలంటే, మనం ప్రోయాక్టివ్ థింకింగు, రియాక్టివ్ థింకింగు, పాస్సివ్ థింకింగు, చేయవలసిన ఆవశ్యకత ఎంతైనావుంది. ఈ దిశలో మన ఆలోచనా విధానం వుంటే, భవిష్యత్తులో మన శక్తిసామర్థ్యాలకు, మంచి గుర్తింపు వస్తుంది.

ఔత్సాహిక ఉద్యోగస్థులకు, విద్యార్థులకు, ఈ విషయాల గురించి అవగాహన అవసరం. అవసరాలకు అనుగుణంగా, ముందుచూపుతో మన ఆలోచనాసరళిని రూపుదిద్దుకుంటూ వుంటే మంచి ఫలితాలను పొందవచ్చు. ఫలితాలను విశ్లేషించుకోవచ్చు. తగిన రీతిలో మార్పులు, చేర్పులు చేసుకొని, సరైన నిర్ణయాలు తీసుకుని, అభివృద్ధి పథంలో ముందుకు సాగిపోవచ్చు. సత్ఫలితాలను పొందవచ్చు సమస్యలను దూరంగా వుంచవచ్చు. ఈభావనతో ఈ విషయాలను యిక్కడ వుదహరించడం జరిగింది. వీటి గురించి మరిన్ని విషయాలు తెలుసుకోవాలని ప్రయత్నించడం. విద్యార్థులకు, ఉద్యోగస్థులకు మంచిది. ఔత్సాహిక ఉద్యోగస్తులు వీటి గురించి తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా వుందని గుర్తించాలి.

# సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం
## (Time Management)

మన యువతలో ఎక్కువ శాతం మంది సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం లేదు. సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం వలన కలిగే ఫలితాలు ఏమిటి ?

1. మన సమయాన్ని సక్రమంగా ఉపయోగించు కోవడం వలన మనకు మరింత సమయం దొరుకుతుంది.

2. ఎక్కువ సమర్థవంతంగా పనిచేయవచ్చు.

3. ఎక్కువ సమయం మన కుటుంబ సభ్యులతో గడపవచ్చు.

4. పిక్నిక్స్, షికారులకు వెళ్ళవచ్చు.

5. స్నేహితులు, బంధువుల ఇళ్ళల్లో జరిగే ఫంక్షన్స్‌కు వెళ్ళవచ్చు. వారితో ఆనందాన్ని పంచుకోవచ్చు.

6. ఏదైనా హాబీని వృద్ధి చేసుకోవచ్చు.

7. ఆటలు, నాట్యం, సంగీతం తదితర వ్యాపకాలు పెంచుకోవడం ద్వారా మరింత ఆనందాన్ని, ఆరోగ్యాన్ని స్వంతం చేసుకోవచ్చు.

8. మరికొంత విశ్రాంతి తీసుకోవచ్చు.

9. సొసైటీకి వుపయోగపడే కొన్ని మంచిపనులు చేయవచ్చు. అందరి మన్ననలను పొందవచ్చు.

10. పరిసరాలను శుభ్రంగావుంచడంలో ఇతరులతో సహకరించవచ్చు.

11. కష్టాలలో వున్న వారిని, అవసరంలో వున్న వారిని ఆదుకోవచ్చు.

12. మన ఇంటి విషయాలు, ఆఫీసు విషయాల కొరకు మనం సమర్థవంతంగా మన సమయాన్ని ఉపయోగిస్తూ కొంత సమయాన్ని ఆదాచేసి సంఘసేవ. చేయవచ్చు. దానికి కొంత క్రమశిక్షణ అవసరం.

తద్వారా మంచిగుర్తింపు, మంచి వ్యక్తిత్వం, పెంచుకోవచ్చు. అయితే యివన్నీ చేయకుండానే మనలో చాలామంది, 'నేను చాలా బిజీగావున్నాను, చావడానికి కూడా

సమయంలేదు అని అంటుంటారు'. ఇది నిజమా?, కపటమా? అసమర్థతా ? బద్ధకమా? సమయాన్ని వృధాచేయడమా? ఇటువంటివారి గుణాలను ఏమనాలి?

చాలామంది ప్రయోజకులు, వారు చేయవలసిన పనులజాబితాను (TO DO LIST) తయారు చేసుకుంటారు.

వాటిలో ఏ పనులను, ఎప్పుడు ఎంత సేపటిలో చేయాలో నిర్ణయించుకుంటారు. అనవసరమైన పనులను సమర్థవంతంగా ఎలా చేయాలో నిర్ధారించుకుంటారు. అవసరమైన పనులు, పూర్తిచేయడంలో పూర్తిగా మనస్సుపెట్టి పనిచేస్తారు. అక్కడ కూడా కొంత సమయాన్ని ఆదాచేయడం వారికిసాధ్యం. అది వారి సామర్థ్యానికి సంభందించిన విషయం.

వారి పనులను ముఖ్యంగా మూడు రకాలుగా విభజిస్తారు.

A. చాలా ముఖ్యమైన, అర్జంటు పనులు.

B. చాలా ముఖ్యమైనవి, కానీ అర్జంటు కాదు.

C. ముఖ్యమైనవి కావు, అర్జంటుకూడ కావు.

వాటి ప్రాముఖ్యతననుసరించి క్రమానుసారం A, B జాబితాలలోని పనులను, నిర్ణయించుకున్న సమయానికి ముందే పూర్తిచేస్తారు.

C జాబితాలోని పనులను వారే చేయాలనుకుంటే చేస్తారు. లేకపోతే వాటిని పూర్తి చేయడానికి యితరులను నియమిస్తారు. వారి కుటుంబ సభ్యులు, స్నేహితులు చేయలేని కొన్ని పనులను, స్వచ్ఛందంగా ఎన్నుకొని, వాటిని కూడా పూర్తిచేస్తారు. తద్వారా వారి మన్ననలను పొందుతారు.

ఈ A,B,C లిస్టులో పనులను నిర్ణీత సమయాలలో సమీకరించుకుని, పూర్తికాని పనులేమైనావుంటే వాటికి కారణాలను పరిశీలించుకుని, తగిన సమయంలో వాటిని పూర్తిచేసి వారి ప్రయోజకత్వాన్ని, సమర్థతను నిరూపించుకుంటారు.

కొన్ని పనులు చేయడం, సమయాన్ని వృధా చేసుకోవడమే అని నిర్ధారణ అయితే వాటిని మరచిపోవాలి. కాని వాటిని అలా మరచిపోవడం వలన వచ్చే పర్యావశనాన్ని గమనిస్తూ వుంటారు. పెరాటో అనే ఒక ఇటాలియన్, ఆర్థిక శాస్త్రవేత్త ఇలా అన్నారు. చాలా ముఖ్యమైన 20% పనులను సమర్థవంతంగా పూర్తి చేస్తే 80% ఫలితం దక్కుతుంది. మిగిలిన 20% ఫలితం కోసం B మరియు C లిస్టులో వున్న పనులను వాటి కోసం నిర్ధారించిన సమయంలో పూర్తి చేయవచ్చు.

ఈ సూత్రము PARETO'S PRINCIPLE గా ప్రసిద్ధి చెందింది. మన పనులు VITAL FEW, TRIVIAL MANY గా వుంటాయి. గుర్తించిన (VITAL FEW) ముఖ్యమైన పనులను, ముందుగా సమర్థవంతంగా చేయడం ద్వారా 80% ఫలితాన్ని పొందటం జరుగుతుంది. ఈ సూత్రాన్ని చాలా పరిశ్రమలలో వ్యాపార సంస్థలలో, ఆఫీసులలో ఉపయోగించి, మంచి ఫలితాలను పొందుతున్నారు. సమర్థవంతంగా విజయవంతంగా పనులు, ప్రోసెస్‌లను పూర్తి చేస్తున్నారు. ఈ పెర్టాటో సూత్రాన్ని, మన నిత్యజీవితంలో కూడా వుపయోగించుకోవచ్చు. తర్వాత ఈ సూత్రాన్ని A,B,C ఎనాలిసిస్ అని కూడా అంటారు.

మనం చేసే పనులను A,B,C లిస్టులుగా విభజించడం, ప్రతిలిస్టులోని, పనిని ఒక టాస్కు అనుకొని, దానిని మళ్ళీ చిన్న టాస్కులుగా విభజించి, ఒకదాని తర్వాత మరొకటి పూర్తి చేయాలి. అలా ఆ పనిని పూర్తి చేయించడం, లేక పూర్తి చేయడం ద్వారా, తమ సామర్థ్యాన్ని ధృవీకరించుకోవచ్చు.

ఏ పనులు నేను చేయాలి, ఏ పనులు నాక్రింది ఉద్యోగులు చేయాలి, వారు నిర్ధారిత సమయంలో పూర్తి చేయలేకపోతే వాటిని ఏ విధంగా పూర్తిచేయాలో ముందుగా, మంచిగా ప్లాన్ చేసుకోవాలి. ఆ విధంగా, పనిని పూర్తిచేయాలి. పైన ఉదహరించిన విధానాన్ని స్విస్ ఛీజ్ మెథడ్ (Swiss Cheese Method) అంటారు. సబ్ టాస్కులను, క్రింది ఉద్యోగస్థులతో పూర్తిచేయించి, మెయిన్ టాస్కును (ముఖ్యమైన పనిని) స్వయంగా పూర్తి చేయాలి. అన్నిటినీ స్వయంగా చేయటానికి మన సమయాన్ని వినియోగించి బుర్ర పాడు చేసుకోకూడదు. అలా ఆదా అయిన సమయాన్ని మరికొన్ని నిర్మాణాత్మక మైన, లాభదాయకమైన, కళాత్మకమైన, సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడే పనులు చేయడానికి ఉపయోగించు కోవచ్చు.

ఆ విధంగా మన సమయాన్ని సద్వినియోగం చేసుకోవచ్చు. సమాజ శ్రేయస్సుకై కృషి చేయవచ్చు. ఈ విధానాలను పాటించడం ద్వారా మన పనులను కట్టుబాటు చేసి, తెలివైన నిర్ణయాలను తీసుకోవచ్చు. మన సమయాన్ని మంచిగా ఉపయోగించుకోవచ్చు. మన సామర్థ్యాన్ని పెంచుకోవచ్చు. ఆదా చేసుకున్న సమయంతో మరిన్ని పనులు చేయవచ్చు. విశ్రాంతి తీసుకోవచ్చు.

అప్పుడు మనం 'నేను చాలా బిజీగా వున్నాను చావడానికి కూడా సమయం లేదు' అని అనము. పైన చెప్పిన విధంగా మన సమయాన్ని సద్వినియోగం చేసుకుంటే, ఆనందంగా మన పనులను, టైము ప్రకారం పూర్తి చేసుకుంటాం. అలసిపోము. హాయిగా నిద్రపోతాము. ఉదయం నిద్ర లేచిన తర్వాత హాయిగా, విశ్రాంతిగా, ఉత్సాహంగా వుంటాము. పని

భారం అనిపించదు. మన పనులను, సమయాన్ని, జీవితాన్ని మన నియంత్రణలో (కంట్రోలులో) వుంచుకోవచ్చు. ప్రతిరోజు, క్రిందటిరోజు కంటే సంతోషంగా, శుభప్రదంగా వుంటుంది.

కనుక మన సమయాన్ని సద్వినియోగం చేసుకోవాలంటే ఈ పని, ఎప్పుడు, ఎవరు, ఎలా, ఎంత టైములో చేయాలని ముందుగానే ప్లాను చేసుకుని, దానికి తగ్గట్టుగా పని చేయాలి.

మన పనులను పూర్తి చేసుకోడానికి లక్ష్యాలను నిర్ణయించుకుంటే, అవి మనకు అవసరమైన దారి డైరెక్షన్ చూపుతుంది.

చేయవలసిన పనుల పట్టిక (TO DO LIST) ను రోజూ తయారు చేసుకోవాలి.

మనం నిర్ణయించుకున్న పనిని చేసేటపుడు కొన్ని అవరోధాలు, మరిన్ని అత్యవసారాలు రావచ్చు. వాటిని చేయడానికి మనం చాలా ఫ్లెక్సిబిల్‌గా వుండాలి. ఏ పనిని ఎప్పుడు చేయాలో అపుడే లేదా ముందుగానే పూర్తిచేయాలి. సమర్ధవంతంగా మంచిగా చేయాలి.

అనవసరమైన పనులు చేస్తూకూర్చుంటే, అవసరమైన పనులు ఆలస్యంగా పూర్తి అవుతాయి.

అనవసరమైన పనులకు No (నో) అని చెప్పడం ద్వారా, మరింత అవసరమైన పనులు చేయాడానికి సమయం దొరుకుతుంది.

సమయానికి, ప్లాన్ ప్రకారం పూర్తిచేసినందుకు, సమర్ధవంతంగా చేసినందుకు మనల్ని మనమే అభినందించుకోవాలి. మరికొన్ని అనుకోని పనులను, సమాజానికి ఉపయోగ పడే పనులనుచేసి, కొంత సమయాన్ని ఆధ్యాత్మిక చింతనలో గడిపి, మనం అందరి అభినందనలను పొందవచ్చు. జీవితాన్ని, శాంతియుతంగా, ఆనందదాయకంగా, గడపవచ్చు అందరి మన్ననలనూ పొందవచ్చు.

సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం ద్వారా మనం భాగ్యవంతులం కావచ్చు. ధనలక్ష్మి సోమరులవద్దకు చేరదు. మనం సోమరితనాన్ని వీడి, మనం ఏ సమయంలో చేయవలసిన పనిని అపుడేచేయాలి. మనపనులను వాయిదా వేయకూడదు. మనం చేయవలసిన పనులను సక్రమంగా ప్రణాళికా బద్ధంగా నిర్వహించాలి. ఎపుడు ఏ పని చేయాలో, ఎంత సమయంలో చేయాలో ముందుగా నిర్ణయించుకుని, ఆ ప్లాను ప్రకారం వాటిని పూర్తి చేయాలి. సరైన సమయంలో ప్రారంభించి. మనస్సు పెట్టి పనిచేసి, నిర్మాణాత్మకంగా కృషిచేసి, అనుకున్న దానికంటే ముందుగా ఆ పనిని పూర్తిచేయాలి. మనం ప్రారంభించేముందు, ఆ పనికి సంబంధించిన వివరాలన్నీ మనకు అందుబాటులో

వుంచుకోవాలి. దానికోసం ఆఖరి సమయంలో పరుగులు పెట్టకూడదు. కష్టం అనుకున్న పనులు పూర్తి చేయడానికి ముందుగా అనుభవంకలవారినుండి వివేకంకలవారినుండి సలహాలు తీసుకోవాలి. నిర్ణయాలను సరైన సమయంలో సరిగ్గా తీసుకోవాలి.

నిర్ణయాలు తీసుకోవడంలో జాప్యం చేయరాదు. ఆలస్యం అమృతం విషం అన్నారు పెద్దలు. సరైన నిర్ణయాలను, సరైన సమయంలో ధైర్యంగా తీసుకోవాలి. ముందుగానే బాగా ఆలోచించి సరైన నిర్ణయాలు తీసుకోవాలి. కొన్ని సత్యాలను మనం గ్రహించాలి.

1. సరైన సమయంలో రోగికి మందు లభించకపోతే (లేక ఆపరేషన్ చేయకపోతే) రోగి ప్రాణం పోవచ్చు.

2. సరైన సమయంలో సాక్షి కోర్టులో హాజరు కాలేకపోతే, జడ్జి నిర్దోషికి మరణదండన విధించవచ్చు.

3. సరైన సమయంలో యోధులు సమరరంగంలో చేరకపోవడం వలన, యుద్ధంలో పరాజయం పొందవచ్చు.

మనకు 'పంక్చువాలిటీ' పై సరైన అవగాహనలేదు. అందుకే మనదేశంలో రైళ్ళు, బస్సులు, విమానాలు నిర్ణీత సమయం ప్రకారం బయలుదేరవు. నిర్ణీత సమయంలో గమ్యం చేరవు. దానికి కారణం, వాటిని నడిపే మనుష్యులే. ఆఫీసులో నిర్ణీత సమయానుగతంగా పనులు జరగవు. దానికి బాధ్యులు ఎవ్వరు? సమయం యొక్క విలువ తెలియని ప్రబుద్ధులే. కానీ వారికి సంబంధించినంత వరకూ, ఇతరులు తమ పనులన్నీ నిర్ణీత సమయంలో చేయాలి. వారికొకనీతి, ఇతరులకు ఒకనీతి.

చాలా మంది యిలా అంటూవుంటారు. 'మాకు సమయం లేదు. చాలా బిజీ. శ్వాస తీసుకోడానికి కూడా సమయంలేదు అంత పని భారంలో వున్నాము. మీరు మా సమయాన్ని వృధా చేయవద్దు'. కానీ వీరు ఆఫీసులలో, యింటి వద్ద ఎంత సమయాన్ని వృధా చేస్తుంటారో మనం గమనిస్తూవుంటాం సమయాన్ని సద్వినియోగం చేసుకోవలసిన ఆవశ్యకత అందరికీవుంది.

మనం చూస్తూనే వున్నాం. రాష్ట్ర, కేంద్ర పరిపాలనా సంస్థలలో, ఉద్యోగులు ఎంతో సమయాన్ని వృధాచేస్తుంటారు. వారికి పనులను నిర్ణీత సమయాలలో చేసే అలవాటు వుండదు. నిర్ణయాలను ఎలా ఆలస్యంగా చేయాలి? దానికి జవాబులు సవాలక్ష వారి వద్ద వుంటాయి. ఎలా వారి ప్రాముఖ్యతను పెంచుకోవాలి? ఎలా ఆర్థికంగా లబ్ధి పొందాలి? వారికి బాగా తెలుసు. కానీ పంక్చువాలిటీ గురించి వారి అభిప్రాయాలు వింతగా వుంటాయి.

ఒక వార్తాపత్రికలో వివరించిన కొన్ని అభిప్రాయాలను యిక్కడ పొందుపరుస్తున్నాను.

ఒక ఈనాడు పత్రికా విలేఖరి, సెక్రటేరియట్‌లో పనిచేస్తున్న రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల పనితీరును, పంక్చువాలిటీని శ్రద్ధగా గమనించి చక్కగా కొన్ని వివరణలను యిచ్చారు. 'ఆలస్యంగా రాకుండా వుండాలంటే, వారికి గృహాలను సెక్రటేరియట్ ప్రక్కనే నిర్మించి యివ్వాలట. వాళ్ళు ఇళ్ళు కట్టు కోవాలనుకుంటే, ఇళ్ళ స్థలాలను సెక్రటేరియట్ ప్రక్కనే ఉచితంగా యివ్వాలట. 'ఆలస్యంగా వస్తున్నాము. ఆలస్యంగా ఆఫీసునుండి వెడుతున్నాము దానిలో తప్పేముంది' అది వారి వాదన. అయితే ఆఫీసు నుండి ఆలస్యంగా వెళ్ళడానికి గల ముఖ్యకారణాలు చెప్పలేదు. అపుడే లావాదేవీలు జరుగుతుంటాయని అంటుంటారు.

'ఇంటి పని, వంట పని పూర్తిచేసుకురావాలి. కనుక ఆలస్యం అవుతుంది. నౌకర్లను ప్రభుత్వం యివ్వలేదుగా' అంటారు. 'బంధువులు ఆఫీసుటైము చూసుకుని రారుగా' అంటారు మరికొందరు'.

వీరు ఆఫీసు సమయాన్ని ఎంతో దారుణంగా వృధా చేస్తుంటారు. స్వంత పనులు చేసుకోడానికి వాడుకుంటూవుంటారు. తద్వారా ఇతరులకు ఏంతో మనస్థాపాన్ని కలిగిస్తూ వుంటారు. వింత ఏమిటంటే, ఇలా మనస్థాపాన్ని పొందినవారు కూడా, వారి అవసరం, యితరులకు కలిగితే వారుకూడా నిర్ణయాలను ఆలశ్యం చేస్తుంటారు. అందరూ సమయాన్ని సద్వినియోగం చేసుకోవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

# విజయం (success)

విద్యార్థులు, ఉద్యోగులు, ముఖ్యంగా విజయం సాధించాలనే ధ్యేయం కలవారు, కొన్ని విషయాలు గుర్తుంచుకోవాలి. అప్పుడే విజయం సాధించాలనే లక్ష్యసాధన వీలుపడుతుంది. విజయానికి అవసరమైన కొన్ని అంశాలను యిక్కడ ప్రస్తావించాను.

జీవితంలో కష్టపడితేనే విజయం సాధ్యం.

దేన్నైనా సాధిస్తాననే ధైర్యం వుంటే, అదే విజయానికి దారిని సుసాధ్యం చేస్తుంది.

చలాకీతనం, కలుపుగోరుతనం, ఆత్మవిశ్వాసం, మనోధైర్యం, వీటి పర్యావసానం విజయం.

మనమీద మనకుండే నమ్మకం మనల్ని శిఖరాల మీద నిలబెడుతుంది మరియు అపనమ్మకం మనల్ని లోయల్లోకి తోసివేస్తుంది.

ప్రతిభాపాటవాలకు గుర్తింపు పొందడం ద్వారానే, విజయానికి దగ్గరవుతాం.

లక్ష్యసాధనకు చేసే కృషి, ఆత్మగౌరవం, విశ్వాసం, విజయాన్నిస్తాయి.

మనకిష్టమైన రంగం ఎంచుకోవడం, మనరాణింపుకు, విజయానికి పునాది.

లక్ష్యసాధనకు శ్రమించడం, విజయానికి తొలిమెట్టు.

మానవ సంబంధాలను మెరుగు పరచుకోవడం, స్నేహం, బంధుత్వ విలువల్ని పెంచుకోవడం, వలన, విజయం సాధించవచ్చు.

మన మంచిచెడ్డలు, కష్టసుఖాలను విశ్లేషించుకోడం, విజయాన్ని సుగమం చేసుకోవడమే.

మన మనస్సు స్వచ్ఛమైనదైతే, మంచి అర్హతలు సంపాదిస్తే, విజయం సాధించవచ్చు.

విజయానికి మూలం కృషి, అవసరం, సామర్థ్యం, ప్రేరణ, నాయకత్వలక్షణాలు, దృక్పథం, అంకితభావం, విద్య, జ్ఞానం, నైపుణ్యం, జ్ఞాపక శక్తి.

ఎవరో వచ్చి మనల్ని వుద్ధరించరు. మనల్ని మనమే వుద్ధరించుకోవాలి.

నేను చేసే పనులకు, జవాబుదారీ నాదే, నాదే బాధ్యత, అన్న ఆలోచన విజయానికి దారి చూపుతుంది.

నీతీ, నిజాయితీలకు, నమ్మిన సిద్ధాంతాలకు కట్టుబడి వుండటమే విజయం.

గమ్యం సాధించడమే విజయం. నిర్భయంగా లక్ష్యసాధన చేయడమే విజయం.

ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం, ఆత్మనిగ్రహం, స్వార్థరహితత్యాగం, ఆత్మతృప్తి విజయానికి మూలం. ఆత్మవంచన, డబ్బుతో వచ్చే పరిణతి విజయంకాదు.

పేరు ప్రఖ్యాతులు, డబ్బు, కోసం ఆత్మవంచనతో, ప్రాకులాడటం విజయం కాదు. అది నిరర్థకమైన గుర్తింపు. మరణం తర్వాత ఆ గుర్తింపు నశించి పోతుంది. ప్రజలు మరచిపోతారు.

భయస్తులు, ఆరంభ శూరత్వం కలవారు, విజయాన్ని సాధించలేరు.

జూదంలో, లాటరీలో, రేసుల్లో డబ్బుసంపాదించిన వాళ్ళను విజయం సాధించారు అని అనలేం.

కోపం, భయం, ఆందోళన, నిరాశలతో విజయం సాధించలేం.

విద్య, వివేకం, విచక్షణ, విశ్రాంతి, విజయానికై, నీలో లేనిది, ఇతరుల్లోవున్నది ఏమిటో గ్రహించాలి. దాన్ని నేర్చుకోవాలి అమలుపరచాలి.

మెదడుకు మంచి మేత, మంచి ఆలోచనలు. మంచి పుస్తకాలు చదవడం, ప్రతిభాపాటవాలకు సానపెట్టడం. తద్వారా విజయాన్ని సాధించడం సాధ్యం.

స్థాయి, సామర్థ్యం, సంయమనం, స్పష్టత, సంతృప్తి, విజయానికి అవసరం.

అనుకున్నదాని కంటే, దక్కినదానితోనే తృప్తిపడే వాడిని బద్ధకస్తుడంటారు. విజయం సాధించాడు, అని అనరు. అంటే MBA పాసై, క్లర్కుగా స్థిరపడటం.

మన పట్ల మనకున్న, నమ్మకం, మనకి ఆత్మవిశ్వాసాన్ని యిస్తుంది. విజయానికి దారి చూపుతుంది.

మన:శ్శాంతి - విజయాన్నిస్తుంది. అశాంతి, భయాలను, కష్టాలను తెస్తుంది.

విసుగు, కోపం, భయం, ఆందోళనలు మనల్ని, విజయం నుండి దూరం చేస్తాయి.

ఏ పనినైనా సకాలంలో ప్రారంభించాలి, నిదానంగా చేయాలి, క్షేమంగా గమ్యం చేరుకోవాలి - అపుడే విజయం సాధ్యం.

ఇతరులకు ఆనందం అందించడంలోనే వుంది సంతోషం. నిస్వార్థసేవ ముఖ్యం.

ఔన్నత్యం, సత్తాచూపడం, శక్తియుతంగా పోరాడటమే - విజయం.

ఆత్మవిశ్వాసంతో ఆటంకాల్ని ఎదుర్కొంటే, విజయం సాధ్యం.

ధైర్యము, సార్థకత, ఉత్సాహము, సత్ప్రవర్తన, సత్సాంగత్యం, విజయానికి దారిచూపుతాయి.

పాపభీతి, సంఘనీతి, దైవప్రీతి - విజయానికి మూలం.

లక్ష్యం, విజయం సాధించలేక పోదానికి, మనల్ని వెనక్కిలాగుతున్న పరిస్థితులను మనం పరిశీలించాలి. విశ్లేషించాలి. ఆత్మవిశ్వాసంతో, ధైర్యంగా వాటిని పరిష్కరించాలి.

అవకాశాల్ని సరిగ్గా ఉపయోగించుకుంటే గమ్యం విజయమే.

కాలాన్నీ, గమ్యాన్నీ, నిర్దేశించుకుంటే విజయం మనల్ని వరిస్తుంది.

అహంకారము, దర్పము, గర్వము విజయాన్ని దూరంచేస్తాయి.

విజయం పొందాలంటే. దానికి అవసరమైన శారీరక, మానసిక, ఆర్థిక, శక్తులను సమీకరించుకోవాలి.

విజయసాధనలో కొన్ని తప్పులు చేస్తే వాటిని సమీక్షించుకుని, విశ్లేషించుకుని సవరించుకుని ముందుకుపోవాలి. మధ్యలో విరమించకూడదు.

పరాజయాల్ని, అనుభవాల్ని పాఠాలుగా చేసుకుని, చేయవలసిన పనులను నిర్ధారించుకుని, జీవితాన్ని, మరింత నిర్దిష్టంగా తీర్చిదిద్దుకోవాలి.

సమస్యల ఊబిలో ఇరుక్కుంటే, ఎవరు మనకు మంచి సలహాలు, సహాయం అందచేయగలరో ముందుగానే ఆలోచించాలి.

అపజయానికి భయపడి ఏమి చేయకుండావుండే దానికంటే, ప్రారంభిస్తే ప్రస్తుత పరిస్థితి కంటే, కొంచెం మెరుగ్గా వుండే అవకాశం వుంటుంది.

ఏ పనైన ముందుగా ప్రారంభించి, ఆలస్యంగా ముగిస్తే, ఫలితాలు మెరుగ్గావుంటాయి.

నిర్మాణాత్మకమైన కుతూహలం విజయానికి దారినిస్తుంది.

మిస్టర్ అండ్ మిసెస్ శైలజా కృష్ణమూర్తి వారికింకా పెళ్ళి కాలేదు. వారు ఈ గది లోపల వున్నారు. వారు ఏమిచేస్తూ వుంటారు? అనే కుతూహలం నిర్మాణాత్మకమైన కుతూహలం కాదు. విజయానికి ప్రతిబంధకాలు ఏమిటి? వాటికి పరిష్కారాలు ఏమిటి? అనే కుతూహలమే నిర్మాణాత్మక మైన కుతూహలం. ఇతరుల విజయానికి గల కారణాలను తెలుసుకోవాలనుకోవడం నిర్మాణాత్మకమైన కుతూహలం. విజయానికి కావలసిన ఆర్థిక వనరులను, మానవ వనరులను ఎలా సమీకరించుకోవాలి ? అనే ఆలోచనలే, నిర్మాణాత్మక కుతూహలం. అదే మన, క్లిష్టమైన సమస్యలను దూరం చేస్తుంది. విజయానికి దారినిస్తుంది.

ఆర్థికంగా, మానసికంగా మనల్ని నష్ట పరచేవాటిని, ముందుగా ఉహించి వాటిని దూర
చేసుకుని, కృషితో ముందుకు పోగలిగితే, విజయం మనకు దగ్గరవుతుంది.

డబ్బు సంపాదించడం ఆనందమే. మంచిగా జీవించడం కూడా ఆనందమే.

మంచి అనే చిన్న మొక్కను నాటండి. అది పెద్దదై పూలు, కాయలు, కాస్తే మీ జీవితంలో ఆనందమే ఆనందం.

మనలో సృజనాత్మకత, నిర్మాణాత్మక సామర్థ్యం ఎంత వుంటే, మనకు అంత ఆనందం, తృప్తి కలుగుతుంది.

అపకారికి కూడా ఉపకారం చేయాలి. అప్పుడే అతను తనతప్పు తెలుసుకుని పశ్చాత్తాప పడతాడు.

భయభీతి జీవితములో, ముందడుగు వేయనీయదు. ధైర్యంగా ముందుకు సాగిపోవాలి.

పోజిటివ్‌గా ఆలోచించడం అలవరచుకోవాలి. విజయపథంలో సాగిపోవాలి.

కష్టం, నష్టం వస్తే భరించి అధిగమించాలి. ఆటంకాలకు ఆవరోధాలకు తలవంచకూడదు.

దృఢదీక్షవుంటే అవరోధాలు తలవంచుతాయి.

అపజయాల అనుభూతులను విజయాలకు పునాదులుగా చేసుకోవాలి.

నిరాశ చెందకుండా ప్రయత్నిస్తూ పోతే విజయం ఈ రోజు కాకపోతే రేపు తప్పక మనల్ని వరిస్తుంది. తెలివిగా వేసే తొలిఅడుగే, సఫలతకు తొలిమెట్టు.

అశావాదులు, ప్రతి అవరోధంలోనూ అద్భుతమైన అవకాశాన్ని సృష్టించుకుంటారు. నిరాశాజీవులు, ప్రతి సువర్ణావకాశాన్నీ వదలుకుని వెనుకంజ వేస్తారు.

మనిషిలో ఉత్సాహం చల్లారితే, పేదరికం, దగ్గరవుతుంది.

సవ్యసాచిలా, భయాన్ని చీల్చి చెండాడి. నిరాశా దృక్పధాన్ని, భస్మీపటలం చేయాలి.

మనో నిబ్బరంతో, విజయకాంక్షతో ముందుకుపోవాలి. మనిషికిగల గొప్పశక్తి నమ్మకం. పరిపూర్ణ విశ్వాసం.

మంచితనం, కీర్తిప్రతిష్టలే జీవితంలో శాస్వతాలు. ధనం కాదు. మహోత్కృష్టమైన మానవ జన్మను సార్థకం చేసుకోవాలి. బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించాలి.

శక్తి సామర్థ్యాలను, ప్రేమానురాగాలను పదిమందికి పంచితే జీవితం సార్థక మవుతుంది.

చదువు, నైపుణ్యం ఉన్నా, జీవితంలో గుర్తింపు రావాలంటే, చక్కగా మాట్లాడే ప్రతిభ కూడా అవసరం.

క్రొత్త, క్రొత్త లక్ష్యాలను ఏర్పరచుకుంటూ ప్రగతిలోకి పయనించాలి. ధ్యేయాల్ని సఫలం చేసుకుంటూ పోవాలంటే, కార్యదీక్ష, పట్టుదల వుండాలి.

విజయాల్ని సాధిస్తే జన్మ సార్ధకత చెందినట్లే. ఈ మహోన్నతమైన మానవజన్మ కీర్తి, ప్రతిష్టలు సాధించడానికే. కేవలం ధనార్జనలో, తృప్తి, విజయం వుండవు.

నెగెటివ్ థింకర్స్ వెంట అపజయం, పోజిటివ్ థింకర్స్ వెంట విజయం వుంటాయి.

చింత మనిషిని క్షణం క్షణం చంపుతూ విజయానికి దూరంగా వుంచుతుంది.

ప్రముఖులు పుట్టగానే విజయాల్ని సాధించలేదు. అంకిత భావంతో కృషి చేయడం వలన, వారివృత్తిలో వారు విజయం సాధించారు. దీనికి చాలా ఉదాహరణలు వున్నాయి.

విన్‌స్టన్ చర్చిల్ – నీకు మాట్లాడటం రాదు అన్నారు ముందుగా.

చార్లిచాప్లిన్ – పొట్టిగా వున్నావు – సినిమాలకు పనికిరావు అన్నారు.

Hema Malini – సన్నగా వున్నావు – సినిమాలకు పనికిరావు అన్నారు.

Amitabh Bachchan – పొడుగ్గా వున్నావు – సినిమాలకు పనికిరావు అన్నారు.

Chiranjeevi – విలన్‌లా వున్నావు – హీరోగా సినిమాలకు పనికిరావు అన్నారు.

వాల్ట్‌డిస్నీ – ఆయన రూపుదిద్దిన బొమ్మలను, ఎడిటర్ చింపేశాడు.పనికి రాని బొమ్మలన్నాడు.

ఎడిసన్‌ను హేళన చేశారు. పనికి రాని పనులతో కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నావు అన్నారు.

రాబర్టు క్లైవ్ – ముందు దొంగ – తర్వాత బ్రిటిష్ సేనాని – ప్రపంచాన్ని వణికించాడు

వాల్మీకి – ముందు దొంగ – తర్వత రామాయణం వ్రాశాడు.

విమర్శలకు కృంగి పోయేవారు – విజయం సాధించలేరు. విజేతలు పారిపోరు.

విజయానికి అడ్డుదోవలు (Short cuts) లేవు. కృషి, దీక్ష, పట్టుదల, పరిశ్రమ, +ve thinking. proactive thinking విజయానికి పట్టుగొమ్మలు.

అంగవైకల్యం విజయానికి అడ్డురాదు, ఆత్మవిశ్వాసమే అసలైనపెట్టుబడి. ఆత్మవిశ్వాసంతో, మానసికశక్తిని పెంచుకోవచ్చు.

ఆత్మవిశ్వాసం, దృఢసంకల్పం, విజ్ఞత, సమయస్ఫూర్తి, కృషి, కమిట్‌మెంట్ వుంటే మానవుడు దేన్నైనా సాధించగలడు.

పొరబాటును దిద్దుకోవాలంటే ధైర్యంగా నిలబడాలి. బెంబేలుపడిపోకూడదు.

జీవితంలో రాజీపడలేక ఆత్మహత్య చేసుకోవాలను కోవడం అవివేకం.

మనలోపాలను వరాలుగా మార్చు కోవటం మనకే సాధ్యం. దానికి స్వయం కృషి కావాలి.

**ఆత్మవిశ్వాసం పెంచుకోవాలంటే :**

a) పలాయన వాదం విడిచి పెట్టాలి.

b) వికలాంగులను స్ఫూర్తిగా తీసుకోవాలి.

c) తక్కువ స్థాయిలో వుండి, కృషితో విజయాన్ని సాధించినవారిని స్ఫూర్తిగా తీసుకోవాలి.

d) సిగ్గును, ఆత్మన్యూనతాభావాన్ని తొలగించాలి. ఆత్మస్థైర్యాన్ని పెంచుకోవాలి.

e) God father లేకుండా, కూడా విజయం సాధ్యం, అని నమ్మాలి.

f) కోపం, భయం, ఆందోళన విడిచిపెట్టాలి.

g) పనులను వాయిదాలు వేయకుండా, ఎప్పటికప్పుడు పూర్తిచేయడానికి మానసికశక్తిని వృద్ధి చేసుకోవాలి.

h) మనస్సాక్షితో రాజీపడకూడదు. అడ్డుత్రోవలో పోకూడదు.

సూక్ష్మ బుద్ధి (Sharpmind) కలవానికి తొందరగా కోపంరాదు. సమస్యలను చక్కగా విశ్లేషించుకుని పరిష్కరించుకుంటాడు.

మన విజయం, మన దృక్పథంపై ఆధారపడి వుంటుంది.

మనుషులు దూరంగా వున్నావారి మనస్సులు దగ్గరగా వుండాలి.

మంచి ఆరోగ్యంతో ఎలెర్ట్‌గా వుండాలి. జీవితంలో పైకి రావాలంటే చెడుఅలవాట్లను దూరంగావుంచాలి.

మార్గ దర్శకత్వం (డైరెక్షన్) సరిగ్గా లేకుంటే, మానసిక వికాసం సరిగ్గావుండదు.

దిగులుతో కూర్చుంటే సమస్యలు తీరవు. ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం వుంటుంది.

ఆదిశలో కృషి చేస్తే, విజయం మనదే.

విజయం పొందాలంటే, ధైర్యం, మనోబలం, మంచి మనస్సు కావాలి. స్వయం కృషిలేని మనిషి, తెలివిలేని మంత్రి, ధైర్యంలేని రాజు అసమర్ధులే.

స్వయం కృషితో పైకి వచ్చిన వ్యక్తి, నడమంత్రపు సిరితో ఎదిగిన వ్యక్తి కంటే మేలు.

ప్రతి పనికి సరైన ప్లానింగు వుండాలి. దాహం వేసినపుడే బావి త్రవ్వడం సరికాదు.

ప్రణాళికాబద్ధంగా లేకుంటే జీవితం, తెగిన గాలిపటంలా మారుతుంది.

మన కృషి లోపిస్తే, మనం ఒకటి తలిస్తే దైవం మరొకటి తలుస్తాడు.

తక్కువ నోములు నోచి ఎక్కువ ఫలితం ఆశించడం, స్వయంకృషి లేకుండానే. గొప్పవారవ్వాలని ఆశించడం ఒక్కటే.

జయాపజయాలు మన కృషిపైనే ఆధాంపడి వుంటాయి. ప్రగతిపథంలో పయనించే బదులు, గాలిలో మేడలు కడుతుంటే, విజయం మనకు  దూరంగా వుంటుంది.

సమస్యలను ఆదిలోనే పరిష్కరించడం అవసరం. గోటితో పోయేదానికి గొడ్డలి అనవసరం.

మన మంచిని పంచినా, మంచి తరగదు. గంధపు చెక్కను అరిగించినా వాసన తరగదు.

కూర్చుని తింటే కొండలయినా తరిగిపోతాయి. విజయం మాట దేవుడెరుగు.

మన  సమర్ధతనెరిగి ముందడుగు వేయ్యాలి. అత్యాశకు దూరంగా వుండాలి.

పట్టుదల, నిలకడ, కృషి దూరాలోచన వుంటే జీవితం విజయవంతం అవుతుంది.

1. దూరదృష్టి, 2. పనిలోనైపుణ్యం, 3. ప్రోత్సాహం, 4. వనరులు (రిసోర్సెస్), 5. ఆచరణల (ఇంప్లిమెంటేషన్) ప్రతిఫలం, విజయవంతమైన మార్పు. వీటిలో ఏది లోపించినా కష్టమే.

వీటిలో అన్నీవుండి 1. దూరదృష్టిలోపిస్తే, గందరగోళమే (కన్‌ఫ్యూజన్ వస్తుంది).

వీటిలో అన్నీవుండి 2. పనిలో నైపుణ్యం లోపిస్తే సాధించవలసినది, సాధించలేదే – అన్న ఆతృత (ఏంక్జైటీ) కలుగుతుంది

వీటిలో అన్నీవుండి 3. పనిలో ప్రోత్సాహం లభించకపోతే, మార్పు (ఛేంజ్) ప్రోత్సాహకరంగా ఉండదు. మార్పు నెమ్మదిగా వుంటుంది.

వీటిలో అన్నీవుండి 4. కావలసిన వనరులు సమకూర్చుకోలేకపోతే; అశాంతి, కోపం (ఫ్రస్ట్రేషన్) వస్తుంది.

వీటిలో అన్నీవుండి 5. అవసరమైన పనులను, ఆచరణలో పెట్టకపోతే ఆశించిన మార్పును

సాధించలేము.

జీవితంలో విజయం సాధించాలంటే మనోధైర్యం కావాలి.

మనంపొందే విజయాలే గౌరవ చిహ్నాలుగా మిగులుతాయి.

మూర్ఖులు విసిరిన రాళ్ళతోనే, గట్టి పునాదులు స్థాపించిన వ్యక్తి అసలైన విజయవంతుడు.

మనిషి నిర్జీవంగా, గమ్యం లేకుండా, రుచిలేని జీవితాన్ని జీవించకూడదు. అంతరాత్మను మనోవికాసాన్ని దృష్టిలో వుంచుకుని జీవించాలి.

ఇతరుల చెడులను, బలహీనతలను గుర్తించకూడదు. వారి అంతరాత్మలను నిద్ర లేపగలిగితే మంచిది. అయితే ముందు మన అంతరాత్మను నిద్రలేపాలి.

మంచి, తెలివితేటలు, ప్రతిభ, మనిషిలో భాగాలు. వాటిని సక్రమంగా ఉపయోగించుకోవాలి, విజయం పోందాలి

తగిన రీతిలో కృషిచేసి, విజయం సాధిస్తే, స్వర్గం మనవద్దే వుంటుంది.

జ్ఞానం వలన వివేకము, బుద్ధి, స్థిరత్వము, మనఃశ్శాంతి వస్తాయి.

కేవలం మంచి చెడులు, జయాపజయాల గురించి ఆలోచించడం సంపూర్ణ జ్ఞానం కాదు.

దుర్గుణములకు అలవాటు పడిన వారు, విజయసాధనలో విఫలులవుతారు.

చెడుమనస్సు, కుళ్ళిపోయిన ఆలోచనలుకల వ్యక్తి, సమాజానికి మంచి చేయలేడు.

నిపుణుడు, సంపూర్ణ అనుభవముకలవాడు మంచిని కోరితే, తనకే కాదు సర్వ సమాజానికి మంచిని చేయగలడు.

పరిపాలనా వ్యవస్థలో మార్పు కోరుకుంటే, అధికారాన్ని, సామర్థ్యము కలవారిచేతికి మాత్రమే అందివ్వాలి.

ఆక్షేపణలేని, యోగ్యమైన మన సేవ, మన విజయానికి దారి చూపుతుంది

అజ్ఞానిలో మార్పును తెచ్చి, బుద్ధి బోధన చేసి, సత్ఫలితాలను సాధిస్తే, ఆసేవ దివ్యమైనది,

ముఖస్తుతి చేసి, మునగచెట్టు ఎక్కిస్తే ఫలితం ఎవరికీ దక్కదు.

పదిమందికి ప్రయోజనకరమైన పనులు చేయడంలోనే వుంది మన విజయం.

ధైర్యంగా మార్పును కోరడమే కాక ఆచరణ యోగ్యంగా చేయడంలోవుంది విజయం.

అవసరానికి యిచ్చే మంచి సలహాలు ఎప్పుడూ వ్యర్థం కావు. వాటిని సత్‌భావనతో

ఆచరించడం అవసరం.

బంధుత్వము, స్నేహం, అనురాగము, ప్రీతి, మన సంపద అని గ్రహిస్తే, విజయం మనదే.

మన ఔన్నత్యాన్ని చూసి ఓర్వలేనివాడు, అసూయపడేవాడు, మన విజయానికి ఏమాత్రము సహకరించలేదు.

మీడియా, నిపుణులు, రాజకీయవేత్తలు, తీవ్రవాదులు, ప్రజలను తప్పుదారి పట్టిస్తే, వచ్చే మార్పు, అరాచకమును సృష్టిస్తుంది. విజయాన్ని సంతోషాన్ని దూరం చేస్తుంది.

మనం గుడ్డిగా, ఒక మతాన్ని, రాజకీయాలను, హేతు పూర్వకముగాని సిద్ధాంతాలను నమ్మితే, పతనానికి దగ్గరగా, విజయానికి దూరంగా మిగిలిపోతాము.

మన విజయానికి మూలం, ధృఢమైన మనోశక్తి, ఆరోగ్యవంతమైన శరీరం, మంచి అలవాట్లు, మంచి మానవతా సంబంధాలు.

మంచి ఆలోచనలతో ప్రేరణ పొందితే, మంచి వ్యక్తుల కృషి ఫలితాలతో ప్రేరణ పొందితే, విజయం మన సమీపంలోనే వుంటుంది. వాటిని ఆచరిస్తే విజయం సొంతమవుతుంది.

మన ఆరోగ్యం శరీరానికే కాదు, మన మనస్సుకు, మన మంచి భావనలకు అవసరం.

మన చుట్టుప్రక్కల పరిస్థితులు, మనుష్యుల వలన, మనం ప్రభావితం అవుతాం. కనుక వాటిని శుభ్రంగావుంచడం, అవసరం.

సత్ సాంగత్యం చేయడం వలన సద్భావనలు కలుగుతాయి.

జన్మతా మనిషికి మంచి ఆరోగ్యం, సంస్కారం కలగవు. వాటిని అంది పుచ్చుకోడానికి తగిన కృషి చేయాలి.

కఠినమైన, నిష్కపటమైన, నిర్ణయాలు, సమస్యల పరిష్కారానికి దోహదపడతాయి.

ఆందోళన, కంగారు, భయం, మనోశక్తిని క్షీణింపచేస్తాయి.

స్వయంకృషి, మనోబలం, సమర్ధవంతమైన శ్రేష్టమైన, ఉల్లాసవంతమైన జీవితాన్ని గడపడం - ఫలితంగా గౌరవ ప్రతిష్టలు సాధించవచ్చు. దీన్నే సెల్ఫ్ ఎస్టీమ్ అంటారు.

సంపూర్ణ వికాసం ఫలితం - సెల్ఫ్ ఎస్టీమ్.

డిప్రెషన్, ఆతృత, భయాందోళనలు, మానసిక ఒత్తిడి, అంతఃకలహాలు, యితరులను కించపరచడం, వంటి గుణాలున్న వ్యక్తిని ఎపుడూ విజయం వరించదు.

సమయోచితమైన ఆలోచనలు, విజయం పొందాలనే దృఢనిశ్చయం, ఆలోచనలుచే కార్యా కూల సమర్ధత, మంచి ఫలితాలను ఇస్తాయి. ఆ లక్షణాలు వుంటే సమాజం మన్ని గౌరవిస్తుంది.

మన పని, మన వృత్తి పట్ల మనోభావన, సంతోష ప్రదమైనది (fun) గా భావించవచ్చు లేదా చాలా కష్టమైనది, హీనమైనదిగా భావించవచ్చు. అయితే మన పనిని సంతోషంగా భావించి, శ్రమిస్తే, విజయం తప్పక మన వద్దే వుంటుంది.

విజ్ఞానం, వివేకం, విజయం మన కృషి ఫలితాలే.

మన హృదయాలను, సద్భావనలతో వుంచితే, మన జీవితం సుఖవంతంగా వుంటుంది అప్పుడు మన కుటుంబాన్ని సక్రమంగా వుంచవచ్చు. అందరూ అలాగ సక్రమంగా వుంటే సమాజం, మనదేశం, ప్రపంచం, సక్రమంగా రూపొందుతాయి. విజయానికి తార్కాణాలు యివే.

* * *

ఇంగ్లీష్ నుండి కొన్ని చాణుక్య సూక్తులను అనువదించి ఇక్కడ పొందుపరిచాను.

1) కొన్ని పరిస్థితుల్లో మనం అధైర్యపడవచ్చు. మన భయాన్ని ఇతరులు గుర్తించకుండా జాగ్రత్తపడాలి. కారణం అభద్రతాభావన. అన్ని పాములూ విషసర్పాలు కావు. అయినా విషసర్పాలుగా మనల్ని భ్రమింపజేస్తాయి. కారణం వాటికీ ప్రాణభయం ఉంటుంది.

2) మనిషి, మరీ నిజాయితీగా ఉన్నా కొన్నిసార్లు కష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది సందర్భోచితంగా తెలివిగా ప్రవర్తించాలి.

3) మన రహస్యాలను అందరితోను పంచుకోకూడదు. అలా చేస్తే మనకు హాని కలుగవచ్చు

4) భయాన్ని దరి చేరనివ్వకూడదు. భయాన్ని పారద్రోలి ధైర్యంగా ఉంటే ఫలితాలు బాగుంటాయి.

5) ప్రపంచంలో అత్యధికమైన శక్తి యువతకు, కలానికి, స్త్రీయొక్క అందానికి ఉంటుంది

6) ముందుగా బాగా ఆలోచించి ఏపనినైనా ప్రారంభించాలి. మధ్యలో ఆపనిని విడిచిపెట్టకూడదు. నమ్మకంగా విధేయతతో పనిచేస్తే ఫలితం సంతోషదాయకంగా ఉంటుంది

7) పుష్పం యొక్క సువాసన గాలివాటంగా వ్యాపిస్తుంది. కానీ మనిషి మంచితనం అన్నిదిశలుగా వ్యాపిస్తుంది.

# సంతోషం

ముందుగా వుదహరించినట్లు ఆటలు, సంగీతం వంటి వాటిని సాధన చేసే వాళ్ళలో, లేక వాటిని యిష్ట పడే వాళ్ళలో, ఎక్కువ సంతోషం చూస్తూవుంటాము. వారి సంతోషమే వారి జీవిత కాలాన్ని పెంచుతుంది. ఉదాహరణకు గాయనీమణులు శ్రీమతి లతామంగేష్కర్, ఆషాభోన్స్‌లే. వారి వయస్సు 70 సంవత్సరాలు దాటినా వారు ఆర్యోగంగా వున్నారు. వారి గాత్రం కోకిల గానంలా మురిపిస్తుంది. ఆ వయస్సులో వారికున్న సంపదతో సమాజసేవ చేస్తున్నారు. అలగే మన రాష్టంలో సుశీలగారిని, జానకిగారిని చూస్తే, వారి సంగీత సాధన వలన, వారి ముఖంలో కనబడే చెదరని చిరునవ్వు, ప్రశాంతత, మనల్ని ముగ్ధుల్ని చేస్తుంది. వారి సంగీత సాధనే వారి సంతోషం. అదే వారి ఆరోగ్యానికి మూలం. శ్రీ బాలసుబ్రహ్మణ్యం గార్కి సంగీతమే, చెదరని వ్యక్తిత్వాన్నిచ్చింది. ఉన్నతస్థాయి లో వున్నా, ఆయన మాటలలో స్పష్టత, ఆయనలోని శ్రద్ధ, వినయం, పెద్దల పట్ల విధేయత ప్రశంసనీయం. చురుకుదనంతో (స్థూలకాయమైనా) సమయానుచితంగా, చక్కటి జోక్సు వేస్తూ మనల్ని నవ్విస్తారు. ఔత్సాహిక గాయనీగాయకులకు, పిల్లలకు మంచి ప్రోత్సాహం యిస్తారు. ఇవన్నీ ఆయనకు సంగీతం ద్వారా భగవంతుడు ప్రసాదించిన వరాలు. అలాగే యువగాయనీ గాయకులలో, సోనూ నిగమ్, ఉదిత్‌నారాయణ, అల్కాయాగ్నిక్, ఉష, ఆర్.పి.పట్నాయక్, చక్రి, దేవిశ్రీ ప్రసాద్ వంటి వారిలో వుత్సాహం, సంతోషం, చొరవ, స్పష్టంగా కనబడుతుంది. ఇటువంటి గుణాలు కల అనేక మందిలో వుత్సాహం, సంతోషం స్పష్టంగా కనబడుతుంది. వారి సంతోషానికి కారణం సంగీత సాధన.

ఈ మధ్య, పద్మశ్రీ గ్రహీతలైన శ్రీమతి చిత్ర, శ్రీమతి కవితా కృష్ణమూర్తి ఎన్నో మధుర గీతాల్ని పాడారు. గుర్తింపు పొందారు. ఎన్నో పురస్కారాలు పొందారు. వారిలో ఎప్పుడూ ఉత్సాహం వురకలు వేస్తూనే వుంటుంది. ఎప్పుడూ నవ్వుతూనే వుంటారు. వారి చిరునవ్వే వారి ఆభరణం. దీనికి కారణం వారి సంగీత సాధన.

మనం చూస్తున్నాం. శ్రీమతి హేమామాలిని, శ్రీమతి మీనాక్షి శేషాద్రి, నృత్య సాధన వలన ఆరోగ్యంగా, సంతోషంగా వుంటున్నారు. వారు యిప్పుడు యిస్తున్న ప్రొగ్రామ్స్‌లో వారి వయస్సు మనకు గుర్తుకురాదు.

ఇటివల పద్మశ్రీ గ్రహీత కోమలావరదన్, ప్రసిద్ధ శాస్త్రీయ నృత్యకళాకారిణి, రచయిత్రి, చిత్రకారిణి. ఆమె సంతోషానికి కారణం నృత్యసాధనే.

అలాగే సంగీత జగత్తులో సుప్రసిద్ధులైన శ్రీ జగజీత్ సింగ్, శ్రీ మంగళంపల్లి

బాల మురళీ కృష్ణగారు, పండిత్ జస్రాజ్, గాన గంధర్వ ఘంటసాల, స్వర్ణ కోకిల జిక్కి ,వారికి చెక్కుచెదరని చిరునవ్వును, సంతోషాన్ని ప్రసాదించింది సంగీతమే.

సంగీత జగత్తులో షెహనాయ్ సామ్రాట్ ఉస్తాద్ బిస్మిల్లా ఖాన్ గారి ముఖంలో ఎప్పుడూ కనబడే చిరునవ్వు, సంతోషాలకు, ఆయన వయస్సుకు సంబంధం లేదు. ఆయన వయస్సు సుమారు 80 సం॥లు వుండవచ్చు.

పండిట్ రవిశంకర్, జాకీర్ హుసేన్, పండిట్ రవికుమార్ శర్మ వంటి సంగీత వాయిద్య కళాకారుల మొఖంలో ఎప్పుడూ చిరునవ్వే కనబడుతుంది. వారి ముఖంలో కనబడే సంతోషం వారి సంగీత సాధన వలననే వచ్చింది. ఆ సత్యాన్ని అందరు సంగీత కళాకారులూ ఏకగ్రీవంగా అంగీకరిస్తారు. వారు సంగీతం ద్వారా సంపాదించిన సిరి సంపదలకంటే, గౌరవ పురస్కారాలకంటే, వారికి లభించిన సంతోషమే ప్రధానంగా పరిగణిస్తారు.

శ్రీమతి చిత్రాసింగ్, శ్రీ జగజీత్ సింగ్‌ల ఏకైక కుమారుడు స్వర్గస్థుడైనందు వలన కలిగిన దు:ఖం వలన తల్లి శ్రీమతి చిత్రాసింగ్ పాటలు పాడటం మానేసారు. సంగీత ప్రియులు నిరాశ చెందారు. కానీ తండ్రి శ్రీ జగజీత్ సింగ్ గారు తనకు కలిగిన దుఖాన్ని, సంగీతం ద్వారా దూరం చేసుకున్నారు. సంగీత సామ్రాజ్యంలో గజల్స్ సింగర్‌గా ప్రపంచ ప్రఖ్యాతి గాంచారు.

ప్రసిద్ధ భారత పాప్‌సింగర్ శ్రీమతి ఉషా ఉతుప్‌గారికి భారీ పర్సనాలిటీ వున్నా, 21 భాషల్లో హుషారుగా పాడుతూ ప్రఖ్యాతిగాంచారు. ఆమె పాడే పాప్ పాటలకు తగట్లు స్టెప్స్ కూడా వేస్తారు. ఎప్పుడూ సంతోషంగా కనబడతారు. ఆమెకు నచ్చనిది ఆమెభారీ రూపమే. ఆమె ధ్యేయం ప్రేమ సంగీతాల విలువను ప్రపంచమంతటా చాటడం. ఆమె ఆరాధ్యం మదర్ థెరీసా. ఉషగారి లో ఈ చైతన్యానికి, చలాకీగా వుండటానికీ మూలం ఆమె సంతోషమే. ఆమె సంగీత సాధనే.

ఏసుదాసుగారి పేరు వినగానే చక్కటి సినిమా పాటలే కాదు, శాస్త్రీయ సంగీతం కూడా గుర్తుకు వస్తుంది. ఆయన జన్మత: ఒక క్రిస్టియన్ అయినా శాస్త్రీయ సంగీత జగత్తులో, భక్తి గీతాలాపనలో ధృవతారగా తన స్థానాన్ని దృఢపరుచుకున్నారు.

సంగీత జగత్తులో మరువలేని మరొక తార శ్రీమతి ఎమ్.ఎస్ సుబ్బలక్ష్మిగారు ఆమె పాడిన వెంకటేశ్వర సుప్రభాతం, భజగోవిందం, విష్ణు సహస్రనామ స్తోత్రము వినని వారుండరు. సంగీతం ఆమెను వుత్సాహవంతంగా సుమారు 85 సంవత్సరాల పైనే

జీవించేలా చేసింది.

అనురాధా పోడ్వాల్, భక్తి రస సంగీతాన్ని ఆలాపిస్తూ, మంచిపేరు తెచ్చుకున్నారు. సంగీత సాధన వలన ఆమె ముఖం లో ఎపుడూ చిరునవ్వు, నిర్మలత్వమూ చూడవచ్చు.

పైన వుదహరించిన వారి ప్రతిభను చూసి, మనదేశంలోని వారే కాక, ఇతరదేశాలలోని వారు కూడా సెల్యూట్ చేస్తున్నారు. అభినందిసున్నారు. అభిమానిస్తున్నారు.

వీరందరి గురించి యిక్కడ ఉదహరించడానికి కారణం? ఈనాటి యువత వారి నుండి ప్రేరణ పొందాలని సూచించడమే. ఆటలు, సంగీతం వంటి వాటిని సాధన చేస్తే, యువతలో సంతోషం, ఉత్సాహం, చురుకుదనం, ఎక్కువవుతుంది. 'ఈ ఆటలు సంగీత సాధన కోసం సమయం లేదు' అని యువత చెప్పకూడదు. ఎందుకంటే వారు ఎంతో సమయాన్ని టి.వి. సినిమాలు, క్రికెట్ మ్యాచ్‌లు చూడటానికి, వృధా చేస్తున్నారు.

యువత అర్ధరాత్రి వరకు టి.విని, నీలిచిత్రాలనూ చూస్తూ, నిద్ర లేమి వలన నిరుత్సాహంగా కనబడుతుంటారు. తద్వారా వారిలోని వుత్సాహానికి, సంతోషానికి, అడ్డు కట్టలు వేస్తున్నారు. నగర శివార్లలోని క్లబ్‌హౌసెస్‌లలో, పబ్స్‌లలో అశ్లీల నృత్యాలలో పాలుపంచు కుంటున్న యువతీ యువకులు పోలీసులకు పట్టుబడుతున్నారు. వారికి మీడియావారి ప్రశ్నలను, వారి కెమెరాలను ఫేస్ చేసే ధైర్యం లేదు. కానీ, అవకాశమొస్తే మళ్ళీ అటువంటి నృత్యాలలో భాగం పంచుకోవాలనే కోరిక మాత్రం వుంది. వీరు తమ తమ భవిష్యత్తును, నిర్మాణాత్మకంగా రూపు దిద్దుకోలేక పోతున్నారు. సమయాన్ని దుర్వినియోగం చేస్తూ వారిలోని వుత్సాహాన్ని, సంతోషాన్ని దూరం చేసుకుంటున్నారు.

ISKCON అంటే INTERNATIONAL SRI KRISHNA CONSCIOUSNESS, వారి రాధాకృష్ణ మందిరాలు, రామకృష్ణ మఠం, శ్రీ పుట్టపర్తి సాయిబాబా పూజా స్థలం, గురుద్వారాలు వంటి సంస్థల పై విశ్వాసం వున్న యువతను స్టడీ చేశాను. వారికి భక్తి, శ్రద్ధ, వినయం, విధేయత చాలాయెక్కువ. వారిలో చాలామంది ప్రొఫెషనల్ కాలేజీలలో చదువుతున్న వుత్తీర్ణులైన వారుంటారు. వీరిలో డాక్టర్లు, ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు, మంచి సంస్థలలో మంచి ఉద్యోగాలు చేస్తున్నవారు, వుంటారు. వారిలో భక్తిశ్రద్ధలతో బాటు, చక్కటి కార్యనిర్వహణా సామర్థ్యాలు వుంటాయి. పేదలకు తిండిని పంపిణీ చేస్తారు. ఓల్డ్ ఏజ్ హోమ్స్, ఆర్ఫనేజ్ హోమ్సులను సందర్శించి వారికి సహాయాన్ని అందిస్తారు. యువతలో మానసిక వికాసాన్ని పెంపొందిచే మంచి రచనలు చేస్తారు. శిక్షణ తరగతులను ఏర్పాటుచేసి, ఎంతో విజ్ఞానాన్ని యితరులకు పంచుతారు. సత్సంగ్

ప్రోగ్రాంలను ఆసక్తి ఉన్న వారి ఇళ్ళల్లో ఏర్పాటుచేసి, భజనా కార్యక్రమాలను, గీతా సారాన్ని పంచే కార్యక్రమాలను చక్కగా నిర్వహిస్తారు. సంగీత, నాట్య కార్యక్రమాలను చక్కగా నిర్వహిస్తారు, పాల్గొంటారు. కానీ మనం పాశ్చాత్య నాగరికత పై మొగ్గు చూపిస్తూ మన సమయాన్ని, విలువలను, వృధా చేస్తున్నాము. మన నాగరికతను ప్రతిబింబించే సంగీతాన్ని నాట్యాలను, మరచి పోతున్నాము. సంతోషంగా వుండాలంటే సంగీతాన్ని నాట్యాలను, ఆటలను సాధన చేయాలి.

మనలో ఎంత సృజనాత్మకత వుంటే, మనకు అంత ఆనందం, తృప్తి కలుగుతుంది అయితే కొందరి నుండి మనం ప్రేరణ పొందాలి. వారు సమకాలీనులైనా మంచిదే, నేను, సినీనటుడు శ్రీ చంద్రమోహన్ గారి భార్య శ్రీమతి జలంధరగారి గురించి విన్నాను. చదివాను ఆమెకు సృజనాత్మకత చాలా ఎక్కువ. ఎప్పుడూ నవ్వుతూ, సరదాగావుంటారు. సంతోషంగా వుంటారు. వారి మంచి భావనలు, మంచి ఆలోచనలే ఆమె సంతోషానికి మూలం. మంచి గృహిణిగా, మంచి తల్లి గానే కాక, మంచి మానసిక విశ్లేషకురాలిగా గుర్తింపు పొందారు ఎన్నో వ్యాసాలు, కథలూ, నాటికలు, నవలలు, వ్రాసారు. వాటికి గుర్తింపుగా, పొట్టి శ్రీరాములు అవార్డు. 'గృహలక్ష్మి స్వర్ణ కంకణం' అవార్డు అందుకున్నారు.

'స్త్రీలకు సంసారం చాలా ముఖ్యం. అలా అని అదే జీవితం కాదు' అని అంటారు ఆమె. 'స్త్రీలు సంసార జీవితంలో పడి తమ వ్యక్తిత్వాన్ని చిన్నచూపు చూడకూడదంటారు'. మంచి పుస్తకాలు చదవడం, మంచి వ్యాపకాలు, పెట్టుకోవడం, నిర్మాణాత్మకమైన పనులు చేయడం అవసరం. దాని వలన తృప్తి, జీవితానికి సార్థకత, అవసరమైనపుడు జీవనోపాధి కలుగుతుంది. జలంధరగారి లాంటి గృహిణులనుండి ప్రేరణ పొందడం అవసరం. ప్రతి గృహిణిలోనూ ఏదో ఒక నైపుణ్యం, ప్రత్యేకత వుంటుంది. దాన్ని నిర్లక్ష్యం చేసి, గానుగ ఎద్దులా జీవితం సాగిస్తుంటే, తమకు, తమ పిల్లలకు న్యాయం చేయలేరు. ప్రగతి పథంలో వారి పాత్రను సమర్థవంతంగా నిర్వహించాలి. సమాజంలో, దేశంలో, ప్రపంచంలో వస్తున్న మార్పులను దృష్టిలో వుంచుకుని, స్త్రీలు మారాలి. వారి ప్రతిభకు గుర్తింపు వచ్చేలా కృషి చేయాలి. మన నాగరికతను ప్రతిబింబించే సంగీతాన్ని, నాట్యాలను, తమ పిల్లలకు నేర్పించాలి. ప్రతిభావంతులుగా తీర్చిదిద్దాలి.

ఉద్యోగస్థులుగాని, విద్యార్థులుగానీ, మరెవరైనాగానీ వారి ప్రథమ కోరిక, సంతోషంగా ఉండాలి, అని అనుకోవడమే. సంతోషం బజారులో కోనుక్కోడానికి దొరికే వస్తువు కాదు. కనుక సంతోషంగా వుండాలంటే మనం ఏంచేయాలి ? సంతోషానికి అవసరమైన కొన్ని అంశాలను యిక్కడ ప్రస్తుతించడం జరిగింది. సంతోషాన్ని సాధించాలంటే

తగిన సాధన, కృషి, అవసం.

## ప్రతి మనిషీ సంతోషంగానే ఉండాలనుకుంటాడు. సాధ్యమా ?

మనిషికి సంతోషమే సగం బలం. కనుక సంతోషం గురించి తర్కించు కోవలసిన అవసరముంది.

సంతోషం, సంతృప్తి, ఆనందం, ఆత్మీయతలు మనిషి యొక్క విలువలను పెంచుతాయి.

ఒత్తిడి (స్ట్రెస్) నుండి విముక్తి పొందాలంటే సంతోషంగావుండాలి.

నాణ్యతాయుతమైన జీవన విధానంలోవుంటుంది సంతోషం.

ప్రతిపనినీ క్రమ పద్ధతిగా, నాణ్యతాయుతంగా చేయడంలోనే వుంది సంతోషం. Quality is a way of life అవసరం.

ఇతరుల ఆనందాన్ని అభివృద్ధిని, ఉన్నతిని చూసి సంతోషించాలి.

ఔన్నత్యంగల పౌరుల జీవన విధానం చూసి సంతోషించాలి. వారి మంచి అలవాట్లను చూసి సంతోషించాలి. మనలో, మన పరిసరాలలో, మన కమ్యూనిటీ లో వస్తున్న మంచి మార్పులను చూసి సంతోషించాలి.

పోటీలో విజయం సాధించినందుకు సంతోషించాలి. మనకంటే మన పోటీదారులు చేసిన కృషిని గుర్తించి సంతోషించాలి. అటువంటి కృషి ఫలితాలను మనం పొందడానికి చేయవలసిన కృషిని చేయాలి. ఫలితాలు పొందాలి. సంతోషించాలి. - అన్ని రంగాలలో పోటీ అవసరమే. పోటీలో విజయం ఎవరిదైనా, ఆ విజయాన్ని చూసి సంతోషించాలి. ప్రయత్నలోపంలో ఉండదు సంతోషం.

మన విజ్ఞానాన్ని, జ్ఞానాన్ని, సంఘీభావాన్నీ వృద్ధి చేసుకోవడంలో ఉంది సంతోషం.

మన జీవితంలో, వృత్తిలో నైపుణ్యం (Operative Skills) ను వృద్ధి చేసుకుని సంతోషంగావుండాలి.

జీవితంలో మనకు, మన కృషి ఫలితంగా దొరికినదానితో సంతోషించాలి. ప్రతివ్యక్తీ తన చిన్నచిన్న పొరబాట్లు, అపజయాల గురించి మనస్సు పాడుచేసుకోకూడదు. సంతోషాన్ని దూరంచేసుకోకూడదు. ప్రతి పనినీ శ్రద్ధగా చేయడంలోనే వుంటుంది సంతోషం.

పెద్ద, పెద్ద విషయాలు అనగా ఆత్మజ్ఞానము, బ్రహ్మజ్ఞానము, ఆధ్యాత్మికచింతన వంటి

వాటిని అర్థంచేసుకోడంలో సంతోషాన్ని ఆస్వాదించాలి, అది భక్తి, వలననే సాధ్యం.

'ఆత్మజ్ఞానము' అంటే మనలో వున్న ఆత్మను గురించిన జ్ఞానమును పొందటం. నేను ఆత్మను, శరీరాన్ని కాదు అని తెలుసుకోవడం. ఆత్మను, మనం చూడలేం. ఆత్మకు పుట్టుక, చావులేదు. మన శరీరం నాశనం అవుతుంది కాని, దాని లోని ఆత్మ నాశనం కాదు.

ఆత్మ శరీరాన్ని విడిచినప్పుడు, ఆ మనిషి చనిపోతాడు. ఆత్మ మరొక శరీరంలో ప్రవేశించి నపుడు, ఆశరీరానికి జీవం వస్తుంది.

మనిషిలో జీవం/ఆత్మ వున్నంత వరకు, ఆత్మను పరిశుద్ధంగా వుంచడంలోనే వుంది సంతోషం. ఆత్మను అవగాహన చేసుకోవడంలోనే వుంది సంతోషం, సంతృప్తి. 'బ్రహ్మజ్ఞానము' అంటే సర్వకర్మలూ చేస్తూ ఫలితం దేవుని పై వదలడం. మన కర్మలను సక్రమంగా ఆచరించడంలోనే వుంది సంతోషం.

సత్సాంగత్యంలో ఉంటుంది సంతోషం. దుష్టులతో సాంగత్యం చేస్తే కలిగేది మనస్తాపమే.

సరళ స్వభావము - సంతోషానికి దారి నిస్తుంది.

ఆటలు, సంగీతం వంటివాటిని సాధన చేసే వాళ్ళలో, ఇష్టపడే వాళ్ళలో ఎక్కువ సంతోషం చూస్తాం.

ఆటలు, సంగీతం, నాట్యం, భజనలు చేసే వారి మనస్సు, ప్రశాంతంగా వుంటుంది. వీటి సాధనలో వారికున్న కష్టాల్ని తాత్కాలికంగా మరచిపోతారు. సంతోష భావన కలుగుతుంది.

సంతోషం, దుఃఖం, మోహం, మానసిక సంబంధములు. కనుక మానసిక వికాసం పొందడానికి సాధన చేస్తే, దుఃఖం, మోహం, దూరమవుతుంది. సంతోషం మన సామీప్యానికి వస్తుంది.

భక్తి, శ్రద్ధ, వినయం, విధేయతలు, విశ్వాసం ద్వారా మన సంతోషాన్ని స్వంతం, చేసుకోగలుగుతాము.

మనకు జ్ఞానం సంతోషాన్ని, అజ్ఞానం దుఃఖాన్ని ఇస్తాయి.

మానసిక వికాసం కోసం మనస్సును గమనిస్తూ వుండాలి (Watch చేస్తూవుండాలి) ఈ పదం లోని మొదటి అక్షరం W అంటే WORDS (మన మాటలు). A అంటే Actions

(ఆచరణలు) T అంటే Thoughts (మనభావనలు). C అంటే Character (మన శీలము / పద్ధతి). H అంటే Heart (మన హృదయం). వీటి విషయంలో జాగ్రత్త పడుతూ వుంటే సంతోషం మన స్వంతం అవుతుంది. వీటిలో అపస్వరాలు పలికితే సంతోషం దూరమవుతుంది. దుఃఖం దరిచేరుతుంది అంటారు పెద్దలు.

ఆవేదన, భయం, ఆందోళన, బాధలను దూరంగా వుంచగలిగితే, దుఃఖం దూరమవుతాది, సంతోషం, మన స్వంతమవుతుంది.

ఇతరులను ప్రేమించడం, సేవాభావం కలిగివుండటంలోనే వుంది సంతోషం.

శుభ ప్రదమైన పనులు (అంటే వివాహాలు, గృహప్రవేశాలు, పుట్టిన రోజులు) చేయడంలోనూ వుంటుంది సంతోషం. వాటికి వెళ్ళడంలోనూ వుంటుంది సంతోషం.

మన చదువు, చిత్తశుద్ధి, సంస్కారం మన సంతోషానికి మూలం.

మన అంతరంగిక శాంతి, మనకు సంతోషం, ఆనందం కలిగిస్తాయి.

ద్వేషం, దురాశ, అసూయ, అహంకారం, వ్యామోహాలు వ్యతిరేకత, వంటి వాటికి దూరంగా వుంటే, సంతోషం మనకు దగ్గరగా వుంటుంది.

మనభావనలు పరిశుద్ధంగా, పవిత్రంగా వుంటే, మన ఆలోచనలు, వాటి ఆచరణ పవిత్రంగా వుంటే, సంతోషం, సంబరాలు మన ఇంట్లోనే వుంటాయి.

ప్రేమ, సేవలకు ప్రతిరూపం సంతోషం, శాంతం, సహనము, సన్నిహితసంబంధాలు మన ఆస్తిగావుంటే ఫలితం సంతోషం.

వినయం, విధేయత, వివేకం మన పనిలో ఏకాగ్రత, విజయం సాధించాలనే బలీయమైన కోరిక, కృషి, వుంటేనే, సుఖఃసంతోషాలు మన స్వంతం అవుతాయి.

సిరిసంపదలూ, పేరుప్రఖ్యాతులూ కావాలంటే మనం సంతోషంగా వుండాలి. ఇతరులను సంతోషపెట్టాలి.

జీవితంలో మనకు దొరికినదానితోనే మనం సంతోషపడాలి. ఇతరులను చూసి అసూయపడకూడదు.

సంతోషం పరిమళద్రవ్యం లాంటిది. అది మనవద్ద వుంటేనే ఇతరులకు తెలుస్తుంది.

ఇతరులకు సహాయం చేయడంలోనే సంతోషం పొందాలి. సంతోషమే విజయం

మంచి ఆలోచనలు, మంచి చేతలు మనకు సంతోషాన్నిస్తాయి.

మనకు కావాలి అనుకున్నదంతా, మనకు వున్నాయని, మనకు వద్దు అనుకున్నదంతా మనకు లేదని అని అనుకుంటే సంతోషం, ఆనందం మన వద్దే వుంటుంది.

నోరు మంచిదయితే, ఊరు మంచిదవుతుంది, ఫలితం సంతోషం.

ప్రపంచానికి అత్యుత్తమమైంది, మనం ఇవ్వగలిగితే, ఆ సంతోషాన్ని స్వంతం చేసుకోవచ్చు.

క్రమశిక్షణ, కార్యదీక్షల ఫలితం ఆనందం, సంతోషం.

ఆనందదాయకమైన జ్ఞాపకాలు మనకు మిగలాలంటే తగిన కృషి చేయాలి.

ఆనందంకోసం కృషిచేస్తే, ఆనందమే మిగులుతుంది. దుఖం దూరమవుతుంది.

మన అందరి లక్ష్యం సంతోషంగా వుండటమే. మనం సంతోషంగా వుంటేనే, దాన్ని ఇతరులకు పంచగలం.

మన సంతోషం, మన మంచి భావనలు, మంచి ఆలోచనల పైనే ఆధార పడుతుంది

సుఖః శాంతులు మన వద్ద వుంటే, సంతోషంగా వుండగలం. సంతోషాన్ని ఇతరులకు పంచగలం.

మంచి అనే చిన్న మొక్కను నేడు నాటితే, అది పెద్దదై పుష్పించి, ఫలిస్తుంది. జీవితాన్ని సంతోష మయంచేస్తుంది.

మనలో ఎంత సృజనాత్మకత వుంటే, మనకు అంత ఆనందం, తృప్తి కలుగుతుంది.

ఉత్తమంగా మనవంతు మనం కృషిచేయాలి ఫలితం సంతోషం. ఫలితం బాగా లేకపోతే కృంగిపోకూడదు.

తక్కువ కోరికలున్నవాడే ఎక్కువ ధనవంతుడు, సంతోషవంతుడు.

తన శక్తిసామర్ధ్యాలను క్షుణ్ణంగా తెలుసుకొని, తెలివిగా మసలేవాడే, నిజమైన తెలివైనవాడు.

సంతోషంగా నవ్వే వ్యక్తి చివరి వరకూ సంతోషంగానే వుంటాడు. అన్నిటి కంటే గొప్ప మందు నవ్వు. చిరునవ్వుకు, కలానికి గొప్పశక్తి వుంది. వాటిని వాడుకోడంలోనే వుంది మన తెలివి.

ఎంతకాలం బ్రతుకుతున్నాం అన్నది ముఖ్యం కాదు ఎంత సంతోషంగా, చక్కగా బ్రతుకుతున్నాం అన్నది ముఖ్యం.

మన డబ్బు, సమయం, ప్రేమ, ప్రోత్సాహం, అవసరంలో వున్న వారికి అందిస్తే, శాంతి, సౌభ్రాతృత్వం, మన జీవితంలో చోటుచేసుకుంటాయి. వాటికి ఎవ్వరూ విలువ కట్టలేరు.

మనస్సు సంతోషంగా వుంటే అదే మనిషికి డబ్బు, కీర్తి తెస్తుంది.

ముఖస్తుతి కృత్రిమమైనది. నిజమైన సంతోషాన్నివ్వదు.

ఆనందాన్ని, అందరికి పంచితేనే పరిపూర్ణత నిస్తుంది. కొంత మనకూ అంటుతుంది.

ఇతరుల సంతోషం కొరకు చేయగలిగినంత చేయాలి. కృతజ్ఞతను ఆశించి మాత్రంకాదు.

ప్రేమ, శాంతి, ఆశయం, సమిష్టిగా వుండటం, మానవతా సంబంధాలను పెంచుకోడం, మన ఆనందానికి మూలం.

సంతోషంగా వుండాలంటే కష్టాలలో కూడా ఓర్పుగా వుండాలి.

జీవితాన్ని సంతోషంగా జీవించాలి, కానీ మన స్వాతంత్ర్యాన్ని ఫణంగా పెట్టకూడదు.

కొంతమంది, ఎప్పుడు వెళ్ళినా, ఎక్కడకు వెళ్ళినా, ఆనందాన్నే తీసుకువస్తారు.

మనకున్నది, ఇతరులలో పంచుకోడంలోనే ఆనందం వుంటాది.

నిజమైన ఆనందం, తీసుకోడంలో వుండదు, ఇవ్వడంలో వుంటుంది.

విశాలహృదయం వుంటే, జయం నిన్నేవరిస్తుంది. సంతోషంనీదే. సంకుచితమనస్సు వుంటే అపజయం నీదే.

మార్పును ఆశిస్తే అంగీకరిస్తే, ఆచరిస్తే జీవితం ఆనందదాయకం అవుతుంది

మానసిక ఆరోగ్యమే మహాభాగ్యము, మానసిక ఆరోగ్యం, శారీరిక ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తుంది. శారీరిక ఆరోగ్యం – మానసిక ఆరోగ్యాన్ని ప్రభావితం చేస్తుంది.

ఆరోగ్యమే మహాభాగ్యం. మానసికంగా కృంగి పోతే మనిషికి మనుగడ కష్టం.

అనుకున్నది సాధించలేకపోయినప్పుడు, జీవితం అంతటితో సమాప్తం కాదు. మరో పద్ధతి అవలభించి మరో ఉన్నత స్థానాన్ని చేరుకోడానికి ప్రయత్నించాలి.

నటుడివి కాలేక పోతే, నటన గురించిన విశ్లేషకుడిగా విజయం సాధించవచ్చు.

శరీరానికి తలిగిన గాయంకంటే, మనస్సుకు తగిలిన గాయం మాన్పుట కష్టం.

మనశ్శాంతి కావాలన్నా, ఆనందంగా వుండాలన్నా లక్ష్యసాధన ముఖ్యం.

దూరదృష్టి లేనివారికి, మనశాంతి, ఆనందం దూరంగావుంటాయి.

సమస్యలున్నపుడు కూడా, సాధారణంగా వుంటే, అవి తీరినపుడు ఆనందంగా వుంటుంది.

సమస్యలు వస్తాయి. పరిష్కారం అవుతాయి. సమస్యలున్నపుడు కూడా ఆనందంగా ప్రశాంతంగా, నిష్కల్మషంగా నవ్వడం సాధన తోనే సాధ్యం.

మనస్సులో శాంతి వుంటే, ఆనందం వుంటుంది. ఆనందం వుంటే, అదే పరమాత్మ నిలయం.

ఒకరి క్షేమం కోసం మరొకరు కాంక్షిస్తే దాని లోనే వుంది అసలైన ఆనందం.

భార్యాభర్తల అన్యోన్యతలోనే వుంటుంది నిజమైన ఆనందం.

ఆనందాన్ని పెంచాలంటే, దాన్ని ఇతరులకు పంచాలి.

చిరునవ్వుకు వెలకట్టలేం.అది మనకు, మన ముందున్న వాళ్ళకూ ఎంతో ఆనందాన్నిస్తుంది. చిరునవ్వు సహృద్భావ వాతావరణాన్ని సృష్టిస్తుంది.

చిరునవ్వు, స్నేహాన్ని, ప్రేమను, జీవితాన్ని, పెంచుతుంది. డబ్బు చేయలేనిపని, ఒక్కొక్కసారి చిరునవ్వు చేస్తుంది. చిరునవ్వు శత్రువులను మిత్రులుగా చేస్తుంది. చిరునవ్వు క్రొత్తవాళ్ళను కూడా మీవైపు ఆకర్షిస్తుంది. చిరునవ్వు మీ సంస్కారాన్ని ఇతరులకు తెలుపుతుంది.

చిరునవ్వు విజయానికి పునాది. చిరునవ్వే ఆభరణం కలవారికి మానసిక విశ్రాంతి సులభం.

చిరునవ్వు ఇతరులలో ఆనందాన్ని ఉత్సాహాన్ని ప్రేరేపిస్తుంది. చిరునవ్వు ఇతరులకు విషాదాన్ని అందివ్వదు, ఆనందాన్నే అందిస్తుంది.

గర్వం, కృతఘ్నత, చెడ్డ మనస్సు, తోడుదొంగలు. వీటికి సంతోషం ఎప్పుడూ దూరంగానే వుంటుంది.

అర్హతలు లేకపోయినా, కోరికలే గుర్రాలైతే, కొంపలు మునిగి పోతాయి. సంతోషాన్ని దూరంచేస్తాయి.

ఏపనైనా చక్కగా చేయాలంటే ముందు స్వయంగా చేసిచూపగలగాలి. ఫలితం

సంతోషం.

దుఃఖం, బాధలనుండి దూరంగా వుండాలనుకుంటే, సుఖాలే కావాలనే కోరికను, దూరంగా వుంచాలి, ఆ వివేకమే మహదానందం.

మనల్ని మనం ముందుగా సంస్కరించుకుని, సత్ప్రవర్తనను అలవరుచుకుంటేనే, సుఖంగా సంతోషంగా వుండగలం.

విశాలహృదయం, వినమ్రత, విధేయత, సంస్కారం, ఫలితం - సంతోషం.

ఇతరులను, తప్పుపట్టి, విమర్శించే ముందు, మన తప్పుల్ని మనం గుర్తించాలి. విమర్శించు కోవాలి.

మనపై మనకు నమ్మకం వుంటేనే, ఎపుడూ నవ్వుతూ నవ్విస్తూ వుండగలం.

మనం సుఖాలకు అలవాటు పడుతున్నాం. కానీ అంత సంతోషంగా వుండటంలేదు. సుఖాలలో వున్న వారికీ దు:ఖాలు తోడుగా వుంటాయి. కారణం స్వార్థం.

మనుష్యులు రెండు రకాలు, ఒకరు మన వద్దకు ఎప్పుడైతే వస్తారో, ఆనందాన్ని / సంతోషాన్ని కూడా తీసుకు వస్తారు. మరొకరు మన నుండి ఎప్పుడైతే వెళ్ళిపోతారో, ఆనందాన్ని / సంతోషాన్ని మనకు కలుగచేస్తారు.

సంతోషం, దయ, ప్రేమ వంటి విత్తనాలను ఇప్పుడు నాటితే, అంకురించి, పుష్పించి, ఫలించి, సత్ఫలితాలను మనకు భవిష్యత్తులో అందజేస్తాయి.

సంతోషం, దయ, ప్రేమ, వీటిని పంచడం, మనం లాభం పొందటానికే.

సంతోషం మన హృదయంలో నుంచే వస్తుంది. బయట ప్రపంచనుండి కాదు.

ఉత్సాహం, పట్టుదల, సంతోషం మన జీవితానికి మేతలాంటివి. మనస్సు వుంటే మనం ఎక్కడికి వెళ్ళినా అవి మనతోనే వస్తాయి.

నిన్నటి తప్పులను సరిగ్గా గుర్తించి, విశ్లేషించుకుని వాటి నుండి పాఠాలు నేర్చుకుంటే సంతోషం మన వద్ద వుంటుంది. అపుడే మనం తెలివైన వారిగా పరిగణింప బడతాం.

ఇతరుల ఆత్మగౌరవాన్ని గుర్తించి, గౌరవిస్తే మనకు మిగిలేది సంతోషం, పోయేది అసౌకర్యం.

మన కష్టనష్టాలను మనం గుర్తించి వాటిని నివారించడం ముఖ్యం. అపుడే సంతోషం మనవంతు అవుతుంది.

చీకటి రాత్రిలో కూడా, ఒక్కచిన్న దిపం వెలుగు చాలా వ్యత్యాసం చూపుతుంది. మనిషి చాలా కష్టాలలో వున్నపుడు. మనం చేసే చిన్న సహాయం కూడా అతన్ని ఎంతో సంతోషపెడుతుంది.

మన మనస్తత్వం మంచిదైతే సంతోషాన్నితెస్తుంది, పంచుతుంది.

నెగెటివ్ థింకింగు (చెడు ఆలోచనా సరళి) కష్టాలను తెస్తుంది, పోజిటివ్ థింకింగు సుఖాలను తెస్తుంది. ఒకటి మనల్ని నాశనం చేస్తుంది. మరొకటి మన అభివృద్ధికి తోడ్పడుతుంది.



<u>చాణుక్య సూక్తులు :-</u>

1) పళ్ళు కాయని పనికిరానిచెట్లపై పిచ్చుకలు నివాసముండవు. అలాగే పనికిరానివాటితో సహవాసం హర్షదాయకం కాదు.

2) మనిషి పుట్టుకతో గొప్పవాడు కాదు. అతను చేసిన మంచిపనుల వలన గొప్పవాడవుతాడు.

3) మనపిల్లలను మొదటి ఆరు సంవత్సరాలు ప్రేమతో పెంచాలి. పది సంవత్సరాలు వచ్చేవరకు అవసరాన్ని బట్టి మందలించాలి. వారి యవ్వనదశలో స్నేహితునిలా ప్రవర్తించాలి. అలాంటి పిల్లలే మనకు మంచి స్నేహితులు.

4) మూర్ఖులకు మానసిక వికాసాన్ని పెంపొందించే మంచిపుస్తకాలు అవసరం లేదు. గుడ్డివానికి అద్దం అవసరం లేదు. కాని మనిషికి మూర్ఖత్వాన్ని దూరం చేసుకోవాల్సిన అవసరంఉంది.

5) చదువు, సంస్కారం కల వ్యక్తులు అందరిచేత గౌరవించబడుతారు. చదువు, జ్ఞానం, అందం, యవ్వనం కంటే గొప్పవి.

6) అంతస్థును చూసి స్నేహంచేస్తే ఇబ్బందులుండవు. మనకంటే గొప్పవారితోకాని, లేక మనకంటే తక్కువవారితోకాని స్నేహం చేయడం వలన కొన్ని సమస్యలు ఉత్పన్నంకావచ్చు

7) స్నేహం చేయడంలో స్వలాభం చూసుకోకూడదు. స్వలాభం లేకుండా చాలామంది స్నేహం చేయరు అనేది నిజం.

# కష్టాలు / సమస్యలు - పరిష్కారాలు

కష్టాలు / సమస్యలు లేని వారు ఎవ్వరు ? కష్టాల్లో కూడా, సమస్యల్ని, మానసిక బలహీనతలను అధిగమించాలి. కష్టాల్లో నిరాశను, దూరంగా వుంచాలి. మానసిక ధైర్యాన్ని కూడగట్టుకోవాలి స్నేహితులు, ఆత్మీయుల, ప్రోత్సాహాన్ని సద్వినియోగం చేసుకోవాలి. ఏదైనా పోగోట్టుకున్నచోటే వెదుక్కోవాలి. మానసిక సంఘర్షణలో అనుకున్నది సాధించాలి. అదే ధ్యాస, అదే ధ్యేయంతో వుండాలి. కష్టాల నుండి బయటపడే మార్గాల అన్వేషణలో అనుకున్నది సాధించాలి. ఆత్మవిశ్వాసంతో ప్రణాళికలు రూపుదిద్దుకోవాలి. అడ్డంకులను ఎదుర్కోవాలి. భగీరథ ప్రయత్నం చేయాలి. భగీరధుడు ఎన్నో అడ్డంకులను ఎదుర్కొని దేవ గంగను దివి నుండి భూమిపైకి మళ్ళించి యశస్సు గడించాడు. ఎన్నో కష్టాలను ఎదొర్కొని శ్రమించి తద్వారా జీవిత సార్థకతను సాధించటం. దిన్నే యశస్సాదన అని అంటారు. ప్రతి వ్యక్తీ అంచెలంచెలుగా తన ప్రతిభను వెల్లడించాలి. తన ప్రయత్నంలో కష్టాలు, ఓటమి కలిగితే భయపడకూడదు. కృంగి పోకూడదు ప్రయత్నలోపం లేకుండా, దీక్షతో కృషి చేయాలి.

అబ్రహం లింకన్, 8 సార్లు దేశాధ్యక్ష పదవికి పోటిచేసి ఓడినా, దీక్ష, పట్టుదల, విడిచిపెట్టకుండా, కృషిచేసి, తోమ్మిదోసారి, అఖండ విజయం సాధించి దేశాధ్యక్షునిగా గెలిచాడు. బీదవాడైన లింకన్ కృషితో నాస్తి దుర్భిక్షం అని నిరూపించాడు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచాడు. యశస్వి అయ్యాడు.

థామస్ ఎడిసిన్ తన ప్రయోగాలలో 900 సార్లు విఫలుడయ్యాడు. సహనంతో కృషిచేసి విద్యుద్దీపాన్ని కనుగొని మనకు చీకట్లో కాంతిని ప్రసాదించాడు. యశస్వి అయ్యాడు. ఫలితం అతని కృషి ఈనాడు మనకు సౌకర్యం.

యశస్సు గడించిన కొద్ది మందిపడిన కష్టాలను కృషిని తలచుకుంటే మనకున్న కష్టాలు, లెఖ్ఖకురావు. ఉదాహరణకి 'ప్యారడైజ్ లాస్ట్' లాంటి అనేక గ్రంధాలను రచించిన జాన్ మిల్టన్ ఒక గుడ్డివాడు.

నెపోలియన్ కష్టాలకోర్చి ఎన్నో విజయాలను సాధించాడు. కానీ నెపోలియన్ చర్మ వ్యాధి పీడితుడు. జర్మనీ సంగీత విద్వాంసుడు బిథోవెన్ బధిరుడు (చెవిటివాడు).

డిమోస్తనీస్ గొప్ప ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన వక్త. కానీ తొలిదశలో అతను ఒక నత్తివాడు. వాళ్ళకు కృషి, పట్టుదల, దీక్ష, ఆయుధాలు. కష్టాలలో కూడా సుఖాలను, విజయాలను

వారు వెతుక్కున్నారు. అంకితభావం, ధృఢ నిశ్చయం, కఠోరపరిశ్రమల వలన సమస్యలను దూరం చేసుకోవచ్చు. ఎవరోవచ్చి మన సమస్యలను తీర్చుతారు అని అనుకోవడం మూర్ఖత్వం.

మనలో ఎక్కువ మంది సాధారణ వ్యక్తులుగా ఎందుకు మిగిలి పోతున్నాము? మనకు మన బాధ్యతల పట్ల భయం. మనం సమస్యలను ఎదుర్కోవడంలో వెనుకంజ వేస్తాము. మనకు సోమరితనం ఎక్కువ. కనుక సాధారణ వ్యక్తులుగా మిగిలిపోతున్నాము. మనం కష్టాలను, సమస్యలను చూచి భయపడిపోతున్నాము. ఛాలెంజస్‌ను, సమస్యలను ఎదుర్కోవడంలోనే మన సామర్థ్యం బయట పడుతుంది. సహనం, పట్టుదలతో కార్యసాధనపై దృష్టి పెడితే అనవసర విషయాలపై ధ్యాస మళ్ళదు. గాసిప్ చేసే వాళ్ళు, బాధించే మాటలు, చేష్టలకు మనం లొంగిపోకుండా బాధ్యతగల వ్యక్తులుగా ప్రవర్తిస్తే మంచిపేరు వస్తుంది.

కష్టాలకు, సమస్యలకు భయం, ఆందోళన తోడుకాకూడదు. అవి మానసిక డిప్రషన్‌కు దారి తీస్తాయి. మానసిక బలహీనతలకు, ఆత్మహత్యలకు కూడా దారితీస్తాయి. అలా కాకుండా రిలాక్స్ అవడానికి ప్రయత్నించాలి.

ఒత్తిడి (స్ట్రెస్) నుండి దూరంగా వుండాలంటే శ్వాసపై ధ్యానం వుంచాలి. అంటే ఎక్కువ గాలి పీల్చి, అంతేసేపు శ్వాసను భందించి, తర్వాత నిమ్మదిగా పీల్చిన గాలిని బయటకు వదలాలి. అలా 15 నిమిషాలు చేయాలి. దీన్నే ప్రాణాయామం అంటారు. ఇలా శ్వాసపై ధ్యాసపెట్టి ఎక్కువ ఆక్సిజన్‌ను మన ఊపిరితిత్తులకు, మెదడుకు అందించడం వలన కొంత ఊరట కల్గుతుంది. ఫ్రెష్‌గా, రిలాక్స్‌డ్‌గా వుంటే సమస్యలనుండి కలిగే బాధ తగ్గుతుంది.

మరొక చిట్కా కష్టాలు సమస్యలువున్నపుడు, విశ్రాంతిగా కూర్చుని మనస్సులోనే కాస్త తక్కువ భయాన్ని కలిగించే పరిస్థితిని వూహించుకోవాలి. మనకంటే ఎక్కువ కష్టాలు, సమస్యలు వున్నవాళ్ళతో మనల్ని పోల్చుకుని, వారికంటే మనం చాలా అదృష్టవంతులం అనుకోవాలి. ప్రమాదం జరిగితే కలిగిన బాధలో డిప్రెషన్‌లోకి వెళ్ళేకంటే, కాళ్ళుచేతులు పోలేదుగా, ప్రాణాలు పోలేదుగా అని సరిపెట్టుకుంటే కొంత బాధ తగ్గుతుంది.

సమస్యల ఒత్తిడి తగ్గించుకోవాలంటే సంగీతం (మ్యూజిక్), మంచి పాటలు, వింటూ కూర్చోవాలి. లేక పోతే మంచి హాస్య ప్రధానమైన సినిమా చూడాలి. అంతేగాని, సమస్య నుంచి దూరం కావడానికి మద్యపానం చేస్తూ దానికి బానిస అయితే మరొక సమస్య తోడవుతుంది.

# వృత్తిలో విజయసాధన

వృత్తిలో (కేరీర్‌లో) విజయసాధన అవసరం. మన వృత్తి పట్టుదల, ఆత్మవిశ్వాసం, కష్టపడే తత్వం, నీతి, నిజాయితీ వుంటే చాలు పరాజయం మనకి దూరంగా వుంటుంది. ఏదైనా సాధించగలం మన ఆత్మవిశ్వాసం మనల్ని ముందుకు నడిపిస్తుంది.

క్రొత్తగా కేరీర్ మొదలుపెట్టే వారికి కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కానీ అపుడు తీసుకున్న సరైన నిర్ణయాల పైనే వారి భవిష్యత్తు ఆధార పడుతుంది. కనుక నిదానంగా ఆలోచించి, అన్ని కోణాలనుండీ పరిస్థితులను గమనించి, వాస్తవాలను పరిశీలించి, మనకు నచ్చిన కేరీర్‌ను ఎన్నుకోవాలి. అపుడు మనకు నిజంగా కష్టపడుతున్నట్లు వుండదు. (we will enjoy our work) ఫలితాలు మనకు యిష్టంవచ్చినట్లుగా, మన మనస్సుకు నచ్చినట్లుగా వుంటాయి. మనలో అలసట వుండదు. మనకు నచ్చని కేరీర్ లో (వృత్తిలో) మనకు మిగిలేది అలసట, అసంతృప్తి మాత్రమే.

మన బలాలు, బలహీనతలు (strengths and weaknesses) మనకు తెలిసినంతగా యితరుల ఎవరికీ అంత బాగా తెలియవు.

మనకు నచ్చిన కెరీర్‌లో పైకిరావాలని మనకు వుంటే, మన Strengths మనకు మరింత ఉత్సాహాన్ని యిస్తాయి. నాకు నచ్చిన పనిని నేనెలాగైనా సాధిస్తాను అనే ఆత్మవిశ్వాసం మనకు వుండాలి. అదే ముఖ్యం. అదే మనల్ని సక్సెస్ (విజయం) వైపుకు తీసుకు వెడతుంది. కష్టపడాలి. కావలిసినది సంపాదించాలి. కానీ ఈ రోజులో యువతీ యువకుల్లో (అధిక శాతం) మేం ఏ పనైనా చేయగలం. చేస్తాం. అనే ఆత్మవిశ్వాసం కనిపించడం లేదు. ఆ ఆత్మవిశ్వాసం, జపాన్, చైనా, కొరియాకు సంబంధించిన యువతలో ఎక్కువగా కనబడుతుందని, విశ్లేషకులు చెబుతున్నారు.

అందుకే ఆ దేశాల యువత మనకంటే ఇండస్ట్రియల్‌గా, ఆర్థికంగా ముందుకు పోతున్నారు వారికి, సృజనాత్మకత (Creativity), అంకితభావం Commitment చాలాఎక్కువ, అని విశ్లేషకులు చెబుతున్నారు.

కానీ మన యువత ప్రపంచంలో ఎవరికీ తీసిపోదు. ఆత్మవిశ్వాసం పెంపొందించుకోగలిగితే చాలు. Creativity, Commitment కావాలి. మన యువతకు కావలిసింది 5 D's. 1) DESIRE, 2) DEDICATION, 3) DEVOTION, 4) DISCIPLINE, 5) DETERMINATION కోరిక, అంకితభావం, ఆరాధన, క్రమశిక్షణ, పట్టుదల కావాలి. మనం

ప్రయత్నించనంత వరకూ, ఏం చేయగలమో ? మన శక్తి ఏమిటో ? మనకు తెలియదు. గతంలో జరిగిన మంచి నుండి పాఠాలు నేర్చుకుని భవిష్యత్తును అభివృద్ధి చేసుకోవాలి (Learn from the past to improve your future).

విజయం సాధించాలంటే ప్రయత్నలోపం వుండకూడదు. ప్రయత్నించడంలో కొన్నిసార్లు పొరబాటు జరుగుతుందని భయపడి వెనుకంజవేస్తే. జీవితంలో ఏమీ చేయలేము. విజయం సాధించలేము. కష్టేఫలీ అన్నారు పెద్దలు. ఈ సంకల్ప లోపం వుండకూడదు. మన స్థితిగతులు మన సంకల్పములపైనే ఆధారపడి వుంటాయి.

కనుక విజయానికి కావలసినవి ఏమిటి?

1. ఆశయం (Ambition)
2. లక్ష్యం (Target)
3. స్పష్టత (Clarity)
4. ప్రణాళిక (Planning)
5. మానవసంబంధాలను మెరుగు పరుచుకోవాలి (Improving Human Relationships)
6. No Communication Gap
7. పోజిటివ్ థింకింగ్ (Positive Thinking)
8. ఇంగిత జ్ఞానం (Common Sense)
9. ఏకాగ్రత (Concentration)
10. సామర్థ్యం (Capability)
11. నాయకత్వ లక్షణాలు (Leadership Qualities)
12. ప్రేరణ (Inspiration)
13. టైమ్ మేనేజ్‌మెంటు (సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం)
13. రిస్క్ టేకింగు (సాహసం చేసే చొరవ)
14. నిర్వహణ (ఆర్గనైజింగు కేపబిలిటీస్)

అన్నిటికంటే ముందు చదువు, జ్ఞానం (knowledge), భాష (Vocabulary), సంభాషణ (Speaking Art) నేర్పరితనం (Skills) వృద్ధి చేసుకోవాలి. కృషి చేయాలి.

అనుకున్నవన్నీ అతి సులువుగా అందుబాటులోకి రావు. అందుబాటులో వున్నవన్నీ అరచేతిలోకి వచ్చివాలవు. అలాఅని ప్రయత్నలోపం, ప్రయత్నమే మానుకోవడం, అసమర్థతకు నిదర్శనం.

మీకు తెలుసు. జీవితం అందరికీ పూలపాన్పు కాదు. పుట్టుకతోనే అందరూ బంగారు వూయలలో వూగలేరు. కొందరికి మాత్రమే పూర్వజన్మసుకృతం వలన యిది సాధ్యం. అయితే స్పష్టమైన లక్ష్యం ఆశయం, కృషి వలన భవిష్యత్తులో మరికొందరికి జీవితం పూలపాన్పు అవుతుంది, అది మన చేతిలోవుంది, ధృఢచిత్తంతో సరైన దిశలో పోరాడితే అనుకున్నది సాధిస్తారు. సత్ఫలితాలు పొందగలరు. యిక్కడ వుదహరించడంలో నా ముఖ్య ఉద్దేశ్యం మీ వృత్తిలో మిమ్మల్ని కార్యోన్ముఖులను చేయాలనేదే నాకిష్టమైన వ్యాపకం మీకు ప్రేరణ యివ్వాలి. మీకున్న అపారమైన శక్తిని మీరు ఎలా వుపయోగించుకోవాలో మీముందు వుంచాలనేదే నాతపన. మీ లక్ష్యసాధనకు మీ మానసిక శక్తి ఎంతో వుపయోగపడుతుంది. మనసులోని బలమైన కోరికలను దేన్నైనా మీ మానసిక శక్తితో నెరవేర్చుకోవచ్చు. మనస్సు వుంటే మార్గం వుంటుంది. మీ కేరీర్‌లో మీరు దేన్నైనా సాధించాలనుకోవడంలో రాజీపడకూడదు. పరిస్థితి అనుకూలించకపోతే మార్గాన్ని మార్చుకోవాలి. మనస్సు వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన పుస్తకాలు, వ్యాసాలు చదవాలి. అవి మీ ఊహలకు మంచి రూపునిస్తాయి.

మీ మనసులో చాలా ఊహలుంటాయి. మీ మనస్సు పారాచూట్ లాంటిది. మీ మనస్సును తెరిస్తేనే మీ ఊహలు పారాచూట్‌లా బయటకు వచ్చి ఎగురుతాయి. అలావచ్చిన ఊహలకు ఒక రూపాన్ని యిస్తే మీరు అనుకున్నది సాధించగలుగుతారు. లేకపోతే మరునాడు వాటిని మరచిపోతారు.

మీ కేరీర్‌లో అపజాయాలు ఎదురైతే వాటిలోనే విజయాలను వెదకాలి. ఇది ప్రోయాక్టివ్ థింకింగ్ ద్వారానే సాధ్యం. జయం కావాలంటే ముందు చూపు వుండాలి. మీ కేరీర్ లో మీరు జయం పొందాలని అకాంక్షిస్తున్నాను. జీవితం ఒక పోరాటం. పోరాటంలో విజయంవుంది. ఆ విజయాన్ని సాధించడానికి కావలిసింది కేవలం కృషి మాత్రమే.

కష్టాలు సమస్యల నుండి బయటపడాలి అదే గమ్యం. ఈ గమ్యం సాధించటానికి చాలా కష్టపడాలి. దీనికి మానసిక వికాసం అవసరం. దీనికి కమిట్‌మెంట్ కావాలి. కమిట్‌మెంటు లేకపోతే సమస్యలు సమస్యలుగానే మిగిలిపోతాయి. ఓటమికి దారి తీస్తాయి. ఓటమికి పరాకాష్ట ఆత్మహత్య కావచ్చు.

# జయాపజయాలు

మన వృత్తిలో కొన్ని జయాలు, కొన్ని అపజయాలు, కలగడం సామాన్యం. జయాలు – సంతోషం కలిగిస్తాయి. మనం ఆర్థికంగా నిలద్రొక్కుకోవడం జరుగుతుంది. కానీ మన వృత్తిలో (కెరీర్‌లో) అపజయాలు కలిగితే, నిరాశ, నిస్పృహ, అవమానం, టన్షన్, కోపం, ఆందోళన కలగడం సహజం. ఎపుడైతే మనం టెన్షన్‌లో వుంటామో అపుడు అనేకరకాలైన మానసిక ఆందోళనలు మనలో వస్తాయి. టన్షన్, కోపం, క్రోధం, భయం, ఆందోళన, విసుగు, అవమానం, అనుమానం వంటి మానసికభావాలు ఒక దాని కొకటి ముడిపడివుంటాయి.

ఒక్కొక్క సారి పర్యవసానం చాలా చికాకు కలుగచేయవచ్చు. తోటి వారితో మనస్పర్థలు, ఘర్షణలకు తావివ్వవచ్చు. భార్యా పిల్లలు, తల్లిదండ్రులపై కూడా చెడు ప్రభావం పడవచ్చు. ముఖ్యంగా ఆఫీసులో జరిగిన విషయాలు ఆఫీసువరకు, పరిమితంచెయ్యాలి. ఇంటికి తీసుకురావడం వలన ఇంట్లోని వాతావరణం కలుషితమవుతుంది. దాన్ని సరిదిద్దడానికి చాలా కష్టపడాలి.

కోపం, క్రోధం, భయం, ఆందోళన, విసుగు, ఒత్తిడి, మనలో వున్నప్పుడు, సంయమనం పాటించడం చాలా అవసరం. తద్వారా ఈ మానసిక భావాలు మనకు మనఃశాంతిని దూరం చేయవు. తార్కికంగా ఆలోచించడం వలన మనకు టెన్షన్ (ఒత్తిడి) దూరమవుతాది. తద్వారా జరిగింది జరిగి పోయింది, దాన్ని సరిదిద్దటం సాధ్యం కాదు, అని నిర్ధారణకు వస్తాం. eg. Promotion రాలేదు. 'ఎన్నోఆశలు పెట్టుకున్నాను. కానీ రాలేదు', అని టెన్షన్ పెంచు కోవడం ద్వారా కోపంతెచ్చు కోవడం ద్వారా, పై ఉద్యోగులతో ఘర్షణ పడటం వలన, క్రింది ఉద్యోగులను, ఇంట్లో వాళ్ళను తప్పుబట్టి తిట్టడం వలన, చేజారిన ప్రమోషను రాదు. పైగా మనఃస్పర్థలు పెరుగుతాయి. కోపం, క్రోధం, ఆందోళన, విసుగు, అవమానం వంటి మానసిక భావాలు మరింత కృంగ దీస్తాయి. కోపం, ప్రదర్శిస్తే, ఒక్కోసారి, మనల్నే సిగ్గుతో తలవంచుకునేలా చేస్తుంది. అనుకున్నది, జరగక పోతే కోపం రావడం, disappoint అవడం సహజం. అవి సహజమైన ప్రక్రియలు. కాని కోపం వలన, టెన్షన్ పెంచుకోవడం వలన, మనం ఏదీ సాధించలేమని, కమ్యూనికేషన్ ద్వారా మాత్రమే కొంత సింపథీని (సానుభూతిని) పొందగలమని తెలుసుకుంటే, మనలో టెన్షన్ పెరగదు.

మనకి కోపం వచ్చినట్లు సంబంధిత వ్యక్తులకు తెలియచేయడానికి అరవనక్కరలేదు. తిట్ల వర్షంకురిపించనక్కర లేదు. కొట్టవలసిన పనిలేదు. ముభావంగా వుండిపోతే, సంబంధిత

వ్యక్తుల మనస్సు కలత చెందుతుంది, సానుభూతి పెరుగుతుంది. కనుక మనకు కోపం తెప్పించిన విషయాన్ని విశ్లేషించుకుని రాజీపడటం మంచిది.

సామాన్యంగా కోపం వచ్చినపుడు మనఃశాంతి పొందాలంటే ధ్యానం గాని, దైవనామస్మరణ గాని, చేయాలి. కోపం తగ్గడానికి 1 నుండి 10, 10 నుండి 1 వరకు అంకెలను, లెక్కపెడుతూ వుండటం చేయాలి. లేకపోతే కోపం వచ్చినప్పుడు, మనలో టెన్షన్ పెరిగి పోతున్నపుడు. ఏదైనా హాస్య భరితమైన సినిమాకు వెళ్ళాలి. లేదా ఏదైనా జోక్‌ని గుర్తుచేసుకోవడమో, మనకిష్టమైన వ్యక్తి నవ్వు ముఖాన్ని గుర్తు చేసుకోవడమో మంచిది. లేదా ఏదైనా మంచి పుస్తకాన్ని చదవాలి.

కోపం వచ్చినప్పుడు, దాన్ని మనసులో దాచుకుని దాని గురించే ఆలోచిస్తూ కూర్చుంటే ఆ కోపం లావాలా ఉడుకుతూ, అగ్ని పర్వతంలా పగులుతుంది. కనుక కోపం తెచ్చుకోకుండా ఒక ప్రణాళిక ప్రకారం పనిచేసి, 'ఈసారి తప్పిపోయిన ప్రమోషన్‌ను రాబోయే సంవత్సరంలో చేజిక్కించు కోగలను', అని ఆలోచించాలి. దానికి అనుగుణంగా కార్యాచరణ లో ముందడుగు వేయాలి. అపుడు అవతలి వ్యక్తి యొక్క ప్రేమని, సానుభూతిని పొందుటకు, క్యాష్ చేసుకోడానికి వీలు అవుతుంది. 'కోపం వచ్చినపుడు సాలెపురుగుని గుర్తు చేసుకోండి' అన్నారు. కోపానికి బద్ధ శత్రువు ఓర్పు. ఓర్పుకి ప్రతీక సాలెపురుగు. అది మనకు ఓర్పుగా, ప్రశాంతంగా ఎలా బ్రతకాలో పాఠం నేర్పుతుంది.

ప్రమోషన్ రాలేదు. దానికి ప్రతిక్రియలు రక-రకాలుగా వుంటాయి.

1) పోయినచోటే వెదుక్కోవడం,

2) మన తప్పులని, ఓటమిని ఒప్పుకోవటం,

3) అంతఃర్ముఖాలోచనం చేసుకుని, భవిష్యత్తులో పోగొట్టుకున్నదాన్ని సాధించడానికి ఒక ప్రణాళికను తయారు చేసుకుని, మరింత ఓర్పుతో, నేర్పుతో, సామర్థ్యంతో (efficiency తో) కష్టపడి పనిచేయడం,

4) గుర్తింపు దొరకలేదని, మరో ఉద్యోగంలో చేరి అక్కడ అనుకున్నది సాధించాలి. ఆ సామర్థ్యం (capability) మనలో లేకుంటే, మొదటి ప్రక్రియ, పోయినచోటే వెదుక్కోవడం చేయాలి. అంతేగాని, విసుగు, ఆందోళన, టెన్షన్, కోపం, క్రోధం, భయం వంటి మానసిక భావాలకు లొంగి పోకూడదు.

మన కెరీర్‌లో అన్నీ మనం అనుకున్నట్లు జరగాలంటే, ఆర్థికంగా ముందంజ వెయాలంటే ఏంచేయాలి ?

1) మరింత ఉత్సాహంతో పనిచేయడం.

2) మన Communication skills ను మెరుగుపర్చుకోవడం.

3) సంబంధిత జ్ఞానం (knowledge), working skills (నైపుణ్యం)ను వృద్ధి చేసుకోవడం.

4) చిత్తశుద్ధితో కార్యాచరణ చేయడం.

5) ఆత్మ విమర్శన చేసుకోవడం.

6) ప్రతి పని లోనూ initiative తీసుకోవడం.

7) మంచి పుస్తకాలు చదవటం, లోకజ్ఞానం పెంచుకోవటం.

8) ఎక్కువ జ్ఞానంగల వారితో తర్కం, వారి నుండి సలహాలు తీసుకోవడం.

9) ఎపుడూ పాజిటివ్‌గా ఆలోచించడం.

10) ప్రోయాక్టివ్ థింకింగ్ చేయడం. అంతే కాని, కోపం తెచ్చుకోవడం సరికాదు.

# విద్య, జ్ఞానం, విజ్ఞానం

మనిషి మంచి నడవడికకు, వినయ విధేయతలకు, మంచి ఆచారవ్యవహారాలకు, మూలకారణాలు ఏమిటి ? విద్య, జ్ఞానం, విజ్ఞానం. ఇవి మనల్ని సన్మార్గంలో నడిపిస్తాయి.

జ్ఞానులతో పరిచయం చేసుకుంటే జ్ఞానం, వివేకం వస్తాయి. అజ్ఞానులతో పరిచయం చేసుకుంటే అజ్ఞానం అంధకారం వచ్చి, మానవుడు. అల్పుడైపోతాడు. మనిషి తనకంటే శ్రేష్ఠులను, స్నేహితులుగా ఎంచుకోవడం ద్వారా, ఆశ్రయించడం ద్వారా, విజ్ఞతను పొందుతాడు. జ్ఞాన జ్యోతి హృదయంలో ప్రకాశిస్తుంది. బుద్ధి నుండి మంచి వస్తుంది. బుద్ధి ప్రధానమైంది. మంచి బుద్ధి కలిగితే మంచి వానిగా పేరుపొందుతాడు. చెడుబుద్ధి, చెడుసాంగత్యం, చెడు పనులు, మనిషి పతనానికి దారి తీస్తాయి. స్వంత వారితో కూడా (అంటే కన్నతల్లి దండ్రులు, భార్య పిల్లలతో) ఛీ అనిపించుకుంటాడు. సమాజం అతనిని చీడ పురుగుగా భావిస్తుంది. బుద్ధికి పట్టిన చీడ పోవాలంటే చదువు, జ్ఞానం, సత్‌సాంగత్యం, దైవచింతన అవసరం. మనిషి తగిన కృషి చేయకపోతే చదువు, సంస్కారం, బుద్ధి, జ్ఞానం, పొందలేడు. మంచి వ్యక్తి, కృషి, సాధన చేయకపోతే వచ్చిన మంచి పేరు ప్రఖ్యాతలు నిలబెట్టుకోవడం కష్టం. జ్ఞానంతో, మనస్సు పవిత్రం అవుతుంది. జీవనం సఫలమౌతుంది. సమాజంలో గుర్తింపు గౌరవం పెరుగుతాయి.

అయితే జ్ఞానానికి, బుద్ధికి తేడా ఏమిటి ? జ్ఞానం వలన వచ్చిన మంచి పేరును నిలబెట్టుకోవడానికి బుద్ధి ఉపయోగపడుతుంది. మన కోరికలను హద్దుల్లో వుంచేదే మంచి బుద్ధి. మన కోరికలను హద్దు దాటించేది చెడుబుద్ధి. నదులు హద్దు మీరనంత వరకు పైరులను పచ్చగా వుంచి, మంచిపంట పండేలా చేస్తాయి. నదులు హద్దు దాటితే వరదలావచ్చి పంటలను, గ్రామాలను, పట్టణాలను, నాశనం చేస్తాయి. అలాగే మనిషి బుద్ధికూడా. బుద్ధి నాశనం అయితే వినాశనం సంభవిస్తుందని కృష్ణ భగవానుడు చెప్పాడు. ఉదాహరణ : 1) కౌరవులు, వారి పక్షపాతులు యొక్క వినాశనం 2) యాదవులు యొక్క వినాశనం. 'బుద్ధి న్యాశాత్ ప్రణశ్యతి' అన్నారు, పెద్దలు.

మంచి విద్య, జ్ఞానం, వున్నవారు మంచి బుద్ధితో ఇతరులను ప్రభావితం చేస్తారు. ప్రోత్సహిస్తారు, మంచి పనులు చేయడానికి ఉత్తేజపరుస్తారు. వీరు కృషి, పట్టుదల, దీక్షలతో పూనుకుంటే విజయం సాధ్యం. నవసమాజస్థాపన సాధ్యం. వీరికి యశస్సు వస్తుంది. ఇలా యశస్సు సాధించిన వారి సిద్ధాంతాలకు మనం ప్రభావితులం కావాలి.

అనుభవం మంచి చెడుల విచక్షణకి, జ్ఞానానికి మూలం. అనుభవం, జ్ఞానం, చదువు,

వీటి ఆధారంగా ప్రతి వ్యక్తికి ఒక మూల్యం, విలువవుంటుంది. ప్రతి వ్యక్తి అతని అదృష్టానికి తనే శిల్పి, తానే సూత్రధారి.

జ్ఞాని చనిపోయినా అతని జ్ఞాపకాలు చనిపోవు, చిరస్మరణీయంగా మిగిలి పోతాయి. అనుభవం మంచి ఉపాధ్యాయుడు. జ్ఞానం, చదువు, సంస్కారం, సంయమనం మనిషిలో వుంటే అతనికి సంపదలు, సుఖాలు వస్తాయి. కానీ జ్ఞానాన్ని వివేకాన్ని క్రమశిక్షణని, మూర్ఖులు తక్కువగా చూస్తారు.

విద్య, విధేయతను, నిరాడంబరతను, ఉదారతను, త్యాగాన్ని పెంపొందించి మనిషిని జ్ఞానిని చేస్తుంది. అజ్ఞానిని ఎవరూ బాగుచేయలేరు. జ్ఞానిని ఎవరూ పాడు చేయలేరు. జ్ఞానులు, మేధావులు, ఎక్కువగా వింటారు. తక్కువగా మాట్లాడుతారు. జ్ఞానులు పరిస్థితులు అనుకూలంగా వున్నపుడు మంచి నిర్ణయాలు తీసుకుంటారు. మంచి ఫలితాలు పొందుతారు. జ్ఞానమే మన బలం, శక్తి. అజ్ఞానమే మన బలహీనత. వ్యక్తి తెలివైనవాడైతే అతనికి గల జ్ఞానం అతనికి మంచి వ్యక్తిత్వాన్ని, సంఘంలో మంచిస్థాయిని యిస్తుంది.

జ్ఞాని తన అంతర్గత శక్తిని, తన వివేకాన్ని సద్వినియోగం చేసుకుంటాడు. మన జ్ఞానమే మన శక్తి. జ్ఞాని ఇతరులు చేసిన అవివేకమైన పనులను పరిశీలించి తద్వారా తన వివేకాన్ని పెంచుకుంటాడు.

జ్ఞానానికి ఆది లేదు. అంతం లేదు. జ్ఞాని ఎపుడూ జ్ఞాన సముపార్జనలోనే వుంటాడు. ఈ ప్రక్రియలో తను లాభం పొందుతాడు. ఆ ఫలితాలను, జ్ఞానాన్ని ఇతరులకు పంచుతాడు. చదువు, జ్ఞానం మనిషిని అజ్ఞానం నుండి విజ్ఞానం వైపుకు తీసుకువెళ్ళతాయి. సిరిసంపదలకంటే విలువైంది జ్ఞానం, విద్య . విద్యను, జ్ఞానాన్ని పంచితే వృద్ధి చెందుతుంది. జ్ఞానం సంపాదించడానికి చదువుకోవాలి. మంచిగా బ్రతకడానికి జ్ఞానాన్ని పెంచుకోవాలి. జ్ఞానానికి మూలం మనిషి మంచి ఆలోచనలే. మనిషి వివేకమే జ్ఞానం. Knowledge is power, knowledge is bliss.'

జ్ఞానంతో, పరిజ్ఞానం (Allied Knowledge), విశ్లేషణ శక్తి, అవగాహన, స్పష్టత, భావ వ్యక్తీకరణ పెంపొందుతాయి. విజ్ఞానానికి మూలం తెలివితేటలు. కానీ తెలివితేటలు మాత్రమే విజ్ఞానం (Wisdom) కాదు. కేవలం తెలివి తెటలు సంపూర్ణ విజ్ఞానాన్ని, వికాసాన్ని అందివ్వలేవు. మంచి తెలివిగలవారు కూడ మూర్ఖంగా ప్రవర్తిస్తుంటారు. వచ్చిన అవకాశాల్ని చేజార్చుకుంటారు. లేకపోతే ఇతరుల నుండి లబ్ధి పొందాలని చూస్తారు. మోసగిస్తారు. వారిలో కూడా అజ్ఞానులు ఉంటారు.

దినదినాభివృద్ధితో, వివేకాన్ని పంచుకోవాలి. దాన్ని పదిమందికి పంచాలి. సమాజానికి, దేశానికి సేవ చేయాలి. యశస్సును పెంచుకోవాలి, విద్యార్థులు, ఉద్యోగస్తులు ఈ దిశలో కృషి చేయాలి. తమ మేధస్సుకు పదును పెట్టాలి. వారిలోని సృజనాత్మక శక్తిని పెంపొందించుకోవాలి. ఇతరులకు ప్రేరణను ఇవ్వాలి. సైన్స్ యొక్క మంచి ఫలితాలను దుర్వినియోగం చేయకూడదు. ఈ మార్పు మనిషికి మంచి చేస్తుంది.

మానసిక వికాసాన్ని పెంపొందించుకోవడం కూడా జ్ఞాన సముపార్జనలో భాగమే. విద్య, మానసిక వికాసం, జ్ఞానం మనిషిని అందలం ఎక్కిస్తుంది. అది కావాలంటే మంచి పుస్తకాలను చదవాలి.

హింసదొంగతనం, దోపిడీలు, స్త్రీలపై అత్యాచారాలు వంటి వాటిని ప్రేరేపించే టీవి ప్రోగ్రాములు చూసి పతనానికి దారిని వెదుక్కోకూడదు.

## నైపుణ్యం (SKILL) :

ఇప్పటి వరకు విద్య, జ్ఞానం, బుద్ధి వంటి విషయాల గురించి చర్చించాం. వీటితో బాటు నైపుణ్యం జోడైతే పరిపక్వత ఏర్పడుతుంది. ఈ రోజు I.T సంస్థలలో చూస్తుంటారు. వారు కమ్యూనికేషన్ స్కిల్స్, పనిలో స్కిల్స్‌లతో మంచి గుర్తింపు పొందుతున్నారు. స్కిల్స్ వున్నవారికి స్కై యీజ్ ది లిమిట్. వారి నైపుణ్యాన్ని వారికే పరిమితి చేసుకోకుండా ఇతరులకు పంచి వారిని కూడా నిపుణులుగా తీర్చిదిద్దాలి. తద్వారా మరిన్ని కుటుంబాలు, సమాజం, అభివృద్ధిని పొందుతాయి.

చెప్పడం సులువు, ఆచరించటం (ఇంప్లిమెంట్ చేయడం) కష్టమని మీకు తెలుసు. ఎవరు ఇంప్లిమెంట్ చేయగలరో, ఎవరు వారికున్న నైపుణ్యాన్ని ఇతరులకు పంచడంలో విజ్ఞత చూపుతారో వారే ఆదర్శప్రాయులవుతారు. ఇలా విద్య, జ్ఞానం, బుద్ధి, నైపుణ్యం జోడైతే పరిపక్వత, పరిపూర్ణత, వికాసం, సాధ్యమవుతాయి. ఈ నేర్పరితనం ఆఫీసుకే పరిమితంకాకూడదు. 'ఒక వ్యక్తి యొక్క నేర్పరితనాన్ని చాలా రంగాలలో గుర్తించవచ్చు' అని ఒక కవి అన్నారు. ముఖ్యంగా 5 రంగాలలో గుర్తించవచ్చు. అవి చెప్పారు.

1. భోజనం చేసే విధానం

2. పేకాట ఆడే విధానం

3. వాహనం (సైకిల్, స్కూటర్, కారు) నడిపే విధానం.

4. ఆఫీసులో / కిచెన్ లో పనిచేసే విధానం

వాటిలో రిఫ్లెక్సెస్ వుంటాయి. ఈ రిఫ్లెక్సివ్ యాక్షన్ అనేది వ్యక్తి యొక్క నేర్పరితనాన్ని, చురుకుతనాన్ని, విజ్ఞానాన్ని సూచిస్తుంది.

1. భోజనం చేసేటప్పుడు కాఫీ, టీలు త్రాగేటపుడు కొంతమంది చాలా పెద్దశబ్దాలు చేస్తుంటారు. జుర్రుకుంటారు. చేతులు, కంచం వికృతంగా నాకుతారు. (చేతులు, కంచం, కడగ వలసిన అవసరముండదు). భోజనం చేసిన తర్వాత బ్రేవ్‌మని తేన్పుతారు. ఇవన్నీ వ్యక్తి యొక్క ఆత్మావగాహనారాహిత్యానికి వుదాహరణలు. అంటే వారికి స్కిల్ లేదని అర్థం. ఈ ప్రక్రియను చూసి ఎదుటి వారు చిరాకు పడతారు.

2. పేకాట ఆడేటపుడు తన వంతు రాకముందే వ్యూహాత్మకంగా, తనకు కావలసిన ముక్క కోసం, తను, ఏముక్క వేయలో ముందుగానే ఊహించుకోవాలి. తన ముక్కలను చక్కగా సర్దుకోవాలి. నేర్పులేని మనిషి వ్యూహాత్మకంగా ఆలోచించడు. తన వంతు వచ్చినా కన్‌ఫ్యూజన్‌లోనే వుంటాడు. సరైన సమయంలో, సరైన నిర్ణయం తీసుకోలేడు.

ఇలా నేర్పరితనం లేని వ్యక్తి పేకాటలోనే కాదు, జీవితంలో కూడా చాలా కన్‌ఫ్యూజన్ తో చాలా పొగొట్టుకుంటూవుంటాడు. Right thinking, right action, right analysis right decision at right time చాలా అవసరం. ఇది జీవితానికి కూడా బాగా వర్తిస్తుంది.

3.డ్రైవింగులో నేర్పరి తనం లేని వాళ్ళు, ఎక్కువగా స్త్రీలు, వారు నడిపే కార్లకు, క్లచ్‌ప్లేట్లు త్వరగా అరిగిపోతాయి. కారణం వారికున్న టెన్షన్. ఎక్కువసార్లు బ్రేకులు వేస్తుంటారు. కారు నాలుగు లేక ఐదవ గేరులో నడుపుతన్నపుడు కూడా క్లచ్ మీద కాలు వుంటుంది. ఎక్కువగా యాక్సిడెంట్లు చేస్తుంటారు. నేర్పరితనం వున్నవారు షార్ప్‌గా వుంటారు. రాబోయే ప్రమాదాన్ని సరైనా సమయంలో ముందుగానే గ్రహిస్తారు. సరైన టైములో తగినట్లు గేర్లు మారుస్తారు. గమ్యానికి ఒడిదడుకులు లేకుండా కార్లోవున్న వాళ్ళను చేరుస్తారు. అంటే మన నైపుణ్యాన్ని మనం డ్రైవింగు చేసే విధానాన్ని చూసి ప్రక్కవారు గ్రహించగలరు.

4.కొంతమంది టేబిల్ మేనేజ్‌మెంటు చాలా చిరాకుగా వుంటుంది. ఫైల్సు, రిజిస్టర్సు, పేపర్సు, టేబిల్ పై అల్మారాలలో, చిందరవందరగావుంటాయి, ఏపేపరు ఏ ఫైలులో వుందో; వారికే తెలియదు. ఏదైనా అర్జంటు పేపరు అడిగితే క్రింద మీద పడిపోతుంటారు. చమటలు పట్టేస్తాయి. చివరకు దొరకదు పై అధికారితో చీవాట్లు, తిట్లు తింటూవుంటారు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉంటాది. కొంతమంది పేపర్సును చక్కగా ఇండెక్స్ చేసుకుంటారు. పేపర్సును చక్కగా ఫైల్‌చేసుకుంటారు. ముఖ్యమైన పేపర్సుకు టాగ్స్ పెడతారు.

సరైన సమయంలో సరైన పేపరును రిట్రీవ్ చెయగలుగుతారు. వ్యూహాత్మకంగా ఫైల్స్‌ను సర్దుకొవడం అప్‌డేట్ చెసుకోవడం ద్వారా వారి ప్రతిభను నిరూపించుకుంటారు. ఇతరుల మెప్పును పొందుతారు. జీవితంలో పైకివస్తారు.

ఒక వ్యక్తిలో నేర్పరితనం, ఆత్మవిశ్వాసం, లోపించినపుడు, సోమరితనం పెరిగినపుడు, అతని వ్యక్తిత్వానికి గుర్తింపు ఉండదు. విమర్శకు గురైనపుడల్లా, నిస్సహాయంగా అస్థిత్వమే కొల్పోయినట్లు కృంగిపోతాడు. నిన్నటికంటే ఈ రోజు, ఈ రోజు కంటే రేపు బాగుండాలంటే మన నేర్పరితన్నాని అభివృద్ధి చేసుకోవాలి. మన సమర్థతను నిరూపించుకోవాలి. మన శక్తి సామర్ధ్యాల పట్ల మనకు సంపూర్ణ విశ్వాసం ఉండాలి. తోటి వారి విమర్శలకు, ప్రవర్తనకు ప్రాధాన్యం యివ్వకుండా మన పనిని ఎలా మెరుగుపర్చుకోవాలి? అనే అలోచించాలి. మనం పనిచేసే సంస్థతోనే మన భవిష్యత్తును సుస్థిరం చేసుకోవాలి. అంటే మన సమిష్టి కృషివలన మన సంస్థ అభివృద్ధి చెందుతుంది. అపుడే మనం అభివృద్ధి చెందుతాం. మన భవిష్యత్తు బాగుంటుంది. మన కస్టమర్లు సంతృప్తి చెందుతారు.

అలాగే ఇంటిని, ఇంట్లోని వంటగదిని, డ్రాయింగ్ రూమ్‌ని చూసి ఇల్లాలు యొక్క నైపుణ్యాన్ని గుర్తించవచ్చు. వీలైనంత ఎక్కువమంది యొక్క అభిప్రాయాలు, సలహాల ద్వారా మన స్కిల్‌ను, మన వ్యక్తిత్వాన్ని సరిదిద్దుకోవడానికి మాత్రమే ప్రయత్నించాలి. ఒక వ్యక్తి యొక్క నేర్పరి తనాన్ని, యిక్కడ వుదహరించిన 5 రంగాలలో తను పని చేసే విధానాలను చూసి గుర్తించవచ్చు అని చెప్తారు. నాల్గు విధానాల గురించి చర్చించాం. ఐదవ విధానం శృంగారం. ఇది పూర్తిగా భార్యా భర్తలకు సంబంధించిన ప్రక్రియ. ఈ అంశాన్ని గురించి వివరించకుండా మీ విజ్ఞతకే విడిచిపెడుతున్నాను.

ఏపని చేసేటప్పుడైనా నవ్వుతూ హుషారుగా వుండాలి. ఇక్కడ ప్రస్తావించిన నేర్పరి తనాన్ని (స్కిల్స్‌ను) మీరు అభివృద్ధి చేసుకుంటూవుంటే, భవిష్యత్తులో మీ బాట రాచబాట అవుతుంది. మీ వ్యక్తివికాసంతో బాటు ఆర్థికంగా, సామాజికంగా, మీరు వృద్ధిచెందుతారు. గుర్తింపు పొందుతారు. మీ గెలుపుకి తొలిమెట్టు మీ నవ్వు. మీ కోసం మీ ఆరోగ్యం కోసం, నవ్వండి, నవ్వించండి. ఇక్కడ ప్రస్తావించిన విషయాలు మిమ్మల్ని ఉత్తేజపరిచాయని భావించవచ్చా? మిమ్మల్ని ప్రభావితం చేసిందని భావించవచ్చా ? మీ మీ రంగాలలో మీరు నైపుణ్యంతో, చక్కగా, నవ్వుతూ పని చేస్తే ఫలితం చాలా బాగుంటుంది. మీరు సృజనాత్మకంగా నిర్మాణాత్మకంగా, నైపుణ్యంతో పని చేస్తున్నారని యితరులు గ్రహిస్తే మీకు ప్రత్యేక గుర్తింపు వుంటుంది. ఆ గుర్తింపే మీ భవిష్యత్తును తీర్చిదిద్దుతుంది.

# ఒత్తిడి

జీవితంలో సమస్యలను సరిగ్గా పరిష్కరించకపోతే మనపై ఒత్తిడి కలుగుతుంది.

జీవితంలో కష్టాలు, నష్టాలు వుంటాయి. సుఖదుఖాలు వుంటాయి. అప్స్ అండ్ డౌన్స్ (ups and downs) వుంటాయి. దీన్నే ఆటూ, పోటూ అంటారు.

అయితే వీటిని ఏవిధంగా ఎదుర్కోవాలి ? ఏ విధంగా ఒత్తిడికి దూరంగా వుండవచ్చు.

వీటికి ముఖ్యంగా మూడు మార్గాలు వున్నాయి.

1. కష్టాలనుండి బయట పడలేక, భయం, ఆందోళన పిరికితనంతో ఒత్తిడికి గురై ఆత్మహత్య చేసుకోవడం.

2. జీవితంలో రాజీపడి, కష్టాలు, సమస్యలనే ఊబి నుండి బయట పడలేక, జీవచ్ఛవాలుగా బ్రతికేయడం.

3. కష్టాలను, సమస్యలను మనోధైర్యంతో ఎదొర్కొని, మరేవైనా పరిష్కార మార్గాలు వున్నాయేమో అని ఆలోచించడం. పరిస్థితులను బాగా అవగాహన చేసుకోవడం. కృషి చేయడం. ఏకాగ్రతతో, సామర్థ్యంతో, ప్రగతి శీలకమైన ఆలోచనా సరళితో, సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం. అవసరమైతే కొంత రిస్క్ (సాహసం) చేసి, కష్టాల నుండి బయటపడి, తమ ఔన్నత్యాన్ని, సమాజం ముందు వుంచి మెప్పుపొందడం.

సమాజంలో వున్న వ్యక్తులంతా, ఈ మూడు మార్గాలలో ఎదో ఒక మార్గాన్ని ఎంచుకోవాలి. అది నిజం. అయితే ఎంత మంది ఏ, ఏ మార్గాన్ని ఎంచుకుంటారు? ఈ సత్యాన్ని కాలం సమాజానికి తెలుపుతుంది.

పైన వుదహరించిన మూడు మార్గాలు అంటే ?

1. ఆత్మహత్య చేసుకోవడం,

2. సమస్యలతో రాజీ పడి జీవశ్ఛవంలా బ్రతికేయడం,

3. సమస్యలను, కష్టాలను, నిర్మాణాత్మకంగా పరిష్కరించుకుని, తమ ఔన్నత్యాన్ని నిరూపించుకుని, సమాజంలో మెప్పు పొందడం.

వీటిలో ఏ మార్గాన్ని మనం ఎంచుకోవాలి?

ఈ మూడవ మార్గాన్ని ఎంచుకుంటే భవిష్యత్తు ఉజ్వలంగా వుంటుంది. అయితే

దీనికి కావలసింది, దృఢనిశ్చయం, కఠోరపరిశ్రమ. పరిస్థితుల పై మంచి అవగాహన. సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం. పోజిటివ్ థింకింగ్, ప్రోయాక్టివ్ థింకింగ్, చేయడం అవసరం. లక్ష్యం, ప్లానింగ్, చేసేపనిలో స్పష్టత వుండటం అవసరం. మంచిగా పరిశీలించి, విశ్లేషించి, మంచి నిర్ణయాలు తీసుకోవడం అవసరం. సమాచారాన్ని విశ్లేషించి, విపులీకరించి తెలపడంలో సామర్థ్యం, ప్రేరణ, మరియు నిర్వహణ అవసరం. ఇవే కాక అవకాశాలను పసిగట్టడం, ముందుగా మంచి అవకాశాలను అందుకోవడం, విజయవంతంగా పనులను పూర్తి చేయడం వంటి పనులు చేయాలి. వీటికి కావాలి **1. ఉత్సాహం, 2. ఆశయం (ఏంబిషన్) 3. లక్ష్యం (టార్గెట్) 4. స్పష్టీకరణ (క్లారిటీ) 5. లౌక్యం (లాజికల్ గా ఆలోచించడం)**

అపుడే సమస్యలు పరిష్కారమవుతాయి. విజయం సాధించడం జరుగుతుంది. పైన ఉదహరించిన లక్షణాలలో ఎన్ని, ఎంత శాతం మన వద్ద వున్నాయో ఆలోచించుకోవాలి. విశ్లేషించు కోవాలి. ఆలక్షణాలను స్వంతం చేసుకోకపోతే మనం చాలా నష్ట పోతాము. ఎందుకంటే గడచిపోయిన ఈ రోజు మళ్ళీ రాదు. ఈ రోజును వృధా చేయకుండా పైన ఉదహరించిన కొన్ని లక్షణాలనూ అంచెలంచెలుగా స్వంతం చేసుకోలేకపోతే మనకు మొదటి రెండు మార్గాలలో ఒక దానిని ఎంచుకోవాలి. అంటే, 1. ఆత్మహత్య చేసుకోవడం లేదా 2. జీవితంలో రాజీపడి, సమస్యల ఊబిలో జీవచ్ఛవాలుగా బ్రతకడం.

కష్టాలు, సమస్యలు లేనివారు ఎవ్వరూలేరు? అవితే వాటిని పరిష్కరించుకుని, సవ్యంగా జీవించడంలోనే వుంది మన ప్రతిభ, ఔన్నత్యం, మరియు సామర్థ్యం. వీటిని మన సొంతం చేసుకోవాలంటే కావాలి కృషి. కృషితో నాస్తి దుర్భిక్షం. కృషి చేయకపోతే మన దృక్పథం బాగోలేకపోతే మనపై ఒత్తిడి కలుగుతుంది.

**ఒత్తిడి (స్ట్రెస్ సింప్టమ్స్) అంటే ఒత్తిడి వలన కలిగే రుగ్మతలు:**

ఒత్తిడి వలన మానసిక ఆందోళన, నిరుత్సాహం, తలనెప్పి, నిద్రలేమి, ఆయాసము, వేడి చేయడం, జీర్ణం కాకపోవడం, మలబద్ధకం, నడుంనెప్పి, ఎలర్జీ, నరాల బలహీనత, నిద్రలో చెడు కలలు రావడం, రక్తపోటు, త్రాగుడుకు బానిసకావటం, ధూమపానం ఎక్కువగా చేయడం, బాధతో కూడిన ఆలోచనలు, డోకులు (ఓమిటింగ్స్), చిన్న విషయాలకు కూడా కోపం చిరాకు రావడం, నీళ్ళ విరోచనాలు, మెడ / బుజాల కండరాల నెప్పులు, ఆస్థమా, రొంప, అల్సర్, కాళ్ళు చేతులు చల్లబడటం, గుండె అతిగా కొట్టుకోవడం, కోపం, లైంగిక బాధలు, సెక్స్‌పై మనస్సు లేకపోవడం మొదలైనరుగ్మతలు కలుగుతాయి. ఒత్తిడి వలన

ఇంటా బయటా ఇతరులతో సత్సంబంధాలను పోగొట్టుకోవడం కూడా జరుగుతుంది.

అనుకున్నది అనుకున్నట్లు జరగకపోతే మనలో కలుగుతుంది ఒత్తిడి. చిన్న విషయాలకే ఒత్తిడికి లోనవడం, హైరాన పడటం కంటే ప్రత్యామ్నాయాలు ఎంచుకోవాలి.

ఒత్తిడి తాత్కాలికమైనదే. చిరాకు, అసహనం, నిద్రలేమి, ఏకాగ్రత లోపం, వీటికి మూలం ఒత్తిడే. నిరాశ, నిస్సహాయత, నిస్పృహ, ఆత్మన్యూనతా భావం, వీటికి మూలం ఒత్తిడే.

సంతోషాన్ని ఇతరులకు పంచడంలో మనలోని ఒత్తిడిని తగ్గించుకోవచ్చు.

ఓటమివలన, కలిగిన దు:ఖాన్ని అంగీకరించాలి. అలా ఒత్తిడిని తగ్గించుకోవచ్చు.

వాదనలు ఒత్తిడిని తెస్తాయి. అంగీకారాలు ఆనందాన్నిస్తాయి. అవసరమైతే రాజీపడాలి.

అలసట, ఒంటరితనం వలన ఒత్తిడి పెరుగుతుంది.

మన నవ్వుముఖం, ఇతరుల ఒత్తిడిని తగిస్తుంది.

అవసరాలను తీర్చుకోడంలో ఆనందం, దురాశను తీర్చుకోడంలో ఒత్తిడి మిగులుతుంది.

అనారోగ్యం సాధారణం. విశ్రాంతి తీసుకొని, సంతోషంగా మనోబలంతో ఉంటే ఒత్తిడి దూరమవుతుంది. అనారోగ్యాన్ని తలచుకొని మనస్సు పాడుచేసుకోకూడదు.

ప్రతి రోజునూ ఆనందదాయకం చేసుకుంటే, మరి లేదు ఒత్తిడికి ఆస్కారం.

మనస్సును శాంతంగా వుంచుకుంటే, ఒత్తిడిని దూరంగా వుంచవచ్చు.

మన అభిప్రాయాలు ఆలోచనలు స్పష్టంగా, మంచిగావుంటే మనకు దూరంగా వుంటుంది ఒత్తిడి.

పోగొట్టుకున్న దానిగురించి మరచిపోవాలి. అపుడే మిగిలినదాన్ని సాధించవచ్చు.

ఒత్తిడికి దూరంగా వుండాలి. అనవసరమైన వాదనలకు దూరంగా వుండాలి.

విశాల మనస్కునికి మిగిలేది విజయం. కుంచిత మనస్కునికి మిగిలేది ఒత్తిడి.

జీవితంలో ఒత్తిడికి దూరంగా వుంటే ఆజీవితమే మనల్ని పూర్తిగా మార్చివేస్తుంది.

ఒత్తిడిని, దు:ఖాన్ని దూరంగా వుంచగలిగితే మిగిలేది సంతోషమే.

మనకు కావలసినదంతా మనవద్ద వుంది. మనకు అవసరం లేనిది మనవద్దలేదు, అని అనుకుంటే సంతోషంగా వుండగలం. ఒత్తిడిని ఎదుర్కోవాలంటే స్నేహపూరిత వాతావరణాన్ని మనమే కల్పించుకోవాలి.

నిష్కల్మషంగా ఆడుతుపాడుతూ పనిచేస్తుంటే మాయమవుతుంది ఒత్తిడి.

యోగ, ప్రాణాయామం, క్రమం తప్పక చేస్తుంటే ఒత్తిడిని దూరంగా వుంచవచ్చు.

సంగీతం, సంతోషం ఒత్తిడిని దూరం చేస్తాయి.

ప్రతి సమస్యకు ఒక పరిష్కారముంటుంది. ఆ పరిష్కారానికి దూరంగా వుంటే వస్తూంది ఒత్తిడి. ఒత్తిడికి మూలం అప్పులు, ఆవేదన, ఆనార్యోగం, ఆకలి.

ఒత్తిడి వలన అత్మగౌరవం, ఆత్మస్థైర్యం తగ్గుతాయి. ఒత్తిడి, దేన్నీ అనందించలేని స్థితికి తీసుకువెడుతుంది. ఒత్తిడి ఎక్కువైతే ఆత్మహత్యా భావనకు దారితీస్తుంది.

ప్రతికూలతను అదిగమిస్తే ఒత్తిడి దూరమవుతుంది. అనుకున్న దాన్ని సాధిస్తామన్న నమ్మకం పట్టుదలవుంటే, ఒత్తిడికి దూరంగా వుండవచ్చు.

అర్థంలేని అనుమానాలతో, కోపతాపాలతో, విసుగుతో నందనవనం లాంటి ప్రశాంతవాతావరణాన్ని దూరం చేసుకుంటే మిగిలేది ఒత్తిడి మాత్రమే. అర్థ రహితమైన ఆందోళన వలన మిగిలేది ఒత్తిడి. ఇతరుల మీద విసుగు చెందితే వారిని నీకు దూరం చేస్తుంది. నీ మీద నీకు విసుగును కల్పిస్తుంది, నిన్ను నీకు దూరంచేస్తుంది.

అసంతృప్తి, ఆశించినవి నెరవేరక పోవడం వలన ఒత్తిడిని తెస్తాయి. అక్రమంగా డబ్బు సంపాదించిన వాళ్ళలో తృప్తివుండదు. విసుగుతో బాధపడుతున్నప్పుడు దానికి మూలకారణం ఏమిటి అని దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటే ఒత్తిడి, సమస్య తగ్గిపోతాయి. విసుగుకి మూలకారణం, అస్థిమితమైన మనస్సు. ఫలితంగా ఒత్తిడి, ఆందోళన. మనలో కలుగుతాయి. జీవన విధానాల పట్ల, సంతృప్తి లేక పోవడం వలన వచ్చేదే ఒత్తిడి. అన్ని విషయాలలోనూ స్పష్టత లేకుండా కొట్టుమిట్టాడటం వలన ఒరిగేది ఒత్తిడి మాత్రమే.

అనుమానం, భయం, కోపం ఆందోళన వీటి పర్యావసానం ఒత్తిడి.

ఒక పనిని నిర్వర్తించడంలో వున్న కష్టం, బాధకన్నా నిర్వర్తించలేమోనన్న అనుమానం వలన వస్తుంది, ఒత్తిడి. అర్థరహిత అనుమానాలు, ఒత్తిడిని తెస్తాయి తర్కం, ధైర్యం, నిదానం ఒత్తిడిని దూరం చేస్తాయి. ఓటమిని విశ్లేషించుకుంటే భయాన్ని ఒత్తిడిని దూరం చేసుకోవచ్చు. ఒత్తిడి లేకుండావుంటూ నవ్వుతూ, నవ్విస్తూ, ఉన్నదాంతోనే తృప్తిపడే వాళ్ళకు ఏరోగము రాదు.

# భయం

మనిషిని కృంగదీసే మరొక మానసిక భావన 'భయం'. అది అందరి లోనూ వుంటుంది. విద్యముగించుకుని కేరీర్ ప్రారంభిస్తున్న వాళ్ళలోనూ వుంటుంది. విద్యార్థులలోనూ ఈ భయం వుంటుంది. పరీక్షలు వస్తున్నాయనే భయం, ఇంటర్వ్యూ ముందు భయం, రిజల్ట్సు వస్తున్నాయంటే భయం. తర్వాత, సరైన ఉద్యోగం వస్తుందో రాదో అనే భయం. అభద్రతాభావంతో భయం. మంచి జీతం వస్తుందో? రాదో? అనే భయం. ఉద్యోగంలోచేరాం, ఇక మంచి పార్ట్‌నర్ దొరుకుతుందో లేదో అనే భయం. పార్ట్‌నర్‌కు కావలసిన చీరలు, కాస్మెటిక్సు కొనివ్వగలనో లేదో అనే భయం, ఇటు వంటి భయాలన్నీ మన ఆత్మన్యూనతకు ముఖ్య కారాణాలు. మనపై మనకి నమ్మకం లేకపోవడం వలన వచ్చే భయాలు యివి.

ఈ భయాల్ని అధిగ మించడానికి మనం ఏవిధంగా కృషి చెయ్యాలి ? ఏరకాలైన టాలెంట్సును సంపాదించాలి? అని ఆలోచించాలి. కానీ ఆత్మన్యూనత (Inferiority Complex) తో భయపడి పోకూడదు. భయం, దీనికి ఎంత ప్రాముఖ్యతనిస్తే అన్నిరెట్లు పరిణామంతో వెనక్కువచ్చి మనల్ని మరింత భయపెడుతుంది. కృంగదీస్తుంది. అందుకే అన్నారు 'భయం బంతి లాంటిదని' మనలోని ఈ భయాన్ని పారద్రోలడానికి ఏమి చేయాలి? ఒక ప్రముఖ రచయిత చక్కని సూచన యిచ్చారు. అది నన్ను బాగా Impress చేసింది.

'భయం, నమ్మకం అనే ఈ రెండు పరస్పర విరుద్ధ భావాలు మనలో వుంటాయి. ఇవి మనలో శక్తివంతంగా పోరాడు తుంటాయి. వీటిలో దేనికి ప్రాదాన్యత ఇవ్వాలి?, అనేది మన పై ఆధారపడి వుంటుంది. ఆ కంట్రోలును మన ఆధీనంలో వుంచుకోవాలి. మనం భయానికి ప్రాముఖ్యతనిస్తే భయం, డ్రాక్యులా లాగ మనపై పడి మనల్ని కృంగ దీస్తుంది. దాన్ని అధిగమిస్తే మనపై, మన సామర్థ్యంపై, మన మనఃస్థితి పై, మన నడవడిక పై, మన బుద్ధిపై, మన స్కిల్స్‌పై, మన నమ్మకాన్ని పెంచు కుంటూపోతే భయం దూరమవుతుంది'. ఆత్మీయులు, మంచి స్నేహితులు, మనల్ని భయం నుండి దూరం చేస్తారు. కనుక మన భయానికి కారణం మనచేతలు. వాక్‌చాతుర్యంలోపించడం మాత్రమే.

మన జయాపజయాలు కొంతవరకు మనపై ఆధారపడి వుంటాయు. ఇది నిజం.

భయపడుతూ రోజూ చావడం సమంజసంకాదు ధైర్యం, ఆత్మబలం (మనోబలం) ఆత్మవిశ్వాసం వుంటే భయాన్ని దూరంగా వుంచవచ్చు.

# ఆందోళన

విద్యార్థులు, ఉద్యోగస్థులలో ఈ ఆందోళన అనే భావం వారిని కృంగ దీస్తుంది. ఆందోళనను అధిగమించాలంటే మూలకారణాలను విశ్లేషించడం అవసరం. మనిషిని కృంగదీసే మానసిక భావన 'ఆందోళన'. ఇది ఇంచు మించు ప్రతీ వారిలోనూ వుంటుంది. కొంత మంది అతిగా ఆందోళన చెందుతారు. ఎక్కువగా ఆందోళన, CEO's జనరల్ మేనేజర్సు, మేనేజర్లలో చూస్తుంటాం. ఆశించిన ఫలితాలు రానప్పుడు, క్రింది ఉద్యోగులు సక్రమంగా పనిచేయనప్పుడు, వారిచ్చిన సూచనలు, అమలు కానప్పుడు, వారిలో ఆందోళన చూస్తుంటాం. అప్పుడు వీరు చెతిలో వున్న పెన్సిల్ / పెన్ / స్కేలు వంటి వాటిని విరగ్గొట్టుతుంటారు. పేపర్ వైట్, ఫైల్సు విసిరేస్తారు. పేపర్లు చింపేస్తారు. చూసేవాళ్ళకు అవి పిచ్చిచేష్టలు అనిపిస్తాయి కానీ ఏమీ వివరించలేని పరిస్థితి.

ఇక కొంత మంది ఉద్యోగస్థులు, ఆఫీసులో పుట్టిన ఈ ఆందోళనను, ఇంటికి తీసుకు వెడతారు. భార్యా పిల్లలతో కోపంగా మాట్లాడటానికి కారణం, అదే. ఆందోళన వలన కలిగిన భావనలు స్పష్టంగా వారి ముఖంలో కనబడుతుంటాయి. ఆందోళనల వలన తోటిప్రయాణీకులతో గొడవపడటం చిన్నవిషయాలకే సహనం కోల్పోయి కోపంతో రెచ్చిపోవడం, మాటలు మిగలడం చూస్తూవుంటాం. ఎవరైనా మధ్యలో కల్పించుకొని సర్దిచెప్పాలని ప్రయత్నిస్తే వారిపై కూడా కోపంతో విరుచుకుపడటం కూడా జరుగుతుంది. చిన్నగా మొదలైన గొడవ, చిలికి చిలికి గాలి వానలా పెద్దదై, ముష్టి యుద్ధం చేసుకోవడం వరకూ వస్తుంది. ఈ ఆందోళన అర్ధరహితం.

కొంత మంది తల్లిదండ్రులు, పిల్లలు చెప్పిన మాటలు సరిగ్గా వినకపోయినా, చదువులో సరిగ్గా లేకపోయినా, వారికి మార్కులు ఆశించిన దానికంటే తక్కువ వచ్చినా, చాలా ఆందోళన చెందుతుంటారు. సరిగ్గా మార్కులు రాకపోతే, సరిగ్గా చదవకపోతే వచ్చే నష్టాలను వివరించి, విశదీకరించి పిల్లలకు చెప్పే బదులు, వారు ఆందోళనతో చాలా బాధ పడుతుంటారు.

మా పక్కింట్లో వుండే ఒక ఆఫీసరు రోజూ పిల్లలను చిదక బాదే వాడు. గిల్లేవాడు. అతనికి సిగరెట్లు త్రాగే అలవాటు లేదు. కానీ సిగరెట్లు కొనేవాడు. కోపం వచ్చినపుడు, ఆందోళనతో సిగరెట్టు అంటించి పిల్లల వీపుపై రుద్దేవాడు. పిల్లల వీపుపై అన్నీ మచ్చలే. ఆయన చేస్తున్న పనులు సరైనవి కాదని రాక్షసంగా పిల్లలను అలా హింసించడం నేరమని నచ్చచెబితే, ఏడ్చేసేవాడు అతని ఆందోళనకు కారణం, పిల్లలు బాగా చదవడం లేదని

కాదు. భార్య అతన్ని, పిల్లల్ని విడిచి వెళ్ళిపోయింది. ఆ తలపులలో ఆందోళన చెందుతూ, పిల్లల్ని హింసించేవాడు. ఆందోళన లేనప్పుడు పిల్లల్ని ఎంతో ప్రేమగా చూసేవాడు. తనలో ఆందోళన లేనప్పుడు రాముడు. తనలో ఆందోళన వున్నప్పుడు రావణాసురుడు. పిల్లల్ని హింసించేవిధానం చూసి అతని తల్లిదండ్రులు అతని యింటికి రావడం మానుకున్నారు. మేము పోలీసు కంప్లయింటు చేస్తామని బెదరించాము. ఫలితం లేకపోయింది. తమలోని ఆందోళన మరచిపోడానికి త్రాగుడు తదితర చెడు అలవాట్లుకు లోనైనవాళ్ళను, కళ్ళజోడును, పెన్స్, పెన్సిల్స్‌ను విరగ్గొట్టేవాళ్ళను చూస్తూవుంటాము కాని, ఇలా పిల్లల్ని హింసించేవాడిని చూడ్డం అదే. దానికి కారణం తనలోని ఆందోళన.

పిల్లల పైగల అధిక ప్రేమవలన కొంతమంది చిన్న చిన్న విషయాలను కూడా పెద్దగా వూహించుకుని, చాలా ఆందోళన చెందుతుంటారు. అతిగా సలహాలు, సూచనలిస్తూ పిల్లల్ని వ్యక్తిత్వం లేని వారిగా చేస్తూవుంటారు. అలా పిల్లల్ని స్వంతంగా ఒంటరిగా ప్రయాణం చేయలేని స్థితికి తీసుకువస్తారు. చిన్న చిన్న దైనందిక కార్యక్రమాలు చేయలేని స్థితి కల్పిస్తారు. పిల్లలు బ్యాంకుకు వెళ్ళరు. ఎలక్ట్రిసిటీ, బిల్లు, వాటర్ బిల్లు, కట్టలేరు. వీటికి కారణం పేరెంట్సులోగల అనవసరపు ఆందోళన.

సినిమా నటుల అభిమానులు చెందే ఆందోళనలు మనం చూస్తూన్నాం. వారి అభిమాన హీరో నటించిన చిత్రం సరిగ్గా ఆడక పోయినా, ఫెయిల్ అయినా భరించలేరు. ఆత్మహత్య చెసుకోడానికి కూడా వెనుకాడటం లేదు. ఇది అర్థరహితమైన ఆందోళన, అవివేకమైన నిర్ణయం. ఇటువంటి ఆందోళనకు మూలం అసంతృప్తి. ఇలాంటి ఆందోళన, వలన వారికి కలసి వచ్చేదేమీ వుండదు. వారి టైమును, వారి జీవితాన్ని ఫణంగా పెడుతున్నారు. తమ అభిమాన హీరో హత్యా ప్రయత్నం చేస్తే, పోలీసులను తమ బాధ్యతను నిర్వహించనీయరు. కారణం వారిలోని ఆందోళన.

ఈ ఆందోళన వలన వారికి ఒరిగేదేమిటి? ఈ అభిమానుల్లో విద్యార్థులు, ఉద్యోగస్తులు, వ్యాపారులు వున్నారు. ఇటువంటి వారు తమ అభిమాన క్రికెట్టు ఆటగాడు సెంచరీ కొట్టకుండా అవుటైతే వాళ్ళలో కలిగే ఆందోళన చూడలేం. ఎంతోమంది యువతీయువకులు, (ఎప్పుడూ క్రికెట్ బ్యాట్ పట్టుకోని వారు కూడా) గంటల తరబడి, కాలేజ్‌లను, లేదా ఆఫీసులను ఎగ్గొట్టి క్రికెట్ మ్యాచ్ చూస్తున్నారు. వారి అంచనాలకు భిన్నంగా ఆట ఫలితాలు వుంటే ఎంతో ఆందోళన చెందుతున్నారు. ఆ ఆందోళన వలన TV ని బ్రద్దలు కొట్టిన ప్రబుద్ధులు కూడా వున్నారు. ఈ క్రికెట్ పిచ్చి వున్న పెద్దలను చూసి, వారి పిల్లలూ వింతగా ప్రవర్తిస్తుంటారు. నాలుగు సంవత్సరాల పాప క్రికెట్టు చూస్తూ.

ఫోర్ కొట్టరా నాయనా, సిక్సు కొట్టరా నాయనా అంటూ ఆందోళన చెందడం చూసి చాలా ఆశ్చర్యపడ్డాను. ఈ క్రికెట్ మేచస్ వలన ఎన్ని మేన్ హావర్స్ వేస్ట్ అవుతున్నాయి? అంత సమయాన్ని కన్‌స్ట్రక్టివ్ పనులపై కన్‌స్ట్రక్టివ్ / క్రియేటివ్ ఆలోచనలపై వినియోగిస్తే, వారికి, దేశానికి ఎంతో మేలు జరుగుతుంది. అన్నిటికీ మించి ఆందోళన, అసంతృప్తిలకు ఆస్కారం వుండదు. ఇది గ్రహించి తదనుగుణంగా ఆందోళనకు తావు ఇవ్వకపోతే, విద్యార్థులకు, ఉద్యోగస్థులకు మంచి జరుగుతుంది. జీవితం ఒక యుద్ధం. ఆందోళన ఒక ఓటమి. ఆందోళన ఒక బలహీనత.

మనలోని ఆందోళన, మనమొహంలో స్పష్టంగా కనబడుతుంది. మన ఆలోచనలలో నిమగ్నమై, మనం అది గ్రహించం. కాని మన చుట్టూవున్న వాళ్ళు ఎవరైనా మనపై దృష్టిపెడితే వారికి మనలోని ఆందోళన, మనముఖంలో, స్పష్టంగా కనబడుతుంది. అది చూసి వారు నవ్వుకుంటారు కూడా. కనుక మనం నిరర్ధక ఆందోళనలకు దూరంగా వుండాలి.

ఒక పుట్టిగుడ్డి వానికి, 25 సంవత్సరాలు వయస్సులో ఆపరేషన్‌చేసారు చూడగలిగాడు. అతను ఇలా అన్నాడట 'నేను గుడ్డి వాడిగా వున్నపుడు లోకంలో మనుష్యలంతా చాలా నిర్మలంగా ప్రశాంతంగా, ఏ ఆందోళన, ఆతృత, అలజడి లేకుండా ఉంటారనుకునే వాడిని. కోపంలో వున్నపుడు, విసుగ్గా అరుస్తున్నపుడు సరే, మామూలుగా వున్నపుడు కూడా ఇంతమంది మొహాలలో ఇంత ఆందోళన ఎందుకు కనబడుతుందో నాకు. అర్థం కాలేదు' అని.

ఈ ఆందోళన, అసంతృప్తి వలన మనం సాధించేదేమిటి? మన ప్రశాంతతను మనమే పాడు చేసుకుంటున్నాము. ఒత్తిడికి లోనవుతున్నాం. అనవసరమైన భావనలతో, కోపతాపాలతో, భయాలతో మన ప్రశాంతతను మనమే దూరం చేసుకుంటున్నాం. ఎందుకీ ఆందోళన? ఎవరికోసం ఈ ఆందోళన? ఎవరికోసం ఈ ఆందోళన మన మనస్సును పాడు చేస్తుందో వారికి, అంటే మన పిల్లలకి, అభిమాన హీరోలకు, అభిమాన రాజకీయ నాయకులకు మన గురించి ఏమీపట్టదు. ఇది రియాలిటీ. ఆందోళనతో మనం చేసే పిచ్చిపనులను తెలుసుకుని నవ్వుకుంటూనే వుంటారు. ఇది ఎంతవరకు సమంజసం? కనుక విద్యార్థులు కానీ, ఉద్యోగస్థులు కానీ ఇటువంటి నిరర్ధక ఆలోచనలకు, ఆందోళనకు దూరంగా వుండాలి. ఆందోళన లేని జీవితం ప్రశాంతమైన జీవితం. ప్రశాంతమైన జీవితం, పరిణతకు దారితీస్తుంది.

విద్యార్థులు, ఉద్యోగస్థులు మంచి పుస్తకాలు, మంచి రచనలతో ప్రభావితం అవ్వాలి.

అప్పుడు వారికి, వారి కుంటుంబానికీ, సమాజానికీ, దేశానికీ మంచి జరుగుతుంది. అంతేగాని అనవసర నిరర్థక ఆందోళనలతో వారి సమయాన్ని, డబ్బును, మనఃశాంతిని వ్యర్థం చేసుకోకూడదు. సాధారణంగా ఆందోళనతో వున్నవారికి విసుగు కూడా వుంటుంది ప్రతి, చిన్న విషయానికీ విసుక్కొంటారు. ఉదాహరణకు తనూ, తన స్నేహితురాలు (Girl Friend), ఒక పార్కులో కలుసుకోవాలను కున్నారు. అనుకున్న టైము కంటే ముందు వచ్చి ఆమె కోసం ఎదురు చూస్తుంటాడు. అనుకున్నటైము దాటిపోయింది. అప్పుడు అతనిలో ఆందోళన మొదలవుతుంది. అటూ, ఇటూ వేగంగ నడుస్తూ, ప్రతినిమిషానికి వాచ్ చూసు కోడం చేస్తుంటాడు. వచ్చిపోయే ఆటోలవైపు, బస్సుల వైపు చూస్తుంటాడు. సహనం చచ్చిపోతుంటుంది. సిగరెట్టు ముట్టిస్తాడు. కానీ సిగరెట్టు త్రాగడు. చేయి కాల్చుకుంటాడు. స్నేహితురాలు ఎందుకు రాలేదా అనే ఆందోళన, దానితో పాటు విసుగు అధికమవుతుంటుంది. అటుపోయే వ్యక్తి టైము అడుగు తాడు. విసుగుతో అయిష్టంగానే చెబుతాడు. అతనిలోని ఆందోళన అతని ముఃఖంలో స్పష్టంగా కనబడుతావుంటుంది. వేరుశెనగ పప్పు అమ్ముకొనేవాడు వస్తాడు. వాడిపై మండి పడతాడు. వాడి వ్యాపారం వాడిది. వాడిపై విసుక్కోవడం దేనికి? కారణం తనలోని ఆందోళన, ఫలితంగా కలిగిన విసుగుదల, కోపం, మానసిక ఒత్తిడి.

2. మరికొన్ని ఉదాహరణలు, క్రొత్తగా పెళ్ళైన భార్య, భర్త ఆఫీసునుండి వస్తాడని ఎదురు చూస్తుంటుంది. ఆఫీసులో పనిభారం వలన అతను రావడం ఆలశ్యమైంది. ఇంక ఆవిడలో ఆందోళన మొదలవుతుంది.

3. మీకు ఇంటర్వ్యూ కోసం ఫోన్ కాల్ వచ్చింది. అవతలి వ్యక్తినుండి వచ్చే సమాచారం, అంటే పేరు, ఫోన్ నంబరు, ఇంటర్వ్యూ తేదీ, సమయం నోట్ చేసుకోవాలి. పెన్ను, పెన్సిల్ కోసం చూస్తారు. అందిన పెన్ రాయడం లేదు. పెన్సిల్ లెడ్ విరిగి పోయింది. ఇంక మీలో ఆందోళన, విసుగు మొదలవుతాయి. ఇటువంటి సందర్భాలు విద్యార్థులు, ఉద్యోగస్తులకు అనేకం. అపుడు కలిగే అందోళనా అధికమే. విసుగూ అధికమే.

ఈ ఆందోళనలను అధిగ మించాలంటే కొంత ప్లానింగు, సహనం, కొంత ప్రిపరేషను అవసరం. వాటిని అశ్రద్ధ చేస్తే ఆందోళన అధికమవుతుంది. మనఃశాంతి దూరం అవుతుంది.

# ప్రేమతత్వం

ప్రస్తుత పరిస్థితులలో మనుష్యులలో అనుమానాలు, అవగాహన లోపాలు ఎక్కువ అవుతున్నాయి. ముఖ్యంగా యువతలో ఆత్మీయత, అనురాగాలు, ప్రేమ, పవిత్రత, భక్తి, బాంధవ్యాలు, సాన్నిహిత్యం, తక్కువ అవుతున్నాయి. యువత జీవితం యాంత్రికంగా సాగిపోతుంది, విలువలు తగ్గుతున్నాయి. తమ బంధువులను, స్నేహితులను, హితులను, అనుమానిస్తున్నారు. 'వారు తమ తమ అవసరాలకోసం ప్రేమ కనబరుస్తున్నారు' అని అనుకుంటున్నారు. అంతేగాని తనను ప్రేమించటం లేదనుకుంటున్నారు. యువతలో ఈ అనుమానం వుందనడం లో అతిశయోక్తిలేదు. ఈ అనుమానాలకు కారణం ప్రేమతత్వాన్ని అర్థం చేసుకోవడంలో లోపమే. ఎదుటివారు తనను ప్రేమించడం లేదని సంశయించుకోవటమే కాని, తను వారిని ఎంతగా ప్రేమిస్తున్నాడో, అని తనను తాను ప్రశ్నించుకోవడం లేదు. అంతేకాదు తనను తాను ఎంత ప్రేమించు కుంటున్నాడో ప్రశ్నించు కోవడం లేదు. తర్కించు కోవడం లేదు. తనను తాను ప్రేమించు కోలేని వ్యక్తి, ఇతరులను ఏం ప్రేమించగలడు? ఏమి గౌరవించగలడు? విలువలను ఏమి గుర్తించగలడు? ఇతరులు తనను ప్రేమించడంలేదు అని తప్పుపట్టే ముందు, తన తప్పులను తాను గుర్తించి విశ్లేషించుకోవాలి. ప్రేమతత్వం లోపించడం వలన, ఇతరులను, దైవాన్ని ద్వేషించడం జరుగుతుంది. యాంత్రికంగా జీవించడానికి అలవాటు పడుతున్నారు. తల్లిదండ్రుల ప్రేమను గుర్తించడం లేదు. తద్వారా వ్యతిరేకత, అయిష్టత, నిర్లిప్తత, నెగెటివ్ థింకింగ్ యువత జీవితంలో చోటు చేసుకుంటున్నాయి. ఫలితంగా తల్లి తండ్రులకు, బంధువులకు, సన్నిహితులకు మానసికంగా, సన్నిహితం కావడానికి ప్రయత్నించడం లేదు. ఫలితంగా ముభావంగావుండటం, కోపాన్ని ప్రదర్శించడం, పాశ్చాత్యనాగరికతను అనుకరించడం, డిస్కో కల్చరుకు అలవాటు పడటం జరుగుతుంది. స్త్రీలపట్ల, గర్ల్‌ఫ్రెండ్స్ పట్ల అసభ్యపు ఆలోచనలు వారిలోచోటు చేసుకుంటున్నాయి. విలువలు దిగజారుతున్నాయి.

ఇలాగే ఈ దారిలోనే ఆడపిల్లలు కూడా పయనిస్తూ ప్రేమకు నిర్వచనాలను మారుస్తున్నారు. తమలోగల లోపాల వలన, పెద్దలను, సన్నిహితులను, అనుమానించి, దూరం పెంచుతున్నారు. వీటన్నిటికీ మూలం ప్రేమతత్వాన్ని అర్థం చేసుకోకపోవడమే.

కనుక ఈ ప్రేమతత్వం గురించి కొంత విపులీకరిస్తే యువతకు ఉపయోగపడుతుందని భావిస్తున్నాను. ప్రేమతత్వం గురించి పెద్దలు యిచ్చిన వివరణలను, యువతకు అర్థమయ్యేరీతిలో యిక్కడ పొందుపరచడం జరిగింది.

ప్రేమతత్వాన్ని అర్థం చేసుకుంటే మానవ సంబంధాలూ, ప్రేమాను రాగాలూ, ఆదరణ, ఆత్మీయతలు మెరుగు పడతాయి. యువతలో అవగాహన పెరుగుతుంది. వారి కార్యాచరణ, సత్ సంబంధాలు పెంచుకోవడం వంటి విషయాల యొక్క ప్రాముఖ్యత విశదమవుతుంది.

అపుడే యువతలో చైతన్యం వస్తుంది. వారిలో విజ్ఞానం, నైపుణ్యం పెంచుకోవాలనే ధ్యాస, యశస్సు సాధించాలనే తపన, చోటు చేసుకుంటుంది. కృషితో నాస్తి దుర్భిక్షం అన్నారు. యువత శ్రేయస్సు, దేశ శ్రేయస్సు, వారి కృషి, సద్భావనలు, ప్రేమల పైనే ఆధారపడి వుంటుంది. ప్రేమ, ప్రేమను పుట్టిస్తుంది. ఆ ప్రేమ వలన ఇతరులు తమను, ప్రేమించడంలేదు, గౌరవించడంలేదు, అనే అనుమానాన్ని యువత దూరం చేసుకోగల్గుతుంది. వారిలో అవగాహన పెరుగుతుంది.

పసితనంలో పిల్లలకు ప్రేమతత్వం గురించి ఎక్కువ అనుమానాలు వుండవు. వారికి తమను తల్లిదండ్రులు, స్నేహితులు పూర్తిగా ప్రేమించడం లేదు అనే అనుమానం కలగదు. అందుకే పసిపిల్లలు, తల్లిదండ్రుల తోనూ, స్నేహితుల తోనూ, బంధువుల తోనూ నవ్వుతూ మాట్లాడతారు. అందరి తోనూ కలిసి మెలసి ఆడుకుంటారు. వారిలో ముభావం వుండదు. వారి మనస్సే ప్రేమమయం. దైవానికి నమస్కరించమంటే 'ఏదేవునికి'? అని ప్రశ్నించరు.

యువత కూడా అలాగే, తమ పెద్దలు, స్నేహితులు, హితులు బంధువులలో సాన్నిహిత్యాన్ని పెంచుకోవాలి. అనురాగాన్ని పంచుకోవాలి. యువత హితాన్ని కోరేవారు వారి హితులు. వారి బాంధవ్యాన్ని కోరేవారు, వారి బంధువులు. యువత తమ తల్లి తండ్రులను, స్నేహితులను, బంధువులను, గౌరవిస్తే, ప్రేమిస్తే, ఆ స్నేహం బాంధవ్యం మరింత పెరిగి తిరిగి యువత వద్దకు చేరతాయి.

జీవితంలో ప్రేమను పంచడం చాలా గొప్ప కార్యక్రమం.

జీవితంలో, ఒక్కొక్కసారి, అతిమంచి స్నేహితుని వలన మనం నష్టపోవచ్చు. కష్టాలపాలు కావచ్చు. కానీ భగవంతుని నమ్ముకుంటే మనం ఎప్పుడూ నష్టపోము.

భగవంతుడు అత్యుత్తమమైన అందాలను, మనకోసం, మన సంతోషం కోసం సృష్టించాడు. వాటిని ఆస్వాదించడం భగవంతుని ప్రేమను పొందటమే.

ప్రేమ, స్నేహం గొప్ప బహుమతులు. వాటిని యితరులకు పంచితే, వారు మనకే కాదు, మరొకరికి కూడా వాటిని పంచుతారు.

మన మనస్సులోని ద్వేషం, మన శత్రువుల జయం. మనం మన శత్రువులను క్షమిస్తే, అది మన జయం. ఆ క్షమాగుణం, యిరువురికీ సంతోషాన్నిస్తుంది.

మంచి పని చేసిన వారిని అభినందించడం, కష్టాలలో వున్న వారిపై జాలిచూపడం చేస్తే, మన కష్టకాలంలో, వాటి విలువ మనకు తెలిసి వస్తుంది.

మన జీవితాలను ప్రేమ మయం చేయడానికి అందంగా రూపుదిద్దటానికి, భగవంతునికి మనం అవకాశం ఇవ్వాలి.

మన ప్రేమ, సహాయం, అవసరంలో వున్న వారికి అందచేయాలి. మనకు అవసరం వచ్చినప్పుడు అవి తిరిగి మన వద్దకు చేరతాయి.

ప్రేమతత్వం, అందం, అపూర్వం. ప్రేమతత్వం ఆశ్చర్యకరమైన శక్తి. ప్రేమతత్వం కష్టకాలంలో వున్న వారికి చిరునవ్వుతో అందించే చిన్నసహాయం. సూర్యకాంతి పుంజం.

డబ్బు, ఆరోగ్యం, విశ్వాసం, హితులను, పోగొట్టుకుంటే, అది నష్టమే. వాటికంటే విషాదాంతమైన విషయం, దేవునిపై నమ్మకం పోగొట్టుకోవడం.

ఒకరి క్షేమాన్ని మరొకరు కాంక్షిస్తే, దానిలోనే వుంది అసలైన ఆనందం

ప్రేమతత్వమే దైవత్వము. ప్రపంచమంతా ప్రేమ మయమే. మనం కళ్ళు తెరచి చూడగలగాలి. ప్రేమయే దైవము.

చెడులో కూడా మంచిని వెదకాలి. ప్రేమను పెంచుకోడానికి ప్రయత్నించాలి.

దూషణ, భూషణ, తిరస్కారం, పురస్కారములకు అతీతమైనది ప్రేమ.

సత్యనిత్యమైనది భగవత్ ప్రేమ.

ఆప్యాయత, ఆలన, పాలన, జాలి-ప్రేమకు ప్రతి రూపాలు

కోరికలపై అదుపు, కోప తాపాలకు దూరంగా వుండటమే ప్రేమ తత్వము.

ప్రేమ, ప్రవర్తన, పరివర్తన మనిషిని యోగ్యుడ్ని చేస్తుంది. ప్రేమను, నవ్వును దాచుకోవద్దు. అవి దాచినా దాగవు. ప్రేమ ద్వేషాన్ని జయిస్తుంది. కానీ ద్వేషం ప్రేమను జయించదు. ప్రేమ, కఠిన మనస్కుడ్ని యోగ్యుడినిగా మారుస్తుంది. ప్రేమకు చావులేదు. ప్రేమ గుడ్డిది ప్రేమ ఒక సారి పుట్టిందంటే చచ్చేదాకా వదలదు. నిజమైన ప్రేమికులను ఎవరూ వేరు చేయలేరు. ప్రేమ, ప్రేమను పుట్టిస్తుంది. ప్రేమ, కృతజ్ఞతలను వీడకూడదు

అందరినీ ప్రేమించు, కొందరినే నమ్ము ఎవరినీ మోసగించకు. ప్రేమే పరమాత్మ. సంతోషానికి మూలం, ప్రేమ. ప్రేమించడానికి మంచి మనస్సు కావాలి.

సృష్టిలో అందరికంటే నిర్భయుడు ప్రేమికుడు. ప్రేమికులలో తెగింపువస్తే వారిని విడదీయాలనుకోవడం మూర్ఖత్వం

ప్రేమలో, యుద్ధంలో తప్పక న్యాయంగా వుండాలి. అవకాశవాదాన్ని దూరంగా వుంచాలి. ప్రేమకు నమ్మకం ముఖ్యం

హృదయాంతరాళంలో ప్రేమజ్యోతిని వెలిగిస్తే, దురాశ, దుఃఖం, అసూయ, గర్వం, దర్పం దూరమవుతాయి.

ప్రేమ వలన మనస్సులో వినయం, వినమ్రత, ఉదయిస్తాయి. ప్రేమను పంచాలంటే ముందుగా విచక్షణా జ్ఞానం పెంచుకోవాలి.

ప్రేమవున్నపుడు భయము వుండదు. ప్రేమతత్వమే సత్యము, సత్యమే ప్రేమ.హృదయం ప్రేమతో నిండివుంటే దాని పరిమళం పదిమందికీ చేరుతుంది

ప్రేమ వుంటే, భయము, సంశయములకు ఆస్కారం వుండదు. ఇతరులనుండి ప్రేమ, గౌరవములను పొందగలం.

ప్రేమ వలన సర్వమానవ సమైక్యత సాధ్యమవుతుంది, కులం, మతం, వర్గ పోరాటాలు సమాప్తమవుతాయి.

ప్రేమ, శాంతి, లేకపోతే సౌఖ్యముండదు. ప్రేమను మనస్సులో నింపుకుంటేనే, మార్గమేదైనా, గమ్యాన్ని చేరవచ్చు.

ప్రేమ, సత్యం, ధర్మం, శాంతి, అహింస అనే పంచసూత్రాల వలన సర్వజన శ్రేయస్సు సాధ్యం. ప్రేమ, ఆదరణ, సహనము, సహకారము. ఫలితం సత్ సంబంధాలు.

ప్రేమ వలననే శాంతి చేకూరుతుంది. శాంతి వలననే సుఖం పొందగలం.

ప్రేమ ద్వేషాన్ని దూరంచేస్తుంది. అప్పుడే అన్ని మతాలు, కులాలు, వర్గాలకు చెందిన వారూ, సత్ సంబంధాలను పెంచు కుంటూ సఖ్యతతో, సుఖంగా వుండగలరు.

ప్రేమ అల్లర్లను, దూషణలను, పోట్లాటలను, దౌర్జన్యాలను ప్రోత్సహించదు. ఏమతమైనా ప్రేమనే ప్రోత్సహిస్తుంది.

ప్రేమ తత్వమే దైవత్వము, పేరేదైనా దేవుడు ఒకడే.

# ఆధ్యాత్మిక చింతన

మానవ జీవితం దేవుడిచ్చిన గొప్పవరం. మన సమయాన్ని పూర్తిగా మన ప్రగతికి, ఉన్నతికి వినియోగించు కోవాలి. అప్పుడే ఇతరులను విమర్శించడానికి సమయం వుండదు. ఆధ్యాత్మిక చింతన మనస్సుకు మంచి ఆహారం.

ధ్యాసంతా డబ్బు, మన శరీర పోషణకే కాదు. శ్వాస, మనస్సు, దైవంపై, కూడా ధ్యాసను పెట్టాలి. మనఃశాంతిని చలించనీయ కూడదు. బాగా కృషి చేయాలి.

ఆధ్యాత్మికచింతన కోసం మంచి పుస్తకాలు చదివితే, అవి మనల్ని ప్రభావితం చేస్తాయి. మంచి విషయాలను తెలుసుకోవాలనే జిజ్ఞాస, మంచిని చూసేలా, మంచిని మాట్లాడేలా, మంచిని వినేలా చేస్తాయి. మన బలం, శక్తి సామర్థ్యం వృద్ధి చేసుకోవడానికి మన బలహీనతలను తొలగించుకోవడానికి ఆధ్యాత్మిక చింతన అవసరం.

మనకున్న సిరిసంపదలు, ఆరోగ్యం, ఆలోచించగల మనస్సు భగవంతుని ప్రసాదాలే, మంచి జీవితాన్ని ప్రసాదించిన దైవానికి కృతజ్ఞత తెలపడం, మనధర్మం.

తనకున్న బలహీనతలను, మరింత పదిల పరచుకున్నవాడే మూర్ఖుడు. ఆందోళన, దుఃఖం సంపదలను తేలేవు.

మన మంచే మనల్ని కాపాడుతుంది. మంచిని పెంచాలి. మంచి మానవత్వాన్ని మెరుగు పరుస్తుంది. జరిగిన చెడు మరచి పోయి, జరగబోయే కార్యక్రమాలు విజయవంతం చేయడంలో నిమగ్నంకావాలి. అభ్యాసంతో మనిషి సాధువుగా, సోమరితనంతో మనిషి మృగంలా ప్రవర్తిస్తాడు. భగవంతుడు సృష్టిలో మనిషికి అత్యుత్తమమైన యంత్రాంగాన్ని యిచ్చాడు. జంతువులకు యివ్వనిది, మనిషికి యిచ్చినది, మనస్సు, ఏకాగ్రత, ప్రతిభ.

సుఖపడటానికి అలవాటు పడితే సోమరితనం, అశ్రద్ధ పెరుగుతాయి. కష్టం ఫలితం సుఖం. సుఖం ఫలితం సోమరి తనం.

ఈ రోజు ప్రేమను పంచు. భవిష్యత్తులో నీకు, దైవం మరింత యిస్తాడు. దాన్ని పంచడం సాధ్యం కాకపోవచ్చు.

నువ్వు విజయవంతుడవు కావాలంటే నీకున్నదంతా దానం చేసే ధైర్యం వుండాలి. ప్రేమను పంచితే 100 రెట్లు పెరిగి, తిరిగి అది మన దగ్గరకు వస్తుంది.

ఆధ్యాత్మిక చింతన, సాధనలో, సద్భావన, సత్ సాంగత్యం అవసరం. సంశయాలు చంచల

బుద్ధి, అజ్ఞానం, వంటి వాటిని దూరంగా వుంచి మనల్ని మనం రక్షించుకోవాలి.

భక్తి శ్రద్ధలు, స్థిర విశ్వాసం, ఆత్మ విశ్వాసం, పెంచుకోవాలి. మిత భాషణ, మధుర, వచనం, ఆత్మవిశ్వాసం, పెంచుకోవాలి. మిత భాషణ, మధుర, వచనం, ఆత్మ నిగ్రహం, ధీరప్రవృత్తి, శాంతి అన్వేషణ, మనిషికి ఆభరణాలు. బాహ్యశరీర, శుభ్రతకంటే, మానసిక అంతర్గత శుభ్రత పట్ల శ్రద్ధ అవసరం. దేనికైనా సాధన, అభ్యాసము అవసరం. ముఖ్యంగా దైవనామస్మరణకు.

అశాంతికి మూలం అజ్ఞానమే పూర్వజన్మలో చేసిన కర్మానుసారం ఈ జన్మలో కష్టాలు గాని, సుఖాలు గాని అనుభవిస్తాము. దు:ఖం, దుర్గుణాలు, దుర్మార్గాలకు మూలం దురాశ.

సత్సాంగత్యము వలన వివేకం, మనశ్శాంతి, ఆధ్యాత్మిక చింతన కలుగుతుంది.

అహంకారం, ఆత్మస్తుతి, మానవత్వాన్ని దూరం చేస్తుంది. ప్రేమ, శ్రద్ధ, స్నేహం, దయ, సంతోషం, మనిషికి వుండవలసిన మంచి లక్షణాలు.

జపం, తపం, వ్రతం, సంయమనం, నియమం వంటి గుణాల్ని మనం ఆచరిస్తేనే వాటిలోని ఆనందం తెలుస్తుంది. దైవమే ప్రేమ. మనం ప్రేమించడం నేర్చుకోవాలి. ప్రేమను ఇతరులకు పంచితే వారు మనల్ని ప్రేమిస్తారు. మన భావనలను గౌరవిస్తారు.

శ్రద్ధ, శ్రమ లేకపోతే ఎంత చిన్న పనినైన సవ్యంగా చేయలేము. జ్ఞానానికి మొదటిమెట్టు శ్రద్ధ. అజ్ఞానికి అన్నీ సంశయాలే. జ్ఞానికి భక్తి, శ్రద్ధ, సరళ స్వభావము సద్భావన వుంటాయి.

సూర్యుని కాంతి, చీకటిని, జ్ఞానోదయం, అజ్ఞానాన్ని దూరం చేస్తాయి. అజ్ఞానం సర్వదు:ఖాలకు మూలకారణం.

చావు దేహానికే కానీ, ఆత్మకు కాదు. ఆత్మ ఒక దేహాన్ని విడిచి మరొక దేహాన్ని ఆశ్రయిస్తుంది. ఆత్మ పోయిన వెంటనే దేహం శవంలా మారుతుంది.

మనిషికి నియమాలు, నిశ్చింత, విశ్రాంతి, సంతృప్తి వుండాలి. మనిషికి పాపభీతి, మంచి సంస్కారం వుండాలి. కలియుగంలో మోక్షం పొందటానికి భగవంతుని నామస్మరణ వలనే సాధ్యమని శాస్త్రములు చెబుతున్నాయి. మన శక్తిని బట్టే మన కోరికలను పరిమితం చేసుకోవాలి.

దైవనిర్ణయం ప్రకారం మన వాటా, జీవితంలో మనకు దక్కుతుంది. అయితే ప్రయత్నలోపం వుండకూడదు.

దైవంపై, మంచిపని చేయడంలో నమ్మకంవుంటే దైవం అన్నీసవ్యంగాజరిగేలా దీవిస్తాడు.

# స్నేహం

సృష్టిలో తీయనిది స్నేహం. అవసరానికి ఆదుకునే వారు మంచి స్నేహితులే. యువత స్నేహం యొక్క విలువను చక్కగా గుర్తించాలి. ఈ రోజుల్లో మన జీవితాలలో బంధువుల పాత్ర కంటే, స్నేహితుల పాత్ర ఎక్కువ. కనుక, స్నేహం గురించి యిక్కడ తర్కించడం జరిగింది.

నీ మాటపై, నీ కర్తవ్యం పై, నీ స్నేహితున్ని పై, విశ్వాసంవుంచు. స్నేహానికి విలువనిస్తే మంచి స్నేహితులు మిగులుతారు.

స్నేహితులను నమ్మితే, మన వ్యక్తిత్వాన్ని నమ్మినట్లే.

స్నేహితుడి వలన మోసపోవడం కంటే స్నేహితుడిని, నమ్మక పోవడం చెడు.

స్నేహం, పరిహాసాస్పదమైన వస్తువుకాదు.

స్నేహితుడ్ని ఆటగా కూడా గేలి చేయకూడదు అతన్ని నొప్పించకూడదు.

విజ్ఞాన వంతుడైన స్నేహితుడు వుండటం, గొప్పవరం. మంచి మనస్సు వుంటే మంచి స్నేహితులు దొరుకుతారు.

క్రొత్త స్నేహితులు కావాలి, కానీ పాత స్నేహితులను మరవరాదు.

నువ్వు చెడుదారిని నడుస్తుంటే తప్ప, స్నేహితుడు, నీ దారికి అడ్డురాడు.

స్నేహితులతో వ్యాపార శైలిలో వ్యవహరించకూడదు.

చెడువానితో స్నేహం మనల్ని చైతన్య హీనుల్ని, భ్రష్టుల్ని చేస్తుంది.

తనను మంచిగా రూపుదిద్దుకోలేని స్నేహితుడు, స్నేహనికి న్యాయం చేయలేడు.

స్నేహితునితో నెమ్మదిగా, నిదానంగా ప్రవర్తిస్తే, స్నేహనికి విలువ పెరుగుతుంది.

మంచి స్నేహితుడు, మన వెనుక కూడా, మన గురించి మంచిగా మాట్లాడతాడు.

స్నేహితుడి మంచిని కోరి నిర్మొహమాటంగా మంచి సలహాలను మాత్రమే యివ్వాలి.

ఆపదలో ఆదుకున్న వాడే నిజమైన స్నేహితుడు.

నీ గురించి అన్నీ తెలుసుండీ, నిన్ను అభిమానించే వాడే నిజమైన స్నేహితుడు.

ఐశ్వర్యము, విజయము చూసి స్నేహితులు వస్తారు. ప్రతికూలమైన పరిస్థితులలో

దూరమవుతారు. అటువంటివారు నిజమైన స్నేహితులు కారు.

మన తప్పుల్ని నిర్మొహమాటంగా చెప్పేవాడే, నిజమైన స్నేహితుడు.

స్నేహితుడితో ఎలా మాట్లాడాలో తెలియక పోతే, మాట్లాడకుండా వుండటం మంచిది.

క్రమ శిక్షణలేని స్నేహితులు దేనికీ పనికిరారు. వారిని దూరంగా వుంచడం మంచిది.

స్నేహం ఒక వ్యాపారం కాదు. మనస్సుకు సంబంధించిన భావన.

స్నేహం కోసం ప్రాణాన్ని అర్పించే ముందు, దానికి అతని, అర్హతను గుర్తించాలి.

స్నేహం ఆనందాన్నిస్తుంది. దుస్థితిని, దుఃఖాన్ని దూరం చేస్తుంది.

ప్రతికూల పరిస్థితులలో కూడా నిలబడేదే నిజమైన స్నేహం.

స్నేహితుడి దుఃఖం, కష్టాలు అర్థంచేసుకోగలిగితే, వాటిని తగ్గించే మార్గం మన వద్దనే వుంటుంది.

స్నేహితుడి అవసరానికి ఆదుకుంటే, భవిష్యత్తులో ఏదోనాడు మనకు ఉయోగపడుతుంది.

స్నేహితుడు నీపై జాలి పడేలా దిగజారి పోవద్దు.

స్నేహితుడ్ని అందరిముందూ అభినందించు. అవసరమైతే రహస్యంగా మందలించు.

స్నేహితుడి తప్పును ఒకసారి క్షమించు. రెండోసారి ఖండించు. మూడోసారి చేస్తే దూరంగావుండు.

స్నేహితుడి, కన్న పిల్లల్ని మన కింద కూలికి పెట్టుకోవద్దు.

స్నేహం, ప్రేమ, అధికారం దౌర్జన్యంతో పొందలేము.

అప్పు యిచ్చి, స్నేహితుడిని పోగొట్టు కోవద్దు.

స్నేహితుని వెనుక అతన్ని గురించి చెడుగా మాట్లాడకూడదు.

స్నేహం వలన మానసిక విశ్రాంతి, ఆత్మీయత లభ్యమౌతాయి.

నవ్వుతూ నలుగురు స్నేహితుల్ని సంపాదించాలి.

స్నేహితునిలోని మంచిని గ్రహించాలి అతని చెడు, బలహీనతలకు దూరంగా వుండాలి.

స్నేహానికి కులం, మతం, లేదు స్నేహానికి గొప్ప, బీద తేడాలు లేవు.

కోపతాపాలు, అసూయలు స్నేహానికి దూరంగా వుంచాలి.

స్నేహితుని పై మీ అభిప్రాయాలు రుద్దటానికి ప్రయత్నించకూడదు. స్నేహం చెదరిపోవచ్చు.

స్నేహం వ్యాపారం కాదు, అది అనుభవం మీద అవగతం అవుతుంది.

మంచి స్నేహితుడ్ని సంపాదించడానికి ఓపిక, విశాల హృదయం, చొరవ కావాలి

సత్ప్రవర్తన, ఆదర్శాలు, క్రమశిక్షణ వున్న వారు, మంచి స్నేహానికి యోగ్యులు

డబ్బు స్నేహాన్ని పాడుచేస్తుంది.

ఒంటి పిల్లిరాకాసితత్వం వదలి, పది మందితో స్నేహంగా, ఆనందంగా వుండాలి.

స్నేహితుల్లోని మంచిని మాత్రమే గ్రహించి, చెడును విడిచిపెట్టాలి.

స్నేహంలో అసూయ, ఆగ్రహాలకు ఆస్కారం యివ్వకూడదు.

# దాంపత్యం, అన్యోన్య దంపతులు

(Made for each other)

ఉద్యోగస్థులలో దాంపత్యం అనేది ముఖ్యమైన పర్వం. కనుక దాంపత్యానికి సంబంధించిన కొన్ని విషయాలను యిక్కడ పొందు పరచడం జరిగింది.

భార్యాభర్తల అనుబంధం, కలకాలం నిలవాలంటే వారి మధ్య నమ్మకం ముఖ్యం.

భార్యాభర్తల సాన్నిహిత్యం బలంగా వుంటే, ఆ అనుబంధం చూపరులకు యింపుగా వుంటుంది.

పెళ్ళంటే నూరేళ్ళ పంట అని, భార్యాభర్తలు నమ్మాలి. పెళ్ళి డబ్బుతో ముడిపడిన వ్యాపారం కాదు. పెండ్లి, భేషజాలకు, సంకుచిత భావాలకు అతీతమైన బంధం. ప్రేమను మాటల్లో కాదు చేతల్లో అందంగా చూపాలి. భార్యా భర్తలు ఒకర్ని ఒకరు గౌరవించుకోవాలి, విలువనిచ్చుకోవాలి. గౌరవం అనేది, ఇచ్చి పుచ్చుకోనేది. అది దంపతులకూ వర్తిస్తుంది. దంపతుల మధ్య అపోహాలుంటే, సున్నితంగా మాట్లాడుకుంటే అవి మాయమవుతాయి. భార్యా భర్తలు ఘర్షణ పడితే సంఘంలో అగౌరవం పొందుతారు.

దంపతులలో ఏఒక్కరిలోనైనా స్వార్థం, కరడుగట్టిన మనస్తత్వం, నిర్లక్ష్యం వుంటే వారి జీవితం నరకమే. వాటి ప్రభావం పిల్లలపై కూడా పడుతుంది.

కష్టాలకు మూలం కొత్తదనాన్ని అంగీకరించలేని మనస్తత్వం.

పరివర్తన మంచి పరిణామాలకి దారితీస్తుంది. దారి తప్పిన వారు. ఈ సత్యాన్ని గ్రహించాలి.

గొడవలు పడి మనస్థాపాన్ని మిగుల్చుకునే కంటే, రాజీపడి మనఃశాంతిని పొందటం మేలు.

అన్యాయమైన వ్యాఖ్యానాలు చేసినవారిని పట్టించుకోకపోతే, వారితప్పును వారే తెలుసుకుంటారు. అన్ని రోజులూ ఒకరివే కావు.

దంపతులు కూడా ఎక్కువ వినాలి, తక్కువ మాట్లాడాలి.

దంపతుల సాన్నిహిత్యం ఇచ్చేస్వాంతన అనిర్వచనీయం.

ఆరోగ్యపరమైన విమర్శలను కరకుగా కాక, సౌమ్యంగా చేస్తే, మంచి ఫలితాలు వస్తాయి.

భాగస్వామికి కూడా వ్యక్తిత్వం వుంటుందని గ్రహిస్తే, గృహంలో కలతలు వుండవు

ఎదుటివారి యిబ్బందులను గుర్తించి, కొన్ని యిష్టాలను తగ్గించుకుంటే మంచిది.

దంపతుల భేదాభిప్రాయాల విషయంలో పట్టూ విడుపూ వుండాలి.

మొదటిలో, భార్య భర్తలలో ఒకరు లైబిలిటీ అనిపిస్తే, ఎస్సెట్ గా మార్చడానికి ప్రయత్నలోపం వుండకూడదు.

దాంపత్య సంబంధం పవిత్రతకు, విశిష్టతకు తార్కాణం.

దంపతులు, పెళ్ళిరోజున, ధర్మ, అర్థ, కామ, మోక్ష ప్రయత్నాలలో పరస్పరం తోడుగా వుంటామని ప్రమాణాలు చేస్తారు. అది సర్వదా గుర్తుంచుకోవాలి.

సతికి, పతికి మధ్యగల సఖ్యతకు, అనుబంధానికి సాటిరాగలది ఏదీ లేదు.

ఏడడుగుల వివాహ బంధాన్ని, భారతీయులు పవిత్రబంధంగా పరిగణిస్తారు.

మానవ స్వేచ్ఛ, పరిస్థితుల ప్రభావం, మెట్టినింట్లోని సాధక బాధకాలూ, దాంపత్య సంబంధాన్ని అపవిత్రం చేయకూడదు.

ఇచ్చిపుచ్చు కుంటేనే జీవితం, సార్థక మవుతుంది. జీవిత భాగస్వామి విలువల ప్రాధాన్యతలను గౌరవించాలి.

జీవిత భాగస్వామి మిక్కిలి ప్రాధాన్యం ఇచ్చే విషయలను ఆమోదించాలి. జీవిత భాగస్వామి ఇష్ట పడే ప్రధాన అంశాలు, నీ విలువలతో విభేదించినా, వాటిని గౌరవించాలి.

దంపతులు మనస్సు విప్పి మాట్లాడుకోవాలి, పరస్పరం అర్థంచేసుకోవాలి.

దంపతులు, వారి విభేదాలను గమనించి, సరైన ఆలోచనల ద్వారా పరిష్కరించు కోవాలి.

దంపతులు, ఉన్నదానితో సంతృప్తి పడాలి.

దాంపత్యాన్ని మించిన ధర్మం మరొకటి లేదని గుర్తించాలి.

దంపతులు జీవితంలో సుఖ సంతోషాలు పొందాలంటే కేవలం శారీరక సంబంధమేకాదు వారి, వారి విలువలను గౌరవించుకోవాలి.

గేలి చేసి, దాన్ని ఒక జోక్‌గా తీసుకో, అని భార్యతో తర్వాత చెప్పడం మూర్ఖత్వం.

ఇతరులముందు జీవిత భాగస్వామిని హేళన చేయడం, అవమానపరచడం అమానుషం.

స్త్రీని ఒక శృంగార సాధనంగానే భావించడం, తర్వాత బాధించడం కుసంస్కారం.

దంపతులు ఒకరినొకరు పట్టించుకోకపోవడం, అవతలి వారి అభిరుచులకు

ప్రాధాన్యతనివ్వకపోవడం అవివేకం.

ఉమ్మడి కుటుంబంలో వున్నా దంపతులు, ఏకాంతం కల్పించుకుని సాధక బాధకాలను చర్చించుకోవాలి.

తమ అభివృద్ధికి తగిన రంగాన్ని ఎంచుకునే స్వేచ్ఛ దంపతుల్లో ఇద్దరికీ వుండాలి.

దంపతులు ఇతరులను గౌరవించడం, సరైన హద్దుల్లో వుండడం, కూడా అవసరం.

బంధువులు, మీ దంపతులపై అతిగా ఆధారపడుతుంటే ఆలోచించాలి. తగిన నిర్ణయం తీసుకోవాలి. వారి గురించి మీ జీవితం నాశనంచేసుకోవద్దు.

భార్య చేసే ప్రతీపనీ ఖచ్చితంగా ఉండాలను కోవడం, పోట్లాటలకు సిద్ధంగావుండటం, భర్త కుసంస్కారానికి నిదర్శనం.

దంపతులు, ఇంటా బయటా ఎప్పుడూ చికాకుగా, హడావిడిగా వుండకూడదు. భావావేశాలు అతిగా ప్రదర్శించడం మంచిదికాదు.

పొగడ్తల కోసం పాకులాడటం మంచిది కాదు. ఇతరుల పొగడ్తలతో సంబరపడిపోయి, భార్యను హింసించడం భావ్యంకాదు.

సంయమనం, సహనంతో వుంటే దంపతుల బాట బంగారు బాట.

మానసికంగా ప్రశాంతంగా వుండటం దంపతులిద్దరికీ మంచిది.

అసహనం, చిన్న విషయాల్ని పెద్దవిగా భావిస్తూ దెబ్బలాట్లకు దిగితే, దాంపత్యం నరక ప్రాయం అవుతుంది.

జీవిత భాగస్వామిని ఎక్కువగా విమర్శించడం, సమస్యపెద్దది కాకపోయినా హైరాన పడటం, మంచి స్వభావం కాదు.

దాంపత్య జీవితంలో సమస్యలొస్తే తప్పుల్ని క్షమించాలి. తప్పుల్ని మరచిపోవాలి. మార్పు తీసుకురావాలి.

జరిగిన పొరబాట్లను, మనస్సులో ఎక్కువకాలం వుంచుకోకూడదు.

భార్యని / భర్తని విమర్శించ వలసి వస్తే, ప్రేమతో, నవ్వుతూ చేయాలి. ఆరోగ్యకరమైన విమర్శలు, చాలా మేలు చేస్తాయి.

దంపతులు గొడవలతో మనస్థాపం మిగుల్చుకునేకంటే, రాజీపడటం మేలు. ఎదుటి వారి మానసిక స్థితిని గ్రహించి మసలు కోడం దంపతులకు మేలు.

తన సమయం బాగోలేదను కుంటే జీవిత భాగస్వామి చేసిన అన్యాయమైన వ్యాఖ్యలను పట్టించుకోక పోవడం మేలు.

జీవితంలో ఒత్తిడికి దూరంగావుండాలి. ఒత్తిడి లేని జీవితమే సుఖ:సంతోషాలనిస్తుంది.

భాగస్వామి ఉత్తమ లక్షణాలను గుర్తించి వాటిని అనుసరించాలి.

పరిస్థితులు విషమిస్తే, మాటలతో పని కాదనిపించినపుడు, జీవిత భాగస్వామిని ఎలాంటి భావోద్వేగాలూ లేకుండా, ఓదార్పుగా, దగ్గరకు తీసుకుంటే ఆ స్వాంతన అనిర్వచనీయం.

విజయవంతమైన వైవాహిక జీవితానికి మూలం అనురాగమే.

సంకుచిత భావాలు, భేషజాలు, అహంభావం, వైవాహిక జీవితానికి కత్తిరేట్లు.

# మన పరిసరాలు - దత్తత

(Owning your surroundings)

యువత నిర్మాణాత్మకమైన పనులు చేయాలి. మీలో ఆర్గనైజింగ్ కేపబిలిటీవుంది. కనుక Face Setting Activity పేరుతో మీ పాత బడి or, మీ College or మీ గ్రామం or, మీపట్టణం or, మీ వీది. or, మీ పార్కులో పారిశుద్ధ్య కార్యక్రమాన్ని చేపట్టండి. ఈ కార్యక్రమం యొక్క భాగంగా మీరు చేయవలసిన పనులను లిస్ట్ (List) చేయండి. Plan చేయండి.

ఈ Face Setting Activity అనే కార్యక్రమంలో Like Minded People తో ఆలోచించండి, వారిని ప్రోత్సహించండి, ప్రోత్సాహాన్ని పొందండి. నేను అనే పదాన్ని దూరం చేసి, మేము అనే దానికి ప్రాధన్యమివ్వండి. కలసి కృషి చేయండి. ఈ కృషిలో భాగస్వామ్యాన్ని పంచండి కావలసిన Infrastructure, డబ్బు, ఎలా కూడ గట్టు కోవాలో ఆలోచించండి. దీనిలో స్వార్థాన్ని దూరంగా వుంచండి.

Brain Storming Session ను Conduct చేయండి. అందరి అభిప్రాయాలనూ సేకరించండి విభేదించవద్దు. ఇతరులు (అంటే ఈ కార్యక్రమంలోని భాగస్వాముల) అభిప్రాయాలను గౌరవించండి. మంచి అభిప్రాయాలకు రూపు కల్పించండి. ఆ (Implementation) అభిప్రాయాలను అమలు చేసే టపుడు మీరు చేసే విధానాలను, చూసేవారు మెచ్చుకునేలా, చేసి శభాష్ అని పించుకోండి. మీరు చేస్తున్న ఈ Face Setting Activity ని మేము ముందుగా ఎందుకు చేయలేక పోయాం? అని చూసేవాళ్ళు అనుకోవాలి.

So think, ఆలోచించండి, మీ అభిప్రాయాలను, (Opinions) ను, మీ సూచనలను యివ్వండి. ఏదీ అసాధ్యం కాదు చేయాలనే పట్టుదల కావాలి.

మీ వరిసారాల పారిశుధ్యాన్ని మీ కాలేజి వరినరాల, పారిశుధ్యాన్ని మీరు చేపట్టాలనుకుంటున్నారు. దానికి మీరు ఏం చేస్తారు? అందరి అభిప్రాయాలూ సేకరించండి. కొన్ని అభిప్రాయాలు ఈ విధంగా వుండవచ్చు.

1. అవసరమయిన వనరులను (Infrastructure) ను కూడగట్టడం,
2. ఏకగ్రీవంగా (Unanimously) fixing date, time మరియు బాధ్యతలను పంచుకోవడం,
3. పారిశుధ్యం గురించి, దాని వల్ల కలిగే లాభాల గురించి అందరికీ వివరించడం,

4. సూచనలను, Notice Board మీద సక్రమంగా రాయడం,

5. వీధులను ఊడ్చి, చెత్తను సేకరించి దూరంగా పడేసి, కాల్చివేయండం,

6. మురుగు కాల్వలోని అడ్డంకులను తొలగించడం, బ్లీచింగు పౌడరు చల్లడం,

7. అనవసర, అశ్లీల పోస్టర్లను తొలగించడం,

8. పారిశుద్ధ్యం గురించి, మీ College చుట్టు ప్రక్కల, ఆ వార్డు లోని వారికి తెలియ చేయడం. Educate చేయడం.

9. పారిశుద్ధ్యం చేసిన తర్వాత, వారు maintain చేయడానికి ఏమిచేయాలో చెప్పడం.

10. సాంస్కృతిక కార్యక్రమాల్ని నిర్వహించడం, వంటి అభిప్రాయాలు చాలా వస్తాయి.

మీ ముందున్న 100 opinions లలో అభిప్రాయాలలో, vital few, trivial many concept ను అమలు చేయండి vital few opinions ను గుర్తించి సక్రమంగా, పోజిటివ్‌గా, స్పోర్టివ్‌గా, effective గా , result oriented గా అమలు (implement) చేయండి. చూడండి. Success is yours. అనుకున్నది సక్రమంగాచేశాం అన్న ఆనందం మీకు కలుగుతుంది. మీ లో వున్న Organising abilities, capabilities కు ప్రాణంపోయండి. ఉన్నత పౌరులుగా గుర్తింపుపోందండి. మీరు ఆదర్శప్రాయం అవ్వండి. మీరు ఒక సారి demonstrate చేసి, మీ college చుట్టూ నివసిస్తున్న వారిని ఎంకరేజ్ చేయండి. Follow-up action లేకపోతే మీ శ్రమంతా వృధా. మీరు చేసిన ఈ social service, (సేవ) ను మున్సిపల్ అధికారుల దృష్టికి తీసుకురండి. వారిభాధ్యతలను మీరు పంచుకున్నారనే భావన వారికి కలిగితే, good will వుంటుంది. మీరు చేపట్ట బోయే తదుపరి కార్యక్రమాలలో వారిసహకారం దానంతట అదే వస్తుంది. మీకు, మీ college కి, గుర్తింపు వస్తుంది.

మీ భవిషత్తును రూపుదిద్దుతున్న మీ కాలేజి, దాని పరిసరాలను ఈ Face setting activity ద్వారా అభివృద్ధి (ఇంప్రూవ్) చేశామన్న ఆనంద మీకు మిగులుతుంది. మీకు తెలుసు మీరు ఎంతో టైముని gossip, chitchatting, irrelevant విషయాల పై చర్చలతో వృధా చేస్తున్నారని. ఆటైములో కొంత time ను ఈ Face setting activity కి ఉపయోగిస్తే ఆదర్శ ప్రాయులౌవుతారు. మీలోని నాయకత్వ లక్షణాలు బయటకు వస్తాయి. మీరూ సంఘానికి కొంత సేవ చేయగలరు.

ఈ సేవను మీరు మనస్సు పెట్టిచేస్తే results will be good. సేవ అనేది మన ప్రదాన కర్తవ్యము. చిత్త శుద్ధి లేక పోతే సార్ధకతవుండదు. 'చిత్త శ్య శుద్ధ యే కర్మ :

సమాజంలో మన మధ్యవున్న వ్యక్తులలో ఈ అలవాట్లను చూస్తుంటాం. ఈ వ్యక్తులు వారి, యింటిని, వారి పరిసరాలను చక్కగా వుంచుకుంటారు. కానీ వీరికి కిళ్ళీలు తినడం అలవాటు. పబ్లిక్ స్థలాలకు వెళ్ళి, గోడల మీద, రోడ్ల మీద వుమ్మి వేస్తుంటారు. తెల్లటిగోడల పై ఎర్రటి మచ్చలు చేస్తుంటారు. ఈ పబ్లిక్ స్థలాలను అశుభ్ర పరచడం వంటి చెడు అలవాట్ల నుండి రక్షణ కావాలి మనకు.

పెద్దవాళ్ళు ఇంట్లోని చెత్తను రోడ్లపై వేస్తుంటారు. టి.వి.లో లైఫ్ బోయ్ సబ్బు కోసం ఒక అడ్వర్‌టైజ్ మెంటును ప్రసారం చేస్తున్నారు. దానిలో చిన్న పిల్లలు శ్రద్ధ తీసుకుని పెద్దవాళ్ళు రోడ్ల పై వేసిన చెత్తా చెదారాలను ఎత్తివేస్తారు. ఒక తింగరివాడు తెచ్చిన బండిపై ఆచెత్తా చెదారాలను వేసి దూరంగా తీసుకువెళ్ళి పడేస్తారు. ఆ కాలనీ రోడ్లన్నీ శుభ్రపరుస్తారు.

ఆ తింగరివాడు ఆ పిల్లల్ని ఆ బండి పై కూర్చోబెట్టుకుని తీసుకువస్తాడు. వారంతా మనం చేయలేని పనిని, వారు చేసినందుకు, సంతోషంగా కేరింతలు కొడుతూవచ్చి, చివరకు లైఫ్ బోయ్ సబ్బుతో సంతోషంగా స్నానం చేస్తారు. నిజంగా ఆ తింగరివాడూ, ఆపిల్లలూ మనకంటే తెలివైనవారు వారి నుండి మనం నేర్చుకోవలసినది చాలావుంది. అలాంటి ఫేస్ సెట్టింగు ప్రోగ్రాంలో, పారిశుధ్య కార్యక్రమంలో పాలుపంచుకోవాలనే, గుణపాఠం వీరినుండి మనం నేర్చుకోవాలి.

ఈ ప్రసారంలో పాల్గొన్న బాలల్లో ఉత్సాహం, ఏదో మంచి చేయాలి అనే పట్టుదల, కనబడుతుంది. 'మీరు పాడుచేస్తున్న రోడ్లను మేము శుభ్రం చేసి మీకు కనువిప్పుకలిగిస్తాం', అని పెద్దలకు ఒక సందేశాన్ని ఇస్తున్నట్లు అనిపిస్తుంది. 'ఒక మంచి పనిని చేయడానికి, మీరు అడ్డుతగిలినా మేము ఆగము. ఈ పారిశుధ్య కార్యక్రమాన్ని మేము చేసి చూపిస్తాం. మీరూ ఈ పని చేయగలరు. కానీ చేయరు. మీరూ మాలాగ ఈ కాలనీ రోడ్లను శుభ్రం చేస్తే, కాలనీ యింకా శుభ్రంగా అందంగా వుంటుంది', అని చెబుతున్నట్లు ఉంది. చెత్తను తొలగించి కాలనీ రోడ్లను శుభ్రం చేసిన తర్వాత, ఆ కార్యక్రమంలో పాలుపంచుకున్న ఆ మానసిక వికలాంగుడి, ముఖంలో కనబడే ఆనందం చూస్తుంటే, 'మీరు యిలాంటి కార్యక్రమాలలో పాలు పంచుకుని, మీ పరిసరాలను శుభ్రపరచి, మా ఆనందంలో పాలు పంచుకోండి' అనే సందేశాన్ని మనకు యిస్తున్నట్లుగా అనిపిస్తుంది. 'ఒక మంచిపనిని సమిష్టిగా చేయడంలో ఎంత ఆనందం వుందో మీరే చూడండి' అన్నట్లు వుంది. 'మేము విసిరిన 'సవాల్' ను మీరు అందుకుని, మీరూ వాతావరణ కాలుష్యాన్ని నివారించి, మాలా ఆనందంగా వుండండి' అన్నట్లుగా వుంది.

పెద్దలు, యిటువంటి పిల్లలను విశిష్టమైన వ్యక్తులుగా గుర్తించి, వారిని మరిన్ని మంచి

పనులు చేయడానికి ప్రోత్సహించాలి. వారి స్వీయప్రతిభను పెంపొందిచడానికి, వినియోగించడానికీ, వారికి తగిన ప్రోత్సాహమివ్వాలి. పిల్లల శక్తి సామర్థ్యాలను తక్కువగా అంచనా వేయకూడదు.

మొక్కలు నాటడం, వారి వీధి, వారి కాలనీ, వారి బడి, వాటిని శుభ్రంగా వుంచడం లో బాలలు పాల్గొంటుంటే వారికి తగిన ప్రోత్సాహమివ్వాలి. ఇటువంటి ఫేస్ సెట్టింగు యాక్టివిటీస్ చాలా అవసరం. ప్రతి పనినీ నిర్మాణాత్మకంగా, సృజనాత్మకతతో చేయడానికి పిల్లలను ప్రోత్సహించాలి. బలమైన పునాది వేయాలి. ఈ కార్యక్రమాలను చేయడానికి, పెద్దలూ ముందుకు రావాలి. మన మనస్సు, ఇల్లు, పరిసరాలు శుభ్రంగా వుంటే మనదృక్పథం చక్కగా వుంటుంది. మన ఆలోచనాసరళి సవ్యంగా వుంటుంది. దానికి కృషి, తోడైతే ఫలితాలు చక్కగా వుంటాయి. కనుక మన పరిసరాలను దత్తత తీసుకుని పరిశుభ్రం ఉంచగలమని నిరూపించాలి. జీవితంలో యిటువంటి కార్యక్రమాలలో పాలు పంచుకోవడం మన బాధ్యతగా గుర్తించాలి. జీవితంలో చదువు, సంస్కారం, ఆటలు పాటలు ఎంత అవసరమో పరిశుభ్రత కూడా అంత అవసరమే.

మన పరిసరాలలో మొక్కలు నాటడం, వాటిని సంరక్షించడం కూడా అవసరమే. మన పరిసరాలలోవున్న నిరక్షరాస్యులకు, అక్షరాస్యత కల్పించడానికి, మన కృషి అవసరమే. ఇటువంటి అవసరాలను గురించి కాలేజీ విద్యార్థులు సమిష్టిగా సోషల్ సర్వీసు చేస్తే, వారు పొందే సంతృప్తి, సంతోషం మరువలేనివిగా వుంటాయి.

# టివిలో మనో వికాసాన్ని పెంచే కార్యక్రమాలను రూపొందించవలసిన ఆవశ్యకత

విద్యార్థులు, ఉద్యోగస్తులు, టివి, సినిమా, ఇంటెర్నెట్, ద్వారా అమితమైన విజ్ఞానాన్ని సాధించవచ్చు. కానీ ఆచరణలో చూస్తే, ఈ సాధనాల వల్ల ఎక్కువ లాభాలకంటే యెక్కువ నష్టాలు కలుగుతున్నాయి. ఏవిషయంలోనైనా చెడును విడిచిపెట్టి మంచిని తీసుకుని ఆచరిస్తే మంచే జరుగుతుంది. కానీ సినిమా, టివి, ఇంటెర్నెట్ వంటి వాటనుండి యువత ఎక్కువ చెడునే స్వంతం చేసుకోవటం జరుగుతుంది. దాని వలన సమాజంలో విలువలు దిగజారు తున్నాయి. స్త్రీలపై అత్యాచారాలు, దోపిడి, దొంగ తనం, హింస, చెడువిషయాల అనుకరణ ఎక్కువ అవుతున్నాయి. ఈ స్థితిని అరికట్టాలంటే కొంత మార్పు రావాలి.

ఈ మార్పు (change) కోసం కొన్ని సూచనలు, యిక్కడ పొందుపరచడం జరిగింది.

విద్యార్థినీ విద్యార్థులకు, ఉద్యోగస్తులకు, వ్యాపారస్తులకు మనో వికాసానిచ్చే ప్రోగ్రామ్సును, రూపొందించి టివిలో ప్రసారం చేయాలి.

ప్రైవేటు ఛానల్సు వారు వినోదానికే ఎక్కువ ప్రాధాన్యత నిస్తున్నారు. విజ్ఞానానికి, మనో వికాసానికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చే ప్రోగ్రామ్సు రూపొందించే వారిని ప్రోత్సహించాలి.

వాణిజ్య సంస్థలు, విజ్ఞాన పరమైన ప్రోగ్రామ్సును (కార్యక్రమాలను) స్పాన్సర్ చేయడానికి ముందుకు రావాలి.

ప్రతిరోజూ వివిధ ఛానల్సులో సగటున 25 సినిమాలు ప్రదర్శిస్తున్నారు. వినోదాన్నిచ్చే నాటకాలు నాయకులతో చర్చలు, అవసరానికి మించిన టివి కవరేజ్, వంటివి టివి లో చాలా చూపుతున్నారు. వాటివలన టైము వృధా. అంతేకాక కంటి సమస్యలు, అసహనం, నేర ప్రవృత్తి వంటి మానసిక రుగ్మతలు వస్తున్నాయి.

టివి చూస్తున్నపుడు కళ్ళు చూస్తాయి కాని మెదడుకు పనిచేయవలసిన అవసరం వుండటంలేదు.

మంచిపుస్తకం చదువుతున్నపుడు మెదడుకు పదును పెట్టడం జరుగుతుంది.

భగవద్గీత చదువుతూ వుంటే చదివే కొద్దీ, క్రొత్త, క్రొత్త అర్థాలూ, సూచనలూ, సలహాలు, మనముందుకు వస్తాయి. కాని మనం భగవద్గీత చదవడం మానేశాము. టివిలో చూస్తున్నాం అప్పుడప్పుడు. కానీ విదేశాల్లో మెటీరియలిస్టిక్ విషయాలతో విసుగెత్తిన యువతీ యువకులు

భగద్గీత చదువుతున్నారు. అధ్యయనం చేయడమే కాకుండా భగవత్‌గీత పై రీసెర్చ్ చేస్తున్నారు. క్రొత్త కొత్త అర్థాలను వెదికి, వెదికి వెలిక్కి తీసుకువస్తున్నారు.

మనం భగవత్‌గీత, రామాయణం, భాగవతం, శాస్త్రాలు, వంటి వాటికి దూరంగా వుంటున్నాము

టివి, ఇంటర్నెట్, విడియో గేమ్స్ మీ మనుస్సును పదును పెడతాయి. జ్ఞానం పెరుగుతుంది. అయితే ఎక్కువ సమయాన్ని వీటిపై కేటాయిస్తే ఫలితం, ఒబెసిటి, ఒత్తిడి, చురుకుదనం లోపించడం, విజయానికి దూరం అవడం.

టివి, ఇంటర్నెట్ ద్వారా సృజనాత్మకత, సద్భావన, మేధస్సును పెంచే, విషయాల పై ఆసక్తి చూపితే మంచిదే. టివి, ఇంటర్నెట్ ద్వారా కాలక్షేపం, ఇతరుల జీవితాల్లోకి తొంగిచూడటం, సెక్స్, హింస, దొంగతనాలను ప్రేరేపించే విషయాలపై ఆసక్తి చూపితే మనకూ, మన సహచరులకూ చెప్పలేనంత నష్టం.

టి.వి. ని విజ్ఞాన పరికరంగా రూపుదిద్దాలి. టి.వి వినోదాన్ని అందించే పరికరమే కాదు.

మేధస్సును పెంచే కార్యక్రమాలకు బదులు మితిమీరిన ప్రేమ, పగ, కసి, కోపం, క్రోధం, భయం, స్త్రీలపై అత్యాచారాలు పెంచే కార్యక్రామాలు చూపుతున్నారు.

హత్యలు చేయడం, కొట్లాడటం సామాన్యమైన విషయాలు అన్నట్లు సినిమాలలో టివిలలో చూపుతున్నారు. ఖర్చు లేకుండా ఇంట్లోకూర్చుని అటువంటి సినిమాలు చూస్తూవుండటం వలన విద్యార్థుల మనో ప్రవృత్తికి చీడపడుతుంది. విలువలు, సంబంధాలు, వేషభాషలలో మార్పులు, దిగ జారుతున్నాయి. పెరిగిన పిల్లలు పెద్ద వారి మాటలను లెఖ్ఖ చేయడంలేదు. కాలేజీలకి వెళ్ళే కొద్దిమంది ఆడపిల్లల వేషధారణ చాలా జుగుప్సాకరంగా వుంటున్నాది. ఫాషన్ ఛానల్స్‌లో వస్త్రధారణ చాలా జుగుప్సాకరంగా వుంటున్నాది. వాటిని అనుకరించడానికి యువతకు టివి అవకాశమిస్తుంది.

ప్రైవేటు ఛానల్సు, విజ్ఞాన యుతమైన, విద్య, విజ్ఞానం, యశస్సు, పట్టుదల, కార్యసాధన, నైపుణ్యం (స్కిల్స్), కెరీర్‌లో విజయసాధన, మానవ సంబంధాల మెరుగు, ఏకాగ్రత, పోజిటివ్ థింకింగు, ప్రొయాక్టవ్ థింకింగు, నాయకత్వ లక్షణాలు, టైమ్ మేనేజ్‌మెంటు, రిస్కటేకింగు (సాహసించడం), నిర్వహణ సామర్థ్యాలపెంపు వంటి అంశాలపై కార్యక్రమాలను రూపొందించే వారిని ప్రోత్సహించాలి.

మానసిక శాస్త్రవేత్తలతో కేవలం ఇంటర్‌వ్యూలు మాత్రమేకాక, వారు విద్యార్థులతో,

ఉద్యోగస్తులతో ముఖాముఖీ చర్చలు, వారి సమస్యలకు సూచనలు యిచ్చే కార్యక్రమాలను రూపొందించడానికి ప్రైవేటు చానల్సు, విద్యా సంస్థల యాజమాన్యం ప్రోత్సహించాలి.

ఇలాంటి ప్రోగ్రామ్సులను రూపొందించటానికి ప్రభుత్వం ముందుకు రావాలి. చిన్న పిల్లల చిత్రాలు తీయడానికి ప్రభుత్వం ప్రోత్సహిస్తుంది. అలాగే పెద్దల (విద్యార్థులు, ఉద్యోగస్తులు) మనోవికాసం కోసం పైన ఉదహరించిన కార్యక్రమాలు, రూపొందించడాన్ని ప్రోత్సహించాలి.

హింసను, సెక్సును, ప్రేరేపించే సినిమాలు, టివిలో చూపుతుంటే, యువతలో నేరప్రవృత్తి, స్త్రీలపై అత్యాచారాలు, దౌర్జన్యం, దోపిడి, దొంగతనాలు, మామూలు విషయాలుగా పరిగణలోకి వస్తున్నాయి. సినిమా, టీ.వి లలో చూపిస్తున్న చెడు అంశాలవలన, మనిషి యొక్క విలువలు ఎంత దారుణంగా దిగజారుతున్నాయో ఈ వార్తను చదివితే, మీకు అర్థమవుతుంది. ఈ యాధార్ధ సంఘటన గురించి ఈనాడు వార్తా పత్రికలో ప్రచురించారు. దాన్ని యదాతథంగా ప్రచురిస్తున్నాము.

ఇదేం ఘోరం...

కంటిని కాపాడాల్సిన కనురెప్పలే కాటేశాయి... ఆరునెలలుగా కూతురిని బెదిరించి తండ్రి, తల్లిదండ్రులకు తెలియకుండా కొడుకు, చెల్లెలి పై అత్యాచారం జరిపారు. వీరి అకృత్యానికి పద్నాలుగు సంవత్సరాల బాలిక అయిదు నెలల గర్భం దాల్చింది. ఈ విషయం బయటకు పొక్కింది. ఎట్టకేలకు భయపడుతూ ఆ బాలిక, తల్లితో తండ్రీ, కొడుకులు చేసిన అఘాయిత్యాన్ని తెలిపింది. తండ్రి తనకూతురు (14) పై కొంతకాలంగా అత్యాచారం చేస్తున్నాడు. ఈ విషయాన్ని ఎవరికైనా తెలిపితే చంపేస్తానని బెదిరించాడు. ఆ బాలిక అన్న సైతం ఆమెను బెదిరించి అత్యాచారం చేయసాగాడు. భయభ్రాంతులకు గురైన ఆ బాలిక విషయాన్ని ఎవరికీ తెలుపలేదు. బాలికకు తీవ్రంగా కడుపు నొప్పి రావడంతో తల్లి, ఆసుపత్రికి తీసుకువెళ్ళారు. పరీక్షించిన డాక్టర్లు, ఆ అమ్మాయి అయిదు నెలల గర్భం దాల్చిందని చెప్పడంతో తల్లి అవాక్కయింది. విషయాన్ని ఆరాతీయగా, ఈ ఘాతుకానికి పాల్పడింది తండ్రీ, కొడుకులని తెలిసింది. ఎలాగైనా ఆ గర్భాన్ని తొలగించాలని వైద్యులను తల్లి వేడుకుంది. దీంతో ఈ విషయాన్ని అసుపత్రి వారు పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఈ మేరకు వారు కేసు నమోదు చేసుకుని దర్యాప్తు చేస్తున్నారు. సభ్యసమాజం తలదించుకునే విధంగా తండ్రీకొడుకులు ఈ అఘాయిత్యానికి పాల్పడ్డారు.

ఆరునెలలుగా కూతురిపై తండ్రి, సొంత సోదరిపై అన్న ఇలాంటి అత్యాచారం జరపడానికి, వారికి ఇటువంటి ప్రేరణ ఎక్కడనుండి వచ్చింది ? ఇటువంటి అకృత్యాలు మరెన్నో

జరుగుతున్నాయి. వివిధ వార్తాపత్రికలలో చదువుతూనే వున్నాము. పతనమై పోతున్న యిటువంటి వారిని రక్షించవలసిన బాధ్యత ఎవరిది ? అకృత్యాలకు బలిఅవుతున్న వారి గురించి నేను వ్రాసిన చిన్న పొరబాటు అనే కథలో వివరించాను. వీటిని పరిష్కరించడానికి నివారించడానికి విజ్ఞత గలవారు తమవంతు ప్రయత్నం చేయాలి.

యువకులు తమ అవసరాలకు, ఆడంబరాలకు, డబ్బులు సరిపోక, దొంగతనాలకు, హింసకు పాల్పడుతున్నారు. కనుక అటువంటి కార్యక్రమలకు బదులు, మానసిక వికాసానికి, లక్ష్యసాధనకు అవకాశమిచ్చే కార్యక్రమాలు చూపాలి. ఆ కార్యక్రమాలను రూపొందించే వారిని ప్రైవేటు T.V. Channels ప్రోత్సాహించాలి. యువతకు ప్రశాంతమైన జీవితాన్నియివ్వాలి.

యువశక్తిని వృధాచేయటం అమానుషం. టి.విలో మనోవికాసాన్ని పెంచే కార్యక్రమాలు రూపొందించవలసిన ఆవశ్యకత వుందని, ప్రభుత్వం, విద్యార్థులు. ఉద్యోగస్తులు, విద్యాసంస్థలు ప్రైవేటు టి.వి. చానల్స్ వారు భావిస్తారని ఆశిస్తున్నాను.

ఇంటర్నెట్ సెంటరుకు వెళ్ళి Google Website (గూగుల్ వెబ్‌సైట్) ఓపెన్ చేస్తే చాలా మంచి విషయాలు, జ్ఞానం లభిస్తాయి మేధావులు చెప్పిన సలహాలు, వారి కొటేషన్స్ వుంటాయి. కాని ఇంటర్నెట్ సెంటరు నుండి బయటకు వచ్చిన యువతి యువకుల మనసంతా ఖాళీ. మన యువత స్థితి యిలా వుంది.

హాస్యభరిత సినిమా చూసి బయటకు వచ్చాం. కానీ ఒక్క జోకూ గుర్తుకురాదు.

లైబ్రరి నిండా పుస్తకాలే, కానీ ఒక్క పుస్తకాన్ని కూడా ఎప్పుడూ తీసుకోలేదు. లైబ్రరీ కార్డు అవసరం ఎప్పుడూ కలుగలేదు.

గంటల తరబడి టి.వి లో క్రికెట్టు చూస్తుంటాం. కానీ ఎప్పుడూ గ్రౌండులో క్రికెట్టు బ్యాట్ పట్టుకోలేదు.

పరీక్షల సమయం. అయినా పర్వాలేదు. క్రికెట్టు మ్యాచ్ చూడవలసిందే.

టెంత్ క్లాస్ పరీక్షలైనా, ఇంటర్ పరీక్షలైనా, ఫైనల్ ఇయర్ డిగ్రీ పరీక్షలైనా, ఇష్టమైన టి.వి సీరియల్ చూడవలసిందే.

హిందు, ఎకనామిక్ టైమ్స్, ఈనాడు వార్తా పత్రికలు, రోజూ ఇంటికి వస్తాయి. కానీ హెడ్ లైన్స్ (ముఖ్యమైన వార్తలు) చదవడానికి కూడా సమయం దొరకదు. ఈనాడు వార్తా పత్రికలతోబాటు వచ్చే వసుంధర సప్లిమెంటును ఎప్పుడూ తెరిచిన పాపాన పోలేదు.

ఎన్నో కళాత్మకమైన, సృజనాత్మకమైన కార్యక్రమాలు, రవీంద్రభారతిలో

జరుగుతుంటాయని తెలుసు. కానీ ఎప్పుడూ రవీంద్రభారతి మెట్లపై కాలు వేయలేదు.

బిర్లామందిరానికి వెళ్ళాలంటే చాలా శ్రద్ధ. దేవుని దర్శనం చేసుకోవడానికి కాదు. బిర్లా సైన్స్ సెంటర్ చూడ్డానికి కాదు. అక్కడికి వచ్చే అమ్మాయిలకు లైను వేయడానికి.

అంజంతా, ఎల్లోరా గుహలు, కోణార్క్, హంపిల కళాత్మక ఖండాలను చూడ్డానికి విదేశాలనుండి ఎంతో మంది యాత్రికులు వస్తుంటారు. కానీ ఆ రాళ్ళూ పుట్టలలో ఏముంది. అవి చూడ్డానికి వెళ్ళడం సమయాన్ని వృధా చేసుకోవడమే అంటున్నారు మన యువతీ యువకులు.

మన సంస్కృతిని మెచ్చి ఎంతో మంది విదేశీయులు మన దేశాన్ని సందర్శిస్తున్నారు కాని దానిలో ఏముంది? మూఢాచారాలు, మూఢ నమ్మకాలు, మాత్రమే అంటున్నది మన యువత. కానీ డిస్కోలకు వెళ్ళడానికి ఎంతో శ్రద్ధ చూపుతున్నారు.

ఈ దుస్థితి నుండి మన యువతను కాపాడటం ఎలా? వారిని సంస్కరించడం ఎలా? అందరు యిలాంటి దుస్థితి లోనే వున్నారా ? లేదు. మనో వికాసాన్ని పొందాలని, కొంత మందికి వుంది. కానీ అవకాశాలు తక్కువ.

ఈ దిశలో ప్రభుత్వం కొన్ని సూచనలను, ప్రోత్సాహన్ని యిస్తే మేధావులు ప్రజల మానసిక వికాసం కోసం, కొన్ని మంచి ప్రోగ్రాములను రూపొందిస్తారు. ఈ ప్రయోగం జరగాలి. విద్యార్థులు, ఉద్యోగస్థులు, యిటువంటి మంచి కార్యక్రమాలనుండి, కొన్ని మంచి విషయాలు తెలుకుని వారి వివేకాన్ని, తెలివితేటలను, మేధస్సును పెంచుకోడానికి ప్రయత్నిస్తారు. అపుడు వారిలో అల్పతత్వ భావన (Inferiority Complex), చెడును అనుసరించే ధోరణి, నిద్రలేమి, ఒత్తిడి, న్యూరోటిక్ డిప్రెషన్, వంటి, లక్షణాలు దూరమవుతాయి. వారి నుండి ఆందోళన, భయం, అసహనం, కోపం, బద్ధకం దూరంఅవుతాయి. అపుడు వారిలో సుఖః శాంతులను చూడగలము.

విద్యార్థులు, ఉద్యోగస్తులు, మరెవరైనా సరే మనో వికాసాన్ని పెంచే పుస్తకాలు చదవాలి. మానసిక వికాసాన్ని పెంచే కార్యక్రమాలను చూడాలి. కనుక టి.విలో మానసిక వికాసాన్ని పెంచే కార్యక్రమాలను ప్రసారం చేయాలి. దీని ఆవశ్యకతను ప్రభుత్వం గుర్తించి, యువతను సన్మార్గంలోకి తీసుకురావాలి. యువత వలన తలనెప్పులను కూడా తగ్గించుకోవాలి.

# జీవితం

## అవసరమైన అంశాలు

జీవితంలో చాలా అవసరమైన విషయాలు / అంశాలు కొన్ని వున్నాయి. విద్యార్థులను, వుద్యోగస్తులను దృష్టిలో వుంచుకుని, వారి జీవితాలకు. అవసరమైన అంశాలను యిక్కడ ప్రస్తావించడం జరిగింది. యువత వీటిని గుర్తించాలి.

1. విమర్శ (CRITICISING) మన చుట్టూ జరుగుతున్న సంఘటనలను చూసి మనం ఆత్మవిమర్శ చేసుకోవాలి. అవి మనకు అన్వయించుకుని, వాటిలో ఏవి మంచివి, ఏవి చెడ్డవి, వాటిలో వేటిని ఎంత వరకు మనం స్వీకరించవచ్చు, వేటిని మనం దూరంగా వుంచాలి, అని ఆలోచించాలి. వాటినుండి పాఠాలు నేర్చుకోవడం చాలా అవసరం. అలాగని యితరులను విమర్శించడం, అనవసరం. అలా విమర్శిస్తే మన సమయం వృధా అవడమేకాక దుష్ఫలితాలను కూడా పొందవచ్చు. విమర్శ నిర్మాణాత్మకంగా సృజనాత్మకంగా వుండాలి.

2. ఫిర్యాదు (COMPLAINING) : మనలో కొన్ని లోపాలు వున్నాయి. మనం స్వయంకృషితో, మన హితులు, స్నేహితులు, బంధువుల సలహాలతో ఆలోపాలను సవరించుకోవచ్చు. ఆలోపాలు పోయేవరకు మనం మన అంతరాత్మకు ఫిర్యాదు చేస్తూనే వుండాలి. మనలో అంతర్మథనం జరుగుతూనే వుండాలి. స్వయంకృషితో యితరుల సహకారంతో, ఆలోపాలను సరిదిద్దుకోవడమే ప్రజ్ఞ. ఆలోపాలు సరిదిద్దుకోవడం జరిగిన తర్వాత, మరికొన్ని క్రొత్త లోపాలు మనలోను, మనచుట్టూ వున్న వాతావరణం లోనూ మనకు కనబడతాయి. వాటి గురించి మన అంతరాత్మకు ఫిర్యాదు, కంప్లైన్, చేయడం చాలా అవసరం.

అలా అని ఆలోపాలను యితరులకు అపాదించి ప్రక్కకు తప్పుకోకూడదు. నేను పెర్ఫెక్టు లోపాలన్నీ యితరులలోనేవున్నాయి. లోపాలన్నీ సమాజం లోనే వున్నాయి. మన దేశంలోనే వున్నాయి. వాటిని సవరించే బాధ్యత నాది కాదు అనకూడదు. విదేశాలల్లో యిటువంటి తప్పులు జరగవు, అని భావించకూడదు (దూరపుకొండలు నునుపు అంటారుగా). ఈ విధమైన మనస్తత్వం మంచిది కాదు. ఇతరుల లోపాలను మనం వేలెత్తి చూపుతున్నపుడు, మరి మూడు వ్రేళ్ళు మనవైపు చూపుతూండటం గమనించాలి. కనుక మన లోపాలను ముందుగా మనం సవరించుకోవాలి. అందరూ తమ తమ లోపాలను సవరించుకుంటే వారికీ, తద్వారా సమాజానికి మేలు జరుగుతుంది.

**3. పోలిక (COMPARISON) :** (కంపేరిజన్) మన జీవనస్థితిని, మనల్ని, మనకంటే వున్నత దశలో వున్న వారి జీవనస్థితి, వారి శక్తి సామర్థ్యాలతో, వారికి వున్న జ్ఞానంతో, వారి తెలివితేటలతో, వారి కృషి ఫలితాలతో పోలిక చేసుకోవాలి. ఇలా పోలిక (కంపేరు) చేసుకోవడం ద్వారా మనలోపాలు మన దృష్టికి వస్తాయి. ఆలోపాలను సరిదిద్దు కోడానికి మనలో అంతర్మథనం జరుగుతూ వుండాలి. అలా మన లోపాలను సరిదిద్దుకోవడం ద్వారా మన విజ్ఞతను పెంపొందించుకోవచ్చు. అలా పోల్చుకోకుండా, మనమే గొప్ప అనుకుంటూవుంటే మనం వెనుకబడి పోతాం. అలాగని యితరుల సిరిసంపదలతో మనల్ని పోల్చుకుని ఈర్ష్య చెందుతూ వుంటే, ఆ ఈర్ష్య మనల్ని తొలిచివేస్తుంది. కనుక మన బంధువులు, స్నేహితుల సిరిసంపదలు, కీర్తి, అంతస్తూ, హోదాలను చూసి మనం ఈర్ష్య పడకూడదు. అవి మనకు స్ఫూర్తినిస్తాయి. అదే స్ఫూర్తితో, అదే ప్రేరణతో, మనం కృషి చేసి వృద్ధిలోకి రావడానికి ప్రయత్నించాలి.

మనకంటే గొప్పవాళ్ళతో, సిరిసంపదలతో, కీర్తి ప్రతిష్టలతో వున్న వాళ్ళతో పోల్చుకుంటే తప్పులేదు. ఈ పోల్చుట (కంపేరిజన్) అనే అంశాన్ని ఇంగ్లీషులో BENCH MARKING (బెంచి మార్కింగ్) అంటారు. మన విధానాలను, మన కంటే అధికుల విధానాలతో, వారి కృషి ఫలితాలతో పోల్చుకుని, తద్వారా కృషిచేసి, మన విధానాలను వృద్ధి చేసుకుని మంచి ఫలితాలను పొందడమే బెంచి మార్కింగు విధానం. అపుడు నిర్మాణాత్మకంగా, సృజనాత్మకంగా కృషిచేసి వారి ఔన్నత్యానికి దగ్గర కావచ్చు. అలా చేస్తే మంచి ఫలితాలను పొందవచ్చు.

**4. పోటితత్వం ( COMPETETION - కాంపిటీషన్) :** మన జీవితంలో మనం పైకి రావాలంటే ఈ పోటితత్వం మనకువుండాలి. పోటిలేని జీవితం, ఉప్పూ, కారం లేని ఆహారం లాంటిది. ఈ జీవితం నిస్సారంగా వుంటుంది. జీవిత పోరాటంలో కొన్ని సార్లు అపజయాలు కూడా పొందవచ్చు. అపజయాలానుండి పాఠాలు నేర్చుకుని, తిరిగి పోటీ పడి విజయాన్ని సాధించాలి. ఆరోగ్యకరమైన పోటీవుండాలి. పోటీ వుంటేనే కృషిచేయడానికి మనస్సు ఆరాటపడుతుంది. మంచి కృషి ఎప్పుడూ మంచి ఫలితాలను యిస్తుంది. పోటీతత్వం వున్న మనుష్యులు ఎప్పుడూ ముందుకు పోతుంటారు. వారు భవిష్యత్తులో కావాలనుకున్న వన్నీ సాధించగలరు. ఈ పోటితత్వం అన్ని రంగాలలోనూ అవసరం. ఆటలు, పాటలలో, సంగీతంలో, నృత్యం, కవిత్వం, రచన, పెయింటింగ్, ఫోటోగ్రఫీ, డైరెక్షన్, కొరియోగ్రఫీ, వంటి అనేక రంగాలలో పోటీ అవసరం. పోటీతత్వం, మనలోని సృజనాత్మకతను వృద్ధి చేస్తుంది. ఈ సృజనాత్మకతకు, మన తెలివితేటలు, మన కృషి, పట్టుదల తోడైతే, మనకు

మంచి గుర్తింపు వస్తుంది. ఆర్థికంగా, సామాజికంగా ముందడుగు వేయడానికి అవకాశం వుంటుంది.

అపుడు మరికొంత మంది మనల్ని ఆదర్శంగా తీసుకుని, వారిలోని పోటీతత్వాన్ని ప్రేరేపించుకుని, క్రొత్త రికార్డులను, సృష్టించి. ఘనతను సాధిస్తారు. అది మనకూ ఆనందదాయకంగా వుంటుంది.

5. విద్య (EDUCATION), జ్ఞానం (KNOWLEDGE), వృత్తిలో అవసరమైన నైపుణ్యం (SKILLS) గురించి మరొక అధ్యాయంలో వివరించడం జరిగింది. విద్యార్థులకూ, వుద్యోగస్తులకూ ఈ అంశాలలో ప్రావీణ్యం చాలా అవసరం. విద్య, జ్ఞానం, స్కిల్స్ తోపాటు మనకు తెలివితేటలు వుంటే, ఆలోచించే మనస్సు వుంటే, మంచి ఆలోచనలు మన మనస్సులో పుడతాయి. మనలోని సృజనాత్మకత (క్రియేటివిటీ), వృద్ధి చెందుతుంది. తద్వారా మంచి ఆలోచనలు, ఉత్పాదకత, వాణ్యత, సేఫ్టీ, ఆరోగ్యం, క్రీడలు వంటి అంశాలలో మంచి వృద్ధిని సాధించడం సాధ్యపడుతుంది. ఇవి మన జీవితానికి రక్షణ యివ్వడమే కాకుండా, మన జీవిత నౌక చక్కగా ప్రయాణం చేయడానికి దోహద పడతాయి.

6. అదృష్టం (LUCK) :

ఒక వ్యక్తి తన అభిమాన నటుడి సినిమా విడుదల కాగానే మొదటి రోజు, మ్యాటినీ షోకు టిక్కెట్టు దొరికినందుకు అదృష్టవంతుడ్ని అనుకుంటాడు. మరొక వ్యక్తి తను చదువుతున్న ప్రొఫెషనల్ కోర్సులో యూనివర్శిటీలో ప్రథమ స్థానం రాలేదు, రెండవ స్థానం వచ్చింది. నిజంగానేను దురదృష్టవంతుడ్ని అని అనుకుంటాడు. వీరిద్దరిలో నిజంగా ఎవరు అదృష్టవంతుడు ? ఎవరు దురదృష్టవంతుడు ?

మూడోవ్యక్తి తన చదువును, ఈ వృత్తిలో నైపుణ్యాన్ని గుర్తించి, మంచి జీతం యిస్తామంటే తన అదృష్టాన్ని వెదుక్కుంటూ అమెరికా వెడుతున్నాడు. ఈ ముగ్గురిలో నిజమైన అదృష్టవంతుడు ఎవ్వరు ? విజ్ఞతగల వారికి సరైన సమాధానం తెలుసు. అయితే ఈ ముగ్గురు వ్యక్తులూ తమ లక్ష్యాలను నిర్ణయించుకున్నారు. వారి వారి లక్ష్యాలను సాధించడానికి తగిన కృషి చేశారు. ఇద్దర్ని జయం వరించింది. ఒకర్ని అపజయం వరించింది. ప్రథమ స్థానం రాలేదని అతను ఆత్మహత్యచేసుకుంటే అతను నిజంగా దురదృష్టవంతుడే. అలాకాకుండా వృత్తిలో చేరి, మరింత కృషి చేసి, మంచి ఫలితాలను సాధించి, మంచి గుర్తింపుపొంది, సంచలనాత్మకమైన అద్భుతాన్ని కనుగొని, సమాజానికి, దేశానికి 'సేవ చేస్తాను' అనే మరొక లక్ష్యాన్ని నిర్దేశించుకుంటే అతనే నిజమైన అదృష్టవంతుడు. అతని కృషి, లక్ష్యం, అతన్ని

విజయం వైపు తీసుకువెడుతుంది. అపజయాలనుండి, పాఠాలు నేర్చుకుని, విజయాన్ని సాధించినవాడే జీవితంలో నిజమైన విజ్ఞత గలవాడు, అదృష్టవంతుడు.

అన్ని వేళలా, అదృష్టం తానుగా వచ్చి మన తలుపు తట్టదు. అదృష్టం వచ్చినప్పుడు అందుకుని, తగిన కృషిచేసి, ఫలితాలను పొందాలి. డబ్బువున్నవాడు మాత్రమే అదృష్టవంతుడు కాదు. డబ్బు వుండి, గుణం, శీలం లేకపోతే అతను దురదృష్టవంతుడే.

పైన ఉదహరించిన అంశాలు, జీవితంలో చాలా అవసరమైనవి. కృషిలోపం లేకుండా తగిన శ్రద్ధ, వీటి విషయంలో తీసుకుంటే జీవితంలో పరిణతకు ఆస్కారముంటుంది మన:శాంతి దొరుకుతుంది. జీవితంలో అందరికీ కావలసినది ఈ మన:శాంతి మాత్రమే.

### 7. నిర్వహణా సామర్థ్యం (CAPABILITY) :

మన యువతలో నిర్వహణాసామర్థ్యాలు వున్నాయి. కానీ వారు, వాటికి సరైన రూపుదిద్దడం లేదు. బహిర్గతం చేయడంలేదు. వారికి వున్న ఆర్గనైజింగు కేపబిలిటీస్ను, నిర్మాణాత్మకంగా చేసిచూపాలి. యువతకువున్న సామర్థ్యం వారు నిరూపించకపోతే, యితరులు వారిని ఎలాగుర్తిస్తారు. వారి చేతలూ, అభిప్రాయాలూ గుర్తింపు పొందాలి. విద్యార్థులు ఉద్యోగస్థులు వారి శక్తి సామర్థ్యాలను నిర్మాణాత్మకమైన పనులు చేయడానికి వుపయోగించాలి. ఆ కృషి వారికీ, సమాజానికీ ఉపయోగపడాలి. ఫలితాలు ఆసక్తికరంగా వుండాలి. యువతలో పోటీతత్వం ఉండాలి. వారి సామర్థ్యంపై ఇతరులకు నమ్మకం కలుగ చేయాలి. సమాజం, గర్వపడేలా మంచి పనులు చేసిచూపాలి. కూపస్థ మండూకాలలా మిగిలిపోకూడదు. వివిధ రంగాలలో ముఖ్యంగా వారికి అభిరుచి వున్న రంగాలలో కృషిచేసి వారిసామర్థ్యాన్ని వృద్ధి చేసుకుంటే, మంచిపేరు తెచ్చుకోవడమేకాక ఆర్థికంగా ముందడుగు వేయవచ్చు. ఆటలు, పాటలు, సాంస్కృతిక కార్యక్రమాలలో పాలుపంచుకోవడం, నిర్వహించడం అవసరం. సామూహిక కార్యాక్రమాలలో పాలుపంచుకోవాలి గుర్తింపు పొందాలి.

అడవిలో వున్న జంతువులు కూడా వాటి సామర్థ్యాన్ని నిరూపించుకుని తమ ఆహారాన్ని సంపాదించుకుంటాయి. కానీ జంతుప్రదర్శనశాలలోని జంతువులు తమ ఆహారాన్ని సంపాదించుకునే సామర్థ్యాన్ని కోల్పోతాయి. అలాగే యువత వారి సామర్థ్యాన్ని నిర్మాణాత్మకంగా ప్రదర్శించకపోతే, ఎందుకూ పనికి రాని వ్యక్తులుగా మిగిలిపోతారు. కాలన్ని ఎవరూ ఆపలేరు. వయస్సు పెరిగే కొద్దీ మనిషి తన సామర్థ్యాన్ని కోల్పోతుంటాడు. ముసలి తనం వచ్చిన తర్వాత, తన సామర్థ్యాన్ని ప్రదర్శించాలన్నా, ఆరోగ్యం సహకరించదు.

కనుక యవ్వనంలోనే వారి సామర్థ్యాన్ని వృద్ధి చేసుకోవాలి. పరిణతి చెందాలి. నాయకత్వలక్షణాలు కలవారిలో, శక్తి సామర్థ్యాలు ఎక్కువగా వుంటాయి. మంచి పనులు నిర్మాణాత్మకంగా చేయడానికి ముందుకు వస్తారు. వారికి మందుచూపు వుంటాది. వచ్చిన అవకాశాలను వారు సద్వినియోగం చేసుకుంటారు. సాంస్కృతిక కార్యక్రమాలలో పాలు పంచుకోవడం, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించడం ద్వారా పదిమందిచేత శభాష్ అనిపించుకుంటారు.

8. లోక జ్ఞానం (COMMON SENSE) :

COMMON SENSE లేని వారిని తెలుగులో 'బుద్ధీ జ్ఞానం' లేని వారు అని అంటారు. తెలుగులో కూడా' కామన్ సెన్స్ అనే పదం ఎక్కువ వాడుకలో వున్నాది. మంచి పనులు చేయడానికి దీన్ని, అంటే కామన్ సెన్స్‌ను ఉపయోగించాలి. కొన్ని సమస్యలను పరిష్కరించుకోడానికి అతిగా కష్టపడి, కృషిచేయవలసిన అవసరం వుండదు. ఎక్కువగా మన వనరులను కూడా ఉపయోగించనవసరం ఉండదు. ఆ సమస్యలను కామన్‌సెన్స్ ఉపయోగించి, చక్కగా పరిష్కరించవచ్చు. మంచి ఫలితాలను పొందవచ్చు అవి మనకు మన తోటివారికి చక్కగా ఉపయోగపడతాయి.

ఈ కామన్‌సెన్స్ సర్వదా చదువుకున్న వారిలోనే ఉంటుందని చెప్పలేం. కొద్దిమంది చదువులేని వారిలో కూడా, ఈ కామన్‌సెన్స్ ఎక్కువగా ఉంటాది. వారు చదువుకోని మేధావులు. వారికి సమస్యలను పరిష్కరించాలనే కుతూహలం ఎక్కువగా ఉంటుంది. మనస్సు ఉంటే మార్గం ఉంటుంది. కనుక కామన్‌సెన్స్ ఉన్నవారు తమకు, తోటివారికి, సమాజానికి మంచి చేసి, గుర్తింపు పొందుతారు. వీరు తెలివిగల వారిగా గుర్తింపు పొందుతారు.

Engineering is mostly Commonsense అనే నానుడివుంది. అలాగే సైన్సు కూడా. కామన్‌సెన్సు ఉన్నవారు క్రొత్త విషయాలను కనుగొన్నారు.

ఉదాహరణ : 1. ఐన్‌స్టీన్, 2. గెలాలియో, 3. అరిస్టాటిల్, 4. గ్రహమ్ బెల్

ఇటువంటి వారికి క్రొత్త విషయాలు కనుగొనాలనే ఆసక్తి, పట్టుదల ఉంటాది. కొన్నిసార్లు వారి పనులు, ప్రయోగాలు, వారికి అపజయాన్ని కలిగించినా, యితరులు నిరుత్సాహపరచినా పట్టుదలతో కృషిచేసి, విజయాన్ని సాదించి యశస్సు సంపాదించారు.

# రెండవ భాగం - 'వివరణ - ముందు మాట'

ఈ పుస్తకంలోని మొదటి భాగం అంతా మానసిక వికాసానికి సంబంధించిన విషయాలపై వివరణలు యివ్వడం జరిగింది. అంటే విద్య, విజ్ఞానం, నైపుణ్యం, వృత్తిలో విజయ సాధన, జయాపజయాలు, ఒత్తిడి, మానవసంబంధాలు, సంతోషం, ప్రేమతత్వం, ఆధ్యాత్మిక చింతన వంటి అంశాల గురించి తర్కించడం జరిగింది. వాటికి సంబంధించిన కొన్ని మంచి సూక్తులను, ఇంగ్లీషు నుండి నాదైన శైలిలో తెలుగులోకి అనువదించి మొదటి భాగంలో పొందుపరచడం జరిగింది.

ముందుగా వివరించినట్లుగా (ముందు మాటలో) ఈ పుస్తకం, విద్యార్థులను, ముఖ్యంగా ప్రొఫెషనల్ కాలేజిలనుండి, విజయవంతంగా బయటకు వస్తున్న విద్యార్థులను దృష్టిలో పెట్టుకుని రచించడం జరిగింది. ఎన్నో ఆశలు, ఆశయాలతో వృత్తిలో అడుగుపెట్టిన ఉద్యోగులను దృష్టిలో పెట్టుకుని ఈ పుస్తకం వ్రాయటం జరిగింది. కొన్ని వివరణలు సూక్తుల రూపంగా, కట్టె, కొట్టె, తెచ్చె అన్నట్లుగా, సామాన్యంగా, సూక్ష్మంగా, వ్యాస రూపంగా ఈ అంశాలను వ్రాయడం జరిగింది. మానసిక వికాసానికి సంబంధించిన మరికొన్ని అంశాలను కథారూపంగా వ్రాస్తే, ఆసక్తిగా, శ్రద్ధగా, విద్యార్థులు ఉద్యోగస్తులు చదువుతారని, స్నేహితులు సూచించారు. వారి అభిప్రాయాన్ని యిక్కడ కొద్దిగా వివరించాలి.

విద్యార్థులు, ఉద్యోగస్థులు, టి.వి., సినిమా, ఇంటర్నెట్ ద్వారా అమితమైన విజ్ఞానాన్ని సాధించవచ్చు. వారు ఇటువంటి, మనో వికాసానికి సంబంధించిన అంశాలు, వ్యాసపరంగా ప్రచురించిన పుస్తకాలు చదవడానికి ఆసక్తి చూపడం లేదు. కొంతలో కొంత కథారూపంగా వున్న పుస్తకాలను చదవడానికి ఆసక్తి చూపుతున్నారని వారి వాదన. అయితే టివి, సినిమాలలో వినోదం, హింస, ప్రేమ, పగ, కసి, కోపం, క్రోధం, భయం, స్త్రీలపై అత్యాచారాలు పెంచే కార్యక్రమాలు, ఎక్కువగా చూపడం జరుగుతుంది. మానసిక వికాసం, సమస్యలకు పరిష్కారాలు, మానవసంబంధాలు మెరుగు పరుచుకోవడం, వ్యక్తిసామర్థ్యం, వ్యక్తిత్వ వికాసం, అవగాహన, ప్రేరణ, నాయకత్వ లక్షణాలు, నిర్వహణాసామర్థ్యం వంటి అంశాలు గురించి తెలిపే కార్యక్రామాలు తక్కువగా చూపడం జరుగుతుంది. ఈ అంశాలను కథా రూపంగా ప్రస్తావించి నపుడు, యువత కొంత ఆకర్షితులు అవుతారని వారి వాదన. వారి సూచనలను గౌరవించి ఈ పుస్తకం లోని రెండవ భాగంలో, మానసిక వికాసానికి సంబంధించిన కొన్ని అంశాలను, వ్యాస రూపంగా కాకుండా, కథారూపంగా వివరణ యివ్వడం జరిగింది.

'చిన్నపొరబాటు' అనే కథ లో చిన్న పొరబాటు వలన జీవితంలో ఎంతటి జటిలమైన సమస్యలను ఎదుర్కోవలసి వస్తుందో వివరించడం జరిగింది. పొరబాట్లు (తప్పులు) చేయని మనిషి ప్రపంచంలో ఎవరూ వుండరు.

కొన్ని తప్పులు మనకు తెలసి జరుగుతాయి. కొన్ని తప్పులు మనకు తెలియకుండానే, మన ప్రమేయం లేకుండా కూడా జరగవచ్చు. కానీ పర్యావసానాలు, చాలా తీవ్రంగా వుండవచ్చు. కొన్ని ప్రాణాలు కూడా కోల్పోవలసి రావచ్చు. ప్రతీ సమస్యకూ ఒక పరిష్కార మార్గం వుంటుంది. ఎంత జటిల సమస్య అయినా పరిష్కారమార్గం అన్వేషించాలంటే, మానసిక వికాసం, పరిపక్వత అవసరమని ఈ కథలో వివరించడం జరిగింది. కులాంతర వివాహాలు తప్పు, అనే 'మిత్' (కల్పన) సరి కాదు. అది తప్పు అని ఈ కథలో చెప్పడం జరిగింది. కులాంతర వివాహాలలో కేవలం, అందం, ఆకర్షణ, సెక్స్ మాత్రమే కాక, వ్యక్తిత్వం, ఆశావహదృక్పధం, అనురాగం, మంచి ప్రణాళికలు వుంటాయని వివరించడం జరిగింది. ఛాందస భావాలను నిరసించడం జరిగింది. ఎదిగిన పిల్లలలోనూ పరిపక్వత చెందిన మనోస్థితి వుంటుందని, వారితో నిష్కల్మషంగా, ప్రేమగా, స్నేహంగా, చిరునవ్వుతో సమస్యలను చర్చిస్తే, వారూ త్యాగాలు చేయడానికి వెనుకాడరు అని చెప్పడం జరిగింది.

అనిశ్చిత స్థితి, మానసిక క్షోభ, విశ్వాసం, ఆశలు, ఆశయాలు, నిజాయితీ, విషాదం, ప్రేమ, పిచ్చి, హింస, సాంప్రదాయం, పోజిటివ్ రెస్పాన్స్, నెగెటివ్ రెస్పాన్స్, శాంతి, మెంటల్ మెచూరిటీ, మంచి నిర్ణయాలను తీసుకోవడం, పరిష్కారం, స్వార్థం, నిస్వార్థం, కష్టాలు, సుఖాల వంటి పరిస్పర విరుద్ధ అంశాలను, మానసిక వికాసాన్నిచ్చే అంశాలను కధారూపంగా వివరణ యివ్వడం జరిగింది

విషాదం, బెంగ, ఉదాసీనత, నిర్లిప్తత, ఆత్మవంచన, చరిత్రహీనత, మెంటల్ డిప్రషన్, పిచ్చి వంటి అంశాలను, నీతి నియమాలు, నిరాశ, నిస్పృహ, ఇంగితజ్ఞానం, పశ్చాత్తాపం వంటి మానసిక అంశాలనూ విపులీకరించడం జరిగింది. ఇంతకు మించి వివరణలు యిస్తే కథలో పటుత్వం వుండదని భావిస్తున్నాను.

'వ్యక్తి ఆరాధన' అనే పేరుతో నేను వ్రాసిన కథలో అంతర్మధనం, కపటి వ్యక్తిత్వం, మొండితనం కుటిల సంస్కారం, చపలతత్వం, మోసం, పతనం, అశ్లీలత, అపోహల గురించి, వాటికి విరుద్ధమైన, వ్యక్తిత్వం అభిమానం, వ్యక్తి ఆరాధన, సంస్కారం, స్నేహం, ఆప్యాయత అనే అంశాల గురించి ప్రస్తావించడం జరిగింది. తద్వారా మానసిక విశ్లేషణ చేయడం, ఒక సందేశాన్ని అందించడం జరిగింది.

కనుక ఈ రెండు కథలలోనూ మానసిక వికాసానికి సంబంధించిన అంశాలను కథారూపంలో వివరణ ఇవ్వడం జరిగింది. ఆవిధంగా ఈ కథలలో మానసిక వికాసానికి సంబంధించిన అంశాలను, వ్యాస రూపంగా కాక కథారూపంగా వ్రాసి, స్నేహితుల సూచనను గౌరవించాను. అయితే ఈ ప్రయోగాన్ని విద్యార్థులు, ఉద్యోగస్తులు ఎంత వరకు అర్థం చేసుకుంటారో, ప్రోత్సహిస్తారో వేచి చూడాలి. కాలమే దీన్ని నిర్ణయిస్తుంది.

సమస్యలు అనేకరకాలు. మానసిక సమస్యలు, డబ్బుసమస్యలు, స్నేహం, బాంధవ్యాల సమస్యలు, వృత్తిలో సమస్యలు, ఇంట్లో, ఆఫీసులో, పరిసరాలలో అనేక సమస్యలు ఉంటాయి. అయితే ఈసమస్యలకు పరిష్కారాలు కూడా ఉంటాయి. వాటిని సరిగ్గా సరైనసమయంలో గుర్తించడానికి ఈమానసిక వికాసం అనేపుస్తకం ఉపయోగపడుతుంది.

సమస్యలు లేనివారు చాలా అరుదు. కనుక సమస్యలను, వాటి పరిష్కారాలను సరిగ్గా గుర్తించి ఆచరించి, సుఖ సంతోషాలను పొందవచ్చు. సమస్యలను విశ్లేషించుకోవడానికి, ఈపుస్తకంలోని సూచనలు బాగా ఉపయోగపడుతాయి.

మానసిక సమస్యలతో బాధపడుతున్నవారు వారి సమస్యలకు రచయితకు పంపితే మరి కొంతమంది మానసిక శాస్త్రవేత్తలతో చర్చించి, విశ్లేషించి తగినసూచనలివ్వడం జరుగుతుంది. ఇటువంటి ఉత్తరాలు పంపినవారి వివరాలను గోప్యంగా ఉంచడం జరుగుతుంది.

మానసిక సమస్యలు వాటి పరిష్కారాలు అనే శీర్షికతో కొన్ని టి.వి. ప్రోగ్రాములను రూపుదిద్దాలని ఆశాభావం ఉంది. దీనికి టి.వి.ఛానల్స్ స్పాన్సర్స్‌ల సహకారం అవసరం. ఈ కార్యక్రమాలను నిర్మాణాత్మకంగా, సంచలనాత్మకంగా, సృజనాత్మకంగా, వినోదాత్మకంగా, రూపొందించాలనే భావన ఉంది. దీనికి సంబంధిత వ్యక్తులనుండి ప్రోత్సాహం కావాలి. ఈప్రోత్సాహం దొరుకుతుందా? లేదా? రాబోయేకాలమే తెలుపుతుంది. ఈదిశలో ఎవరైనా చొరవచేసి ముందుకువచ్చి సహకారం అందించాలనుకుంటే రచయితను సంప్రదించవలసిందిగా కోరుతున్నాము.

# చిన్న పొరబాటు

మా పెద్ద అమ్మాయి సుగుణ వివాహం విషయంలో మాట్లాడటానికి హైదరాబాదు వచ్చాను. పెండ్లివారితో సుదీర్ఘ చర్చలు మంచి వాతావరణంలో జరిగాయి. మా ఆలోచనలు బాగా కలిసాయి. పెండ్లికుమారుడు అతని తల్లి తండ్రులు నాకు బాగా నచ్చారు. అబ్బాయి చైతన్య చాలా స్మార్ట్ గా వున్నాడు. అతని మాటలలోనే అతని సంస్కారం, వుట్టి పడుతుంది. అతని వినయం, విధేయత, సింప్లిసిటీ నాకు బాగానచ్చాయి. ప్రస్తుతం చైతన్య USA లో విప్రో కంపనీ తరపున పనిచేస్తున్నాడు. సాఫ్ట్‌వేర్ ఇంజనీరు. MS స్టేట్స్‌లోనే పూర్తి చేశాడు. విప్రో కంపనీలో, మార్కెటింగు డిపార్టుమెంటులో పనిచేస్తూ మంచి గుర్తింపు పొందాడట. ప్రస్తుతం ఆఫీసు పని మీద ఇండియా వచ్చాడట.

ఈ అవకాశాన్ని విని యోగించుకుని, వీలైతే సాంప్రదాయమైన కుటుంబం నుండి వచ్చిన, అందమైన, యోగ్యురాలైన, అమ్మాయి దొరికితే, చైతన్య వివాహం చేద్దామనుకుంటున్నారు, అతని పేరెంట్సు. నా స్నేహితుడు కేశవరావు ద్వారా ఈ విషయం తెలిసి హైదరాబాదు వచ్చాను. కేశవరావు ప్రదీప్ గారు మంచి స్నేహితులు.

మేమిద్దరమూ ప్రదీప్‌గారి యింటికి వెళ్ళి వారి వివరాలు చాలా మటుకు తీసుకున్నాము. మా బంధువులు, మాస్టాటస్, మా కుటుంబం గురించి కూడా వారికి తెలియచేయ వలసిన బాధ్యత నాకు వున్నది కదా. మానాన్నగారు, మా మావయ్యగారి గురించి చెప్పగానే ప్రదీప్ గారు, ఆయన భార్య అరుంధతిగారు పకా పకా నవ్వడం మొదలు పెట్టారు. మేమిద్దరం బిత్తర పోయాము.

'మీరు మా సుశీల హజ్బుండా?' అని ప్రదీప్‌గారు అడిగారు.

'నా భార్య సుశీల పేరు మీకు ఎలా తెలుసు ?' ఆశ్చర్యంగా అడిగాను.

'భలేవారే బావగారూ, సుశీల నా కజిన్. మానాన్న గారూ, మీ మావయ్యగారు కజిన్స్'

'ఆ అలాగా'.

'నేను ఎయిర్ ఫోర్స్‌లో ఆఫీసర్‌గా పనిచేస్తూ దేశం అంతా తిరుగుతున్నాను. కనుక మీ వివాహానికి మేము రాలేదు. మా వివాహం ఢిల్లీలో జరిగింది కనుక అక్కడకి మీరు రాలేదు. ఉద్యోగాల రీత్య మన మధ్య దూరం పెరిగింది'.

'మీరు ఆగండి. నేనొక విషయం అన్నయ్యగారికి చెబితే యింకా ఆశ్చర్యపోతారు. సుశీల గారు నాకూ బాగా తెలుసు మేము రెండు సంవత్సరాలు ఒకే స్కూలులో చదవడం జరిగింది.

ఆమె నా క్లాస్ మేట్. తర్వాత నాన్నగారు ఉద్యోగరీత్యా ఢిల్లి వెళ్ళి అక్కడే సెటిల్ అయ్యారు. మీ మావయ్యగార్కి, మారెండు కుటుంబాలూ చాలా దగ్గర మేమంతా ఆయనకు ఆప్తులం'.

'ఆ. అలాగా. ముందు మావయ్యగారు కూడా నాతో వస్తా నన్నారు. వేరే పనివుండి తర్వాత డ్రాప్ అయ్యారు'.

'మీకు మరో విషయం చెప్పాలి' అరుంధతిగారు ఆత్రంగా అన్నారు. 'చెప్పండి. ఇకనేను నోరు విప్పవలసిన పనిలేదు' కేశవరావు జోక్ చేశాడు.

'ఒక సారి మా డాక్టరు అంకుల్ యింట్లో పెండ్లికి కాకినాడ వచ్చాను. అప్పుడు చైతన్యకి 3 సంవత్సరాలు. మీ సుగుణ వయస్సు ఒక సంవత్సరం. అంకుల్ హెల్త్ బేబీ కాంటెస్టుకు తీసుకు వెళ్ళారు. అందులో మీ సుగుణకు హెల్త్ బేబీగా ఫస్టు ప్రైజు వచ్చింది. అప్పుడు సుశీల గారు కలిసారు. ఇద్దరం చాలా సంబరపడిపోయాం. అప్పుడు మీ సుగుణకు నేను ఒక ప్రజంటు కొని యిచ్చాను. సుశీలగారు మొహమాట పడ్డారు. 'మొహమాటం వద్దు. మీ పాపనే మా యింటికి కోడలుగా తీసుకు వెళ్ళిపోతాను అన్నాను. అందరం నవ్వుకున్నాం. చైతన్య కొద్దిగా సిగ్గుపడ్డాడు.

'ఈ సంబంధం కుదిరి వివాహం కాక ముందే మీరు మా బావగారు అయ్యారు'. 'మీతో పరిచయం లేక పోయినా, మా సుశీల గురించి, మీగురించి నాకు బాగా తెలుసు'

'నా గురించా ?'

'అవును, మా చిన్నాన్న గారు, అంటే మీ మావయ్యగారు, ఆయన అల్లుడి సంస్కారాన్ని గురించి బాగా చెప్పి మురిసి పోతూ వుండేవారు. ఒక్క గానొక్క కూతురిని ఎంతో అబ్బురంగా పెంచి, ఒక యోగ్యునికి యిచ్చి వివాహం చేశానని చెప్పేవారు'.

'ఏదో మీ మంచి తనం కొద్దీ అలా పొగడుతున్నారు', నేను కొద్దిగా సిగ్గుపడ్డాను.

'సుశీల గార్కి కూడా స్కూల్లో మంచి గుర్తింపు వుండేది. చదువులోనూ, ఆటలలోనూ, సంస్కారం లోనూ ఆమెకు, ఆమేసాటి' అని అరుంధతిగారు అన్నారు.

'మా పిన్నిగారు చిన్నవయసులోనే చనిపోయిన తర్వత మళ్ళీ పెండ్లి చేసుకోకుండా, చిన్నాన్న సుశీలను గారాబంగా, ప్రత్యేక శ్రద్ధతో పెంచారు.'

ప్రదీప్ గారు, అరుందతిగారు సుశీలను అలా పొగుడుతుంటే నేను గర్వంతో, సంతృప్తిగా ఫీలయ్యాను.

'సుశీల గారు ఎంత డిసిప్లిన్డ్‌గా పెరిగారో అంత డిసిప్లిన్డ్‌గా, వీరి ముగ్గురమ్మాయిలను పెంచుతున్నారు. నాస్నేహితుడని కాదు గాని, వీళ్ళది చాలా కల్చర్డ్ ఫామిలీ, కేశవరావు మాటకలిపాడు.

'మా అమ్మాయిల గురించి చెప్పాలిగా. నాకు ముగ్గురు అమ్మాయిలు. సుగుణ, సుమిత్ర, సుప్రజ'.

'సుశీల గారి పేరు 'సు' అనే అక్షరం లో మొదలైంది కనుక, మీ అమ్మాయిల పేర్లు కూడా 'సు' తోనే మెదలయ్యేటట్లు పెట్టారు' అరుంధతిగారు తన అబ్జర్వేషన్ చెప్పారు.

'అవును'

'పేర్లు చాలా బాగున్నాయి'

'సుగుణ బి.టెక్ (కంప్యూటర్ సైన్స్) రీసెంటుగా పూర్తి చేసింది. సుమిత్ర MCA చేస్తూవుంది. సుప్రజ టెంత్ క్లాస్ చదువుతుంది'.

'సుశీల గారి పెంపకంలో, అబ్బాయి లేని లోటు ఎప్పుడూ ఫీలవ్వలేదు, రవీంద్ర' కేశవ రావు అన్నాడు.

ఎవరు ఏమి మాట్లాడినా తిరిగి తిరిగి ఆటాపిక్, సుశీల దగ్గరకు వచ్చి ఆగుతోందని గమనించాను. 'దటీజ్‌ది స్పెషాలిటీ ఆఫ్ సుశీల' అని, మనస్సులో అనుకున్నాను. మనస్సు ఆనందంతో నిండి పోయింది.మరుక్షణం మనస్సు బాధగా మూలిగింది. మౌనంగా వుండి పోయాను.

'బావగార్కి , సుశీల జ్ఞాపకం వచ్చినట్టుంది.' ప్రదీప్ గారి మాటలకు కొద్దిగా తడబడ్డాను. మనస్సులోని బాధను బయటకు తెలియకుండా జాగ్రత్త పడ్డాను

'సుశీలగార్ని కూడా తీసుకు రావలిసింది'

'ఆ ఇది మొదటి సిటింగ్ మాత్రమేకదా'

'మీరు అలాఫీల్ అవుతున్నారేమో కానీ, మాకు మీసుగుణను, చిన్నపుడు అన్నట్లుగా మాయింటికి కోడలుగా తీసుకు వచ్చేస్తామనిపిస్తుంది' అరుంధతి గారి మాటలకు చైతన్య అడ్డువచ్చాడు.

'మమ్మీ మీ ఏంగిల్‌లోనే మీరు ఆలోచిస్తున్నారు. మీ రేమి చేసినా, బాగా ఆలోచించి, నా మంచి కొసమే చేస్తారని నాకు తెలుసు. కానీ....', 'కానీ నేను వాళ్ళ అమ్మాయికి

నచ్చాలి కదా'.

'అయితే, త్వరలో ఫార్మల్‌గా పెండ్లిచూపులకు వెడదాం'. ప్రదీప్ గారు మాటకలిపారు.

'వచ్చే దశమి చాలా మంచి రోజు. మీకు వీలైతే, మాయింటికి రమ్మని ఆహ్వానిస్తున్నాను'

'తప్పక అలాగే చేద్దాం. అయితే... అమ్మాయికి అబ్బాయి, అబ్బాయికి అమ్మాయి నచ్చితే, వివాహం కూడా త్వరగా చేయవలసి వస్తుంది'.

'అంతకంటే మాకూ కావలసిందేముంది'.

చైతన్య సెల్ ఫోను మ్రోగింది. 'ఎక్స్‌క్యూజ్ మీ' చైతన్య బయటకు వెళ్ళాడు. ఇదే అదను అనుకున్నాను.

'బావగారూ, మిగతా విషయాలు కూడా ఇప్పుడే మాట్లాడేసుకుంటే మంచిది కదా తర్వాత ప్రోబ్లెమ్స్ వుండవు.'

'భలేవారే బావగారూ' ప్రదీప్ గారు తేలికగా నవ్వేశారు.

'అన్నయ్యగారూ, మాకు చైతన్య ఒక్కడే అబ్బాయి. వాడి సుఖం మాకు ముఖ్యం. అందుకే సాంప్రదాయమైన కుటుంబం నుండి వచ్చిన, చదువుకున్న, అందమైన, యోగ్యురాలైన, అమ్మాయికోసం చూస్తున్నాం. డబ్బు కంటే గుణం ముఖ్యం. ఆ క్వాలిఫికేషన్సు మీ అమ్మాయికున్నా యనిపిస్తుంది' అది అరుంధతి గారి అభిప్రాయం.

'సుశీల పెంపకంలో, మీ పిల్లలు ఏంతో బుద్ధి మంతులుగా పెరుగుతున్నారని, మాచుట్టాలు చెప్పారు. కాని మేము మగపెళ్ళి వాళ్ళం కనుక, మే మే వచ్చి మిమ్మల్ని అడుగుతే బాగోదని, జాప్యంచేశాం. ఇపుడు మీరాకతో వెదుకుతున్న తీగ కాలికి చుట్టుకున్నట్లలయింది మీరు మీ సంతృప్తి కొరకు ఏమి యిచ్చినా అది మీ అమ్మాయికే వుంటుంది.'

'చైతన్యకు భార్యను పోషించుకునే యోగ్యత వుంది. డాలర్లు సంపాదిస్తున్నాడు. మాకూ దేవుడి దయవల్ల మారెండు జెనరేషన్సుకు సరిపడ్డ సంపదవుంది'.

ఈ దంపతుల ఉన్నతమైన ఆలోచనలు విని నా మనస్సు ఆనందంతో నిండిపోయింది. ఈ సంస్కారవంతులైన వ్యక్తుల మధ్య నా సుగుణ ఎంతో సుఖపడుతుందనిపించింది. సుశీల కూడా ఈ సంబంధం గురించి విని చాలా సంతోషిస్తుందని భావించాను. మావయ్యగారు కూడా అంగీకరిస్తారు. ఎంతైనా వాళ్ళూ వాళ్ళూ బంధువులేకదా.

మరొక సారి వారిని సుగుణను చూసుకోడానికి మా యింటికి రమ్మని ఆహ్వానించి వారినుండి

సెలవు తీసుకున్నాను. డైరెక్టుగా స్టేషనుకు వచ్చేశాను. కేశవరావు, చైతన్య, ప్రదీప్ గారి దంపతులు స్టేషనుకు వచ్చి నాకు వీడ్కోలు యిచ్చారు.

ఇది మాస్టేటస్‌కు తగ్గ సంబంధం. బంధువులు, సంస్కారవంతమైన వాళ్ళు. అబ్బాయి చైతన్య యోగ్యుడు. ఈ సంబంధం కుదిరేలా చేయమని, భగవంతునికి దండం పెట్టుకున్నాను. ఏమైనా నా మనస్సులో వున్న భయాలు, అనుమానాలూ నాలోనే వున్నాయి. వాటిని దూరంచేయగల సమర్థత, సుశీలకు, సుగుణకు మాత్రమే వున్నాయి.

నా ఫస్ట్ క్లాసు కంపార్టుమెంటులో వేరేవాళ్ళు రాలేదు. నా ఆలోచనలు ముందుకు పోతున్నాయి. నాలో అంతర్మథనం ప్రారంభమైంది. పెండ్లివారి మధ్యవున్నంత వరకూ నా మనస్సు చాలా ఆహ్లాదకరంగా వుంది. ఇప్పుడు ఒంటరిగా ట్రెన్‌లో కూర్చున్నాను. కారు మేఘాలు నా మనస్సుపై కమ్ముకుంటున్నాయి. నా భయానికి కారణంవుంది. ఈ మధ్య సుశీల, సుగుణల నిర్లిప్తత, బెంగ, దుఖం, మౌనం... నా భయానికి కారణం. వాటికి కారణం, సరిగ్గా నాకు తెలియదు. గతంలోకి వెళ్ళిపోయాను.

ఇంతకు ముందు సుగుణకు ఒక మంచి సంబంధం వచ్చింది. అబ్బాయి డా॥ శ్రీధర్ మాకందరికీ ఆ సంబంధం నచ్చింది. కానీ సుగుణ తనకు ఇప్పట్లో పెండ్లి చేసుకుందామన్న ఆలోచన లేదని, తనను బలవంతం చేయవద్దని భయంలేకుండాచెప్పింది. ఊహించని జవాబు. కారణాలు తెలుసుకోమని నాగుబాబుకు చెప్పాను.

నాగుబాబు ఒక ఆనాథ, నాచిన్ననాటి స్నేహితుడి కొడుకు నేను చేయూతనిచ్చి, తన కాళ్ళపై తను నిలబడేలా చేశాను. సుగుణ కంటే చిన్నవాడు. మా పిల్లల తో కలసి మెలసి వుంటూ పెరిగాడు కనుక, ఇంచుమించు ఒకే వయస్సు వాళ్ళు కనుక, సుగుణ ప్రోబ్లమ్ తెలుసుకోమన్నాను. సుగుణ, నాగబాబును స్వంత తమ్ముడిలా భావించేది. వారి మధ్య చనువు వుంది.

సుగుణ, శ్రీరాం అనే అబ్బాయిని ప్రేమిస్తుందనే నిజాన్ని నాగుబాబు చెప్పాడు. సుగుణ శ్రీరాంను ప్రేమించడానికి కల కారణాలు, అతని వ్యక్తిత్వం, దృక్పథం, తెలివితేటలు, సుగుణ పట్ల ఆసక్తి, ఆకర్షణ, ప్రేమ, అనురాగం మాత్రమే అని చెప్పాడు. కానీ ముగ్గురు ఆడపిల్లల తల్లిగా సుశీల ఈ ప్రేమకు అంగీకారం యివ్వలేదు.

ఈ కులాంతర వివాహం, తన కుటుంబం మీదా, తర్వాత వున్న యిద్దరుఆడపిల్లల జీవితాల పైనా, ప్రభావం చూపుతుందనే భయం. నాకు, మావయ్య గారికి కూడా, కులాంతర వివాహాలపై అంత మంచిఅభిప్రాయం లేదు. మారెండు కుటుంబాలలోనూ, యిప్పటి

వరకూ, కులాంతర వివాహాలు జరుగలేదు. దీనికి మాతో శ్రీకారం చుడితే, సవ్యంగా జరిగినంతవరకూ, పర్వాలేదు. ఎక్కడైనా, ఏదైనా అపశ్రుతి పలికితే, అందరూ వేలెత్తి చూపుతారు. దాని ప్రభావం, సుమిత్ర, సుప్రజలపై పడితే మేము భరించలేము. బంధువుల పరామర్శలు, వ్యంగ్య భాషణలు, సాను భూతులు, విమర్శలు, అసలే భరించలేము. సుగుణ సుఖపడతాదనుకుంటే, వీటిని లెఖ్ఖ చేయనక్కర లేదు. అయినా మాలోనే చాలా యోగ్యులైన వారు వున్నపుడు, కాదని పరుగు పెట్టి ఈ కులాంతర వివాహనికి ఎందుకు వెళ్ళాలి? కాని ప్రేమ గుడ్డిది. ప్రేమకు కులమత భేదాలువుండవు. తను డాక్టరు. అయినా ఈ ఛాందస భావాలు ఏమిటి?' అని ఒక సారి నన్ను నేను ప్రశ్నించుకున్నాను.

సుశీలకు ధైర్యం చెప్పాను. 'ఈ సమస్య పరిష్కరించలేనంత పెద్దది కాదు. ప్రతి సమస్యకూ ఒక పరిష్కారం వుంటుంది. ఈ సమస్యని చూసి బెంబేలు పడిపోతే, మనస్సు పాడుచేసుకుంటే, అదిరెట్టింపై కలసి కట్టుగా వచ్చి, మనల్ని మరింత బాధ పెడుతుంది' అని వివరంగా చెప్పాను. కానీ సుశీల పై ప్రభావంలేదు. అదే నిర్లిప్తత, బెంగ, అదే ఉదాశీనత. సమస్యని మూలకు తోసి, దిన చర్యలలో మామూలుగా వుండు అంటే వినదు. తండ్రిగా నేను ఈ సమస్యని భరిస్తూ మామూలుగా వుండగలుగుతున్నాను. తల్లిగా తను మాత్రం ఎందుకంత సీరియస్‌గా వుండాలి? దీనికి తోడు చిరాకు, కోపం, ఒంటరి తనాన్ని ఇష్టపడుతుంది. కళ్ళలో కాంతి లేదు. ముందు వుండే ఉత్సాహం లేదు. ఈ డిప్రెషన్‌లో సుశీలకు దేనిపైనా ఏకాగ్రత కుదరటం లేదు.

ఈ మార్పుని గమనించిన ఆమె స్నేహితులు, బంధువులూ, కారణం అడిగితే, ఏవో మోనోప్లాజ్ ప్రోబ్లమ్స్ అని చెప్పి ప్రక్కకు తప్పుకుంటున్నాది. డాక్టరుగా నాకు తెలుసు. తనకు మోనోపాజ్ ప్రోబ్లమ్ లేదని.

అన్నీ ఆలోచించి సుగుణకు డా॥ శ్రీధర్‌తో వివాహం, ఇష్టంలేనపుడు, దీనిగురించి బలవంతం చేయడం మంచిది కాదని పించింది. డా॥ శ్రీధర్ సంబంధం డ్రాప్ చేశాము.

సుశీలకు పిల్లలంటే అమితమైన ప్రేమ. వాళ్ళను తీర్చిదిద్దడానికి ఎంతో జాగ్రత్త తీసుకునేది.

తెలివిగా వాళ్ళను తనకు నచ్చిన మార్గంలో ఆనందంగా వుండేలా చేసేది. పిల్లలతో స్నేహితురాలిగా మెలిగేది. తన చిరునవ్వుతో అందరినీ, మంత్రముగ్ధుల్ని చేసేది. బంధువులూ, స్నేహితులూ, మాకాలనీ లో వున్న వాళ్ళూ సుశీలను మంచి సంస్కారంగల స్త్రీగా గుర్తించి, గౌరవించేవారు. అటువంటి సుశీల, ఆసమస్యతో సతమతమౌతూ ఒంటరితనాన్ని కోరుకుంటున్నాది? ఎప్పుడూ కన్నీరు కారుస్తూ అన్నీ పోగొట్టుకున్నట్లు వుంటుంది.

మావయ్యగారు, ఈ అవాంఛనీయమైన మార్పుకు కారణ మేమిటని అడిగితే, అంతగా గౌరవించే ఆయనపై చిరాకు పడింది. ఆయన చిన్న బుచ్చుకున్నారు. మా అత్తగారు చిన్న వయస్సులోనే చనిపోయిన తర్వాత మళ్ళీ వివాహం చేసుకోకుండా, సుశీలను గారాబంగా పెంచి పెద్ద చేశారు. ఆయనకు ఆరో ప్రాణం సుశీల. జీవితంలో ఎటువంటి పరిస్థితిలోనూ సుశీల కన్నీరు పెట్టుకోకుండా సంసారం చేశాను. తనను ఆహ్లాదంగా వుంచటమే నా మొదటి బాధ్యత. జీవితాన్ని ఆహ్లాదంగా జీవించలేని స్త్రీ అప్పులకు కూడా బరువవుతుంది. అలాగే తమ ఇష్టానుసారమే తమ సంతానం బ్రతకాలని అభిలషించే తల్లి దండ్రులు పిల్లలకు బరువే. ఈ సమస్య వలన సుశీలలో డిప్రెషన్, స్ట్రెస్, నిర్లిప్తత, చిరాకు, కోపం, దిగులు, భయం చోటు చేసుకుంటున్నాయి. తనలో వస్తున్న మార్పు వలన, పిల్లలపైనా, నాపైనా, మావయ్యగారి పైనా, పనివాళ్ళ మీదా చిరాకు పడుతుంది. మామంచి తనం, తనకు ఓదార్పు యివ్వక పోగా, చికాకు కలిగిస్తున్నాది. ఒక సారి సుశీల స్నేహితురాలు USA నుండి వచ్చి రెండు రోజులు మా యింట్లో వున్నాది. వెళ్ళేటపుడు తను నాతో అన్న మాటలు యింకా నాకు బాగా గుర్తున్నాయి.

'మీ సుశీలతో ఒక రోజు గడపడం, ఒక మంచి పుస్తకం చదివినంత సంతృప్తినిస్తుంది. తన పెంపకంలో మీ పిల్లలు అందరూ గర్వించ తగ్గట్లుగా పైకివస్తారు' అన్నది.

అటువంటి విజ్ఞతగల సుశీల, ఇలా మారిపోతుంటే నాకు చాలా భాధ అనిపించింది. ఆ సమస్యకు వెంటనే పరిష్కారం చేయకపోతే, సుశీల పూర్తిగా మనశ్శాంతి కోల్పోతుంది. పిచ్చిదైపోతుంది.

మావయ్యగారితో సుదీర్ఘ చర్చలు చేశాను. అనుబంధ సమస్యల పర్యావసనాన్ని దృషిలో వుంచుకుని. మావయ్య గార్కి నచ్చచెప్పాను. ఈ సమస్య పరిష్కారానికి సుశీలను కూడా భాగస్వామిని చేయాలనే దృష్టితో, తనను పిలిచాను. 'మీ ఇష్టం వచ్చినట్లు చేయండి' అంటూ విసుగ్గా, లేచి వెళ్ళిపోయింది. ఆమె కళ్ళలో నీళ్ళు నాకు స్పష్టంగా కనిపించాయి.

సుగుణను పిలిచి ఈ సమస్య గురించి పూర్తిగా చర్చలు జరిపాము. తను చెప్పిన సత్యాలను పూర్తిగా విన్నాము. తన విశ్వాసాన్ని నీట్‌గా, క్లియర్‌గా మాకుతెలిపింది. తను, శ్రీరాం కలసి తీసుకున్న నిర్ణయం మాకు తెలియజేసింది. 'తన తల్లిదండ్రులు, శ్రీరాం తల్లిదండ్రులు ఏకగ్రీవంగా అంగీకరించి, తమ వివాహం జరిపిస్తే సరే, లేక పోతే పెద్దలను వ్యతిరేకించి వివాహం చేసుకోడం జరగదని నిర్ణయించుకున్నాము'. వాళ్ళప్లాన్స్ దాపరికం లేకుండా చెప్పింది.

ఈ పెళ్ళికి శ్రీరాం తల్లిదండ్రులు అంగీకారం తెలిపారట. ముందు ససేమిరా వద్దాన్నా నిమ్మదిగా సుశీల కూడా అంగీకరించింది. సుశీల అనుభవిస్తున్న మానసిక క్షోభనీ, అనిశ్చిత స్థితినీ, తనలో వస్తున్న మార్పుల గురించి చర్చించాం.

'నాకు ప్రపంచలో అన్నిటి కంటే ముఖ్యమైంది నా తల్లి సంతోషం. శ్రీరాంతో నా వివాహమే నా తల్లి సమస్య అయితే, ఎటువంటి పరిస్థితి లోనూ ఈ పెళ్ళి చేసుకోను'. అని స్పష్టంగా చెప్పింది సుగుణ.

తండ్రిగా నాకు సుగుణ చిన్నపిల్లలానే అనిపిస్తుంది. కాని తను చాలా ఎదిగింది. తన మనోస్థితి, మెచ్యూరిటీ, స్పష్టమైన భావాలను గ్రహించి, నేను మావయ్యగారు చాలా సంతోషించాం.

'మేము ప్రేమించుకున్నామే కాని, హద్దులు దాట లేదు. దీనిలో దాపరికం లేదు. అమ్మ సాక్షిగా, దైవం సాక్షిగా చెబుతున్నాను. అమ్మ నన్ను బాగా అర్థం చేసుకుంటుందన్న భావనతో, తనతో స్పష్టంగా చర్చించాను. కొంత వరకు నాగుబాబుతో కూడా చర్చించాను ఎందుకంటే, చిన్నప్పటి నుండి కలిసి పెరిగాం. స్వంత తమ్ముడు కాక పోయినా, ఇంచు మించు ఒకే వయస్సు వాళ్ళం కనుక, నాగుబాబు పై మీకు విశ్వాసం వుంది కనుక నా వివాహం, అదీ కులాంతర వివాహం గురించి మీ తోనూ, తాతయ్య గారితోనూ చర్చించే ధైర్యం నాకు లేదు. అమ్మ ద్వారా, నాగు బాబు ద్వారా ఈ విషయాలు మీకు తెలిపితే మంచిదని పించింది. సహృదయంతో మా ఆశలనూ, ఆశయాలనూ మీరు అర్థం చేసుకుని ఆశీర్వదిస్తారని, భావించాను' సుగుణ స్పష్టంగా తన మనసులోనిమాటలు, చెప్పింది.

'కానీ ఈ విషయాలు, అమ్మగాని, నాగుబాబు గాని మాతో చర్చించలేదు.'

'అవును, అదే నన్ను బాధిస్తుంది. బహుశ మీతో చెప్పే ధైర్యం వాళ్ళకు లేక పోయిందేమో'

'ఇది అమ్మను, అడిగి చూశావా ?'

' హం చాలాసార్లు అమ్మను అడిగాను అడిగినప్పుడల్లా, కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ వెళ్ళి పోవడం జరిగింది' సుగుణ చెప్పిన విషయం అంతగా అర్థం కాలేదు.

'నీ ప్రేమే నీకు ముఖ్యంగాని అమ్మలో వస్తున్న మార్పులు, విషాదం నీకు ముఖ్యం కాదా'.

'అమ్మకంటే ముఖ్యమైనది, ఈ ప్రపంచంలో నాకు ఏదీ లేదు. అమ్మలో వస్తున్న మార్పులు నన్నూ బాధిస్తున్నాయి. అమ్మ పరిస్థితి గురించి శ్రీరాంతో సీరియస్‌గా చర్చించాను. మేము సుదీర్ఘ చర్చల తర్వాత ఒక నిర్ణయానికి వచ్చాము'

'ఏంటది' ?

కొద్దిసేపు నిశ్శబ్దం తర్వాత సుగుణ వారి నిర్ణయం చెప్పింది.

'అమ్మని బాధపెడుతూ, అమ్మని పిచ్చిదాన్ని చేస్తూ, మేము వివాహం చేసుకుని. మా సంతోషాల్ని వెదుక్కుంటూ, వెళ్ళిపోవటం మాకు భావ్యమని పించలేదు. అందుకే మేము వివాహం చేసుకో కూడదని నిర్ణయించు కున్నాం. మంచి స్నేహితులుగా మిగిలి పోదామని నిర్ణయించుకున్నాం.'

'నిజంగా....'

'నాన్నగారూ మీతో అబద్ధం చెప్పే ధైర్యం నాకు లేదు. మీరు నన్ను తండ్రిగా కాకుండా స్నేహితుడిగా ట్రీట్ చేస్తున్నారు. నాసుఖసంతోషాలే మీకు కావాలి. నాకూ అమ్మ సంతోషమే ముఖ్యం. నేను చెప్పింది అక్షరాలా నిజం. అమ్మ సాక్షిగా చెబుతున్నాను. మేము వివాహం చేసుకోకుడదని నిర్ణయించుకున్నాం'. సుగుణ మాటలలో వున్న నిజాయితీ మాకు అర్థమయింది

'మరి మీ నిర్ణయాన్ని గురించి అమ్మకు చెప్పావా ?'

'చెప్పాను'

'మరి అమ్మ ఏమంది ?'

'మళ్ళీ మొదలే, కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ వెళ్ళిపోయింది.'

'అమ్మ విషాదానికి కారణం, తన పిల్లలపై అతిగా ప్రేమ బంధం పెంచుకోడం. నా ప్రేమ వ్యవహారం తెలుసుకుని అతిగా విచారిస్తోంది. తనను తాను పనిష్ చేసుకుంటుంది. ఫలితంగా అమ్మలో వూహించని మార్పులు వస్తున్నాయి. నాకు చాలా బాధగా వుంది. ఇలా అమ్మను వదిలేస్తే అమ్మకు పిచ్చి పట్టేలావుంది . . . . నేను ధైర్యం చేసి మిమ్మల్ని సంప్రదించాలను కుంటున్నాను'

'దేనికి?'

'నా వివాహం చేయమని కాదు. అమ్మ గురించి, అమ్మ విషాదానికి కారణం, నా పైగల పిచ్చి ప్రేమ. ప్రతి ఫలంగా అమ్మను ఇక మీదట అశాంతికి పాలు చేయను. అందుకే మేము వివాహం చేసుకోకూడదని నిర్ణయించు కున్నాము. అమ్మకు మానిర్ణయం చెప్పినా అమ్మ తనను తాను హింసించు కుంటూనే వుంది. కానీ పోజిటివ్‌గా రెస్పాన్స్ యివ్వడం లేదు'?

'ఎందుకని'?

'అదే, ఎంత ఆలోచించినా, నాచిన్న మనస్సుకు సమాధానం దొరకటం లేదు'

'నీది చిన్నమనస్సు కాదు.. తల్లీ, చాలా పెద్దమనస్సు. నీ లాంటి కూతుర్ని కన్నందుకు గర్వపడుతున్నాను. ప్రేమించడం నేరంకాదు. నీ ప్రేమ వలన నీ తల్లి బాధపడుతుందని, నీ తల్లి విషాదానికి నువ్వే కారణం, అని తెలుసుకుని, నీ ప్రేమను త్యాగం చేయదానికి సిద్ధపడ్డావు. ఇది నీ మెంటల్ మెచూరిటీకి ఉదాహరణ'.

మావయ్యగారు నా భావనలతో అంగీకరించారు. ఈ సమస్యను ముగ్గురం కలసి పరిష్కరించాలని నిర్ణయించుకున్నాం. సుశీలను ఈ నిర్లిప్తస్థాయి నుంచి తొందరగా బయటకు తీసుకురావాలి. తనలో నిర్ణయాలు తీసుకునే శక్తిని తిరిగి తీసుకురావాలి. ఈసమస్య, తన మీద, తన మనస్సు మీద, తన ఆరోగ్యం మీద, తన ఆత్మీయుల మీద, ఎలాంటి ప్రభావం పడుతోందో సుశీలకు తెలియ చేయాలి.

ఈ సమస్య సుగుణ ప్రేమ వివాహం దగ్గర మొదలయింది. కాని ప్రస్తుతం సుశీల, నిర్లిప్తత ప్రధాన సమస్య. ఈ సమస్యను పరిష్కరించడానికి మా ముగ్గురితో బాటు మారో ముగ్గురు చేతులు కలిపారు. వాళ్ళు, శ్రీరాం, శ్రీరాం తల్లి తండ్రులు. మా అందరిదీ ఒక్కటే ధ్యేయం. సుశీలను ఈ స్థితినుండి రక్షించాలి.

నిస్వార్ధంగా, చర్చించాం. మంచిచెడులు ఒడపోసి చివరకు ఒక నిర్ణయానికి వచ్చాం. మేము అందరం కలసి కట్టుగా వెళ్ళి సుశీలకు మా నిర్ణయాన్ని తెలిపాము. మా నిర్ణయం కులాలకు అతీతం. సుగుణ శ్రీరాంల పెళ్ళి సాంప్రదాయంగా, జరిపిస్తున్నామని, సుశీలకు తెలియచేశాం. కాలం మారుతుంది కాలంతో పాటు మనం మారాలి. ఈ కులాంతర వివాహం, తన కుటుంబం మీదా, తర్వాత వున్న ఇద్దరి ఆడపిల్లల జీవితాల మీద, ఎటువంటి చెడుప్రభావం చూపదని భరోసా యిచ్చాము.

'అమ్మా ! మాకు అన్నింటికన్న ముఖ్యమైనది నీ ఆరోగ్యం. మా వివాహం కాదు. నీవు మానసారా ఆశీర్వదిస్తేనే, నేను, వివాహనికి అంగీకరిస్తాను'. అని సుగుణ స్పష్టంగానే చెప్పింది. సుశీల మెహంలోని భావాలను నేను స్పష్టంగా చదవలేక పోయను.

'మీకందరికీ ఇష్టమైతే నాకు ఏమాత్రం అభ్యంతరం లేదు' సుశీల మెదటి సారిగా నోరు విప్పింది. తన కళ్ళల్లో ఆనంద భాష్పాలు చూశాం

'అయితే తొందరలో ఈ పెళ్ళి జరపండి' అని చెప్పి లోపలికి వెళ్ళిపోయింది. సుశీలను

అర్థంచేసుకోడం కష్టమనిపించింది. ఏమైనా, ఈ నిర్ణయం, సమస్యల పరిష్కారానికి దోహద పడుతుందనే ఆశాదీపం నాలో వెలిగింది.

పెళ్ళిపనులు చురుకుగా సాగుతున్నాయి. కాలం కలసిరాకపోతే, కష్టాలన్నీ కలసి కట్టుగా వస్తాయంటారు. ఉద్యోగరీత్యా హైదరాబాదులో వుంటున్న శ్రీరాంకు కారు ఏక్సిడెంట్ అయిందని తెలిసింది.

శ్రీరాం పేరెంట్స్, సుగుణ, నేను హైదరాబాదు వెళ్ళాము. సుశీలకు ముందు చెప్పలేదు.

నా ప్రాక్టీసు వదలి, సుగుణతో హైదరాబాదులో ఒక నెల వుంటే, జరుగకూడనిది జరిగిందని అర్థంచేసుకుంది. ఇంక తన విషాదానికి హద్దు లేదు. ఎవరూ సుశీలను ఓదార్చలేక పోయారు.

శ్రీరాంను ఎలాగైనా దక్కించుకోవాలని, చాలా కృషి చేశాము. ఫలితంగా శ్రీరాం కృతజ్ఞత తెలపడానికి, మిగిలిన ఒక చేతితో నాకు సెల్యూట్ చేసేవాడు. తను చనిపోయిన తర్వాత సుగుణ బాధ్యతను మేము ముగ్గురం కలసి కట్టుగా తీసుకోవాలని కోరాడు. సుగుణ వివాహం చేసుకుని, సుఖః సంతోషాలతో వుంటేనే తన ఆత్మ సంతోషిస్తుందని చెప్పాడు. శ్రీరాం తల్లి తండ్రులు సుగుణ వివాహం జరిపే బాధ్యత తమదే అని చెప్పారు. శ్రీరాం సంతృప్తిగా, స్వర్గస్థుడైనాడు.

కాలం గడచి పోతుంది. శ్రీరాంకు యిచ్చిన మాటను నిలబెట్టుకోవాలనిపిస్తుంది. కానీ సుగుణ కలసిరావడం లేదు. ఇక సుశీల సంగతి చెప్పనక్కరలేదు. విషాదమే, విషాదం. బెంగ, ఉదాశీనత. సుగుణ, సుశీలల నిర్లిప్తత, మౌనం, దుఃఖం ఇవే నా భయానికి కారణాలు.

అయినా ప్రయత్న లోపం వుండకూడదుగా. అందుకని కేశవరావు రమ్మంటే హైదరాబాదు వచ్చాను. ప్రదీప్‌గారు, అరుందతిగారు చైతన్యలతో సుగుణ వివాహం గురించి మాట్లాడటం జరిగింది. రాత్రంతా ఈ ఆలోచనలతో అసలు నిద్రపోలేదు.

హైదరాబాదు నుండి వచ్చిన తర్వాత అక్కడి విషయాలన్నీ సుశీలకు, మావయ్యగార్కి శ్రీరాం తల్లి దండ్రులకు వివరంగా చెప్పాను. సుశీల కళ్ళల్లో ఆనంద భాష్పాలు చూశాను. మరుక్షణం భయం, బాధ ఆమెలో చూశాను. సుశీలను ఎలా అర్థంచేసుకోవాలి ?

శ్రీరాం తల్లిదండ్రులు రోజూ వచ్చి ఈ వివాహనికి ఒప్పుకోమని సుగుణను బ్రతిమాలేవారు . తమ కుమారుడి ఆఖరి కోరిక తీర్చమని కోరేవారు. వాళ్ళు చెప్పగా, చెప్పగా సుగుణలో కొద్ది మార్పు వచ్చింది. శ్రీరాం ఆఖరి కోరిక తీర్చడం తన బాధ్యత అని

గుర్తించింది. మనస్సు దిటవు చేసుకుంది.

అనుకున్నట్లే దశమి రోజున వారు సుగుణ పెండ్లి చూపులకోసం, హైదరాబాదు నుండి వచ్చారు. చిన్ననాటి స్నేహితులిద్దరూ కలుసుకుని సంబర పడిపోయారు. మావయ్య గారు ప్రదీప్ గారూ కూడా చాలా సంవత్సరాల తర్వాత కలవడం వలన చాలా ఆనంద పడ్డారు. మావయ్యగారంటే ప్రదీప్ గార్కి చాలా గౌరవం వుంది.

ఫార్మల్‌గా జరిగిన ఈ పెండ్లిచూపులకు శ్రీరాం పేరెంట్స్‌ను కూడా పిలిచాము.

పెళ్ళివారి దగ్గర యేవిషయం దాచకుండా, జరిగింది, జరిగినట్లు చెప్పాలనేదే, సుగుణ అభిమతం. మేం కాదన లేక పోయాం.

అందరూ సంస్కార వంతులే. కల్లాకపటాలు లేవు. దాపరికాలు లేవు. డబ్బు వ్యామోహాలు లేవు. వూహించని విషయాలు తెలుసుకుని, అరుంధతిగారు ముందు కంగారు పడ్డారు. శ్రీరాం తల్లి తన కొడుకు ఆఖరి కోరికని తీర్చమని, వారిని కోరారు. శ్రీరాం సుగుణ ల స్నేహం ఎంత పవిత్రమైనదో వివరంగా చెప్పారు. సుగుణ, చైతన్యలు మనస్సు విప్పి మాట్లాడుకున్నారు.

ఫలితంగా వారి వివాహం ఘనంగా జరిగింది. శ్రీరాం, ఆఖరి కోరిక తీరింది. అందరి మనస్సు ల్లో నూ ఆనందమే. శ్రీరాం తల్లిదండ్రుల సంతోషానికి అవధులు లేవు. చైతన్యలో వారి బిడ్డను చూసుకున్నారు. గతాన్ని మరచి, చైతన్యతో సుఖంగా సంసారం చేస్తూ పిల్లల్నికని తమకు చూపాలని సుగుణను కోరారు, శ్రీరాం తల్లిదండ్రులు. సుగుణకు చాలా మనోబలం వుంది. శ్రీరాం మనఃశాంతి కోసం, తన కిచ్చిన మాటకోసం వివాహం చేసుకుంది. పాత జ్ఞాపకాలతో బాధపడుతూ, భవిష్యత్తులో తను బాధపడుతూ, చైతన్యను, మమ్మల్నీ బాధపెట్టదని నాకు తెలుసు.

వివాహం జరిగిన కొద్దిరోజులలోనే తన బార్యను తీసుకుని చైతన్య అమెరికా, ఉద్యోగరీత్యా వెళ్ళవలసి వచ్చింది. చైతన్య మమ్మల్ని, శ్రీరాం తల్లి దండ్రులను అమెరికా రమ్మని ఆహ్వానించాడు. అందరం చాలా సంతోషించాం. సుప్రజ, సుమిత్ర ల ఆనందానికి అవధులు లేవు. మళ్ళీ పోయిన ఆనందం ఈ యింటిలోకి తిరిగి వచ్చింది అనుకున్నాం.

సంతోషంగా అందరం ఆ కొత్త దంపతులకు వీడ్కోలు ఇచ్చాం. కానీ మర్నాటి నుంచీ సుశీల పరిస్థితి మళ్ళీ మామూలే. అదే దిగులు, అదే బెంగ, అదే నిర్లిప్తత. సుశీలకు పిచ్చిపట్టకుండా వుండాలంటే నేను ఏమిచేయాలి ?

ఒక రోజు, ఒక సీల్డ్, రిజిస్టర్డ్ పార్సిల్ వచ్చింది. అందులో నాగుబాబు వ్రాసిన ఉత్తరం, 25,000 రూపాయలు, సీల్ చేసి వున్న మరొక కవరూ వున్నాయి. అపుడు నేను ఇంట్లో ఒంటరిగా వున్నాను. ఆ ఉత్తరం చదవడం మొదలు పెట్టాను.

డియర్ అంకుల్,

నమస్తే, మీరు ఒంటరిగా వున్నపుడే ఈ ఉత్తరం చదవండి. మీకు ఈ ఉత్తరం వ్రాయడానికి చాలా సిగ్గుపడుతున్నాను. కాని తప్పదు. ఒక సమస్యకు ఈ ఉత్తరం పరిష్కారం కాగలదని భావించి వ్రాస్తున్నాను. ఈ నిజాన్ని మీముందు వుంచకపోతే, ఈ సమస్య వలన కొన్ని ప్రాణాలు పోయేలాగున్నాయి. ఈ సమస్యని పరిష్కరించగల సామర్థ్యం మీ ఒక్కరికే వుంది.

'నేనొక దౌర్భాగ్యుడిని. మీకు తెలుసు నాతల్లి, కన్న కొడుకుని, భర్తని వదలి, తన సుఖాన్ని వెదుక్కుంటూ వేరొకరితో లేచిపోయింది. నా తండ్రి అది భరించలేక, అవమానంతో, బాధతో, ఒక త్రాగుబోతు, తిరుగు బోతుగా మారాడు. చివరకు దిక్కులేని చావు చనిపోయాడు. నా తండ్రి చితికి నిప్పుపెట్టడానికి కూడా నాకు అవకాశం యివ్వలేదు. ఎక్కడ చనిపోయాడో తెలుస్తేకదా. నేను అనాథగా మిగిలి పోయాను. అల్లరి చిల్లరగా తిరుగుతున్న నన్ను మీరు చేరదీసారు. కారణం నేను మీ స్నేహితుడి కొడుకుని. అర్హత లేకపోయినా, నన్ను మీరు మీ పిల్లలతో కలిసి పెరగడానికి అవకాశం యిచ్చారు. కన్న తల్లి కాక పోయినా, పెంచిన తల్లిగా ఆంటీ నామంచి చెడ్డల్ని చూచి నన్ను పెద్ద చేశారు. మీ ఆదర్శ దంపతులకు ఎన్ని జన్మలెత్తినా రుణం తీర్చుకోలేను.

చరిత్ర హీనులకు పుట్టిన నేను చరిత్రహీనుడుగానే మిగిలిపోతున్నాను. దొంగ బిడ్డ దొంగే అవుతాడని నిరూపించాను. చదువులో రాణించలేక పోతున్ననాకు, ఒక చిన్న వుద్యోగం యిప్పించారు. రాజమండ్రిలో ఆ వుద్యోగంలో చేరి నా కాళ్ళ మీద నేను నిలబడ్డాను. కాని నా చెడు ప్రవృత్తి నానుండి దూరం కాలేదు. చెడుపోయేవాళ్ళను ఎవరూ బాగు చేయలేరు. బాగుపడేవాళ్ళను ఎవరూ చెడపలేరు.

ఒక సారి నన్ను ఆంటీ పిలిపించారు. సుగుణ గురించి చెప్పారు. సుగుణకు, డా॥ శ్రీధర్ తో పెళ్ళి నిశ్చయం అయ్యేలావుందని, మంచి సంబంధమైనా సుగుణ ఈ పెళ్ళికి ఒప్పుకోవడంలేదని చెప్పారు. కారణం తెలుసుకుని తనకు చెప్పనున్నారు. నాకు చెప్పడానికి కారణం, నేను, సుగుణ చిన్నప్పటి నుండి కలసి పెరిగాం. నేను సుగుణ తో ఫ్రీగా చర్చించాను. శ్రీరాం తనూ ప్రేమించుకుంటున్నట్లు సుగుణ నాకు నిజం చెప్పింది. మీకూ,

ఆంటీకి ఈ విషయం చెప్పే ధైర్యం తనకు లేదు. మీకు చెప్పి ఒప్పించమని చెప్పింది. మరిన్ని వివరాలు సేకరించి, ఆంటీకి చెప్పాను. శ్రీరాం చాలా యోగ్యుడు. మంచివాడు. అన్ని వివరాలూ చెప్పి వాళ్ళ వివాహం చేస్తేనే మంచిదని సూచించాను.

ఈ కులాంతర వివాహానికి ఆంటీ ఒప్పుకోలేదు. దీని ప్రభావం, తన కుటుంబం మీదా తర్వాత వున్న ఇద్దరి ఆడపిల్లల జీవితాల మీదా పడుతుందని ఆంటీ భయపడ్డారు.

ఆంటీ ఏవిధంగానూ ఈ కులాంతర వివాహానికి రాజీపడరని శ్రీరాంకు, సుగుణకు చెప్పాను. కాదని చేసుకుంటే ఆ ప్రశాంత నిలయంలో కల్లోలం రేగుతుందని చెప్పాను. వారిద్దరూ మంచి చెడ్డలు కూలంకుషంగా చర్చించుకున్నారు.

వారి ఇద్దరి తల్లి తండ్రులూ మనసారా ఒప్పుకుని వారి వివాహం చేస్తేనేసరి, లేకపోతే స్నేహితులుగానే మిగిలిపోడానికి నిర్ణయించుకున్నారు. ఒకరినొకరు కలుసుకోడం కూడా మానేశారు.

నాకూ మీ కుటుంబం పై వున్న ఆరాధన, గౌరవం, కృతజ్ఞతాభావాలు శ్రీరాంకు తెలుసు. ఒక రోజు శ్రీరాం నాదగ్గరకు వచ్చి ఒక కవరు, నాకు యిచ్చాడు. దానిలో తను, సుగుణలు కలసి తీయించుకున్న ఫొటోలు, సుగుణ తనకు వ్రాసిన ఉత్తరాలు వున్నాయని చెప్పాడు. అవి సుగుణకు అందజేయమని చెప్పి వెళ్ళిపోయాడు. కాని నేను ఆటైము లో త్రాగిన మత్తులో వున్నానని గ్రహించలేదు శ్రీరాం.

ఒద్దు అనుకుంటూనే కవరు తెరచి ఆ ఫొటోలు చూశాను. మీకు ముఖాఃముఖి గా చెప్పే ధైర్యం వాళ్ళకు లేదు. ఈ ఫొటోల ద్వారా, వాళ్ళు ప్రేమించుకుంటున్న విషయం మీకు తెలియచేయాలని కొంత అన్యోన్యంగా వున్నట్లుగా ఫొటోలు తీయించు కున్నారే తప్ప వాళ్ళు హద్దులు దాట లేదు.

ఆ ఫొటోలు తీసుకుని మీ యింటికి వచ్చాను. సుగుణకు యివ్వడానికి కాదు. ఆంటీకి యివ్వడానికి. పునరాలోచన చేసి వివాహం పెద్దలే జరుపుతే బాగుంటుందని ఆంటీకి నచ్చ చెప్పాలనుకున్నాను.

అదే రోజు నా జీవితంలో, చాలా పెద్దతప్పు చేశాను. ఏ కొడుకు, ఏ సోదరుడూ చేయని పెద్ద తప్పు. తిన్నయింటి వాసాలు లెఖ్ఖపెట్టాను. ఏచేయి, నా చిన్నప్పుడు గోరుముద్దలు తినిపించిందో ఆ చేతిని నరికేశాను, మీ ఉప్పుతిని మీకే ఎసరు పెట్టాను. నాలాంటి నీతి మాలిన వాడు ఎవరూ వుండరు. నాలో వున్న రక్తం అలాంటిది. తప్పు చేసిన ఆరోజు నుండీ ఈరోజు వరకు పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నాను. నన్ను నేనే శిక్షించు కుంటూ

మరణశయ్య (death bed) పై చేరాను. నేను చనిపోదానికి ఇంక ఎన్నో రోజులు పట్టదు. ఈ లోకం లో నాలాంటి నీచులు బ్రతికడానికి వీలు లేదు.

ఈ వుత్తరం మీకు, నా గురించి వ్రాయడం లేదు. నిరాశ, నిస్పృహ, భయం, ఆందోళన, విచారంతో, రోజు రోజుకీ కృంగిపోతూ పిచ్చిదానిలా మారి పోతున్న ఆంటీ కోసం. నిజం తెలుసుకుని మీరు రక్షిస్తారని. మళ్ళీ మీ జీవితాలలో పోయిన ఆనందం తిరిగి రావాలని. మీ కుటుంబానికి పట్టినపీడ పోవాలని.

అంకుల్ నేను మీకు నిజం చెబుతున్నాను. నన్ను క్షమించండి. ఆంటీని రక్షించండి.

శ్రీరాం యిచ్చిన ఫోటోలతో నేను మీ యింటికి కంగారుగా వచ్చాను. ఇంటిలో ఎవ్వరూ లేరు. కానీ నేను చూడకూడని దృశ్యం ఒకటి చూశాను. నాలోని నాగుపాము బుసలు కొట్టింది. నాలోని దుర్బుద్ధి పరాకాష్టకు చేరుకుంది. నా పతనానికి అది మరోమెట్టు. తాగిన మైకంలో వున్న నాకు అదృశ్యం చూచి చెమటలు పట్టాయి. కళ్ళు మూసుకు పోయాయి. నాలో ఇంగితజ్ఞానం నశించింది. నాలోని రాక్షసుడు నిద్ర లేచాడు.

ఆ సమయంలో ఇంట్లో మగ వాళ్ళు ఎవరూ లేరనే భరోసాతో ఆంటీ బాత్ రూమ్ నుండి అర్ధ నగ్నంగా బయటకు వచ్చి బట్టలు కట్టుకుంటున్నారు. ఆపద నారూపంలో పొంచి వుందని తనకు తెలియదు. కాలనాగు తనను కాటేయదానికి బుసలు కొడుతుందని తనకు తెలియదు.

ఆ దృశ్యం నాలోని రాక్షసుడ్ని నిద్రలేపింది. నేను ఆంటీ వున్న బెడ్ రూంలోకి వెళ్ళాను. ఆంటీ భయకంపితులయ్యారు. తిట్టారు. బయటికి పొమ్మన్నారు. కనక పోయినా పెంచిన తల్లినని గుర్తుచేసారు. ఈ బండఅబ్బాయిని బయటకు గెంటగల శరీర దారుఢ్యం, సన్నగా వుండే ఆంటీకి లేదు. అయినా తన శీలాన్ని కాపాదు కోదానికి నన్ను చంపి వేసేవారే. ఆ ఫోటోలు వుత్తరాలు. చూపించాను. ఆమె కృంగి పోయారు.

సుగుణ, గుణవతి కాదని, శ్రీరాంతో కాలు జారిందని, సుగుణ పవిత్రతను కోల్పోయిందని, అన్నాను. ఆఫోటోలు ఉత్తరాలు, పెళ్ళివాళ్ళకు యిస్తానని బెదిరించాను. గుట్టుగా నాకు లొంగకపోతే, సుశీల గారు శీలాన్ని కోల్పోయారని ప్రచారం చేస్తానని బెదిరించాను. సుమిత్రను కూడా పాడు చేస్తానని బెదిరించాను.

ఎన్ని నీతులు చెప్పినా, త్రాగిన మైకంలో వున్న నా బుర్రకు ఎక్కవని గ్రహించారు. సుగుణ జీవితం పాడుకాకూడదని, ఆఫోటోలను ఉత్తరాలను సంపాదించాలని నా మీద దాడిచేసారు. ఆపెనుగులాటలో నామగతనం తల్లిలాంటి ఆంటీని కాటువేసింది.

ఏ కొడుకూ, ఏ సోదరుడూ చేయకూడని పాపంచేసి, పారిపోయాను. కూడా ఆఫోటోలు వుత్తరాలు తీసుకు పోయానన్న విషయం ఆషాక్‌లో ఆమె గ్రహించలేదు.

తర్వాత మీ కుటుంబానికి మొహం చూపలేదు. పశ్చాత్తాపంతో నన్ను నేను శిక్షించు కోవడం మొదలు పెట్టాను. ఉద్యోగం మానేసి దేశదిమ్మరిలా, మానాన్నలా తిరగడం మొదలు పెట్టాను.

చెడు కర్మలు చేస్తే, ఆకర్మ ఫలాన్ని ఈ జన్మలోనూ, లేకపోతే తర్వాత జన్మలోనూ అనభవించడం జరుగుతుందని, కృష్ణ భగవానుడు చెప్పాడు. నేను ఆ చెడుకర్మఫలాన్ని ఈజన్మలోనే అనుభవిస్తున్నాను. నా శరీరానికి సరైన పోషణ చేసుకోక పోవడం వలన తెలివితప్పి పడిపోవటం జరుగుతూంది.

డాక్టరు పరీక్ష చేసి, నా మెదడు పై ట్యూమర్ వుందని. సరైన వైద్యం చేయించుకుంటే ఈ జబ్బు తగ్గిపోతుందని చెప్పారు. నేను వైద్యం చేయించుకోలేదు. నేను మరణానికి దగ్గరయ్యాను, అని వేరే వాళ్ళ ద్వారా మీకు తెలిసిపోయింది.

మీరు వచ్చారు. దగ్గర వుండి అన్ని పరీక్షలూ చేయించారు. జబ్బు ముదరటంతో రాయవెల్లూరు వెళ్ళి వైద్యం చేయించుకోవాలని, మీకు తెలిసి పోయింది. ఫిట్స్ వచ్చినపుడే కాని, మిగతా టైములో నాపని నేను చేసుకోగల్గుతున్నాను. మీరు నాకు 25,000/- రూపాయలు యిచ్చారు. రాయవెల్లూరు వెళ్ళి వైద్యం చేయించు కోడం ప్రారంభించ మన్నారు. ఇంటికి వెళ్ళి మరి కొంత డబ్బు తీసుకుని మీరు తర్వాత వస్తా నన్నారు. మీ చేతులు పట్టుకొని ఏడుస్తూ వుండిపోయానే గాని మరేమీ చెప్పలేక పోయాను. నాకు వైద్యం చేయించు కోవాలని లేదు.

నాకు బ్రతకాలని లేదు. అందుకే ఈ డబ్బు మీకు తిరిగి పంపుతున్నాను. ఈ ఉత్తరాన్ని మీరు చదివేటప్పటికి, నేను గమ్యం తెలియని బాటసారిలా, మీరు చేరుకోలేనంత దూరం వెళ్ళిపోతాను. బహుశ నాతండ్రిలా దిక్కులేని చావుచస్తాను.

చనిపోయేముందైనా ఒక మంచి పని చేయాలని పిస్తుంది. ఏ ఫోటోలు, ఏ ఉత్తరాల గురించి ఆంటీ భయపడుతున్నరో, వాటిని ఆంటీ స్వయంగా కాల్చి పారేయాలి. ఏ వ్యక్తి బ్రతికి వుంటే, తనకూ, తన పిల్లలకూ హాని కలుగవచ్చు అని ఆంటీ భయపడుతున్నారో, ఆవ్యక్తి, ఆ నీచుడు చనిపోయినట్లుగా ఆంటీకి తెలియాలి. అందుకే చనిపోక ముందే నా పాడిని నేనే తయారు చేసుకున్నాను. శవం గెటప్ లో ఈఫోటోలు తీయించుకున్నాను.

నా శవం ఫోటోలనూ, శ్రీరాం యిచ్చిన ఉత్తరాలు, ఫొటోలనూ మీకు

పంపుతున్నాను. పథకం ఆలోచించి, తద్వారా వీటిని ఆంటీకి చూపండి. ఆంటీ సమస్య పరిష్కారం అవుతుంది.

ఈ ఉత్తరం వెంటనే చింపివేయండి. మరెవరూ దీన్ని చదవకూడదు. క్షమించమని అడిగే అర్హతలేని దౌర్భాగ్యుడు.

'నాగుబాబు'

నాగుబాబు ఉత్తరం చదివిన తర్వాత. సుశీల ప్రాబ్లమ్ ఏమిటో తెలిసింది. అది శారీరిక, సాంఘిక, మానసిక, చైతన్య రహితమైన బాధ అని. తద్వారా తనలో ఈ విషాదం, భయం, బెంగ, దుఃఖం, నిర్లిప్తత చోటు చేసుకున్నాయి. ఈస్థితి నుండి బయటకు తీసుకు రాడానికి. ఒక పథకం ద్వారా తనకు పెద్ద షాక్‌యివ్వాలి. తన భయాన్ని పోగొట్టి ఏకాగ్రతతో ఆలోచించేలా చేయాలి. శవంలా వున్న నాగుబాబు ఫొటోలు సుశీల చూడాలి. శ్రీరాం, సుగుణలు తీయించుకున్న ఫోటోలు చూడాలి. సుగుణ శ్రీరాంకు వ్రాసిన ఉత్తరాలను, తన చేతులతో మంటల్లో వేసి భస్మంచేయాలి. అపుడే సుశీల తనకుదక్కుతుంది. లేకపోతే పిచ్చిదైపోవడం ఖాయం.

ఏకాగ్రతతో ఆలోచించి, లాజికల్‌గా ఆలోచించి ఒక నిర్ణయం తీసుకున్నాను. సుశీలకు వివరంగా ఒక ఉత్తరం వ్రాశాను.

'సుశీలా' !

బెదురుతూ, భయపడుతూ సుశీల వచ్చింది 'చూడు. ఆ టేబిల్ మీద ఒక ఉత్తరం వుంది. ప్రశాంతంగా, జాగ్రత్తగా చదువు'. సుశీల బిత్తర పోయింది. ఆత్రంగా ఆ ఉత్తరం తీసుకుని చదవడం పారంభించింది.

ప్రియమైన సుశీలకు,

నీకు ఇటువంటి ఉత్తరం రాయవలసి రావడం, నా దురదృష్టం. 25 సంవత్సరాలు, నాకూ నాపిల్లలకూ ప్రేమ, అమృతం పంచి పెట్టావు. కాని ఈ మధ్య నీ ప్రవర్తన వలన నాకూ, నా పిల్లలకూ, నీ నాన్నగార్కీ మనఃశాంతి లేకుండా పోతుంది. మంచిగా నీకు ఏమి చెప్పినా అర్థంచేసుకోవడం లేదు. నా మంచితనాన్ని భరించ లేక పోతున్నావు. నిన్ను నీవు హింసించుకుంటున్నావు. తద్వారా మమ్మల్ని హింసిస్తున్నావనే సత్యం, నీవు గ్రహించడంలేదు. ప్రస్తుత పరిస్థితిలో మేము యిక రాజీపడదలుచుకోలేదు. చాలా విసిగిపోయాము.

ఈ రోజు నువ్వు జీవితంలో అతిపెద్ద నిర్ణయం తీసుకోవాలి. ప్రస్తుతం పరస్పర విరుధమైన రెండు రకాల నిర్ణయాలు నీ ముందు వుంచుతున్నాను. ఈ రెండిటిలో ఏనిర్ణయాన్ని ఎన్నుకుంటావో అది నీ యిష్టం. మా ప్రమేయం లేదు. బలవంతమూ లేదు.

మొదటిది. నువ్వు గతాన్ని మరచి పోవాలి. నీప్రమేయం లేకుండా, మనసా వాంఛా నువ్వు కోరకపోయినా, నీకు జరిగిన దుర్ఘటనను నువ్వు మరచిపోవాలి. మనస్సు అద్దంలా శుభ్రం చేసుకుని, రేపటి నుండి మాకు నరకానికి, బదులు స్వర్గాన్ని చూపాలి. మన సంసారంలో సుఖఃశాంతులు మళ్ళీరావాలి. ఈ రోజున కూడా నువ్వు నాకు ఎంతో పవిత్రంగా కనబడుతున్నావు. తామరాకుకు నీటిబొట్టు ఎలా అంటుకోదో, అలానే నీ ప్రమేయంలేని ఆ దుర్ఘటన నిన్ను అపవిత్రం చేయలేదు. అపవిత్రం అయ్యానని భావిస్తే అది నీ మూర్ఖత్వమే.

ఈ సమస్య నిన్ను కుమ్మరి పురుగులా, మళ్ళీ మళ్ళీ తొలచివేయకూడదు. ఈ సమస్య శాశ్వతంగా పరిష్కారమైపోవాలి. నీ కష్టంలో మనమిద్దరం భాగస్వామ్యులం. నీ మానసిక క్షోభనీ, నీ మానసిక రుగ్మతనీ, అనిశ్చితస్థితినీ, దూరంచేసుకోవాలి. ఈ సమస్య వలన నీకు అనారోగ్యమూ, పిచ్చీ రాకూడదు. నీ భాధ, యిక మేము చూడలేము.

మనసా వాంఛా నీ ప్రమేయం లేని సంఘటన వలన నువ్వు పిచ్చి దానివి అవడం, తద్వారా మేమంతా ఆత్మహత్యలు చేసుకోవడం గర్హించే పనికాదు. నువ్వు మారాలి. నువ్వు మాకు కావాలి.

ఈ మెదటి నిర్ణయం తీసుకోవడం నువ్వు చేయలేకపోతే, ఈ రెండో నిర్ణయం నీకు అంగీకారమని భావిస్తాను.

నీ ఈ రెండో నిర్ణయం యొక్క పర్యావసానం ఏమిటో నీకు తెలుసా ? రేపటి ఉదయాన్ని, నేనూ, సుమిత్ర, సుప్రజలు చూసే అవకాశం వుండదు. భయపడకు. ఏడవకు. నీ కళ్ళల్లో నీళ్ళు రాకూడదు. ఉత్తరం పూర్తిగా చదువు. మళ్ళీ మళ్ళీ ఇలాంటి ఉత్తరం రాసే అవకాశము యింక నాకు వుండదు. మధ్యలో ఈ ఉత్తరం చదవడం మాని నన్ను చేరుకోవాలని ప్రయత్నంచేసినా ప్రయోజనంలేదు. మన మధ్యవున్న తలుపులు, యిప్పటికే మూసుకుని పోయాయి. ఒక వైపు నువ్వు, రెండో వైపు నేనూ మన పిల్లలు. నీకున్న ఏశక్తీ ఈ తలుపుల్ని తెరవలేదు. నువ్వు ఏడ్చి, గట్టిగా రాద్ధాంతం చేయలేవు. అలా చేస్తే నువ్వు అపవిత్రం అయ్యావనే నీ భ్రమ అందరికీ తెలిసిపోతుంది. అందుకేగా నీలోనే నువ్వు బాధపడిపోతూ నిన్ను శిక్షించుకుంటున్నావు. ఈ దుర్ఘటన గురించి ముగ్గురికే తెలుసు.

నీకు, నాకు, నాగుబాబుకు. తాగిన మైకంలో, తనుచేసిన తప్పుకు, తనే శిక్ష విధించుకుని, పశ్చాత్తాపంతో, చనిపోయాడు. ఇక నేను రేపటి ఉదయాన్ని చూడగలుగుతాను అని అనుకోవడం లేదు. ఇక పోతే నువ్వు నీ పిచ్చిభ్రమ లో పడి, పిచ్చిదానిలా మారిపోకుండా, నిన్ను ప్రేమతో పెంచిన మీ నాన్నగారికి సేవచేస్తూ నీ రుణం తీర్చుకో. నీ భ్రమను భస్మంచేయి.

మన మధ్య మూసుకున్న ఈ తలుపులు వెనుక ఒక వైపు నువ్వు, మరొక వైపు నేను, ప్రేమతో పెంచిన నీ యిద్దరి పిల్లలూ ఉన్నాము. వాళ్ళు నిద్ర పోతున్నారు. దానికి కారణం తెలుసా? జాగ్రత్తగా ఈ ఉత్తరం చదువు. సుమిత్ర, సుప్రజల సమక్షంలో పాలలో నిద్రమాత్రలు కలిపాను. ఆ విషయం వాళ్ళకు స్పష్టంగా చెప్పాను.

'నిద్ర మాత్రలు కలిపిన ఈ పాలను, నేను చెబితే త్రాగుతారా ?' అని అడిగాను. 'నాన్నగారూ. మీరు డాక్టరు. ప్రాణాలు పోసే మీరు, ఏ పరిస్థితిలో, ఈ నిద్ర మాత్రలు కలిపిన పాలను త్రాగమంటున్నారో నాకు తెలియదు. తెలుసుకోవాలని కూడా నాకు లేదు. ఇలా చేస్తే ఏదో మంచి జరగ వచ్చు అని వూహిస్తున్నాను. కనుక తప్పక ఈ పాలను త్రాగుతాను' ఇది మన సుమిత్ర జవాబు.

'నాన్నగారు మీరు చెబితే, నిద్ర మాత్రలు కలిపిన ఈ పాలనే కాదు, విషం యిచ్చి త్రాగమన్నా త్రాగుతాను' ఇది మన ఆఖరి కుమార్తె సుప్రజ సమాధానం.

'అయితే, ఈ పాలను చెరిసగం త్రాగండి అన్నాను' సుమిత్ర, సగం పాలు త్రాగి, 'నాన్నగారు మిగతా సగంపాలూ కూడా నేనే త్రాగుతాను. సుప్రజకు ఈ విషం కలిసిన పాలను ఇవ్వవద్దు. సుప్రజ అంటే అమ్మకు చాలా యిష్టం' అన్నాది. 'అలా కుదరదు.' అన్నాను.

సుమిత్ర సగం పాల తోవున్న పాలగ్లాసును, టేబుల్ మీద పెట్టింది. 'థాంక్స్' అని సుప్రజ మిగిలిన సగం పాలను త్రాగింది.

ఇద్దరూ నాకు ముద్దులు పెట్టారు. వీళ్ళు నువ్వు ఎంతో డిసిప్లిన్‌గా పెంచిన నా బంగారుబిడ్డలు. వీళ్ళను జన్మయిచ్చి ఈరోజు వరకూ ఎంతో ప్రేమతో పెంచావు. నువ్వు వీళ్ళకు అమృతాన్ని యిచ్చావు. నేను మైల్డ్ విషాన్ని యిచ్చాను. ఫలితంగా యిద్దరూ గాఢ నిద్ర లో వున్నారు.

ఏడవకు నీ రెండో నిర్ణయం యొక్క పర్యావసానం పూర్తిగా చూస్తావా ? చూడు. కిటికీతలుపులు తెరిచేవున్నయి. ఆ టేబిల్ మీద 3 గ్లాసుల్లో వున్న నీళ్ళలో సైనైడు

(భయంకరమైన విషాన్ని) కలిపాను.

'మీరు సజస్ట్ చేసిన మొదటి నిర్ణయం నేను తీసుకోలేనండీ' అని నువ్వు సింపుల్‌గా చెబితే చాలు గాఢ నిద్ర లో వున్న నా ప్రియాతి ప్రియమైన ఇద్దరి పిల్లలనూ నిద్ర లేపుతాను. చివరిసారిగా, మాకు మానవజన్మ యిచ్చిన ఆ భగవంతునికి, నమస్కరించి, మేము ముగ్గురమూ, యీ భయంకరమైన విషాన్ని తీసుకుంటాము. తర్వాత మాకు అంతాశాంతి.... సుశీల ఆవుత్తరాన్ని అక్కడ పడేసి, పరుగున కీటికీ దగ్గరకు వచ్చింది. సుశీలకు నేను వూహించినట్లుగా పెద్ద షాక్ తగిలింది.

'ఏ మండీ తలుపులు తీయండి'

'తీయను'. 'ముందు తలుపులు తీయండి. తర్వాత నా నిర్ణయం చెబుతాను.'

సుశీల ప్రాధేయపడింది.

'కుదరదు'.

'ఏ మండీ తలుపు తీయండి. నా తల తిరుగుతుంది, నరాలు పగలిపోయేలా వున్నాయి' తనతలను కిటికీ వూచలకు కొట్టుకోవడం మొదలు పెట్టింది.

'సుశీలా' కిటకీలోంచే చేయి చాచి, బలంగా సుశీల చెంపమీద చెళ్ళు మనేలా ఒక్క దెబ్బ కొట్టాను. సుశీల బిత్తర పోయింది. కళ్ళు పెద్దవి చేసి నావంక చూస్తూ అలావుండిపోయింది. పూర్తిగా చెమటలు పట్టాయి. కళ్ళనుండి నీళ్ళు రావడం లేదు.

'నా నిర్ణయం మీరు చేసిన మొదటి ప్రాపోజలే' నిమ్మదిగా అన్నాది సుశీల

'నిజంగా....గతాన్ని మరచి పోతావా ?'

'నిజంగానేనండీ. భగవంతుడి మీద ప్రమాణం చేసి చెబుతున్నాను.'

'నాకు నమ్మకం కుదరడం లేదు'

'నా మూర్ఖత్వంతో, భగవంతుడి లాంటి, నా భర్తనూ, బంగారం లాంటి నా పిల్లల్నీ పోగొట్టు కోలేను. గతాన్ని మరచి పోతాను. నిజంగానే. నన్ను నమ్మండి'.

నా లో ఆనందం పరవళ్ళు త్రొక్కింది. కానీ బయట పడలేదు. తలుపులు తీయలేదు.

'సుశీలా. ఒక పని చేస్తావా ?'

' చెప్పండి ముందు తలుపులు తీయండి'

'తీయను. ముందు నేను చెప్పింది చేస్తావా ?'

'చేస్తాను త్వరగా చెప్పండి' కంగారుగా అంది. చూడు. ఆ అల్మారాలో ఒక పెద్ద కవరువుంది తీసుకురా'.

పరుగున వెళ్ళి ఆ కవరు తెచ్చింది.

'ఆ కవర్ లో ఏమి వున్నాయో చూడు. నాగుబాబు చనిపోయాడు. అతని శవానికి తీసిన ఫోటోలు చూడు. శ్రీరాం సుగుణలు తీయించుకున్న ఫోటోలు చూడు. సుగుణ శ్రీరాంకు వ్రాసిన ఉత్తరాలు చూడు. అవి నిజంగా ప్రేమలేఖలు కాదు. కులమతాల కలీతమైన, సంఘసంస్కరణలకు తను చేసిన ప్రొపోజల్స్. అవి నీకు చూపించి నాగుబాబు బ్లాక్‌మెల్ చేశాడు. నువ్వు వీటిని చూసే కదా భయపడ్డావు. వీటిని పెళ్ళివాళ్ళకు చూపిస్తాననీ, సుగుణ జీవితం నాశనం చేస్తాననీ, సుమిత్రను కాటు వేస్తాననీ, నిన్ను భయపెట్టేడు. దీనికి భయపడే కదా, నీ పిల్లలకు చెడుజరగకూడదని నీ జీవితాన్ని త్యాగం చేస్తున్నావు ?'

సుశీల గాబరాగా అవన్నీ త్రిప్పి, త్రిప్పి చూసింది. 'వీటి గురించే కదా, ఇన్నాళ్ళు భయపడుతూ, బ్రతికావు. ఇప్పుడు అవన్నీ నీచేతిలో వున్నాయి. వాటిని కాల్చేసి తృప్తిగా శ్వాస తీసుకో. ఈ భయాన్నించి బయటపడు. మళ్ళీ నిన్ను బ్లాక్‌మైల్ చేయదానికి, నాగుబాబు లేడు. చచ్చిపోయాడు. పశ్చాత్తాపంతో, తనను తానే శిక్షించుకుని, ఈ లోకాన్ని విడిచి పెట్టేశాడు'

సుశీల పిచ్చిదానిలా నవ్వడం ప్రారంభించింది. కసిగా ఆఫోటోలనూ, ఆఉత్తరాల్ని ముక్కలుముక్కలుగా చింపివేసింది. కిరోసిన్, అగ్గిపెట్టె తెచ్చింది. వాటిని పూర్తిగా తగులబెట్టింది. సంతృప్తిగా నవ్వుకుంది. ఇప్పుడు తనకు ఏబెంగా లేదు. ఏ భయమూ లేదు.

నెమ్మదిగా తలుపులు తీసాను. కంగారుగా పరుగు పరుగున, తన పిల్లల చెంతకు చేరింది.

'సుశీలా భయపడకు. మన పిల్లలకూ ఏ భయంలేదు. నేను డాక్టరుని, ప్రాణాలు కాపాడతాను గాని, మనకు ప్రియాతి ప్రియమైన, మన పిల్లల ప్రాణాలు తీయలేను. నేను వాళ్ళకు యిచ్చింది చాలా మైల్డ్ డోస్. కాసేపటికి వాళ్ళే నిద్రలేచి కూర్చుంటారు.

సుశీల ఆనందానికి అవధులు లేవు. ఇపుడు తన మనస్సు ఎంతో ప్రశాంతంగా వుంది.

ఏ మండీ నన్ను క్షమించండి'

'మన మధ్య క్షమాపణల ప్రసక్తే లేదు. నువ్వు నాకు ఎంతో పవిత్రంగా కనబడుతున్నావు'. సుశీల కళ్ళల్లో ఆనందభాష్పాలు చూశాను.

ఇంక సుశీల పిచ్చిదైపోయే భయంలేదు. ఇదివరకటిలా ఆ ప్రేమమూర్తి నాకూ, నా పిల్లలకూ అమృతం, ప్రేమ పంచుతుంది.

సంతోషంగా సుశీలను నా కౌగిలి లో చేర్చుకున్నాను.

సుశీల చేసిన చిన్న పొరబాటే, అమాయకంగా అశ్రద్ధగా చాలా మంది ఆడవాళ్ళు చేస్తుంటారు. సుశీలకు జరిగినట్లు వారికి జరగవచ్చు అని అభిప్రాయం వస్తే పొరబాటున కూడా అలాంటి చిన్నపొరబాటు చేయరు. మనం చూస్తూవుంటాం. పవిత్ర నదులలో స్నానం చేసి బయటకు వచ్చి, బట్టలు మార్చుకునే టపుడు, బీచెస్ లో స్నానం చేసేటపుడూ, లొట్టలు వేసుకుంటూ తమనే దొంగతనంగా చూస్తున్న ప్రబుద్ధులు తమ చుట్టూ వున్నట్లు స్త్రీలు గ్రహించరు. వాళ్ళ వలన ఏదైనా జరగకూడనిది జరిగితే, ఆ స్త్రీల, బాధ ఎలావుంటుంది? దానికి సుశీల ఒక ఉదాహరణ. వాళ్ళ ప్రమేయం లేకుండానే, కొంత మంది స్త్రీల జీవితాలు ఇలా నాశనమైపోతున్నాయి.

ఉదాహరణకు, న్యూస్ పేపర్సులో ప్రచురించిన కొన్ని యదార్థ సంఘటనలు.

1. కన్నకొడుకు, కామాంధుడై తల్లిని పాడుచేయడం,

2. సొంత సోదరుడు, తన సోదరిని కామాంధుడై పాడుచేయడం,

3. సొంత అక్క, చెల్లెళ్ళ బిడ్డలు వరుసకు అన్నా చెల్లెళ్ళు అని తెలిసినా కామానికి బలై, కాంప్రమైజ్ కాలేక గాని, లేక అదే వీక్‌నెస్‌కు బానిసలైకాని చివరికి పెళ్ళి చేసుకుని భార్యా భర్తలుగా జీవిస్తూ వుండటం. బంధువులచే వెలివేయబడి, సోషల్ సెక్యూరిటీ లేకుండా బ్రతకడం,

4. అలాగే సొంత అన్న, తమ్ముళ్ళ బిడ్డలు కామానికి బలైపోవడం.

ఇలా జరగటానికి మూలకారణం, ఒక చిన్న పొరబాటే. ఇవి నిజమా? అని కొంత మంది ముక్క మీద వేలు వేసుకోవచ్చు. సంఘంలో జరుగుతున్న అన్ని చెడుసంఘటనలూ అందరికీ తెలియాలని లేదు.

సామాన్యంగా, పురుషులు డబల్ స్టాండర్డ్సు పాటిస్తుంటారు. తన భార్యని గాని, తల్లిని గాని, కుమార్తెలను కాని, పరపురుషులు కన్నెత్తి చూడకూడదు. కాని తను మాత్రం పరస్త్రీ, (స్నేహితుడి భార్యే కావచ్చు) పైట పొరబాటున జారితే చొంగ కార్చుకుంటూ,

ొట్టలేసుకుంటూ చూడవచ్చు. అపుడు నీతి నియమాలు, మంచి చెడుల. విచక్షణ, స్నేహం, ంధుత్వం ఏమీ గుర్తుకురావు. అర్ధ నగ్నంగా వున్న పరస్త్రీని చూడటం జరిగితే వాళ్ళ ునో ప్రవృత్తి గురించి చెప్పనక్కరలేదు. పర్యావసానం కళ్ళముందే వుంది. తను ీరామచంద్రుడు కాదని తెలుసు. కాని భార్య పవిత్రమైన సీతాదేవిగా వుండాలి. ఇద్దరూ ువిత్రంగా వుంటే మంచిదే. అపుడు యిక ఇలాంటి ప్రోబ్లమ్స్ వుండవు.

ఏది ఏమైనా ఏ స్త్రీ కూడా, అమాయకంగా ముందు వెనుక చూసుకోకుండా, ులాంటి చిన్న చిన్న పొరబాట్లు చేయక పోతే మంచిది. ఏపుట్టలో ఏ పామువుంటుందో? ఏమీ జరగవంత వరకు పర్వాలేదు. జరిగితే ? పర్యవసానం?

ైనా స్త్రీలు ఈ విషయంలో తగిన జాగ్రత్త తీసుకుంటే బాగుంటుందని పిస్తుంది.

్న పొరబాటు యొక్క పర్యవసానం భయంకరంగా వుంటుందని గుర్తించాలి.

# 'వ్యక్తి ఆరాధన'

నేను MCA పూర్తి చేసాను. ఒక సంవత్సరం తర్వాత TCS లో జాబ్ వచ్చింది.

'అమ్మాయిని ఒంటరిగా హైదరాబాదు ఎలా పంపుతారు?' అని అమ్మ గొడవ చేసింది.

నేనూ, నాన్నగారూ అంతగా పట్టించు కోలేదు.

నా క్లాస్‌మేట్ రాధిక, నా సీనియర్స్ సుందరి, హరి, ప్రియాంక, సురేష్ అదే ఆఫీసులో పనిచెస్తున్నారు. వారి సహాయంతో, నాకు TCS, లో చేరడం, ప్రియాంక రూమ్ మేట్‌గా చేరడం సులువుగా జరిగిపోయాయి.

ప్రియాంక చాలా అందగత్తె, మాటకారి. మంచి వ్యక్తిత్వంగల అమ్మాయి. కాలేజిలో ఆమెకు మంచి గుర్తింపువుండేది. ఏపని చేసినా పద్ధతిగా, ఇతరులను ఆశ్చర్య పరిచేదిగా వుండేది. ఎప్పుడూ నవ్వుతూ ఇతరులను నవ్విస్తూవుండేది. అలా అని అతిగా మాట్లాడేది కాదు. ఆమె చిరునవ్వు మొహమే ఆమె భావనలను యితరులకు అందజేసేది. సమయానికి తగ్గట్టుగా ఛటుక్కున మాట్లాడిన కొద్దిమాటలే అందరికీ నవ్వుతెప్పించేవి. ఆమె మాటలు భావయుక్తంగా వుండేవి. అందులో కొద్ది మందిని నొప్పించే పదాలు, వ్యంగ్యం, ఏమాత్రం వుండేవి కాదు. కాని తన దగ్గర వున్న ఇన్‌ఫర్మేషన్ అంతా రివీల్ చేసేదికాదు. కొంత సస్పెన్స్ లో పెట్టేది.

రాధిక, ప్రియాంక దూరపు బంధువులు. చదువుకునే రోజుల్లో ఒకసారి రాధికతో ప్రియాంక ఇంటికి వెళ్ళడం జరిగింది. ఇల్లును, ఇంటిలో అమర్చిన వస్తువులను చూస్తేనే తెలిసింది. ప్రియాంక వాళ్ళు చాలా భాగ్యవంతులని. ప్రియాంక నాన్న గారు బ్యాంకు మేనేజరు. మంచి టేస్టు, డిసిప్లిన్, సిన్సియారిటీ వున్న వ్యక్తి. ప్రియాంక అమ్మగారు కూడా బాగా చదువుకున్న సంస్కార వంతమైన స్త్రీ. తన ఇల్లును ఎంతో చూడముచ్చటగా సర్దేవారు. ఏది ఎక్కడ వుంచాలో దాన్ని అక్కడ వుంచేవారు. ప్రియాంకకి కూడా ఇల్లు చక్కబెట్టడం, తన సరౌండింగ్స్‌ను తీర్చిదిద్దడం లో మంచి టేస్టువుంది.

అలాంటి ప్రియాంక నా రూమ్‌మేటుగా వుండటం నా అదృష్టంగా భావించేను. అది రాధిక రికమెండేషన్ వలన సాధ్యమైంది. ఇంతకుముందు, సుందరి, ప్రియాంక ఈ ఫ్లాటులో వుండేవారు, సుందరిని, TCS, USA పంపారు. దాని వలన ఈ అదృష్టం నన్నువరించింది. ఈ ఫ్లాటు మా ఆఫీసుకు మరీ దూరం కాదు. మంచి పోష్ లొకాలిటీ లో వుంది. ప్రియాంకకు మారుతి జెన్ కారు వుంది. అన్ని సదుపాయాలూ వున్న ఈ అవకాశం నాకు దొరకడం నా

అదృష్టంగా భావించాను. కానీ ఈ సంతోషం నాకు ఎక్కువ కాలం వుండలేదు. ఎందుకంటే, ప్రియాంక కూడా త్వరలో ఈ ఫ్లాటు ఖాళీ చేస్తుందని రాధిక చెప్పింది. అయితే ప్రియాంక ఖాళీచేసే లోగా సుందరి అమెరికా నుండి తిరిగి వస్తుందని, ఈ ఫ్లాటులోనే తనతో వుంటుందని రాధిక చెప్పింది.

ప్రియాంకకు ఈ మధ్యే వివాహం అయిందట. ఆమె భర్త వైజాగులో ఉద్యోగం చేస్తున్నారట. ట్రాన్స్‌ఫర్ గురించి ప్రయత్నిస్తున్నట్లు, ఫలిస్తే హైదరాబాదుకు త్వరలోవచ్చి, పెద్ద ఫ్లాటు తీసుకుని వుంటారట. వాళ్ళతో పాటు తన అత్తగారు, ఆడపడుచులూ కూడా వుంటారట. ప్రియాంక తన పెండ్లికి నాకు శుభలేఖ పంపలేదు. కారణం మాకున్న పరిచయం తక్కువ 'ఆయన ఏం చేస్తుంటారు'? అని ప్రియాంకను అడిగాను. తనదైన శైలిలో చిలిపిగా నవ్వి ఆయన త్వరలో వస్తారు. నువ్వే అడుగు. ఇప్పుడు నువ్వు రాధికను అడిగినా చెప్పదు' అంది.

తన విషయం తను చెప్పనపుడు వేరే వాళ్ళను అడిగి తెలుసుకోవాలనే ఆత్రుత నాకు లేదు. ఈ ఫ్లాటు లో ప్రియాంక తో వుండే అదృష్టం కొద్ది రోజులే అని తెలిసిన తర్వాత, నాకు ఏదో తెలియని వెలితి అనిపించింది.

బాల్కనీ కిటికీ నుండి, మాఫ్లాటులోకి చూస్తే ఎంతో ముచ్చటగావుంటుంది. కళాత్మకంగా వుంటుంది. ఇంటిని చక్కదిద్దుకోవడం ప్రియాంక నుండి నేర్చుకోవాలనిపిస్తాది. తను ఉద్యోగరీత్యా ఎంత బిజీగా వున్నా, ఫ్లాటును చక్కగా తీర్చిదిదుతుంది ప్రియాంక. డ్రాయింగ్ /డైనింగ్ రూమ్, కిచెన్, బెడ్ రూమ్ చక్కగా కనబడుతూవుంటాయి. బాల్కనీలో, కూర్చీలో కూర్చుని వీధిలోకి చూస్తూ కూర్చోవడం కంటే మా ఫ్లాటులోకి, చూస్తూవుంటే మంచి కాలక్షేపం.

ఈ ఫ్లాటులో ప్రియాంకతో చాలా కొద్ది రోజులే వున్నా, తన సంస్కారం, కళాత్మకంగా ఇల్లు చక్కబట్టే తీరు చూస్తుంటే నాకు చాలా ఆనందంగా వుంటుందని, ఒక తియ్యని అనుభూతిలా వుంటుందని తనకు చెప్పాను. చిలిపిగా నవ్వుతూ 'పోవే' అని తేల్చి పారేసింది. కొద్ది సేపు ఆగి 'ఈ కాంప్లిమెంట్సు నాకు కాదు. ఈ క్రెడిట్ నా తల్లి దండ్రులకు దక్కాలి' అంది. ఆమె సంస్కారానికి ఇది ఒక ఉదాహరణ.

స్వతహాగా ప్రియాంక మితభాషిణి. కానీ సెల్ ఫోన్ లో తనభర్త తో మాట్లాడే టప్పుడు మాత్రం తనకు టైము తెలియదు. ప్రపంచంలో వున్న సంతోషం అంతా తన ముఖం లో వున్నట్లు అనిపించేది. తను మాట్లాడటం తక్కువ. వింటూ చిరునవ్వులు నవ్వడం ఎక్కువ.

తన భర్త గౌరాంగ్ ఫోను తీసుకుని తను బెడ్‌రూమ్‌లోకి వెళ్ళేది. వాళ్ళ సంభాషణ వినడం భావ్యం కాదని తలచి నేను బాల్కనీకి వెళ్ళి బయటకు చూస్తూ కూర్చునేదాన్ని.

ఆ రోజు ప్రియాంక ఆఫీసు టైములో, బయటకు వచ్చి గార్డెనులో నుంచుని సెల్ ఫోనులో మాట్లాడుతుంది. నాసీటు మొదటి అంతస్తులో, కిటికీ ప్రక్కన వుండటం వలన తను క్లియర్‌గా కనబడుతుంది. తన ముఖంలోని సంతోషం చూస్తుంటే, ఆఫోన్ గౌరాంగ్ నుండి వచ్చిందని తెలిసి పోయింది. తర్వాత తను కనబడలేదు. ఆరోజు పని ఎక్కువగా వుంది 'ఆలస్యంగా వస్తానని' చెబుదామని తన సీటుకు ఫోను చేసాను. ఫోనులో 'ప్రియాంక బయటకు వెళ్ళింది. నిన్ను డైరెక్టుగా. ఇంటికి వచ్చేయమంది. తనకోసం వెయిట్ చేయవద్దని చెప్పింది' అన్నాది, మరొక స్నేహితురాలు.

పనిపూర్తి చేసుకుని, ఆలస్యంగా మా ఫ్లాటుకు చేరుకున్నాను. ప్రియాంక ఇంట్లోనే వుంది. అలసటగా సోఫాలో ఇబ్బందిగా కూర్చునివుంది.

'ఏమైంది అలావున్నావు?' ఖంగారుగా అడిగాను.

'పిరియడ్స్ రావడం ఆలశ్యమైంది. ఏమీ తినాలనిపించడంలేదు. వాంతి వచ్చేలావుంది. గౌరాంగుకు ఫోనులో చెప్పాను. ఆయన ఏదో ఏదో వుహించుకుంటున్నారు. చాలా సంతోషంతో తబ్బి ఉబ్బి అవుతున్నారు. వెంటనే ఫ్లైటులో ఇక్కడకు రావాలని వుందట. కానీ మా ఆడపడుచును చూడ్డానికి ఒక మంచి సంబంధం వస్తుందట. అబ్బాయి USA లో వుంటున్నాడట. వాళ్ళు వచ్చి వెళ్ళగానే తను వస్తానంటున్నారు. ఈ లోగా బంజారాహిల్స్‌లోని తన బంధువు డా॥ రమేష్ గైనకాలజిస్టును వెంటనే సంప్రదించమన్నారు. చాలా తెలివైన డాక్టరట. గౌరంగ్ మాట కాదనలేక ఈ రోజు ఆయన నర్సింగ్ హోమ్‌కి వెళ్ళాను'.

'కంగ్రాట్యులేషన్స్'

'థాంక్స్' అది సరేగాని తర్వాత జరిగింది నీకు చెబితే, నువ్వు బాధ పడతావు'.

'ఏంజరిగింది' ? ఏంటి అంత డిప్రెస్‌డ్‌గావున్నావు'?

'ఎలా చెప్పాలో తెలియడం లేదు. నేను ఆ నర్సింగ్ హోమ్‌కు వెళ్ళకుండావుంటే బాగుండేదనిపించింది దుర్గా'. కొద్ది సేపు నిశ్శబ్దం తర్వాత తనే మొదలు పెట్టింది.

నేను ఆ నర్సింగ్ హోమ్‌కు వెళ్ళకుండా వుండాల్సింది. గౌరంగ్ మాట కాదనలేక వెళ్ళాను. ఒక విధంగా సంతోషంగావుంది. ఒక విధంగా చికాగుగావుంది. డాక్టర్ టెస్ట్ చేసి ప్రెగ్నెన్సీని

నిర్ధారించారు. టెస్ట్ చేసే ఆ ప్రోసెస్‌లో ఆయన నా అందాన్ని కళ్ళతో జుర్రు కున్నాడనిపించింది. అవసరానికిమించి, డాక్టర్ చేతులు నన్ను తాకాయనిపించింది. కాని ఆయన డాక్టరు కనుక నేను వ్యతిరేకించలేక పోయాను. టెస్ట్ చేసేటపుడు ఆయన చేసిన పనులు అంత అవసరమో కాదో కూడా నాకు తెలియదు. ఆ డాక్టరు, గౌరంగ్ బంధువు కూడా. అందుకు ప్రతి ఘటించలేకపోయాను. ఈ డాక్టరుపై అంత గౌరవం లేకపోతే ఆయన నన్ను వెంటనే వెళ్ళి ఆయనతో చెక్‌అప్ చేయించు కోమని తొందరపెట్టారు. ఈ మనస్తాపానికి తోడు, సామెతలో చెప్పినట్లు ఓ బట్టతలాయన ఎండవేడికి తట్టుకోలేక తాటి చెట్టు క్రింద నుంచుంటే, తాటికాయ బట్టతల మీద పడిందట అలా జరిగింది నాకూ'

'సరిగ్గా చెప్పు. ప్రియాంకా, నీకు యేమైనా అయితే నేను భరించలేను. ఈ కోద్ది రోజులలోనే నీ మీద గౌరవం, ప్రేమ, అభిమానం చాలా పెరిగిపోయాయి' అన్నాను.

'అందుకే చెప్పాలా లేదా అని ఆలోచిస్తున్నాను. నేనుదాచాలన్నా ఆ విషయం దాగేది కాదు'.

కొద్ది సేపు నిశ్శబ్దం తర్వాత ప్రియాంక మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

'ఈ మంచి, చెడుల ఆలోచనలతో సతమత మౌతున్నాను. నేను, బయటకు వస్తున్నపుడు కాలు జారి బోర్లాపడ్డాను. మోకాలికి, గట్టిగా దెబ్బ తగిలింది. డాక్టరు సిస్టర్లు అంతా గుమిగూడారు. స్ట్రచర్‌పైకి లిఫ్ట్ చేసి లోపలికి తీసుకు వెళ్ళారు. మళ్ళీ పరీక్ష మొదలైంది. డాక్టరు మోకాలికి బాండేజి వేశారు. ఫర్వాలేదన్నారు. రేపటిరకు ఎమైనా వాపు కనబడితే ఎక్స్‌రే తీస్తానన్నారు. జాయింట్ వద్ద డిస్క్ బోన్‌పై హేర్‌లైన్ క్రాక్స్ రాడానికి ఆవకాశం వుందన్నారు'. చీర కొద్దిగా పైకి తీసి మోకాలికి కట్టిన బేండేజ్‌ను చూపింది ప్రియాంక. నొప్పికి 'అమ్మా' అని మూలిగింది. నాకు దుఃఖం ఆగలేదు. కట్టలు తెంచుకుని ప్రవహించింది. ప్రియాంక చేతులు పట్టుకుని ఏడ్వేయడం మెదలుపెట్టాను. ప్రియాంక నన్ను ఆపలేదు.

'ఆడదానికి అందం ఒక వరం అంటారు అందుకే నాకు అందగాడు, ఉత్తముడైన భర్త, నీలాంటి స్నేహితులు దొరికారు. ఆడదానికి అందం ఒక శాపం అని నాకు ఈరోజే అనిపించింది' ప్రియాంక నిట్టూర్చింది. నాలో దుఃఖంతో బాటు కోపం కట్టలు తెంచుకుని ప్రవహించింది.

కళ్ళు ఎర్రబడ్డాయి. చెమటలు పోశాయి. కోపంతో వూగి పోయాను. 'ఆ డాక్టరు నాకు ఎదురైతే వాడ్ని చంపేస్తాను'. గట్టిగా అరిచాను.

'కూల్‌డౌన్ దుర్గా. ఆవేశపడకు నా కంటే నువ్వే ఎక్కువ బాధ పడుతున్నావు. కష్టాలు

వచ్చినపుడు జాగ్రత్తగా పరిష్కరించు కోవాలి కానీ, చంపడం దాకా వెళ్ళకూడదు. కష్టాల్ని, సుఖాల్ని సమానంగా తీసుకోవాలి. మనం తొందర పడితే క్రొత్త సమస్యలు రావచ్చు. పరిష్కారం మనచేతిలో లేదు. గౌరంగ్ చేతిలోనే వుంది'.

'గౌరంగ్ గారిని వెంటనే రమ్మని ఫోన్ చేయనా ?' 'వద్దు వైజాగ్ పని కూడా ఆయనకు చాలా ముఖ్యం. ఆయన ఇంటికి పెద్ద. మావయ్యగారు లేరు. మా ఆడబడుచు జీవితం చక్క బెట్టడం ఆయన బాధ్యత. మనం రమ్మని ఫోన్ చేయనఖ్ఖరలేదు. తండ్రి అవబోతున్నానన్న ఆలోచనే ఆయన్ను ఇక్కడికి తీసుకు వస్తుంది. నాకు దెబ్బ తగిలిందని తెలిస్తే ఆయన తట్టుకోలేరు. డాక్టరుకు కూడా చెప్పాను. ఆయనకు చెప్పవద్దన్నాను'

ప్రియాంక, వ్యక్తిత్వాన్ని, సంస్కారాన్ని, ఆత్మసౌందర్యాన్ని, అంత బాధలోనూ ఆమె ముఃఖంలో వుట్టి పడుతున్న నిండుతనాన్ని చూచి, చేతులెత్తి నమస్కారం చేయకుండా వుండలేకపోయాను.

'ఛీ పిచ్చిపిల్లా, ఏంటీ ఈ పనులు ఊరుకో, ఇంత సున్నితమైన మనస్సుతో వుండకూడదు. నీకు నీ తల్లి తండ్రులు 'దుర్గ' అనే పేరును పొరబాటున పెట్టారు' చిరునవ్వుతో నా కన్నీళ్ళను తుడిచింది. ఇంత కష్టంలోనూ తను నవ్వు తుంటే నాకు ఆశ్చర్యమనిపించింది. నీకు చెప్పిన విషయాల్ని ఎవరికీ చెప్పకు. రాధికకు కూడా చెప్పకు. కష్టాలు వస్తే ధైర్యంగా ఎదుర్కోవాలిగాని పదిమంది ముందు వుంచితే, ముందుగా మనమే లోకువ అవుతాం. అయినా ఏమని చెబుతాం? డాక్టరు ప్రొఫెషన్‌లో వాళ్ళుచేసే పనులు మనకి చెడ్డగా అనిపించినా, వాళ్ళకు అనిపించక పోవచ్చు.... సరే....లే, కొద్దిగా ఏమైనా వండుకుని తిందాం. లే. . .లే'

నా ఆలోచనా ధోరణిని మళ్ళించడానికే అలా అంది. నిజంగా ఆకలి వేసి కాదు.

'నువ్వు విశ్రాంతి తీసుకో ప్రియాంకా నేను అన్నీ చేస్తాను.'

ఏదోయాంత్రికంగా, పనిచేస్తున్నానే కాని మధ్య మధ్యలో ప్రియాంకని తనలోని దివ్యత్వాన్ని చూస్తున్నాను. ప్రియాంక సోఫాలోనే కూర్చుని, ఏదో మేగజైన్ తిరగేస్తుంది. కానీ తన ఆలోచనలు వేరేకచోట తిరుగుతున్నాయని తెలుస్తూనే వుంది.

బేండేజి చుట్టూ అమృతాంజనం వ్రాసి, వేడినీళ్ళలో కాపడం పెట్టాను. అపుడు తన ఆలోచనలలో ఏమి మార్పులు జరుగుతున్నాయో, ఆమె ముఖంలోని భావాలు నాకు అర్థం కాలేదు.

'అమృతాంజనం రాసి, వేడినీళ్ళతో కాపడం పెడుతున్నపుడు, నీ వ్రేళ్ళూ, చేతులూ నాతొడ భాగానికి తగులుతున్నాయి. కానీ నాకు ఏమీ అసభ్యంగా అనిపించట్లేదు. కానీ డాక్టరు బేండేజి కడుతున్నపుడు అతని వేళ్ళు నా తొడల భాగానికి తగులు తున్నపుడు, వ్రేళ్ళు పాకుతున్నట్లు అనిపించింది.' చిలిపిగా నవ్వుతూ అంది.

తనకు కావలిసిన పనులన్నీ నేనే చేయడం లో నాకెంతో ఆనందం కలిగింది.

మరునాడు లేవగానే, దేవునికి నమస్కారం చేసుకుని, ప్రియాంక వైపుచూశాను. రాత్రివేసుకున్న మాత్రల వలన కాబోలు యింకా గాఢంగా నిద్ర పోతుంది. ముఖం నిర్మలంగా వుంది. మోకాలి చుట్టూ ఏమైనా స్వెల్లింగు వచ్చిందేమోనని చూశాను. ఏమిలేదు. 'థాంక్ గాడ్' అనుకుంటూ గట్టిగా నిట్టూర్చాను. తన మోకాలికి తగిలిన దెబ్బ కంటే, తన మనస్సుకు తగిలిన గాయం గురించి మరొక సారి తలుచుకుంటే, నా మనస్సు బాధగా మూలిగింది.

ప్రియాంక నిద్ర లేచిన తర్వాత తన పనులన్నీ తనే చేసుకుంది. మోకాలి దెబ్బ కూడా అంతగా బాధిస్తున్నట్లు అనిపించలేదు. ఆహ్లాదకరంగానే ఫ్రెష్‌గా వుంది.

'దుర్గా ఈ రోజు లీవు పెడుతున్నాను. ఈ లీవ్‌లెటరు మాబాస్‌కు యివ్వు'

'నేను కూడా నీకోసం లీవు పెడదామనుకుంటున్నాను. నీ కేమైన అవసరం అవుతుందేమో?'

'నో, నో, అవసరమేమీ వుండదు. నువ్వు ఆఫీసుకు వెళ్ళు. అవసరమైతే నేనే చెప్పేదాన్ని. కొద్దిగా మత్తుగా వుంది. ఈ రోజు రెస్టు తీసుకుంటే రేపు ఫ్రెష్‌గా ఆఫీసుకు రావచ్చు.

అయితే నీకు చెప్పిన విషయాలు ఎవ్వరికీ చెప్పకు. రాధికకు కూడా చెప్పకు. నాకు దెబ్బ తగిలిన విషయం మన కొలీగ్సుకు అస్సలేచెప్పకు. విజిటర్స్ ఎక్కువ అవుతారు. నేను రెస్టు తీసుకోడానికి వుండదు'. ప్రియాంక చిన్నగానవ్వింది.

ఆఫీసులో కూర్చున్నానేగాని పని మీద ఏకాగ్రత రావడం లేదు. అస్తమానూ ప్రియాంక, ప్రియాంక ఔన్నత్యము, ఆమె సంస్కారం, ఆమె మంచి వ్యక్తిత్వం, కష్టంలో కూడా ఆమె ముఃఖంలో కనబడుతున్న చిరునవ్వు, ఆమె ఆలోచనా దోరణి గుర్తుకు వస్తున్నాయి. నేను ప్రియాంకను ఆరాధిస్తున్నానపించింది. కొద్దిగా నవ్వు వచ్చింది.

'ఏమ్మా ? నీలో నువ్వే నవ్వుకుంటున్నావు. మేరేజిగాని ఫిక్స్ అయ్యిందా?'

ఎదురుగా మా గ్రూప్ లీడరును చూసి కంగారుగా లేచి నిలబడ్డాను.

'నో, నో, కూర్చో ఏమైనా డౌట్సు వస్తే నన్ను అడుగు'. అని వెళ్ళి పోయారు. మెదటి హాఫ్

అంతా ప్రియాంక ఆలోచనలతోనే గడిచిపోయింది. కేంటీన్‌లో భోజనం చేయాలనిపించలేదు. ఇంటికి ఫోన్ చేశాను ప్రియాంక మాటలు వింటే తను ఫ్రెష్ అయ్యిందనిపించింది.

'సాయంకాలం వచ్చేటప్పుడు ఏమైనా తేవాలా?'

'వద్దు, అన్నీవున్నాయి. సాయంకాలం నువ్వు వచ్చేటప్పటికి, నీ కిష్టమైన బిర్యాని చేసి వుంచుతాను'

'ఇంట్లో ఎవరో వున్నట్లనిపిస్తుంది, ఎవరు?'.

'ఆ, పనిమనిషి'

'ఓకే బైబై'. ప్రియాంక ఫోన్‌పెట్టేసింది.

ప్రియాంకకు దెబ్బ తగిలి లీవుతీసుకుని ఇంట్లో వుంటే నేను ఆఫీసులో కూర్చోడం నాకెందుకో బాగోలేదు. హాఫ్‌డే లీవుపెట్టి రాధికకు చెప్పి, ఇంటికి బయలుదేరాను. రాధిక 'వద్దు' అంది. నేను పట్టించుకోలేదు.

మా ఫ్లాటు ముందు, హోండా సిటీ కారు ఆగివుంది. చూడగానే అది డాక్టరు కారు అని తెలుస్తూనేవుంది. కారుపై డా॥ రమేష్, డా॥ ప్రియంవద, అని పేర్లు వున్నాయి. నాకు షాక్ తగిలి నట్లయింది. ఈ డాక్టరు ఇంటికి కూడా తయారయ్యాడా? అని తిట్టుకుంటూ త్వరత్వరగా మెట్లు ఎక్కాను. చెప్పులు విడచడానికి బాల్కనీలోకి వెళ్ళాను. లోపలినుండి బిర్యానీ వాసన ఘుమఘుమలు వస్తున్నాయి. కాక తాళీయంగా కిటికీలోంచి లోపలికి చూశాను. ఆ దృశ్యం చూసిన నాకు తలపై పిడుగు పడినట్లని పించింది. నేను చూస్తున్నది కలా? నిజమా ? తెలియని అయోమయ వ్యవస్థలో పడ్డాను. నా చూట్టూ ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్లని పించింది. అది వూహించని దృశ్యం.

లోపల బెడ్‌రూంలో ఒకే మంచాన్ని పంచుకున్నారు ప్రియాంక, ఆడాక్టరు. బయట ప్రపంచంలో ఏమి జరుగుతుందో గుర్తించేలాలేరు. అర్ధనగ్నంగా వున్నారు యిద్దరూ. వాళ్ళ తనువులు ఏకమైనాయి. ప్రియాంక చేతులు డాక్టరు మెడ చుట్టూ బిగుసుకుని ఉన్నాయి. అతని మొహంపైనా, పెదాలపైనా ముద్దుల వర్షం కురిపిస్తోంది. ఆ మత్తులో ప్రియాంక కళ్ళు పూర్తిగా మూసుకొని పోయివున్నాయి. నాకు ఇంకొక పెద్ద షాక్ తగిలింది. నగ్నంగా వున్న ప్రియాంక కాళ్ళు ఆ డాక్టరు నడుం చుట్టూ బిగుసుకుని వున్నాయి. మోకాలికి బేండేజి మాత్రంలేదు. ఇటువంటి ప్రక్రియను చూడటం ఇదే మొదటిసారి. నా మెదడు మొద్దుబారిపోయింది. కాలికింద భూమి కదులుతున్నట్లు అనిపించింది. అక్కడ నుండి

వెనుతిరిగి, మెట్లు దిగాను. బిర్యానీ వాసన కుళ్ళు కంపు కొడుతున్నట్లు అనిపించింది.

ఎక్కడికి వెళ్ళాలో అర్థం కాలేదు. రాధిక యింటికి వెడదామంటే. అదొక పెద్ద సత్రం. రాధిక ఆఫీసులోనే వుంది. దగ్గరలో వున్న ఒక థియేటరుకు వెళ్ళాను. ఆ సినిమాలోనూ యిటువంటి అశ్లీల దృశ్యాలే. తలనొప్పి ఎక్కువయింది. తలనొప్పి భరించలేక థియేటరు నుండి బయటకు వచ్చాను. ఎక్కడికి వెళ్ళాలి ? మా ఫ్లాటుకు, థియేటరుకు మధ్య ఒక గార్డెన్‌వుంది. అక్కడకు వెళ్ళి ఒక చెట్టు నీడలో చతికిల పడ్డాను. తల మొద్దుబారిపోయింది. వచ్చేకన్నీళ్ళు ఎవరికీ కనబడకుండా మోకాళ్ళ మధ్య ముఖాన్ని వుంచుకుని కూర్చుండి పోయాను. అపుడు మొదలయ్యింది, నాలో అంతర్మథనం.

ఇపుడు నా దృష్టిలో ప్రియాంక చాలా దిగజారిపోయింది. ఆమె కపటి వ్యక్తిత్వాన్ని చూచి, కుటిల సంస్కారాన్ని చూసి తను మోసపోయింది. ప్రియాంకని తను ఎంతగానో ఆరాధించేది. ఇటువంటి చపలతత్వం,అశ్లీలత, మోసం ఆమెలో దాగివున్నాయని తను తెలుసుకోలేక పోయింది. ఈ విషయాలు కొంత వరకు రాధికకు తెలిసివుండవచ్చు. అందుకే తను ప్రియాంక ఎదురుగానే అనేది 'తోటి వ్యక్తిని అభిమానించవచ్చు కాని, ఆరాధించ కూడదు. దైవాన్ని ఆరాధించాలి' అని. దానిలోని గూడార్థం యిప్పుడు తెలిసింది.

పాపం తన భర్త గౌరాంగ్‌ని ప్రియాంక ఎలా మోసం చేస్తోందో? గౌరాంగ్ పై జాలి కల్గింది. అందగాడు, ఉత్తముడు, సంస్కార వంతుడైన భర్తను మరచి వేరొక డాక్టరు తో ఇంత అశ్లీలంగా ప్రవర్తిస్తుంది. ఈ విషయం గౌరాంగ్ గారికి తెలుస్తే తట్టు కోగలడా ? ఛీ ఛీ ప్రియాంక వంటి మోసగత్తె, నీచురాలు, తనకు తెలిసిన వాళ్ళలో ఎవరూ లేరు. ప్రియాంక గురించి నిన్నటి వరకూ నా అభిప్రాయాలు ఏమిటి? ఇప్పుడు తన గురించి నా అభిప్రాయం ఏమిటి ? తను చేసిన చెడ్డ పని వలన ఎంత పతనానికి దిగజారింది ? మరి తన మోకాలికి వున్న బ్యాండేజీ సంగతి ఏమిటి ? అది కూడా తను పన్నిన పన్నాగమేనా? ఆవంకతో తను ఇంటిదగ్గర వుండి, నన్ను బలవంతంగా ఆఫీసుకు పంపిందా ? ఈ డాక్టరుకు ఎలా లొంగి పోయింది ? ప్రియాంక గోముఖఃవ్యాఘ్రం. ఒక పతిత. ఒక వ్యభిచారిణి.

ఈ తర్జన భర్జనలో, అంతర్మమథనంలో నేను ఎంతసేపు అలావుండి పోయానో నాకే తెలియదు. ఎవరోనాభుజంపై చేయివేశారు. ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాను. రాధిక. తడబడ్డాను. చీకటిపడుతూవుంది.

'ఏంటే ఆ కన్నీళ్ళు? ఏమిటీ నీవాలకం? రా. నీ ఫ్లాటుకు వెళ్ళి మాట్లాడుకుందాం. రా !

రా !' రాధికను చూస్తే నాకనీళ్ళు ఆగలేదు. ఆమె భుజంపై ముఃఖం పెట్టుకుని ఏడ్చేశాను.

'ఏడ్చింది చాలుగానీ రా ఇంటికి వెడదాం. ప్రియాంక చాలా కంగారు పడుతుంది పద, పద.'

'రాధికా, నాకు ఒక సహాయం చెయ్యి. నేను ఆయింటిలో కాలు పెట్టను. నేను మీయింటికి వెడతాను. నువ్వు నాసామానంతా సర్ది మీయింటికి తీసుకురా'

'నీకేమైనా పిచ్చిపట్టిందా. పద పద' అంది రాధిక చిలిపిగా నవ్వుతూ.

'రాధికా, చాలా సీరియస్‌గా చెబుతున్నాను. నీకు తెలుసుగా నామొండితనం. నేను ఎటువంటి పరిస్థితిలోనూ ఆయింట్లో అడుగుపెట్టను. నేను చెప్పినట్లు చెయ్యి' మొండిగా అన్నాను.

'ఏడ్చావులే. ముందు నీ కోసం ఎవరు వచ్చారో చూడు'.

వెనక్కి చూశాను.

తనదైన సహజశైలితో చిరునవ్వు నవ్వుతూ ప్రియాంక, ప్రక్కన ఆడాక్టరు వున్నారు.

'ఈయన మా గౌరంగ్ అన్నయ్య. డా॥ గౌరంగ్'. రాధిక పరిచయం చేసింది.

'నిన్న ఉదయం నన్ను టెస్టు చేసి, ప్రెగ్నెన్సీ నిర్ధారణ చేసిన పోకిరీ డాక్టరు ఈయనే.

డా॥ గౌరంగు. నా భర్త'. చిలిపిగా నవ్వుతూ ప్రియంక చెప్పింది. షాక్ తిన్నాను. నిజం తెలిసి తడబడ్డాను.

'నమస్తే. మీరు ఎప్పుడు వచ్చారు ?'

'నమస్తే, నిన్న ఉదయం వచ్చాను. ప్రియాంక చెప్పిన విషయం కన్ఫర్మ్ చేసుకుందామని వచ్చాను. బంజారాహిల్స్ సమిపంలో నాకు చాలా పనులు వున్నాయి. మా రమేష్ అంకుల్ ఇల్లు, నర్సింగ్ హోమ్ బంజారా హిల్స్‌లోనే వుంది. అందుకే ముందు అక్కడ దిగాను. ప్రియాంకను అక్కడికే రమ్మన్నాను'.

'ఈ డా॥ రమేష్ ఎవరు ?' ప్రియాంకను అడగకుండా వుండలేక పోయాను.

'మా అత్తగారి పెద్దన్నయ్య. డా॥ రమేష్ గారి భార్య కూడా డాక్టరే డా ॥ ప్రియంవద. కాని ప్రస్తుతం ఇద్దరూ USA లో వున్నారు'.

సిగ్గుతో, పశ్చాత్తాపంతో నాతల దించుకున్నాను. ప్రియంక ఇంకా ఎత్తు ఎదిగి పోయినట్లనిపించింది. ఇంతటి సంస్కారవంతురాలినా నేను అనుమానించాను? అయినా ప్రియాంక చేసిన ఈ ప్రాక్టికల్ జోక్ నాకు నచ్చలేదు.

డా ॥ రమేష్‌గారి కారులో నల్గురమూ మా ఫ్లాటుకు వచ్చాము. నిజానికి మేం నల్గురమూ లంచ్ చేయలేదు. అనుమానం, అపోహలతో, షాక్‌లో నేనూ, నన్ను వెదుకుతూ వాళ్ళు ముగ్గురూ భోజనం చేయలేదు.

వేరే కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకుంటూ లంచ్‌కి చేసిన డిషెస్‌ను, డిన్నర్‌లో పూర్తి చేశాము. ప్రియాంక చేసిన బిర్యానీ చాలా రుచిగా వుంది. బాల్కనీ కిటికీ మూసివుంది.

'దుర్గా వ్యక్తి ఆరాధన చేయడం మంచిదికాదే. ఎక్కడైనా పొరబాటు జరిగితే, పూర్తిగా అప్‌సెట్ అయిపోతావు. వ్యక్తి ఆరాధన చేయడం మంచిది కాదని నీకు తెలపడానికి, నీతో ఒక ప్రాక్టికల్ జోక్ చేయాలను కున్నాను. అందుకే డా॥ గౌరంగ్ వివరాలు నీకు చెప్పలేదు. కాని పరిస్థితి యిలా మలుపు తిరుగుతుందని వూహించ లేదు. నన్ను క్షమించవే .... ' ప్రియాంకను యింక ఏమీ మాట్లాడకుండా నోరు మూసేశాను. కానీ నా కళ్ళలో వచ్చిన నీటిని వాళ్ళు గుర్తించారు.

స్వతహాగా ప్రియాంక యేదైనా ప్రాక్టికల్‌జోక్ చేయాలను కుంటే, చేసిన తర్వాతగానీ పూర్తి ఇన్‌ఫర్మేషన్ రివీల్ చేయదు. కొంత సస్పెన్స్‌లో వుంచుతుంది. మోకాలికి కట్టిన బేండేజి విషయం యింకా సస్పెన్స్ గానే మిగిలి పోయింది.

'ఏంటి? నా కాలి బేండేజి గురించి ఆలోచిస్తున్నావా' ? 'ఔను' అందరూ పక పకానవ్వేశారు.

బిత్తర పోయి చూస్తూ వుండి పోయాను.

'ఈ సస్పెన్స్ నేను రివీల్ చేస్తాను' రాధిక ముందుకు వచ్చింది.

'గౌరంగ్ అన్నయ్య వచ్చాడని తెలిసి, నేనూ, ప్రియాంక బంజారా హిల్స్ వెళ్ళాము. అన్నయ్య ప్రిలిమినరి ఎగ్జామినేషన్ చేసి, ప్రియాంక ప్రెగ్నెన్సీని కన్‌ఫర్మ్ చేశాడు. డాక్టర్ రమేష్ గారి ఇంట్లోనే క్లినిక్ వుంది. ఆయన రిటైర్డ్ కనుక ఇంట్లోనే ప్రాక్టీసు చేస్తున్నారు. ప్రస్తుతం USA లో వున్నారు. తను తల్లి కాబోతున్నాననే శుభవార్త విని ప్రియాంక తబ్బిబ్బు పడుతూ కాలుజారి బోర్లాపడింది. తగిలిన దెబ్బ చిన్నదే. కానీ అన్నయ్య పెద్ద కట్టు కావాలనే కట్టాడు. అంత పెద్ద కట్టుతో ప్రియాంక ఆఫీసుకు వెళ్ళకుండా ఇంట్లోనే వుండి పోతుందని. ఆ నిజం రహస్యంగా నాకు చెప్పాడు. తనకి కావలసినట్లుగా వ్యూహం సిద్ధం చేసుకున్నాడు. వేరే చాలా పనులుండటం వలన నిన్న ఈ ఫ్లాటుకు రాలేక పోయాడు. ఈరోజు నువ్వు ఆఫీసుకువెళ్ళిన తర్వాత వచ్చాడు. తర్వాత జరిగింది నీకు తెలుసు.

అందరూ మనసారా నవ్వుకున్నాం. కాని ప్రియాంక సిగ్గు పడిపోయింది.

'ప్రియాంకా, నీ వ్యక్తిత్వానికి సంస్కారానికి జోహార్లు. నన్ను క్షమించు' అనకుండా వుండలేక పోయాను.

'ఇదిగో మళ్ళీ 'వ్యక్తి ఆరాధన' చేస్తున్నావు. వద్దమ్మా'

ప్రియాంక మాటలకు అందరం నవ్వుకున్నాం.

'నిజమే 'వ్యక్తి ఆరాధన' మంచిది కాదు. మనస్సు లోనే అనుకున్నాను.



# కొన్ని ప్రశ్నలు

- వివాహితులు భార్యకన్నుగప్పి భర్త, భర్త కనుగప్పి భార్య అక్రమసంబంధాలు ఏర్పరచుకోవడం భావ్యమా?
- అవివాహితులైన యువతులు కాలుజారి తరువాత గర్భస్రావం చేయించుకోవడం భావ్యమా? ఈ అక్రమ సంబంధంలో యువకులు భాగస్వాములు. కానీ వారు ఏశిక్షా లేకుండా తప్పించుకోవడం భావ్యమా?
- ఈరోజుల్లో గర్భస్రావాల సంఖ్య, ఎందుకు రోజురోజుకీ పెరుగుతుంది?
- యువతలో ఎందుకు విలువలు దిగజారిపోతున్నాయి?
- మనలో ఎక్కువమంది ఎందుకని సాధారణవ్యక్తులుగా మిగిలిపోతున్నారు?
- యువతలో బంధుత్వాలపట్ల నిర్లక్ష్యం ఎందుకు పెరుగుతుంది?
- యాంత్రికజీవనంలో మానవతాసంబంధాలు ఎందుకు దిగజారిపోతున్నాయి?
- ఈరోజుల్లో అన్నిరంగాల్లోను స్వార్థం ఎందుకు పెరిగిపోతుంది?
- యువత మానసిక వికాసం కోసం, మానసిక పరిణత కోసం చేసే కృషి వృద్ధి చెందవలసిన అవసరం ఉందా? లేదా?
- అందరు ఎంతో సంతోషంగా ఉండాలనుకుంటారు. కానీ ఎందుకు సంతోషంగా ఉండలేకపోతున్నారు? కావలసినంత డబ్బు లేకపోవడం వలనా? ఎక్కువ డబ్బుగలవారు సిరిసంపదలు కలవారు సంతోషంగా ఉంటున్నారా?
- అందరికీ మనశ్శాంతి కావాలి. కానీ ఎక్కువమందికి మనశ్శాంతి ఎందుకు కరువవుతుంది?
- మనశ్శాంతి కావాలన్నా, మానసిక వికాసం కావాలన్నా యువత ఏం చేయాలి?
- ఈనాటి యువతలో వినయవిధేయతలు, ఆప్యాయతలు, వినమ్రత క్రమేపి తగ్గుతున్నాయని విశ్లేషకులు చెబుతున్నారు. కారణాలేమిటి?
- ఈకాలంలో ఉమ్మడికుటుంబాలు ఎందుకు విఫలమౌతున్నాయి?
- ఈనాటి యువతలో దుడుకుతనం, కోపతాపాలు, ఉద్రేకం, నిర్లక్ష్యం నానాటికి ఎందుకు పెరుగుతున్నాయి?

- ప్రతివ్యక్తి ఇతరులు చేయలేని ఒకపనిని చేసిచూపడానికి కృషిచేస్తే ఎన్నో అద్భుతాలను సృష్టించవచ్చు? ఇది సాధ్యమా?
- యువత తమలోని ప్రతిభను సృజనాత్మకతను, నిర్వహణాసామర్థ్యాన్ని వ్యక్తపరచడానికి తగినకృషి ఎందుకు చేయడంలేదు?
- యువత తమ ఆత్మవిశ్వాసాన్ని పెంచుకోవడానికి ఏం చేయాలి?
- యువత తమ బలాలను, బలహీనతలను, అవకాశాలను, భయాలను, పూర్తిగా గుర్తించలేకపోతున్నారని విశ్లేషకులు చెబుతున్నారు. నిజమా?
- ప్రోయాక్టివ్ థింకింగ్, ప్రోగ్రెస్సివ్ థింకింగ్, రియాక్టివ్ థింకింగ్- వీటిపై యువతకు సరైన అవగాహన ఉందా?
- మనయువతలో పాజిటివ్ థింకింగ్ ఉన్నవారు ఎక్కువా? లేక నెగిటివ్ థింకింగ్ ఉన్నవారు ఎక్కువా?
- అందరు విజయాన్ని సొంతం చేసుకోవాలనుకుంటారు. విజయవంతులంతా సంతోషంగా ఉంటున్నారా?
- యువతలో కలుగుతున్న అసంతృప్తికి కారణాలేమిటి? వారి కృషిలోపమా? వచ్చిన అవకాశాలను అందిపుచ్చుకోలేకపోవడమా? పనిలో ఏకాగ్రతలోపమా?
- యువతలో ప్రతికూలభావనలు ఎక్కువగా ఉంటున్నాయా? అనుకూలభావనలు ఎక్కువగా ఉంటున్నాయా?
- యువతలో లక్ష్యాలను నిర్ధారించుకొని ధృడసంకల్పం, లక్ష్యాలను చేరుకోవాలనే తపన ఉందా?
- మనం నెగెటివ్ ఆలోచనలకంటే పాజిటివ్ ఆలోచనలకు ప్రాధాన్యత ఇస్తున్నామా?
- జీవితంలో అందరికి సమస్యలు ఉంటాయి. వాటిని తలచుకుంటూ, బాధపడుతూ కృంగిపోవడం భావ్యమా?
- పనులను వాయిదావేసే మనస్తత్వం, అలవాటు మంచిదా?
- జీవితంలో తమ తమ లక్ష్యాలను సాధించగల శక్తిసామర్థ్యాలు ప్రతిఒక్కరిలోను ఉంటాయి. కానీ చాలామంది ఎందుకు నిరాశవాదులుగా మిగిలిపోతున్నారు.




**Addressing M/s. BHEL Executives,**

**Hyderabad.**



*"All The Best"*

